# ముందుమాట

పురాణ మీమాంస అని పేరు పెట్టడంలో ఒక ఆంతర్యం దాగివున్నది. అది ఏమిటి అంటే నాకు పురాణ విషయం అవగాహనకుగాను బ్రహ్మీభూత సచ్చిదానందతీర్థ స్వామివారు మా కామకోటినగర్ వాస్తవ్యులుగా వున్నప్పుడు నా కోసం చాలా శ్రమించారు. ఆయన ప్రోత్సాహం సహకారంతోనే నేను పురాణాలలో ప్రవేశింపగలిగాను. A.I.R లో సూక్తి సుధలు చెప్పేవాడిని. అంతేకాక నేడు Vijayawada City Cable లోను మరియు ప్రస్తుతం శ్రీచక్ర చానెల్‌లో రోజూ చిన్న చిన్న పురాణ విశేషములు ఉపన్యాసములు చెప్పుటకు ఆయన ప్రేరణయే కారణం అని చెప్పాలి. ఇంక గతంలో కూడా నేను TV9, TV1 లలో ప్రోగ్రామ్స్ చేసినప్పుడు మన పురాణ ఇతిహాస కథనాలు వాడుతుండేవాడిని. స్వామివారి దగ్గరకు సందేహాలు వచ్చిన ప్రతిసారీ వెళ్ళేవాడిని. నాకు ఆయన కామకోటినగర్ వచ్చిన కొత్తలో జ్యోతిషం మీద ఆయన వేసిన కొన్ని ప్రశ్నలు నేటికీ రోజూ గుర్తు వస్తుంటాయి. ఆ ప్రశ్నల రూపంలోనే నేను ఈ రోజుకూ జ్యోతిషంతో పాటు పురాణములు చదువుతుంటాను. స్వామివారు "పురాణ మీమాంస" పుస్తకం వ్రాశారు అది గుంటూరులో బొల్లేపల్లి సత్యనారాయణగారు ప్రచురించారు. అందులో నేను పుస్తక ముద్రణ విషయంలో స్వామివారికి డి.టి.పి. ప్రూఫ్ రీడింగ్ సందర్భంలో యింకా ఎక్కువ దగ్గర అయి వెంటనే "వేద మీమాంస" పుస్తకం రచింప చేయించి ముద్రించాము. ఆ సందర్భంలో ఎన్నో ఆసక్తికర పురాణ అంశాల మీద స్వామివారు మా యిరువురికి గల బంధం గురించి వారి పుస్తకాలలో వ్రాశారు కూడా. అంతేకాక కీ॥శే॥ వాసిరాజు రంగారావుగారు స్థాపించిన వసుధ పత్రికలో ప్రారంభం పత్రిక నుండి చివరి పత్రిక వరకు పురాణ, ఇతిహాస, ధర్మశాస్త్ర విషయముల యందు నేను సందేహాలు, సమాధానములు వ్రాసివుంటిని. ఆ సందర్భంలో నా చొరవ ధైర్యము చూసి వ్యాస రచనా విషయంలో ఎక్కువ సహకరించారు. నేను ప్రస్తుతం కనకదుర్గ ప్రభలో విషయ పరిజ్ఞానం పేరుతో పురాణ ధర్మ సందేహములకు సమాధానం వ్రాయుచున్నాను. బాగానే వున్నది దీనికి కారకులయిన సచ్చిదానంద తీర్థ స్వామి వారికి ఎంతో ఋణపడి వున్నట్లే చెప్పాలి. అలాగే ధర్మజ్యోతి పత్రికలో మహర్షుల చరిత్రలు వ్రాశాను. మార్కండేయ పురాణం విశేషములు వ్రాశాను. మరొక విషయం

వసుధ పత్రికలో పండగుల ఆచరణ, మరియు లలితోపాఖ్యానం వ్రాసి లలితా సహస్రనామాలకు సరళ వ్యాఖ్యానం 400 నామములు పూర్తి అవగానే పత్రిక ఆగినది. అవకాశం యిచ్చిన కీ॥శే॥ వాసిరాజు రంగారావుగారికి మరియు సచ్చిదానంద తీర్థస్వామి వార్లకు గుర్తుగా ఈ పుస్తకం ముద్రించాలి అనే కోరిక గలవాడనై ఈ పనిచేశాను. అందుకే నా పుస్తకానికి పురాణమీమాంస అని పెట్టాను. స్వామివారు రచించిన పురాణమీమాంస కావలసినవారు గుంటూరు నెం.2232935 కు ఫోన్ చేయగలరు. "సన్ ఫ్లవర్ న్యూస్" అనే డైలీ పేపర్లో మొత్తం 385 రోజులపాటు పన్నెండు పురాణము లను సూక్ష్మీకరించి ప్రతి అంశాన్ని ఆర్టికల్స్ రూపంలో వ్రాశాను. యిది జీవితంలో మరవలేని ఘట్టము. నేటి సమాజంలో చాలా వరకు మన భారతీయ సంస్కృతికి సంబంధించిన ఆచారవ్యవహారములు, శాస్త్ర పురాణ విషయాలు మన చేతిలో లేకుండా పోయేలాగా ఎవరికి తోచిన విషయములు వారు ఉపన్యసిస్తున్నారు. మనం మనకు తెలియని అంశాలు గూర్చి చర్చించుకుంటున్నాం అనే ఆత్మ విమర్శలో కూడా లేకుండా ముందుకు వెడుతు న్నారు. ఉదాహరణకు ఆచార వ్యవహారములు చూద్దాం. దానిలో భాగంగా వాస్తు శాస్త్రం, వాస్తు యిది ప్రజల చేతిలో చాలా పనికిమాలిన సబ్జెక్ట్ అయిపోయింది ప్రజల చేతిలో. మీకు కోపం రావచ్చుకానీ ఒకసారి విశ్వకర్మ వాస్తు, మయవాస్తు, మానసారం వాస్తు విద్య వంటి గ్రంధములు మహర్షులు వ్రాసినవి చదవండి. నేటి సమాజంలో అమలు జరుగుతున్న వాస్తు పరిశీలించండి. అసలు పొంతన వుండదు. అపుడు మీరే నేను చెప్పిన మాటను ఒప్పుకుంటారు. దయచేసి చదవకుండా విమర్శింపవద్దు. నన్ను తూలనాడవద్దు. మహర్షులు గ్రంధస్థంగా చెప్పిన శాస్త్రం గురించి తెలియకుండా మనవారు చర్చలు చేసుకుంటున్నారు. అలాగే జ్యోతిషం అందులో గోచారం మరియు శాంతి మర్గాలు. యివి అందరు సంభాషించే సబ్జెక్టులు. పంచె కట్టిన ప్రతివాడినీ అడిగే స్థాయికి ఈ విషయంలో దిగజారారు. యింక ఆచారం, ధర్మం అయితే మరీ చండాలం అయిపోయింది అనే చెప్పాలి. నేను ధర్మశాస్త్రం గ్రంధం చదివానా? లేదా? అనే ఆత్మ విమర్శ లేనివారు అందరు ఆచారం ధర్మం గురించి చెప్పి మన భారతీయ సంస్కృతిని భ్రష్టు పట్టించారు. నేను పెద్ద పండితుడిని కాదు, సర్వజ్ఞుడుని అంతకన్నా కాదు. నాకు పెద్దల ఆశీర్వచనం, యోగం కలిసి వచ్చి కామకోటి నగర్ వాసిని అయ్యాను. మా కామకోటినగర్లో వేదం, వేదార్థం, స్మార్తం, శ్రౌతం, శాస్త్రములు, పురాణం హరికథ, సంగీతం, సాహిత్యం వంటి అన్ని విషయాలలో గురుకుల వాసంగా చదువుకున్న పండితులు వున్నారు. ఆ గొప్ప

గ్రామంలోనే నివాస యోగం నాకు వచ్చినది. యిది నా పూర్వ జన్మ సుకృతమే. మా కుటుంబంలో వేద, స్మార్త, శ్రౌత పండితులు మంత్రశాస్త్ర, ఆగమ శాస్త్ర, జ్యోతిశ్శాస్త్ర పండితులు వున్నారు. అంబటిపూడి నాగేశ్వరశర్మగారు నాకు జ్యోతిషశాస్త్రం పాఠం చెప్పిన విషయంలో ఆయన ఎంతో శ్రమ చేసారు. అది కాకుండా మాకు స్మార్త విశిష్ట క్రమాంత స్వాధ్యాయి, సలక్షణ ఘనపాఠి, ఆమ్నాయవిద్వన్మణి, స్వాధ్యాయచతురానన భాషాప్రవీణ అయిన బ్రహ్మశ్రీ మంగిపూడి వేంకటశాస్త్రిగారు మా పేటలోని వేద విద్యార్థుల కోసం 2000 సం॥ నుండి 2008 వరకు సాహిత్య పాఠం చెప్పారు. ఆ సందర్భంలో సాహిత్యం పంచకావ్యాలు ఇంకా ఎన్నో ధర్మశాస్త్ర విషయాలు మేము నేర్చుకున్నాం. అది మాకు వారి ద్వారా వచ్చిన గొప్ప వరము. మా కుటుంబంలో మా చిన తాతగారు కల్పరత్న బిరుదాంకితులు కీ॥శే॥ కప్పగంతు యజ్ఞ వేంకటసుబ్రహ్మణ్యచయనులుగారు వేద శ్రౌత స్మార్తములలో వారి కాలంలో వారికి ఎదురులేని పండితుడుగా ఆంధ్ర తమిళ కన్నడ రాష్ట్రాలలో ఆయన వెళ్లిన ప్రతిచోట ఘనకీర్తి వహించిన వ్యక్తి. మా తాతగారు కీ॥శే॥ కప్పగంతు సుబ్బరామసోమయాజులుగారు స్మార్తము, ఆగమములలో అదే స్థాయి కానీ ఆంధ్రవరకే పరిమితంగా వుండేవారు. వారి తరువాత తరములలో మా తండ్రిగారు ఘనాచార్య కప్పగంతు వేంకట సుబ్రహ్మణ్య ఘనపాఠీగారు పినతండ్రులు సూర్యనారాయణ అవధానిగారు, జ్వాలా రామలింగ ఘనపాఠీగారు ఇంకా వారి తరువాత తరంలో వారు కూడా వేద, శాస్త్ర, స్మార్త విద్వాంసులుగా ఉండగా ఆ తరువాత తరంలో వారు యిప్పుడే గురుకుల వాసం మాదిరిగా వేదాధ్యయనం చేయుచున్నవారు ప్రారంభం అయ్యారు. యీ సత్సంగంలో వున్న నాకు అందరితో వున్న సాన్నిహిత్యం వలన 1992 మొదట పూర్వపద్ధతి పంచాంగం చేశాను. నేటికినీ ముద్రించుతూనే వున్నాను. 1994 మార్చికు బి.ఎ. మేథ్స్ పూర్తి చేశాను. 1995 అనంత పద్మనాభ చతుర్దశీనాడు బ్రహ్మశ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రి దగ్గర సుదీర్ఘంగా జరిగిన ఇంటర్వ్యూలో నేను మహర్షి మహేష్ యోగి సంస్థలో జ్యోతిష ఉపాధ్యాయ వుద్యోగం సంపాదించాను. కానీ చేరలేదు. కారణం జ్యోతిషం యింకా రీసెర్చి చేయాలి అంటే విధానం ఎలా అనుకున్న సమయంలో నాకు ఆ ఇంటర్వ్యూ ఆ పెద్దాయనతో నా జీవితానికి అవసరం అని వెళ్ళాను. నా ఈ జ్యోతిష వాస్తు ముహూర్త, పంచాంగ విధానాలకు ఆయన చాలా సూచనలు చేసేవారు. మధుర శాస్త్రిగారు భారత దేశంలో లభ్యం అయ్యే గొప్ప పండితులలో ఆయన ఒకరు. కొందరు దుష్టులు నేడు ఆయనను విమర్శిస్తున్న తీరు చాలా దురదృష్టకరం అని చెప్పాలి. నేను 12 సంవత్సరాలుగా

పురాణ వ్యాస రచనలు చేయుచున్నాను. జ్యోతిషం ఆర్టికల్స్ ప్రస్తుతం కనకదుర్గ ప్రభ మరియు ఆంధ్రభూమి పత్రికలలో వ్రాయుచున్నాను. ఈ పురాణ మీమాంసలో వ్రాసిన ప్రశ్నలు అన్నీ గతంలో కనకదుర్గ ప్రభ, వసుధ, ఆంధ్రభూమి పత్రికలకు వచ్చిన ప్రశ్నలు వాటికి నేను సమాధానములు అవి వ్రాశాను. స్వామివారి ప్రోత్సాహంతోనే ప్రారంభించాను. కావున ఆయన పుస్తకం పేరే పెట్టాను. నా పినతండ్రిగారు బ్రహ్మశ్రీ సూర్యనారాయణ అవధానిగారు ఒకనాడు పురాణాల మీద అవగాహన కోసం పఠనం ప్రారంభించమనడం అదే సమయంలో వేద పరిరక్షణ సంస్థ హైదరాబాద్‌వారు నాకు కొన్ని పురాణ గ్రంథాలు బహుకరించడం స్వామి సచ్చిదానందతీర్థవారి అనుగ్రహం కలిసి ఈ ప్రయోగం దగ్గరకు చేరగలిగాను. నా మిత్రబృందం కూడా చాలా సహకారం చేసారు. విశాఖ శారద పీఠం స్వరూపానంద స్వామివారు అలాగే గోవిందవఝులకామేశ్వరశర్మగారు ప్రోత్సాహం కూడా ఉన్నది. అన్నింటికి మించి నా ప్రాథమిక విద్యాభ్యాసంలో శ్రీ బుర్రా బాలకృష్ణశర్మగారు, పద్మనాభశర్మగారు, భాస్కర శర్మగారు ఆ కాలంలో చెప్పిన పురాణ కథలు నాకు పునాది అనుటలో అతిశయోక్తి లేదు. త్వరలోనే మరిన్ని పురాణ గ్రంథాలు నా ద్వారా భగవత్కృపతో రానున్నాయి. దీనికి ఎందరో ప్రోత్సాహకులు వున్నారు. అందరికీ త్రికరణ శుద్ధిగా నమస్కరిస్తూ..,

విజయవాడ
తేది : 26-01-2015

విద్వజ్జన విధేయుడు
**కప్పగంతు సుబ్బరామ సోమయాజులు**

# విషయసూచిక

శ్రీ గణాధిపతయే నమః

# పురాణ మీమాంస

◆ **ధర్మశాస్త్రం తెలియకుండా శాస్త్రం చెప్పవచ్చా?**

***వేద జ్ఞాన విహీనశ్చ ధర్మశాస్త్ర నిరర్థకః***
***యోవదతి దుర్ధీర్ధర్మం వ్రజేత్ నరకం ధృవమ్.***

చాలా తప్పు. ధర్మశాస్త్రమే కాదు. జ్యోతిషం, వాస్తు, పురాణం, ఆయుర్వేదం ఇలాంటివి విద్యాభ్యాసం చేయకుండా ఎవరికీ కూడా చెప్పకూడదు. అలా చెప్పుట వలన రౌరవాది నరకాలకు పోతారు. అంతేకాకుండా శాస్త్రములు చదవకుండా వాటి గురించి చెప్పేవారికి ఇహలోకంలో పరలోకంలో కూడా విచిత్ర శిక్షలు పడతాయి.

◆ **దేవతా అర్చన విషయాలలో "ఘంట"కు ఎందుకు విశేషం చెప్పబడినది?**

వివిధ వాయిద్యములకు ప్రాధాన్యత ఎలాగ వున్నదో అదేరీతిగా దేవతా అర్చనలలో కూడా మంగళవాయిద్యములకు ప్రాధాన్యత వున్నది. మంగళ వాయిద్యముల స్థానములో ఘంటకు ప్రాధాన్యత యిచ్చుటలో ఆంతర్యం ***"ఘణ్టా భవేద శక్తస్య సర్వవాద్యమయీ యతః"*** (వాద్యములను పూజా సమయంలో చేయుటకు ఆశక్తత వున్నవారు) ఘంట సర్వవాద్య రూపము కావున, శక్తి వున్ననూ అశక్తులయిననూ ఘంటా వాద్యము చేసిన ఎడల మంగళవాద్యములతో అర్చనలు చేసినట్లు అవుతుంది. అందుకే పూజా ఆరంభంలో ***ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసామ్ – కురుఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్...*** , అని దేవతాహ్వానం పలుకుటకు ఘంటారావం చేయమని మనకు ఆదేశించారు.

◆ **దైవ పూజకు ఎరుపు, తెలుపు రంగు పూలు శ్రేష్ఠం అని చెబుతారు అయితే పసుపు రంగు చేమంతిపూలనే ఎక్కువగా ఉపయోగిస్తున్నారు ఈ తేడా ఏమిటి?**

ప్రాంతంలో దొరికే పుష్పములను బట్టి ఆచారము మారుతూ ఉంటుంది. అన్ని ప్రాంతాలలో అన్నీ దొరకవుకదా! ఇందులో భక్తి, లక్ష్యం కూడా ప్రధాన భూమిక అవుతుంది. ఆ పూలలో శ్రేష్టమైనవి మల్లి, జాజి, పున్నాగ, మందార, పారిజాత, గన్నేరు వంటివి, విశేషంగా లక్ష్మీ అర్చనకు కలువలు, శివార్చనకు తుమ్మి, గణపతికి శ్వేతార్క యిలా కొన్ని విశేషాలు చెప్పబడినవి. అయితే చామంతికి పుప్పొడి లేని కారణంగా పూజకు నిషేధమని కొందరి వాదన కూడా ఉన్నది. మన భారతీయ

ఆచార వ్యవహారాలు అన్నీ కూడా భౌతికంగా మనకు ప్రకృతి నుండి దొరికే సదుపాయాల ఆధారంతో మార్పు తీసుకొన్నవి. దీనికే ఆచారమని పేరు. ధర్మశాస్త్రంలో చెప్పబడినవి. ఆచారంలో మార్పు ఉంటాయి. ఇదే రీతి చామంతి కూడా. దక్షిణాదిలో చామంతి వాడకం పెద్దలందరూ ఆచరిస్తూనే ఉన్నారు. బంతి, చామంతి విషయంగా వాసన లేని పుష్పములు నిషేధమని సువాసనలు రాని గడ్డిపూలు నిషేధమని పూజలు పనికిరావని చెప్తారు.

◆ **శివాలయంలో ప్రదక్షిణలు చేయరాదని కొందరు చెబుతారు. దానికి ప్రత్యేక ప్రదక్షిణ విధి ఉన్నదని కొందరు చెబుతారు. వివరిస్తారా?**

శివుడు ప్రదక్షిణ ప్రియుడు. వినాయక చవితి కథ గణేశుడు శివునికి ప్రదక్షిణ చేసినట్టు ఉన్నది కదా? కావున అనుమానం లేదు. అయితే చండీ ప్రదక్షిణాలు విశేషంగా చెప్పబడినవి. ఇది ఒక ప్రదక్షిణగా చెప్పబడినవి.

***చండస్థానేతు సంకల్ప్య వృషభాదౌ ప్రదక్షిణమ్ ।***
***వృషం చండం వృషం చైవ సోమసూత్రం పునర్వృషం ॥***
***చండం చ సోమసూత్రం చ పునశ్చండం పునర్వృషం ।***
***నవప్రదక్షిణోపేతో యః కుర్యాచ్చ ప్రదక్షిణమ్ ॥***
***త్రింశత్సహస్రసంఖ్యాక ప్రదక్షిణఫలం లభేత్ ॥***

మొదట చండేశ్వరుని దగ్గర సంకల్పించి భజం ప్రభృతి సోమసూత్రం వరకు., సోమసూత్రం నుండి ప్రదక్షిణంగా ధ్వజం మీదగా సోమసూత్రం వరకు., సోమసూత్రం నుండి అప్రదక్షిణంగా ధ్వజం మీదగా సోమసూత్రం వరకు వెళ్ళి మళ్ళీ వెనుకకు ధ్వజస్తంభం వరకు రావలెను.

◆ **వేదాలలో స్త్రీకి ప్రాముఖ్యం యిచ్చారా? లేదా?**

వేదం, శాస్త్రాలలో స్త్రీకి యిచ్చిన ప్రాముఖ్యత అసాధారణమయినది. వేదాలు చెప్పిన రీతిగా మనం మన జీవన శైలి ఏర్పాటు చేసుకుంటే నేడు మనం ఈ చర్చ చేసేవాళ్లం కాదు. "నస్త్రీ స్వాతంత్ర మర్హతి" అనే అంశాన్ని భిన్న రూపాలలో చర్చలు చేసి అనేక అపార్థాలకు సంఘంలో అవకాశం యిచ్చారు. కానీ వేదం మాత్రం స్త్రీకి విశేషమయిన గౌరవం యిచ్చినది. స్త్రీ నియమాలు మనం ప్రశాంతంగా పరిశీలిస్తే మనవారు స్త్రీ రక్షణ నిమిత్తంగా ఆ విధమయిన కట్టుబాట్లు ఏర్పాట్లు ఎందుకు చేశారో? అవగాహన అవుతుంది. "అంతేకానీ స్త్రీ మీద గౌరవం లేక కాదు అని అర్థం అవుతుంది." స్త్రీని వంటయింటి కుందేలుగా వేదం ఎప్పుడూ చెప్పలేదు. ఒకసారి కొన్ని వేదమంత్రాల అర్థం తెలుసుకుంటే వేదం స్త్రీకి ఎంత గౌరవం యిచ్చినదో తెలుస్తుంది. "అయజ్ఞోవా ఏషః యోపత్నీకః నప్రజాః ప్రజాయేరన్" యజ్ఞములు

చేయుటకు భార్య లేనివానికి అర్హతలేదు. వివాహము లేకపోవుటచే సంతానయోగము వుండదు. "జాయమానోవై బ్రాహ్మణస్త్రిభిర్ ఋణవా జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః" బ్రాహ్మణుడుగా పుట్టగానే మూడు రకములయిన ఋణములు కలిగి వుంటాడు. బ్రహ్మచర్య దీక్షతో ఋషి ఋణము, యజ్ఞముల ద్వారా దేవ ఋణము, సంతానం వలన పితృఋణము తీర్చటం జరుగుతుంది. మరి మార్కండేయ పురాణంలో మనువుల కథలలో వివాహము భార్య యొక్క విశిష్ఠస్థానం, సంతానావశ్యకత గురించి చెప్పబడింది కదా! పురాణకథలు వేదములలోనివే. మనుస్మృతిలో "దారాధీన స్తథా స్వర్గః పితౄణా మాత్మనశ్చహ" మనం తరించాలి అనినా, మన పితృదేవతలు తరించాలి అనినా ఆ బాధ్యత భార్య అధీనమయి వున్నది అని చెప్పబడినది. మరియిలా శాస్త్రాలలో కూడా చెప్పబడినది కదా! "గృహాన్గచ్ఛ గృహపత్నీ యథా సో వశినీత్వం విదథ మావదాసి" ॥పత్నీహి పారీణహ్యస్యేశే పత్నియై వానుమతం నిర్వపతి" వివాహానంతరం గృహమునకు అధిపతురాలుగా రమ్మని భార్యను పిలవడం, అలాగే వివాహానంతరం గృహస్థు సంపాదించి యింటికి తెచ్చిన ప్రతి ద్రవ్యము మీదా భార్యదే ఆధిపత్యము వుంటుంది అని మంత్రములకు అర్థము. ఈవిధంగా వేదం, శాస్త్రం, పురాణం అన్నిటా స్త్రీకి ప్రత్యేక స్థానం యిచ్చారు. ఆచరణలో కనబడడంలేదు అనేది మన మనోభావన మాత్రమే.

◆ **కార్తీకమాసంలో ఉసిరి వనంలో భోజనాలు శ్రేష్ఠమని చెబుతారు కదా! కాని కార్తీకమాసంలో ఉసిరి నిషిద్ధమని కార్తీకపురాణం పేర్కొంటున్నది?**

తులసి, ధాత్రీ సహిత లక్ష్మీనారాయణ రూపంలో ఉసిరి చెట్టును ఆరాధించడం కార్తీకమాసంలో విశేషం. ఉసిరి ఆయుర్వేద విద్యా ప్రకారం నిత్యం తింటే ఆరోగ్యం అయితే ఆదివారం నిషేధం, రాత్రి భోజనంలో నిషేధం. మరి కార్తీకమాస విశేషం గూర్చి చెప్పాలి అంటే.... కార్తీక దీక్షలు పాటించే వారికి కార్తీకంలో ఉసిరి భక్షణ నిషేధం, కారణం కార్తీక దీక్షలలో భాగమే "నక్తము" ఆ మాసమంతా రాత్రి భోజనము చేయుట పగలు ఉపవసించుట మరి సర్వదా రాత్రి భోజనంలో ఉసిరి భక్షణ నిషేధం కావున కార్తీక వ్రత దీక్షలో నక్తం ప్రధాన పాత్ర పోషిస్తుంది. కావున కార్తీకంలో ఉసిరి భక్షణ పనికిరాదని చెప్పారు. దీక్ష అంటే ఒక నియమం కాదు కదా అన్ని నియమాల ఆధారంగానే ఈ నిషేధం వచ్చింది.

◆ **రాహు కాలమంటే ఏమిటి? ఇది అందరికి వర్తిస్తుందా? మరి ఇంత కాలంగా లేనిది, ఇటీవలే బాగా వ్యాప్తిలోకి ఎలా వచ్చింది?**

రాహుకాలం యమగండం, గుళిక, దుర్ముహూర్తం, వర్జ్యం వంటివి కాలములు మహర్షుల చేత చెప్పబడినవి. 1980 వరకు ఆంధ్రాలో రాహుకాలం వాడకం

లేదు. గుళిక యమగండ కాలములు ఎక్కువగా కేరళాలో వాడకం ఉన్నది. శ్రీలంక, తమిళనాడు నుండి నెల్లూరు వరకు మాత్రమే రాహుకాలం వాడకం. 1980 నుండి క్యాలెండర్‌లలో రాహుకాలం ప్రచురణ ఎక్కువగా జరగడం రాహుకాలానికి ప్రాచుర్యానికి కారణం అయినది. ఆంధ్రాలో దుర్ముహూర్తమే ఎక్కువ వాడకం ఉన్నది. ముహూర్త, విషయాలు ముహూర్త గ్రంథాలు మీరు పరిశీలిస్తే ఏక వింశతి దోషాలలో వార జనిత దుర్ముహూర్తం అనేది మాత్రమే ఉన్నది. అందుకే సుముహూర్త విషయాలకు దుర్ముహూర్త పట్టింపు మాత్రమే ఉన్నది కాని రాహుకాల పట్టింపు లేదు. మనవారు ప్రత్యేకంగా విషయం తెచ్చి పెట్టుకున్నారు. రాహుకాలం శాస్త్రమే కానీ మన పూర్వులు వాడలేదు. ఇలా అన్నీ వాడాలి అంటే రోజూ వర్జ్య కాలమే అవుతుంది. అందుకే మనవారు రాహుకాలం, గుళిక, యమగండ కాలాలలో సుముహూర్తాలు వ్రాశారు. దానికి మన పాత పంచాంగాలే ఆధారంగా కనబడతాయి.

◆ **జ్యోతిషం జీవనోపాధిగా చేయవచ్చా?**

చేయరాదు. ఒకవేళ జ్యోతిషం చదువుకొని ఉంటే జ్యోతిష విషయాలు ఎవరికైనా ముహూర్తం, ప్రశ్న, వాస్తు వంటివి చెప్పినా.., వారు ఎంత ఇస్తే అంత తీసుకోవాలి కాని, చేసిన జ్యోతిష కార్యములకు ఇంత డబ్బు ఇమ్మని అడుగుట మహాపాప కృత్యము. జ్యోతిషం చెప్పినందుకు రోజు కనీసం సహస్ర గాయత్రీ జపం చేయాలి. అనుష్ఠానం చేయుట వేదమాతసేవచేయుట, గోసేవ చేయుట అవసరం. వేదాధ్యయనం చేసి జ్యోతిషం అభ్యసించినవారికి మరియు నిత్యకర్మానుష్ఠానపరులకు జ్యోతిష్యం చెప్పినదానికి వచ్చే దోషం తక్కువని పెద్దలు చెప్తారు. డబ్బు అడిగి జ్యోతిషం చెప్పుట వంటి వ్యాపార ధోరణి కూడదు.

◆ **పునర్జన్మలు ఉన్నాయని భారతీయ శాస్త్రాలు చెబుతున్నాయి. స్వర్గస్థుడైన దశరధుడు రావణ వధానంతరం భూమికి వచ్చి శ్రీరామచంద్రుని ఆశీర్వదించినట్లు రామాయణంలో ఉన్నది. దశరధుడు ఎలా వచ్చాడు?**

ఇది యుద్ధ కాండ 119వ స్వర్గంలోని విషయం. అయితే యిక్కడ దశరధుని పునర్జన్మగా చెప్పబడలేదు. ఇంద్రలో కగతుడైన దశరధుడు మహేశ్వరుని అనుజ్ఞపై దివ్యవిమానంలో వచ్చి సీతారామ లక్ష్మణులను ఉద్దేశించి సంభాషించి మరల అదే విమనంలో వెళ్ళిపోయెను. స్వర్గస్థులయిన కృత త్రేతా ద్వాపరయుగాలలో వారు మరల తిరిగి భూమిని చేరిన విషయం, బలి పాతాళమునకు నెట్టబడు సందర్భంలో ప్రహ్లాదుడు వచ్చినట్లు, కురుక్షేత్ర అనంతరం కురువంశస్తుల దర్శనం వంటివి దృష్టాంతములు ఉన్నవి. అయితే దశరథుని విషయంలోనే కాదు. నేటి కలియుగాలలో కూడా పితృదేవతలు భూమి మీదకు రావడం జరుగుతుంది. అయితే మిగిలిన మూడు

యుగాల వారు చక్షుషువులు కలవారు కావున వారు ప్రత్యక్షంగా చూడగలిగేవారు. మనకు జ్ఞానక్షువులు లేవు కనుక మనము చూడలేము. పునర్జన్మ విషయానికి వస్తే "క్షీణేపుణ్యే" మర్త్యలోకం విశన్తి" పుణ్యం నశింపగానే స్వర్గస్థులైనవారు మరల భూమి మీదకు నివాసం రావలసినదే. అందుకే పునర్జన్మలు నమ్మితీరవలసినదే.

◆ **ఉగాది గురించి ఎందుకింత చర్చ జరుగుతుంది? (గతంలో జరిగిన చర్చ మీద వ్యాఖ్య...)**

గతంలో శ్రీ సర్వజిన్నామ సంవత్సర ఉగాది ఎప్పుడు? మార్చి 19 లేక మార్చి 20 అనే విషయమై పెద్ద గందరగోళం జరిగింది. టి.విలలోను, వార్తా పత్రికలలోను ప్రకటనలు చర్చలు జరిగాయి. అయితే అవన్నీ ప్రాథమిక అంశాన్ని ప్రక్కన పెట్టి అనవసర విషయాల మీద చర్చలు చేయటం వలన నేలవిడిచి సాము చేసినట్లు అయింది. దాని విషయమై..., ఉగాది అయినా మరి ఏ యితర పండుగ నిర్ణయ మయినా పంచాంగం ఆధారంగానే చేస్తాము. అయితే పంచాంగాలలో విభేదాలవలన సమస్య వస్తున్నది. పంచాంగ కర్తలు అందరూ కలసి పంచాంగ గణితాన్ని ఏకతాటి మీదకు తీసుకువస్తే ఈ సమస్య పరిష్కారం అవుతుంది. ఏ పంచాంగ కర్త అయినా, తన పంచాంగాన్నే అనుసరించాలని చెప్పడం తప్పు, అయితే ఎందుకు అనుసరించాలి అన్నది చెప్పాలి. పంచాంగాలలో దృక్‌పద్ధతి, పూర్వ పద్ధతి రెండు రకాలున్నాయి. పూర్వ పద్ధతి పంచాంగాలలో ఒక నిమిషం తేడాతో అందరికీ ఒకే గణితం వస్తున్నది. దృక్ సిద్ధాంతాలలో అనేక రకాలున్నాయి. మనకు ప్రధానంగా లభ్యమయ్యేవి రెండు. 1. పిడపర్తి కృష్ణమూర్తి గారు చేసే గణిత విధానం. 2. మధురకృష్ణమూర్తిగారు చేసే విధానం. ఈ రెండు శ్రేష్ఠమైనవే అయితే ఈ రెండింటికి ఎంతో దూరం ఉన్నది. భేదం ఉన్నది. సర్వజిత్‌నామ సంవత్సరంలో పిడపర్తి వారికి జ్యేష్టమాసం అధిక మాసమయితే, మధురవారికి శ్రావణమాసం అధికమయింది. పిడపర్తి వారికి సంక్రాంతి జనవరి 14, 2008 వస్తే మధురవారి జనవరి 12, 2008 వచ్చినది. దేనిని ఆచరించాలి? దృక్ సిద్ధాంతం ప్రకారమే గ్రహనిర్ణయం, భావస్ఫుటం చేసి జాతక శోధన చేయాలి అని పరాశర, వరహమిహిరులు నిర్ణయం చేశారు. అయితే, దృక్ సిద్ధాంతాన్ని అనుసరిస్తున్న పిడపర్తి వారిది సరియైనదా లేక శ్రీమధుర వారిది సరి యైనదా అని తేల్చుకోవాల్సిన అవసరం ఉంది. అది తేలకుండా దృక్ సిద్ధాంతాన్ని అమలు చేయాలి అని చెప్పటం హాస్యాస్పదంగా ఉంటుంది. 1960 వరకు ఈ దృక్ సిద్ధాంతానికి ప్రాచుర్యం లేదు. ఇప్పుడేమో దృక్ సిద్ధాంతంలో ఒక సంధిగ్ధత నెలకొని ఉంది. కనుక, ముందుగా వీలయినంత త్వరలో దృక్ సిద్ధాంతం అమలు గురించి ఒక నిర్ణయం చేయాలి. అది కూడా మధుర కృష్ణమూర్తిగారి సమక్షంలోనే జరగాలి. మధుర కృష్ణమూర్తిగారి లేని సభా నిర్ణయము సూర్యుడు లేని పంచాంగమవుతుంది.

ఒక విషయం మాత్రం గుర్తించుకోవాలి. మెడికల్ సైంటిష్టులు ఒక విషయాన్ని కనుక్కుంటే డాక్టరులు దానిని అమలు పరుస్తారు. పంచాంగ కర్తలు అందరూ సైంటిష్టులు కారు, వారు అమలు చేసే ఆపరేటర్లు మాత్రమే. మధురవారు మాత్రం పంచాంగ గణిత సైంటిష్టులు వారు లేకుండా చేసే నిర్ణయాలు సరియైనవి కావు అని నా విజ్ఞప్తి. శృంగేరి నృసింహ భారతీ తీర్థస్వామివారు పంచాంగం పూర్తిగా తెలిసినవారు ఆయన సలహాలు, గణితం సరిచేసిన విధానాలు ప్రకారంగా నేడు శృంగేరి, టి.టి.డి, కప్పగన్తు, తంగిరాల, పీసపాటి, నేమాని ఇంకా ఎన్నో పంచాంగాలు మార్కెట్‌లో దొరుకుతున్నాయి. అలాగే అందరు స్వామిజీలు పంచాంగ గణితం తెలిసినవారైతేనే మాట్లాడాలి. శాస్త్రం మీద అభిమానంతోను పంచాంగ గణిత పరిరక్షణ కోసం స్వామీజీలందరూ కలసి పంచాంగ కర్తల సమావేశం ఏర్పాటు చేసి ఏకీకరణకు సాధించవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నారు. ఎవరికి వారు ప్రకటనలు చేయడం వారి అనుయాయులను, ప్రజలను తప్పుద్రోవ పట్టించడమే అవుతుంది.

నేను 1992 ఆంగీరస నుండి పూర్వపద్ధతి పంచాంగం చేయుచున్నాను. మా మాతా మహుని వద్ద దృక్ సిద్ధాంత పంచాంగం (పిడపర్తివారి గణిత విధానం) నేర్చుకున్నాను. 2064 వరకు గణితం చేశాను. పైన పేర్కొన్న ప్రకారం నేను కూడా గణితాన్ని అమలు చేసే ఆపరేటర్‌నే కాని పంచాంగ సైంటిష్టును కాను. అయితే ఈ రెండు గణితాలు నేర్చుకుని మధుర శాస్త్రిగారి వాదనలు, వారి రచనలు చూసిన మీదట మనం చేయవలసిన నిర్ణయాలు చాలా ఉన్నాయనే ఉద్దేశ్యంతనే ఈ విజ్ఞప్తి చేస్తున్నాను. పంచాంగ కర్తలు సమావేశం మధుర వారి సమక్షంలో జరిగితే సిద్ధాంతం భాగం రక్షింపబడుతుంది. మధురవారు పెద్దవారు అయినారు. వారు ఓపికగా ఉండగానే ఈ నిర్ణయాలు జరగాలని ఆకాంక్షిస్తున్నాను. పబ్లిషర్స్ కూడా రచయితలను సరియైన వాళ్ళని ప్రోత్సహించాలి. ఈ మధ్యకాలంలో ఒక విశేమయిన ఎఫెమరీస్ మార్కెట్‌లోకి వచ్చినది. దానిలో రాహుకేతువులకు ఋజుమార్గం, వక్రమార్గం రెండూ ఉన్నాయి. అందుకే వీరందరిని Modern Astrologers with Hybride Planets అంటారు.

◆ **వైదీక సంస్కారములను గూర్చి ప్రోత్సాహం ఇవ్వని గురువులకు ప్రాధాన్యం ఇవ్వరాదా?**

భారతీయ సంస్కృతికి వేదం ఆధారం. వేద విహితమైన కర్మకాండకు వైదీకం అని పేరు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు వైదిక విధానంలో జాతకర్మ ప్రభృతి కర్మకాండ జరుగుతుంది. మరి ఈ మూడు జాతులకు బాల్యంలో ఉపనయనం చేయమని సంధ్యావందనం చేయమని, గాయత్రీ అనుష్ఠానం చేయమని శాస్త్ర పురాణముల మీద అవగాహన పెంచుకోమని ప్రోత్సహించని గురువులకు స్వాములకు ప్రాధాన్యం ఇవ్వరాదు. ఉపనయనం బాల్యంలో జరగాలి. తరువాత 12 సంవత్సరాలు బ్రహ్మచర్య

దీక్షలో విద్యాభ్యాసం జరగాలి. వర్ణవ్యవస్థ, నిత్యకర్మానుష్ఠానం సరిగా జరిగితే అందరూ చేస్తే, లోకం సుభిక్షంగా ఉంటుంది. ఇది వైదీకులు వేద శాస్త్రాల మీద రీసెర్చి చేసిన పెద్దల ద్వారా తెలుసుకున్న అంశము. ఇది పాటించనంతకాలం సృష్టిలో వాతావరణం కూడా సరిగా ఉండదు. దీనికి స్వామీజీలు గురువులు ముందుకు వస్తే వారి ఫాలోవర్స్ ఆచరిస్తారు. సంఘం బాగుపడుతుంది. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః

◆ **ధృతరాష్ట్రుడు భౌతికంగా గుడ్డివాడేనా? లేక పుత్ర వ్యామోహంతో అంధుడైన ధృతరాష్ట్రుని పాత్రను ఆ విధంగా మలచటం జరిగిందా?**

ధృతరాష్ట్రుడు జన్మతః గుడ్డివాడు, అలాగే పుత్ర వ్యామోహం చేత కూడా అతని నడవడి గుడ్డితనాన్ని మరిపించినది. జన్మతః గుడ్డివాడు అనే విషయంగా వ్యాసభారతంలోనే వున్నది. అంబికకు గర్భాదానం చేయగానే వెంటనే వ్యాసమహర్షి "ఆ యంబిక యందు బలపరాక్రమవంతుడయిన కొడుకు పుట్టు వాడు మాతృదోషమున అంధుండగు". అని చెప్పెను. దీనిని బట్టి ధృతరాష్ట్రుడు పుట్టు గుడ్డివాడే. అయితే ప్రవర్తన రీత్యా కూడా గుడ్డివాడే. పాండురాజు వానప్రస్థమునకు పోయినది మొదలు రాజ్య అపేక్ష – పుత్రులకు రాజరికం అప్పగించాలి అనే దుర్బుద్ధితో మానసికంగా కూడా అంధుడిగా ప్రవర్తించాడు. లాక్షాగృహం, జూదం వంటి సందర్భాలలో రాజు అయివుండి కూడా దుర్యోధనాదుల ప్రవర్తనను అడ్డుకోక గుడ్డివానివలె ప్రవర్తించాడు. ధర్మం తెలియని వాడు కాదు, తాను స్వయంగా నీతిశాస్త్రం తెలిసినవాడు. విదురుడు, సంజయుడు వంటి ధర్మాతుల సహచర్యం కలవాడు. అయినను పుత్ర వ్యామోహ ముతో కూడా గుడ్డివాడాయెను.

◆ **శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని చూడటానికి స్వయంగా శ్రీకృష్ణుడే ధృతరాష్ట్రునికి చూపు ప్రసాదించాడు. కాని ఆ తరువాత ధృతరాష్ట్రుడు చూపును శాశ్వతంగా ఉంచుకోలేదు. ఇంక చాలు అని చెప్పి మరల అంధుడైనాడు. కారణం ఏమిటి?**

శ్రీకృష్ణుడు రాయబార నిమిత్తంగా హస్తినాపురమునకు వెళ్ళినపుడు దుర్యోధనా దులు దుష్టపన్నాగంతో శ్రీకృష్ణుడిని బంధింప ప్రయత్నించగా శ్రీకృష్ణుడు విశ్వరూపము దాల్చెను. ఆ సమయంలో ధృతరాష్ట్రుడు పుణ్డరీకాక్ష! నీవే జగత్తున కంతటినీ మేలు కూర్చువాడవు, కావున నాయందు అనుగ్రహము చూపుము. నేను మరల ఎవరినీ చూడగోరను అని అడిగెను. అదేరీతిలో శ్రీకృష్ణపరమాత్మ ధృతరాష్ట్రుని కోరికకు తగిన విధంగానే (దృష్టిని) నేత్రములను యిచ్చి విశ్వరూప సందర్శనానంతరం వాటిని తీసివేసినాడు. సత్సాంగత్యయోగం (విదురుడు, సంజయుడు) ఎన్నడూ ధృత రాష్ట్రుడు విడనాడలేదు. పుత్ర వ్యామోహంతో దుర్మార్గుడయిననూ తాను విదుర

సంజయుల వలన కొన్ని సత్కార్యములు చేసినట్లుగా మనకు వ్యాసభారతంలో ఎన్నోచోట్ల గోచరమవుతుంది. అందువలన ఆ యోగ్యత దృష్ట్యానే శ్రీకృష్ణపరమాత్మ ధృతరాష్ట్రునికి విశ్వరూప సందర్శన యోగం అవకాశాన్ని యిచ్చారు. ధర్మబుద్ధి కూడా ఉన్నది కదా! పుత్రవ్యామోహం కూడా ఉన్నది. ఒకవేళ చూపు అలాగే ఉంటే చక్రవర్తిగా పరిపాలన క్రమంగా సాగించేందుకు శాస్త్రతః అవకాశం వచ్చినట్లే. అప్పుడు ధృతరాష్ట్రుని తరువాత ధర్మంగా దుర్యోధనుడే చక్రవర్తి అవుతాడు. ఇంక పాండవులకు అవకాశం లేనట్లే. ధృతరాష్ట్రుడు జ్యేష్ఠుడు అతని కుమారుడు వారసుడు. మరి శ్రీకృష్ణావతారం యొక్క పరమార్థం పూర్తి అవ్వదు కదా! అందుకే పరమాత్మ అతనికి మరల కళ్ళు వద్దనుకునేలాగ బుద్ధి సృష్టించాడు.

### ◆ నదీ జలాలు లేదా భూగర్భ జలాలు అభిషేకానికి మంచిదా?

ఒక పాత్రలోకి నీరు పడితే వాటికి మడి, మయిల అనే ఆచారం ప్రారంభం అవుతుంది. మరి నదీ జలాలు భూగర్భ జలాలు ఎప్పుడూ శౌచమే కదా! అందుకోసమే ప్రత్యక్షంగా భూగర్భ జలాలు లేదా నదీ జలాలు అభిషేకం చేయువారు స్వయంగా తెచ్చుకుంటే దానికి విశేషం ఉన్నది. పంచాయితీ కుళాయిలు లేదా మున్సిపాలిటీ నీరు ఒక ట్యాంక్ (పాత్ర)లో పట్టిన తరువాత మన ఇంటికి వస్తే వాటికి ఆశౌచం వస్తుంది కదా! అందుకోసమే అవి అభిషేకానికి రెండవ రకం.

### ◆ కర్ణుడికి తాను కురుక్షేత్రంలో మరణించెదనని, పాండవులు విజయం సాధిస్తారని ముందుగానే తెలుసా?

తెలుసు. తెలిసే యుద్ధమునకు సన్నద్ధమయ్యాడు. శ్రీకృష్ణుడు రాయబారము పూర్తి అయి ఉపప్లవమునకు తిరిగి వేడుతూ కర్ణుని పిలిచి రథం ఎక్కించికొని – కర్ణునిని జన్మవృత్తాంతం తెలిపి నీవు పాండవుల తరపు చేరమని తద్వారా యుద్ధ నివారణ జరగగలదనీ తెలపగా కర్ణుడు ధర్మరాజుకు అతడు నా తమ్ముడు అని తెలిస్తే సామ్రాజ్యాధిపత్యం స్వీకరించుటకు అంగీకరించడు. అటువంటి ధర్మమూర్తి కలకాలము ఈ భూమికి పరిపాలకుడు కావద్దా? అని ప్రత్యుత్తరం ఇచ్చాడు. ధర్మరాజు రాజుకావలెను అనే కోరిక కర్ణునికి వున్నట్లు ఈ సందర్భంలో తెలిసింది.

యుద్ధమును యజ్ఞము అని భావిస్తారు ధీరులు. కర్ణుడు కురుక్షేత్ర యజ్ఞము గూర్చి సంభాషిస్తూ ధర్మజుని సోదరులు ఋత్విక్కులగాను, నీవు ఉపద్రష్టగా వుండి ఏ పని ఎలా చేయాలో నిర్దేశిస్తూ వుండగా ధర్మరాజు కౌరవులు అనే పశువులను సంహరించి రణయజ్ఞం పూర్తికావించును.

అంతేకాక కృష్ణా! అర్జునిచే చావగొట్టబడిన నన్ను నీవు చూచిననాడు ఈ యజ్ఞమునకు పునశ్చిత్తి అనే కార్యము జరిగినట్లు, శకునాలు స్వప్నాలు యుద్ధం

జరుగు విషయంగానే కనబడుచున్నవి. యుద్ధమున ధర్మరాజుకే విజయం లభింపగలదు. ఈ విషయం కృష్ణునితో కర్ణుడు అన్నాడు. అంటే ధర్మరాజు గెలవ గలడని తెలిసీ దుర్యోధనుని యుద్ధప్రేరణ చేశాడు కర్ణుడు. ఒక కోణంలో కర్ణుడే కురువంశ వినాశనానికి కారకుడేమో? అందుకే సత్‌సహవాసం ఎప్పుడూ శ్రేయస్కరం.

◆ **గాంధారి భర్తను అనుసరించి అంధురాలు అయింది. అది పతివ్రతా ధర్మమా లేక ఆమె కూడా పుత్ర వ్యామోహంలో చిక్కుకున్నదా?**

తన వివాహం ధృతరాష్ట్రునితో జరగనున్నదని సుబలుని బంధువుల మాటలు విన్న గాంధారి "నాకు భర్త ధృతరాష్ట్ర మహారాజే – నేను అన్యులను వివాహమాడ అంగీకరించను." అని ఆ మహాపతివ్రత పరపురుషులను తాను చూచుటకు యిష్టపడక "భర్తకు కళ్ళులేవు" కావున తాను కూడా కళ్ళకు గుడ్డ అడ్డం కట్టుకొన్నది. అదే విధంగా జీవితాంతం భర్తతో పాటు అంధురాలిగానే గడిపినది.

అయితే ఈమె కూడా ధృతరాష్ట్రుని మాదిరిగానే పాండవుల విషయంలో పుత్ర వ్యామోహంతో అంధురాలివలెనే ప్రవర్తించినది. కుంతికి ధర్మరాజు కలిగాడని తెలిసి గర్భవతిగా వున్న గాంధారి తన గర్భమును బాదుకొని గర్భస్రావం చేసుకొన్నది. అప్పుడు వ్యాస మహర్షి దయ వలన ఆమెకు ఆ పిండ రక్షణ కలిగి దుర్యోధనాదులు ఉద్భవించారు. ఈ విధంగా పాండవుల ఉత్పత్తి నాటి నుండే తన అసూయ ప్రకటించి ప్రవర్తనా విషయంగా అంధురాలయినది.

◆ **జ్యేష్ఠునికే రాజ్యాధికారం అన్నది న్యాయ సమ్మతమయితే, పాండు రాజుకులేని రాజ్యాధికారం పాండవులకు ఏ విధంగా సంక్రమిస్తుంది?**

ధృతరాష్ట్రుడు గుడ్డివాడగుట చేత రాజ్యాధికారి కాదని, కురువంశమునకు రాజుకాదగిన సమర్థుడయిన కుమారుని తన కోడలికి అనుగ్రహింపమని సత్యవతి వ్యాసమహర్షిని కోరెను. అంతట వ్యాసుడు పాండురాజును అనుగ్రహించెను. కనులే లేని కారణంగా ధృతరాష్ట్రునికి రాజ్యార్హత లేకపోయినది. విదురుడు దాసీపుత్రుడు కనుక విదురునికి రాజ్యాధికారములేకపోయినది. ధృతరాష్ట్రుడు గుడ్డివాడని, విదురుడు దాసీ పుత్రుడు అని మనకు తెలిసిన విషయమే కదా! "మనుస్మృతి" యాజ్ఞవల్క్యస్మృతి వంటి ధర్మశాస్త్ర గ్రంథాల ఆధారంగా రాజ్యాధికారం నేత్రహీనుడయిన ధృతరాష్ట్రునకు లేదు.

పాండురాజు పరిపాలనా విశేషములు మహాభారతంలో వివరింపబడినవి. ఆంధ్ర మహాభారతం ఆదిపర్వం షష్ఠశ్వాసంలో కూడా 123,124,128,129,143 పద్యాలలో ధర్మరాజు – రాజు అవ్వవలసిన ఆవశ్యకత విషయంగా ధృతరాష్ట్రుడు దుర్యోధనునికి చెప్పిన విషయము, పౌరులు అందరూ చర్చించుకున్న విషయం వున్నవి. ఒకసారి రాజుగా పాండురాజు అయినప్పుడు అతని కుమారుడే రాజు కావలెను

అనే విషయం ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో అన్న సందర్భాలూ ఉన్నాయి. అది ధర్మశాస్త్రం. కేవలం గుడ్డివాడుగా రాజార్హత కోల్పోయిన ధృతరాష్ట్రుడు పాండురాజు వానప్రస్థంకు వెళ్ళగా అత్యవసరస్థితిలో రాజ్యాధికారం తీసుకొని భీష్ముని రక్షణలో పాలన చేశాడు. వేరే ఆధారంలేనిసమయంలో యిచ్చి నా రాజ్యాధికారం.., అది విలువయినది కాదు. పాండురాజు రాజ్యంలో లేని కారణంగా అతని రాజ్యానికి రక్షణ నిమిత్తం ప్రతినిధిగా ధృతరాష్ట్రుడు వున్నారు. అంతేకాని పూర్తి రాజరిక లక్షణాలతో రాజ్యాధికారి కాలేదు. అందువలన పూర్తి రాజ లక్షణాలు ఉన్న పాండురాజే రాజు. అతని పుత్రులు పాండవులే ఉత్తర రాజ్యాధికారులు. యిది ధర్మశాస్త్ర విషయము.

◆ **పంచాంగకర్తల మీటింగ్‌లలో ఎటువంటి వారు ఉంటే పంచాంగాలు ఏకీకరణ అవుతాయి?**

ఎఫెమరీస్ లేకుండా పంచాంగం చేయగల సమర్థత ఉన్న పంచాంగకర్తలు మాత్రమే పాల్గొనే పంచాంగ కర్తల సమావేశంలో త్వరగా పంచాంగగణితం ఏకీకరణ జరుగుతుంది. నేటి హైబ్రీడ్ పంచాంగ కర్తలకు ఆత్మవిమర్శ అవసరం. వారికి కనీసం గణకానందం, గ్రహలాఘవం, కళ్యాణ గణితం వంటి కరణ గణిత గ్రంథాలతో గ్రహ, గ్రహణ, తిథ్యాదులు చేయడం వస్తే, మరియు సూర్య సిద్ధాంతం, సిద్ధాంతతత్త్వ వివేకం, సిద్ధాంత శిరోమణి వంటి గ్రంథాలు మీద చర్చ చేయగలిగిన అవగాహన ఉండాలి. అప్పుడు ఈ పంచాంగాలలో భేదాలు పోతాయి. గణితం రానివారు గణితంతో సంబంధంలేనివారు ఆత్మవిమర్శ చేసుకొని సభలో కూర్చోవాలా? వద్దా? నిర్ణయించుకోవాలి. క్షమించండి ఇది వ్యవస్థ తప్పుడు దోవ పడుతున్న కారణంగా నేను ఇలా వ్రాస్తున్నాను. భారతీయ సంస్కృతికి పంచాంగం చాలా అవసరం. యూనివర్సిటీలో జ్యోతిషం సిలబస్‌లో పంచాంగ గణితం పెట్టని ఆ ప్రొఫెసర్‌లు వృధా అనుటలో ఎటువంటి ఆక్షేపణ లేదు. ఇప్పటికైనా గవర్నమెంట్ యూనివర్సిటీలో జ్యోతిషం ఉన్న సబ్జెక్ట్‌లో పంచాంగ గణితమే ప్రధాన అంశంగా పెట్టిన ఎడల రెండు సంవత్సరాలలో గొడవ తీరిపోతుంది. టి.టి.డి వారి జ్యోతిష పాఠశాలలో కూడా పంచాంగ గణితం సబ్జెక్ట్‌గా పెట్టకపోతే డబ్బులు దండగ కార్యక్రమంగా జ్యోతిషం సిలబస్‌ను పెట్టుకోవచ్చు. పెట్టకపోవడం మహాదుర్మార్గం, వ్యవస్థాద్రోహం అవుతుంది.

◆ **బొటన వ్రేలు గురుదక్షిణగా యివ్వడంతో ఏకలవ్యుని పాత్ర మహాభారతంలో అయిపోయినదా? ద్రోణాచార్యులు బొటనవేలే అడగడం తప్పా?**

దేవ గురువు బృహస్పతి అంశద్రోణాచార్యులవారు. దుష్టద్యుమ్నుడు కేవలం ద్రోణుని సంహరించుటకు యజ్ఞప్రసాదంగా పుట్టిన వ్యక్తి అది తెలిసి కూడా ద్రోణుడు దుష్టద్యుమ్నునికి విద్యాబుద్ధులు నేర్పి గురువులకు ఆదర్శప్రాయుడు అయినాడు. అంతటి గొప్ప వ్యక్తి ఏకలవ్యుని బొటనవేలు గురుదక్షిణగా అడుగుటలో ఏదేని

కారణం వుండాలి లేదా విధివిలాసం అయివుండాలి. భారతంలో ఏ పాత్రను ధర్మబద్ధంగా పరిశీలించిన అది చివరకు భూభారం తగ్గించే నెపంతో ధర్మసంస్థాపన కోసం శ్రీకృష్ణుని ప్రభావంగా జరిగినట్లే అంతా అనిపిస్తుంది. ద్రోణుడు అర్జునుడితో సృష్టిలోనే నిన్ను గొప్ప విలుకాడిగా తీర్చిదిద్దెదను అని ఇచ్చిన మాట నిలబెట్టు కోవడంలో ఒక ఉద్దేశ్యం కూడా ఉన్నది. ఏకలవ్యుడు నిషాదులతో కలిసి మధుర మీద దండెత్తినప్పుడు బలరాముడు అతనిని ఓడించినట్లు హరివంశంపురాణంలో ఉన్నది. అటువంటి దుర్బుద్ధుడు జరాసంధుడుతో కలిసినాడు కదా! అతడు భవిష్యత్తులో అర్జునుడికి ఎదురు వచ్చే అవకాశం వున్నది. అప్పుడు కృష్ణపరమాత్మ అవతార పరమార్థం జరగదు. అందుకే ద్రోణాచర్యుల వారికి ఈ బుద్ధి కలిగినది.

### ◆ ఏకలవ్యుని విషయంలో జరిగిన సంఘటనలు?

ద్రోణుడు ఏకలవ్యుని విద్యార్థిగా నిరాకరించాడు. ద్రోణుని బొమ్మ పెట్టుకుని విద్య స్వయంగా నేర్చుకొని ద్రోణుని గురువుగా భావించి గురుదక్షిణ ఇస్తానన్నాడు ఏకలవ్యుడు. బొటన వేలు యిమ్మని అడుగగా అతడు అలాగే ఇచ్చాడు. ఆ తరువాత ఏకలవ్యుని చూపుడు వ్రేలు మధ్య వేలుతో శరసంధానం నేర్చుకొని మంచి విలుగాడు అయ్యాడు. ఇది శ్రీకృష్ణ లీలయే. కారణం భారతం ద్రోణ పర్వంలో ఘటోత్కచుని వధ అనంతరం అర్జునునితో శ్రీకృష్ణుడు అన్న మాటలు.

ఏకలవ్యస్స మిత్రశ్చ వాతధానోధ గోముఖః (ఆదిపర్వం 67వ అధ్యాయం)
గణాత్ క్రోధవశాదేష రాజపూగోభవత్క్షిత్రే (ఆదిపర్వం 61వ అధ్యాయం)
***"ఏకైకశో నిహతాస్సర్వే ఏతే యోగైస్తైః త్వద్ధితార్థం మమైవ"***

అర్జునా! జరాసంధుడు, శిశుపాలుడు, నైషాది (ఏకలవ్యుడు) వీరు అంతకు ముందే వధింపబడకుంటే ఈ యుద్ధంలో వారు దుర్యోధనునికి సహాయం వచ్చేవారు. వీరు మొదట నుండి మీ మీద శత్రు భావం కలవారే. అందుకే నేను ద్రోణాచార్యుని ద్వారా ఏకలవ్యుని అంగుష్ఠ హీనుని చేసితిని. ఏకలవ్యుడు జరాసంధునితో కలిసి మధురపై దండెత్తినట్లు ఉన్నది. ద్రోణపర్వం 180,181 అధ్యాయాలలో ఏకలవ్య ప్రస్తావన ఉన్నది. దీనిని బట్టి చూస్తే దుష్ట సంహారంలో భూభారం తగ్గించుటకు భూమి మీద అవతరించిన శ్రీకృష్ణుని లీలయే ఈ ఏకలవ్యుని చరిత కూడా. ఏకలవ్యుడు నిషాధ రాజుగా జరాసంధుడికి సైన్యాధిపతిగా ఉన్నట్లుగా పాఠాంతరములు ఉన్నవి.

### ◆ వరకట్నం తీసుకోవడం తప్పా?

వరకట్నం తీసుకోవడం తప్పు కాదు. శాస్త్ర సమ్మతమే. అయితే వరకట్నం అడగడం తప్పు. గోదానం, కన్యాదానం చేసేవారు. దానం పుచ్చుకునే వారికి కొంత ధనమును కట్న రూపముగా ఇవ్వవలెను అనునది శాస్త్రం. ఇక్కడ ఈ

విషయంలో శోధనలో కొన్ని ప్రత్యేక అంశాలు కూడా శోధించవలసిన అవసరం ఉన్నది. పుత్రులలో కన్న పుత్రుడు, దత్తపుత్రుడు మాదిరిగా కొనుక్కున్న పుత్రుడిని "క్రీతుడు" అంటారు. వరుని తరుపువారు వధువు తండ్రి (కన్యాదాత) ప్రీతి పూర్వకంగా ఇచ్చునది వరకట్నం అంటారు. వరుని తరుపు వారు కన్యాదాతను అడిగి తీసుకొను దానిని "వరవిక్రయం" అంటారు. అలాంటి వాటిలో వరకట్నం విశేషమయినది. మరి వరవిక్రయం జరిగినప్పుడు ఆ వరుని కొనుక్కున్న కన్యాదాతకు – ఆ వరుడు క్రీత పుత్రుని మాదిరిగానో లేక దాసుని మాదిరో అవుతాడు. కాని అల్లుడు అవ్వడు. దాసుడు కాని, క్రీతపుత్రుడు కాని అయినవాడు చేసే పుణ్యకార్యములో, కర్మలలో భాగము కొంత యజమానికి చెందును. అటువంటి సమయంలో ఈ వరవిక్రయంలో పొందిన వరుడు తన తల్లిదండ్రులకు చేయు శ్రాద్ధాది పితృకర్మలలో పుణ్యభాగము కన్యాదాతకు చెందును. అందువలన వరవిక్రయం మంచిది కాదు. మన సాంప్రదాయంలో అష్టవిధ వివాహములు వున్నవి. అవి బ్రహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, అసుర, గంధర్వ, రాక్షస, పిశాచ అనే ఎనిమిది విధములు. మొదటి నాలుగు వివాహములలోని వారికి కలుగు సంతానము సత్సంతానము అనబడుతుంది. వరవిక్రయం జరిగిన ఎడల ఆ వరుడు "పతి"గా అనర్హుడే అవుతాడు. వారు సోదరులు వరుస అవుతారు. వేద ప్రతిపాదిత కర్మానుష్ఠానంలో యజ్ఞ యాగాది క్రతువులు చేయడం కోసం సహాయకారిగా సహధర్మచారిణి అవసరం. భార్యగా వున్న స్త్రీ కేవలం అన్నం వండి పెట్టడానికో లేక దైహిక అవసరాలు తీర్చడానికో మాత్రమే కాదు, ఆమె మగవాడు చేయు ప్రతి పూజ, జప, కర్మ కాండ, యజ్ఞ యాగాదుల నిర్వహణలో భూమిక వహిస్తుంది. భార్య లేకుండా చేయు ఏ కర్మకాండ కూడా, సిద్ధించదు. అందుకే శ్రేష్ఠమయిన కన్యను శ్రేష్ఠమయిన రీతిలో వివాహం చేసుకోవాలి.

◆ **కుజదోషం ఉన్నవారు శాంతి చేయించుకున్న తరువాత చక్రంలో కుజదోషం ఉన్నది అని చదవాలా? లేక లేదని చదవాలా?**

పొరపాటున కూడా శాంతి అయిన తరువాత లగ్నాత్ కుజుడి స్థాన స్థితిలో మార్పు రాదు కదా! అందువలన శాంతికి ముందు శాంతి తరువాత కూడా కుజదోషం ఉన్నదనే వివాహ పొంతన విషయంలో జాతకం చదవాలి.

◆ **దైవారాధనలతో మనకు జాతకంలో వున్న దోషాలు పోగొట్టవచ్చా?**

దైవారాధన రెండు విధములు. 1. ఏదేని కామ్యార్థము చేసేది 2. కేవలం భగవత్ ప్రాప్తి కోసం చేసేది. అయితే మీరు అడిగే ప్రశ్న ప్రకారం జాతకంలో వుండే దోషాదులు తొలగించుకునే ప్రయత్నంలో భాగంగా దైవారాధన చేయడం అంటే అది కామ్యార్థం చేయునది. కేవలం భగవత్ ప్రాప్తి కోసం చేయు పూజా పునస్కారముల

ద్వారా ఆనందాన్ని మోక్షాన్ని పొందుతారు. అయితే వేదం కూడా "ఆనందోబ్రహ్మే తి వ్యజానాత్" అనే తెలియ చేసింది. నిష్కామంగా చేయు పూజలలో భగవంతుడే ప్రధాన లక్ష్యం అవుతారు కావున యిది సాధ్యమే.

అయితే కామ్యంతో చేయు పూజలద్వారా మనకు జాతకంలో వుండే దోషాలు పోతాయా అంటే అది మనం చేసే పూజా స్థాయిని బట్టి వుంటుంది. మార్కండేయుడు శివారాధన ద్వారా జాతకంలో వున్న అతి తక్కువ ఆయుర్దాయమును పెంచుకున్నాడు. అయితే మనం అంతస్థాయిలో జపం, పూజ వంటివి చేయగలమా? కానీ చేసిన స్థాయికి పెరిగితే తగిన ప్రతిఫలం పొందగలము. ఉదాహరణకి జాతక రీత్యా ఆరోగ్య సమస్యలు పెరిగే సూచన వున్నది ఆ సమయంలో మనం చేసే పూజా ఫలితం మంచి వైద్యం దొరికి త్వరగా ఉపశమనం పొందే మార్గం చూపడం, వైద్యం ఎంత ఖరీదయినా చేయుంచుకునే ఆర్థిక సహకారం అందడం, వైద్య సమయంలో మనకు సహకరించే మనుషులు వుండడం, అనారోగ్యాన్ని నిర్భయంగా ఎదుర్కొనే మనోధైర్యం వంటివి మనం పొందగలుగుతాము. ఇవన్నీ దైవారాధన ద్వారా రావలసినవే. రోగం రావడం మాత్రం ఆగకపోవచ్చు. అయితే మార్కండేయుని స్థాయితో పూజాదులు చేస్తే రోగము రాకుండా తప్పుకోగలము అనేది మనకు పురాణాల ఆధారం.

### ◆ బ్రహ్మచారి దానం పుచ్చుకోవచ్చా?

బ్రహ్మచారి దానం పుచ్చుకోకూడదు. అంతేకాక దానం యిచ్చినవారికి కూడా దోషం వస్తుంది. బ్రహ్మచారి నియమాలలో ముఖ్యమయినది విద్యాభ్యాసము. అందు చేతనే వేదంలో కూడా 'భిక్షాచర్యంచర ఆచార్యాధీనోభవ" అని ఉన్నది. ఇది అందరూ ఆచరించవలసిన నియమమే. బ్రహ్మచారిగా ఉన్నంతకాలం అంతా గురువు ఆధీనంలో వుండాలి. అంటే స్వతంత్రుడు కాడు అనేగా అర్థం. స్వతంత్రుడు కానివాడు గోదానమో, భూదానమో పుచ్చుకుంటే దానిని ఏమి చేయాలి? తానే గురువు మీద ఆధారభూతుడు అయినప్పుడు తాను బంధాలు పెంచుకోవడం తప్పుకదా! అందువలన బ్రహ్మచర్యంలో వుండగా దానం పుచ్చుకోకూడదు. బ్రహ్మచారికి దానం యివ్వకూడదు. గురువు ఒకవేళ అంగీకరిస్తే పై నియమాలలో మార్పు సంచరించుకుంటుంది. గురువు ఆజ్ఞ లేకుండా ఏ విధమయిన దాన ధర్మాలు పుచ్చుకోకూడదు.

### ◆ రాత్రి పది గంటల తరువాత వివాహం చేస్తే ఒక రోజు వివాహం శాస్త్ర సమ్మతమేనా?

ఉపనయన అర్హత ఉన్నవారి విషయంలో కచ్చితముగా తప్పు. వైదిక కర్మకాండ ప్రకారం సూర్యాస్తమయం నుండి సుమారు మూడు గంటల వ్యవధిలో స్థాలీపాకం అనే ప్రక్రియ చేయాలి. మరి రాత్రి పది గంటలకు పెళ్ళి చేస్తే స్థాలీపాకం ఆ రోజు

కుదరదు కదా! అందువలన రెండు రోజులు వివాహం ఐదు రోజులు వివాహం వారికి మాత్రమే గాని ఇది సిద్ధిస్తుంది. ఒక రోజు వివాహం ఉపనయన అర్హత లేనివారికి కూడా సిద్ధిస్తుంది. ఉపనయన అర్హత ఉన్నవారికి రాత్రి 9-30 గంటలకు తరువాత చేయు ఒక రోజు వివాహం అశాస్త్రీయమే.

### ◆ రామావతారంలో ఏకపత్నీవ్రతం పాటించి; కృష్ణావతారంలో బహుభార్యలను పొందడంలో ఆంతర్యం ఏమిటి?

రాముడు, కృష్ణుడు యిరువురూ కారణజన్ములు. రామావతార లక్ష్యం వేరు; కృష్ణావతార లక్ష్యం వేరు. రాముడు నరుడుగా వున్న నారాయణుడు. నరనారాయణ రూపం కూడా ఆయనే. కృష్ణావతారంలో కృష్ణుడు సాక్షాత్ నారాయణ స్వరూపం మరి నరుడేమో అర్జునుడయినాడు. రామావతారంలో శ్రీరాముడు ఎప్పుడూ తాను నరుడిగానే సంచరించారు. మరి శ్రీకృష్ణావతారంలో తాను సాక్షాత్ నారాయణ స్వరూపంగా ప్రకటించిన సందర్భాలు అనేకం.

ఇక రామావతారంలో ఏకపత్నీ వ్రతం పాటించి శ్రీకృష్ణావతారంలో బహు భార్యలను పొందడంలో ఆంతర్యం ఏమనగా శ్రీరాముడు అరణ్యవాస కాలంలో దండకారణ్యంలో సంచరించేటప్పుడు మునులు మునికాంతులు శ్రీరాముని చూచి మోహించిరి. అందులకు మీ కోరిక రాబోవు కృష్ణావతారంలో తీర్చగలను అని వారిని రామావతారంలో ఉండగా అనుగ్రహించిరి. అందులకు గాను మునులు గోపికలు గాను ముని పత్నులు గోవులుగాను జన్మించిరి. ఈ విషయం వాల్మీకి చరిత గర్గ సంహిత గోలోక ఖండం వంటి వాటలో వివరించబడింది.

### ◆ కలియుగంలో దైవదర్శనం జరగడం సులభమా?

అతి సులభము. కృత, త్రేతా, ద్వాపర యుగాలలో అనేక వేల సంవత్సరాలు తపస్సు చేసి భగవద్దర్శనం పొందినటులు వున్నది. కలియుగంలో భగవద్దర్శనం పొందినవారు త్యాగయ్య, పోతన, కాళిదాస, విక్రమార్క, ఆదిశంకరుల వంటివారు అనేకులు. వీరి ఆయుఃప్రమాణం అందరికీ వంద సంవత్సరములలోపే. అందులోను ఆది శంకరులు తన ముప్పది రెండు సంవత్సరాల జీవితకాలంలో తాను భగవంతుని చూచి తన తల్లికి కూడా చూపించగలిగారు. విష్ణుపురాణంలో కలియుగ విశిష్టతలను తెలిపే అధ్యాయాలలో కలియుగంలో భగవద్దర్శనం చాలా సులభమని లక్ష్యం ప్రధానం అనీ తెలుపబడినది. అంతేకాక స్త్రీలకు, శూద్రులకు కలియుగంలో త్వరగా భగవద్దర్శనం చాలా సులభంగా కాగలదని విష్ణుపురాణంలో తెలుపబడినది. అందువలన సాధన ప్రారంభిస్తే ఏదైనా సాధించవచ్చు. అన్నిటికీ నిష్కల్మషమయిన మనసే ప్రధానం.

### ◆ విశ్వామిత్రుని యాగసంరక్షణకు రామలక్ష్మణులు నిజంగా అవసరమా?

పురాణ ఇతిహాసములో చెప్పిన ప్రతి విషయంలోను యిటువంటి అనుమానములు బాగా వచ్చే అవకాశములు వున్నాయి. మీరు అడిగిన ప్రశ్నను బట్టి చూస్తే "సృష్టికి ప్రతి సృష్టి చేసిన సమర్థుడు" విశ్వామిత్రడు. ఆయన తన యాగ సంరక్షణ చేసుకో లేడా? అనే దృష్టిలో వున్నది మీ ప్రశ్న. నిజమే క్షత్రియుడుగా జన్మించి ఎంతో శ్రమించి బ్రహ్మర్షి అయినాడు. ప్రతి విషయంలోను తాను అనుకున్నది తాను సాధించేవరకు ఊరుకోలేదు. అంతేకాక త్రిశంఖు స్వర్గాన్ని నిర్మించాడు. మరి అటువంటివాడు రామలక్ష్మణులను ఎందుకు తీసుకువెళ్ళారు. అంటే యాగం చేయుటకు సంకల్పిస్తే చాలా నియమాలు ఉన్నాయి. వీటిలో "జీవహింస పనికి రాదు" అనే విషయం ఉన్నది. రాక్షసులు యాగం ప్రారంభించాక మాత్రమే వచ్చి విఘ్నం కలిగిస్తున్నారు. మరి ఈ నేపధ్యంలో ఎంతటి వీరుడైన ఎంతటి సాధకుడైనా ఎవరినో ఒకరిని ఆశ్రయించవలసినదే. మరి శ్రీరామచంద్రుడు సాక్షాత్ శ్రీమన్నారాయణుడే అనే విషయం ఆ విశ్వామిత్రునికి తెలుసు. పైగా శ్రీరామచంద్రుడు క్షత్రియుడు, ప్రభువు. యాగ రక్షణ క్షత్రియుల ధర్మం. అందువలన శ్రీరామచంద్రుని యాగ రక్షణ కోసం తీసుకున్నారు. మరి శ్రీరాముడు బాలుడు కదా! ఆయన అంత కార్యం చేయగలడని ఎలా అనుకున్నారు అని అనుమానం రావచ్చు. అయితే దానికి ఒకే ఒక కారణం సప్తఋషులు అందరికి "శ్రీమన్నారాయణుడే శ్రీరామచంద్రుడిగా అవతరించాడని" తెలుసు. అందుకే ఆయన్ని విశ్వామిత్రులవారు తీసుకువెళ్ళాడు. విశ్వామిత్రులు మహర్షి అయిన తరువాత శస్త్రాస్త్రములు ప్రయోగం చేయకూడదని కూడా అనుకున్నారు. అవి రాముల వారికి ఇవ్వడం కోసమే తీసుకువెళ్ళారు. పైగా దీక్షలో ఉన్నవారు యుద్ధం చేయరాదు కదా! అందుకే విశ్వామిత్రునికి శ్రీ రామ అవసరం ఏర్పడింది.

### ◆ మంచి దానం గోప్యంగా చేయమంటారు ఎందుకు?

ఏ దానమయినా గోప్యంగానే ఉండాలి. ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ దాత చెప్పుకోరాదు. ఇది శాస్త్రం. ఇక అనుభవ పాఠం చూద్దాం. నేటి మన యాంత్రిక జీవనంలో చెప్పుకోవడం అవసరం అనిపిస్తుంది. కారణం మన అభిమాని అయిన వ్యక్తిని మనం అనుసరిస్తూ ఉంటాం. యద్యదాచరతి శ్రేష్ఠఃతత్తదేవే తరోజనః అని గీతాచార్యుడు చెప్పాడు కదా! అందువలన ఈ కలిలో మంచి దానములు చేసినవి పబ్లిక్‌లో అందరికి తెలియడం మూలంగా మన ఫాలోవర్స్ అనుసరించి వారు కూడా మంచి దానాలు చేయడానికి అలవాటు పడతారు. తత్‌ప్రభావంగా సంఘంలో సత్ కార్యాలు పెరుగుతాయి.

### ◆ వామనావతారం రెండు సార్లు జరిగినదా?

అవును. వామనుడుగా శ్రీమన్నారాయణుడు రెండుసార్లు అవతారం చేయవలసి వచ్చినది. అందులో ఒకటి అందరికీ తెలిసినదే. ఒకటి., బలిచక్రవర్తిని మూడడుగుల

భూమిని అడిగి పాతాళానికి తొక్కేసిన సందర్భం ఒకటి. యిదికాక బలిచక్రవర్తికి పూర్వమే "దుంధుడ"నే రాక్షసుడు యింద్ర పదవిని సాధించాడు. ఆయన బ్రహ్మలోకం సాధించాలి అనే ఉద్దేశ్యంతోనే శతాశ్వమేధయాగం చేయుచుండగా అప్పుడు శ్రీమన్నారాయణుడు వామనుడగా అవతరించి ఆకాశంనుండి నదిలో పడడం, అది చూచి భార్గవ వంశీయులు రక్షించడం. అనంతరం మూడడుగల భూమిని వామనుడు దుంధుడిని అడిగి ఆయనను పాతాళమునకు అణిచివేసెను. బలికోసం అవతరించిన వామనావతారంలో "కశ్యప – అదితి"కి పుత్రుడుగా జన్మించారు. దుంధుడికోసం స్వయంగా అవతరించారు. నరసింహావతారం కూడా నాలుగు రకాలుగా పురాణంలో ఉన్నది. అయితే భాగవతమే ప్రమాణం.

### ◆ పిల్లలు లేనివారు ఉత్తర క్రియలు చేసే వారుండరనే ఆలోచనలో, బతికివుండగానే ఏమైనా కార్యం చేయవచ్చా?

యిది పిల్లలు లేనివారే కాదు పిల్లలు వున్నవారు కూడా బ్రతికి వుండగానే బదరిలో స్వయంగా "ఆత్మపిండం" వేసుకోవచ్చు. తనకు ఉత్తర కర్మలు సరిగా జరగవేమో అనే సంశయం వున్న ఎడల ఎవరికి వారు స్వయంగా జీవకర్మ ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు. అనగా ఉత్తరకర్మలలో చేసే దశమహాదానములు, షోడశమహా దానములు చేసుకోవచ్చు. ఈ పనిని పిల్లలు లేనివారు, పిల్లలు వున్ననూ వారు మనకు ఉత్తర కర్మలు సరిగా చేస్తారో? లేదో అనే అనుమానం వున్నవారు కూడా చేసుకోవచ్చు. అయితే యిది అంతా వైదిక కర్మకాండ. దీనికి బాగా అనుభవం వున్న వారి చేత మాత్రమే చేయించాలి. ఈ విషయంలో కొన్ని పాఠాంతరములు కూడా వున్నాయి. పెద్దలు ఆచరిస్తూ ఉండేవారు. ఇది చేయించడానికి వేద పండితులు, స్మార్త పండితులు మాత్రమే సమర్థులు.

### ◆ వివాహం అయిన స్త్రీకి పినతండ్రి పెదతండ్రి విషయాలలో అశౌచం వుండదా?

వివాహం అయిన తర్వాత ప్రతి స్త్రీకి ఆచార వ్యవహార, విధానములు భర్తను అనుసరించి వుంటాయి. భర్త ఆచరించే అశౌచమే భార్యకు వుంటుంది. ధర్మశాస్త్రంలో "పితామహ పితృవ్యాదే: ఊఢ కన్యాస్నానమాచరేత్" అని వున్నది. వివాహ మంత్రముల అర్థం కూడా భర్తను అనుసరించి భార్య వుండాలి అని. వివాహానంతరం భార్య తల్లితండ్రి సోదరుల మృత అశౌచం భర్త అనుసరిస్తాడు. కావున ప్రతి స్త్రీ పుట్టింటి తరపు అశౌచం అంతవరకే పాటిస్తుంది. మిగిలిన పుట్టింటి వారి తరపు అశౌచములు పాటించదు. రక్తసంబంధమే అయినప్పటికీ అవసరం లేదు. ఇది కాదనే వారు ధర్మశాస్త్ర గ్రంథాలు, వివాహ వేద మంత్రాల అర్థాలు కూడా పరిశీలించి అప్పుడు కూడా కాదంటే వారిని మనం పరిగణనలోకి తీసుకోరాదు.

◆ **కల్కి అవతారం గూర్చి వివరించండి?**

శ్రీమన్నారాయణుని అవతార గాథల వివరాలు తెలిపే శ్రీమద్భాగవతం ద్వాదశ స్కంధంలో ఈ కల్కి అవతార వివరం వున్నది. కలి కాలపు చివరలో ధర్మ సంరక్షణకు గాను భగవంతుడు అవతారం ఎత్తును. సంబల గ్రామమున విష్ణుయశుదు అను బ్రాహ్మణునికి శ్రీమహావిష్ణువు కల్కి అవతారముగా జనించును. అతడు దేవదత్తము అను గుర్రమును ఎక్కి ఖడ్గము ధరించి బలల్దేరును. అతని శరీరము నుండి అద్భుతమయిన తేజస్సు ప్రసరించును. ప్రపంచమంతా సంచరించి దుర్మార్గులయిన రాజులను సంహరించును. అంతేకాక పాపములను పారద్రోలి సత్యయుగము ప్రారంభింపచేయును. కలియుగం చివర్లో కల్కి అవతరిస్తారు. ద్వాపరయుగం గడచిన వెంటనే కలియుగ ప్రవేశం అయినది. అందువలన ఈ యుగాల మధ్య ఖాళీరాలేదు కావున మన పంచాంగ కర్తల నిర్ణయం ప్రకారం 5108 సంవత్సరాల కలియుగ వయస్సు సరి అయినదే అందువలన కల్కి అవతరించడానికి యింకా సమయం చాలా వున్నది.

◆ **మేము నూతనంగా గృహనిర్మాణం చేశాము. గృహప్రవేశం మరునాడు మా తండ్రిగారు కాలం చేశారు. అందరూ "యింటిలో వాస్తు దోషం వున్నదేమో?" అంటున్నారు. వాస్తు అంతస్థాయిలో పనిచేస్తుందా?**

మీరు వాస్తు ప్రకారం యిల్లు కట్టుకున్నారు. కావున మీ తండ్రిగారిని కొంత కాలం ఆయుష్షు పెంపు వుండదు. అలాగే మీరు వాస్తు ప్రకారం యిల్లు కట్టకపోవడం వలన కొంతకాలం ఆయుష్షు తగ్గింపు వుండదు. బ్రహ్మరాసిన లలాట లిఖిత ఆయుర్దాయం యమధర్మ రాజు తూ.చ. తప్పక అమలుచేస్తారు. భగవద్గీతలో కృష్ణ పరమాత్మ అర్జునునికి చేసిన జ్ఞానబోధ యిదే. తల్లిదండ్రులను, గురువులను, తాతలను చంపలేను అని అర్జునుడు అంటే దానికి సమాధానంగా శ్రీకృష్ణుడు చెప్పే మాటలు యొక్క అర్థం "నీవు బాణం వేసిననూ వారికి ప్రాణాలు కోల్పోయే యోగం నేను వ్రాస్తేనే ప్రాణం పోతుంది. నీ బాణం, నీవు కూడా నిమిత్త మాత్రులే" అందువలన సృష్టిలో యిప్పటివరకు ప్రాణాలు తీసే వాస్తు సృష్టింపబడలేదు గుర్తించండి. అతి ఆలోచనలతో అసలు మహర్షులు చెప్పిన వాస్తు శాస్త్రం చదవకపోవడం వలన వచ్చిన నష్టం ఇవి.

◆ **ఇంట్యూషన్ (దైవీబలం) ఉంటుందా?**

ఒక ఉదాహరణ దివంగత ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డిగారి మృతికి పూర్వం జూన్, జూలై మాసాలలో విజయవాడ కామకోటినగర్‌లో ఒక యాగం జరిగినది. రోశయ్యగారు యాగదర్శనం కోసం వచ్చారు. కీర్తిశేషులు విష్ణుభొట్ల లక్ష్మీనృసింహ ఘనపాఠిగారు రోశయ్యగారిని తమ ప్రక్కన ఉన్న ఇతర వేద పండితులతో కలిసి ముఖ్యమంత్రి ప్రాప్తిరస్తు అని ఆశీర్వదించగా అసెంబ్లీ లాబిలో రాజశేఖర్ రెడ్డిగారు

రోశయ్యగారిని హాస్యం చేసినట్లుగా మరుసటి రోజు పేపర్లలో ఈనాడు, ఆంధ్రజ్యోతిలలో "ముఖ్యమంత్రి ప్రాప్తిరస్తు" "ఆశీర్వచనం ఫలించేనా?" అని హెడ్డింగ్‌లతో మేటర్ వచ్చినవి. మరి అప్పటి దాకా ఊహలో లేని రోశయ్యగారికి ముఖ్యమంత్రిత్వం సిద్ధించినది అంటే మరి దేవీ బలం ఉన్నదా? లేదా? మీరే తేల్చుకోండి? అయితే రోశయ్య గారు ముఖ్యమంత్రి అయిన తరువాత ఆ పేపర్‌లు వీటి గురించి మరల వ్రాయలేదు.

### ◆ అవధూతకు సన్యాసికి గల తేడా ఏమిటి?

ప్రారంభం నుండి ఏ దేని దేవతా ఆరాధనలతో వుండి పూర్తిగా ఆ దేవతా బోధనలు అందరికీ తెలియజేస్తూ, ఆ దేవతానుగ్రహంతో భూత భవిష్య ద్వర్తమానములు తెలుసుకునే స్థాయికి చేరి, వారు స్వయంగా ఆ దేవత యొక్క రిప్రజెంటిటివ్‌గా వ్యవహరించేవారిని అవధూతలు అంటారు. ఈ అవధూతల జీవనశైలి సన్యాసుల జీవనశైలికి దగ్గరగా వుంటుంది. సన్యాసికి దండ కమండలములు తప్పనిసరి. అవధూతకు అవి వుండవు. సన్యాసికి కాషాయ వస్త్రధారణ తప్పనిసరి అవధూతకు ఆ నియమం లేదు. భిక్షాటన సన్యాసికి విధించిన ప్రధాన నియమం, ఏ బంధం అనుబంధంలేని జీవితం సన్యాసి గడపవలెను. అయితే అవధూతకు తాను నమ్మిన దేవతాబంధం జీవితాంతం వుంటుంది. అన్ని బంధాలు, కోరికలు వదిలి సన్యాసి జీవనం చేయవలెను. సన్యాసి ఒకచోట నివాసం వుండరాదు. సన్యాసి మోక్షగామి అయి నిరంతరం నారాయణ నామస్మరణం చేయుచూ జీవనం చేయవలెను. సన్యాసి నియమాలు తెలుసుకోగోరు వారు శ్రీమద్భాగవతం సప్తమస్కంధం చదవండి. అవధూత ఇచ్ఛానుసారి, ధర్మసంచారి.

### ◆ శివుడు సర్వ విద్యలకు, అస్త్ర, శస్త్రములకు అధిపతియా?

అవును. ఈ విషయం రామాయణంలో కూడా వున్నది. వశిష్ఠ ఆశ్రమంలో ఒకనాడు విశ్వామిత్రుడు (రాజుగా వున్న సమయంలో) తను, తన సేనతో సహా విందు ఆరగించి, ఆ విందు ఏర్పాటు చేసిన "కామధేను" అనే మహిమకల ధేనువును బలవంతంగా అయినా తీసుకుపోవలెను అనే కోరికతో బల ప్రదర్శన చేసి ఆ కామధేను చేతిలో పరాజయం పొందిన వాడై ఆశ్రమం నుండి వెళ్ళెను. విశ్వామిత్రుడు వశిష్ఠుని ఎదిరించేందుకుగాను అన్నీ అస్త్రములు పొందాలి; దీని గూర్చి ఎవరిని అర్చించాలి అనే సందేహంలో వుండగా అయనకు మహాదేవుడు శివుని అర్చించిన ఎడల సర్వ అస్త్రములు లభింపగలవు అనే ఉద్దేశ్యం కలిగి హిమాలయములకు వెళ్ళి శివుని అర్చించి అన్నీ అస్త్రములు శస్త్రములు సంపాదించెను. దీనిని బట్టి సర్వ అస్త్రశస్త్రములకు అధిపతి శివుడే అని తేలింది కదా? యిక విద్యల విషయానికి వస్తే భారతీయ సాంప్రదయంతో వేదముల నుండి శాస్త్రములు ఉద్భవించాయి.

వేదశాస్త్రములే విద్యలు. "వేదశ్శివః శివో వేదః" అని ప్రమాణమే వున్నది కదా? దీనిని బట్టి సర్వవిద్యలకు శివుడే అధిపతి. విద్యాయోగం కలగాలి అంటే శివారాధన చేయాలి. "ఈశానస్సర్వ విద్యానాం" వేద వాక్యం.

◆ **ద్రోణాచార్యుని పేర అవార్డులు యిస్తారు కదా? ద్రోణుడు గురువుగా అంతగొప్పవాడా?**

చాలా చక్కటి ప్రశ్న. "కృష్ణం వందే జగద్గురుమ్" అని శ్రీ కృష్ణపరమాత్మను నిత్యం స్తుతించే ఈ భారతదేశంలో కృష్ణుని పేర అవార్డు యివ్వవచ్చు గదా? అలాకాక ద్రోణుని పేర యిస్తున్నారేమిటి? అని మీ సంశయం కావచ్చు. యిక్కడ శ్రీ కృష్ణపరమాత్మ ద్వాపరయుగంలో భూమి మీదకు వచ్చినది మొదలు తన అవతారం చాలించేవరకు నడచిన ప్రతినడవడీ కూడా ప్రతిమనిషికీ ఒక పాఠమే. అంతేకాదు ప్రతి మనిషికీ అజ్ఞానం పోగొట్టి వారు చక్కటి విజ్ఞానంతో బ్రతకడానికి గాను – శ్రీకృష్ణపరమాత్మచే అర్జునునికి చెప్పబడి–తద్వారా లోకానికి అందించబడిది భగవద్గీత. ప్రతి మనిషీ సుఖజీవనం చేయవలెను అనినా (లేదా) ఏదేని సమస్యలో వున్నా ఒక శ్రీకృష్ణుని గూర్చి భారత భాగవతాలలో శోధన చేస్తే తప్పనిసరిగా మన సమస్యకు పరిష్కారం లభిస్తుంది. సుఖజీవనం లభిస్తుంది. అందుకే ఆయన జగత్‌కు గురూజీ అయ్యారు. అయితే తాను ప్రత్యక్షంగా ఎప్పుడూ గురుస్థానంలో లేరు. యికద్రోణుణి గూర్చి పరిశీలిస్తే భారతంలో ద్రోణ పాత్ర గురువుగానే ప్రారంభం అక్కడి నుండి ద్రోణుని చివరి శ్వాసవరకు గురుస్థానంలోనే వున్నారు. ఆయన పరస్పరం శతృవులయిన కౌరవపాండవులకు విద్యాభ్యాసం చేయించారు. అలాగే ఎంతోమంది ఆనాటి రాజులు రాజపుత్రులు ఆయన శిష్యులే. యిక ఆయన గురువుగా గొప్పస్థానం సంపాదించుటకు కారణాలు ఎన్నోవుండగా అందలి ప్రధాన కారణం గూర్చి చూద్దాం. ద్రుపదుడు అనే మహారాజు ద్రోణాచార్యుల వారిని తీవ్రంగా అవమానించాడు. అయితే పాండవులు గురుదక్షిణగా ద్రుపద మహారాజును యుద్ధంలో ఓడించి బంధించి ద్రోణునికి అప్పగించారు. ద్రోణుడు ద్రుపదుడు ఒక గురువు శిష్యులే. కావున ఆ పాత స్నేహంతో ద్రోణుడు ద్రుపదుని విడుదల చేశారు. ఆ తర్వాత "ద్రోణుని సంహరించు పుత్రుని పొందాలి" అని కోరికతో ద్రుపదుడు యాగం చేసి యజ్ఞ ప్రసాదంగా ద్రౌపదిని, దుష్టద్యుమ్నుని పొందాడు. దుష్టద్యుమ్నుని జన్మకు ప్రధాన లక్ష్యం ద్రోణుని వధించడమే. అది తెలిసి కూడా ద్రోణాచార్యులవారు దుష్టద్యుమ్నుని చేత విద్యాభ్యాసం చేయించారు. గురువు యొక్క ధర్మం తన దగ్గరకు ఎవరైనా వచ్చి విద్య నేర్పమంటే ఆ అడిగినవాడు అర్హుడే కనుక అయితే తప్పనిసరిగా విద్యను నేర్పాలి. ఆ కోణంలోనే దుష్టద్యుమ్నుడు విద్యార్థిగా అర్హత కలవాడే అందు వలన ద్రోణాచార్యులవారు "దుష్టద్యుమ్నుడు తనను వధించుటకు పుట్టినవాడు" అనే

విషయం పక్కన పెట్టి అతనికి చదువు చెప్పి లోకంలో, కీర్తి పతాకంను ఎగురవేశారు. అంతేకాక ద్వాపరయుగంలో విద్యా ప్రదర్శన చేసి కీర్తి గడించిన వారిలో ఎక్కువ మంది ద్రోణుని శిష్యులే. గురువు స్థానం ఆక్రమించి గురువుగా కీర్తి గడించి గొప్పగా గురువు లక్షణాలు ప్రదర్శించిన ద్రోణుడి పేర అవార్డులు యివ్వడంలో అతిశయోక్తి లేదు.

### ◆ సత్పురుషుల ఆశీర్బలం - గ్రహబలమును అధిగమిస్తుంది అంటారు నిజమేనా?

గ్రహబలం ప్రధానం తప్పదు. 100 శాతం నిష్కల్మషంగా ఆశీర్వచనం చేయువారి ఆశీర్బలం ప్రభావంగా మనకు మంచి జరుగుతుంది. జరుగబోయే చెడు ముందుగా తెలుస్తుంది. చెడు దాటగలుగుతాం. మంచి పొందగలుగుతాం. సత్‌పురుషుల ఆశీర్బలం విశేషమే.

### ◆ స్త్రీలు గాజులు ఎందుకు ధరించాలి?

బాలికలను, వివాహం అయిన స్త్రీలను లక్ష్మీ స్వరూపంగా గౌరవించడం మన సంప్రదాయం. లక్ష్మీత్వంగల మంగళ ద్రవ్యాలుగా పసుపు, కుంకుమ, పూలు, గాజులు సూచించారు. ఈ మంగళ ద్రవ్యాలను ధరించడం వలన లక్ష్మీప్రదమైన చిహ్నాలు మరింత పెరుగుతాయి. అంతేగాక, లక్ష్మిని అంటే స్త్రీని కాపాడవలసిన బాధ్యత కూడా వుందని స్త్రీకి రక్షణ కూడా కల్పించడం జరిగింది. అంతేగాక గాజులు ధరించడం ఆరోగ్యప్రదమైనది. ఆక్యుపంక్చర్ సూత్రాలు దీనిని సమర్థిస్తున్నాయి. లలితా సహస్ర భాష్యం చదివితే ముక్కుపుడుక, చెవుల దిద్దులు, బొట్టు వివరాలు తెలుస్తాయి.

### ◆ శైవులు, వైష్ణవులు అనే బ్రాహ్మణ వర్గీకరణ సరి అయినదేనా?

దేవీ భాగవతం మన ఈ సంశయాన్ని తీర్చగలదు. జన్మతోనే బ్రాహ్మణుడుగా తెలుపుబడుతుంది. ఉపనయనంలో గాయత్రీ ఉపదేశం చేయబడుతుంది. వేద శాస్త్ర విజ్ఞాన ఆర్జనకు అర్హత ప్రారంభం అవుతుంది. ఈ గాయత్రీ ఉపదేశంతోనే కొన్ని నియమాలు కూడా విధింపబడినవి. బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులకు ఉపనయంతో గాయత్రీ దీక్ష ప్రారంభం అవుతుంది. ప్రతి బ్రాహ్మణునికీ గాయత్రీ శాశ్వత దీక్ష. అందుకే బ్రాహ్మణులు అందరూ శాక్తేయులు అని వర్ణించినది దేవీభాగవతం. అయితే శైవులు వైష్ణవులు అనే వర్గీకరణ కేవలం మనం సృష్టించుకున్నదే. శివారాధన ప్రాముఖ్యం కలవారు శైవులు. విష్ణు ఆరాధన ప్రాధాన్యం కలవారు వైష్ణవులు. సృష్టికి శివకేశవులు యిరువురూ ఒకటే. అంతేకాక శివ, కేశవులకు భేదం చూసినవారు నరక ప్రాప్తిని పొందుతారు అని పురాణములు తెలుపుచున్నవి. అంతేకాక బ్రాహ్మణులు అంతా శైవులు కారు, వైష్ణవులు కారు, “శాక్తేయులు” అని దేవీభాగవతం సూచిస్తున్నది. శైవులు శివకేశవ ఆరాధన చేయవలసినదే. వైష్ణవులు కూడా శివకేశవ ఆరాధన చేయవలసినదే. శివకేశవ ఆరాధనల యందు భేదం చూపరాదనే పురాణాలు

తెలుపుచున్నవి. యింకా విశేషములు కావలెను అనిన ఎడల శివపురాణం, విష్ణు పురాణం, దేవీభాగవతం చదవండి. మీకు మరిన్ని విశేషాలు తెలుస్తాయి. "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" పురుషసూక్తం, బ్రాహ్మణుల సృష్టి పురుషోత్తముడిది. శైవం, వైష్ణవం సృష్టి మహర్షి సాంప్రదాయం అనుసరించి వచ్చినది.

**◆ వానరులలో రాముడికంటే ముందు జన్మించిన వారెవరు? ఆంజనేయుడి తండ్రి ఎవరు?**

రామాయణం బాలకాండ 17వ సర్గ ఆధారంగా జాంబవంతుడు రామావతారం కంటే ముందుగానే జన్మించినట్లు తెలియుచున్నది. రామావతారం అయిన తదుపరి బ్రహ్మగారి ప్రేరణతో, వివిధ దేవతల అంశల ప్రభావంగా వాలి, సుగ్రీవ, నల, హనుమంత మొదలగు వారు పుట్టిరి. దీనిని బట్టి వానరులలో రాముల వారి కంటే ముందు జన్మించినది కేవలం జాంబవంతుడే.

అంజనాదేవి, కేసరి (వానర రాజు)ల యొక్క పుత్రుడు ఆంజనేయస్వామి. అంజనాదేవి సంతానం కోసం వేంకటాచలం (ప్రస్తుత తిరుపతి కొండ) మీద తపస్సు చేయగా శివుని ఆజ్ఞతో వాయుదేవుడు శివతేజమున అంజనాదేవి గర్భమున ప్రవేశపెట్టెను. అందుకే ఆంజనేయస్వామి శివాంశ, వాయుపుత్రుడు, కేసరినందనుడుగా పిలువబడుతాడు.

**◆ మీరు టి.వి. 1, టి.వి. 9లలో జ్యోతిషం ప్రోగ్రామ్స్ ఎందుకు మానేశారు?**

ప్రజలలో ఉన్న కోరిక అతిగా ఉన్నది. టి.వి. 1లో అదృష్టం ప్రోగ్రామ్ చేశాము. జాతకం ప్రశ్నలకు ఎమ్‌సెట్ పేపర్ మోడల్‌లో ఒక్క నిముషంలో జాతకానికి ఆన్సర్స్ చెప్పడం కుదిరే పనికాదు. ప్రజలు కోరుకుంటున్నారు. అది వారి అతి ధోరణి. కనీసం తొమ్మిది గ్రహాలు 12 భావాలు వాటిని గ్రహజం, రాశిజం, భావజం, గ్రహరాశిజం, గ్రహభావజం, యోగజం పరిశీలించాలి అంటే కనీసం ఒక జాతకానికి 10 నిమిషాల వ్యవధి కూడా లేకుండా చెప్పడం అనేది ప్రజలను మోసం చేసినట్టే అనిపించింది. అందుకే టి.వి.1 మానివేసాను. ప్రస్తుతం టి.విలలో ఈ ప్రోగ్రామ్ చేసేవారు అది నిజమా కాదా అనేది వారి మనోభావాన్ని వారే ప్రశ్నించుకోవాలి.

**◆ పురాణాలలోని ఆశ్రమ ధర్మ విశేషాలు తెలుపగలరు?**

నియమం లేని జీవనం గమనం లేని ప్రయాణం వంటిది. నియమాలు తరచు దాటవేయు జీవనం దోష భూయిష్టమయినవే అగును. అందువలన మన సాంప్రదాయంలో ప్రతిస్థాయిలోను వర్ణాశ్రమ ధార్మల పేర కొన్ని నియామలు చెప్పబడినవి. ఆశ్రమ ధర్మాలు చక్కగా పరిపాలన జరిగితే సృష్టి అంతా జాగ్రత్తగా సాగుతుంది అనే ఉద్దేశ్యంతో మహర్షులు మనకు కొన్ని ధర్మాలు తెలిపారు. కేవలం భాగవతంలోనే కాక పురాణాలలో కూడా అనేక చోట్ల ఈ ఆశ్రమ ధర్మాలు తెలియచేయబడినవి.

శ్రీమద్భాగవతంలోనే కాక మార్కండేయ పురాణంలో మదాలస అలర్కునికి బోధించిన సందర్భంలో, కూర్మ పురాణం ఉత్తర ఖండలోను, విష్ణుపురాణం తృతీయాంశంలోను యిలా ఎన్నో చోట్ల మనకు ఈ ఆశ్రమ ధర్మ వివరాలు తెలియచేయబడినవి. అంతేకాక అన్ని రకాల భారతీయ సంస్కృతి సంబంధ గ్రంథాలలోను ఏదో ఒక సందర్భంగా ఈ ఆశ్రమ ధర్మాలు బోధింపబడినవి. ఆశ్రమములలో బ్రహ్మచర్య, గృహస్థ, సన్యాస, వానప్రస్థ ఆశ్రమములు ఉన్న శ్రీమద్భాగవతం సప్తమ స్కంధం మరియు ఏకాదశ స్కంధములలో ఈ ఆశ్రమ ధర్మ విశేషాలు తెలుపబడినవి. మనిషి జీవన శైలి అంతా చిన్న వయస్సులో పెరిగిన విధానం మీద ఆధారపడుతుంది. అందువలన బ్రహ్మచర్యం జీవితానికి చాలా ప్రాముఖ్యమయిన ఆశ్రమం. అలాగే గృహస్థాశ్రమం సమాజానికి చాలా అవసరమయిన ఆశ్రమం. కారణం

యధా మాతరమ్ ఆశ్రిత్య సర్వేజీవంతిజన్తవః – వర్తంతే గృహిణః తద్వత్ ఆశ్రిత్య ఇతర ఆశ్రమాః ॥ అన్ని రకాల ఆశ్రమ వాసులు కూడా ఈ గృహస్థ ఆశ్రమంలో వున్నవారి మీద ఆధారపడవలసినదే.

బ్రహ్మచారి ధర్మములు తెలుసుకుందాం.

***బ్రహ్మచారీ గురుకులే వసన్ దాన్తో గురోర్హితమ్***
***ఆచరన్ దాసవన్నీచో గురౌ సుదృఢ స్సౌహృదః***

బ్రహ్మచారి గురుకుల మందు నివసింపవలెను. ఇంద్రియ నిగ్రహంతో గురువు యందు మంచి భావము స్నేహభావముతో వుంటూ ఒక దాసునివలె, ఒక అల్పుని మాదిరిగా వుంటూ గురువునకు హితము చేయుచూ జీవితం గడపాలి. కృష్ణ యజుర్వేదం కూడా "ఆచార్యాధీనోభవ" "భిక్షాచర్యం చర" అనే చెబుతున్నది. బ్రహ్మచారిని గురుకులమునకు పంపేటప్పుడే శ్రేష్ఠుడయిన గురువును విద్యావంతుడు, సత్ప్రవర్తన కలిగిన గురువును ఎంచుకొనవలెను. తత్ప్రభావంగా ఆ గురువు ఆధీనంలో ఈ బ్రహ్మచారి సత్ప్రవర్తన కలిగి విద్యావంతుడై వుండే అవకాశం వున్నది.

పురాణ పురుషులు రాముడు, కృష్ణుడు వంటివారు కూడా ఈ నియమాన్ని పాటించారు. విశ్వామిత్రుని దగ్గర శ్రీరాముడు, సాందీపముని దగ్గర శ్రీకృష్ణుడు విద్యాభ్యాసం చేశారు. అంతేకాక అతి తక్కువ సమయం అవతారంలో వున్న వామనుడు కూడా భరద్వాజ మహర్షి దగ్గర విద్యాభ్యాసం చేసినట్లు వున్నది. అంతేకాక రాక్షసశ్రేష్ఠులకు కూడా గురుకుల విద్యాభ్యాస విషయంతో మంచి గౌరవం వున్నట్లు ఆధారాలు వున్నాయి. హిరణ్య కశిపుడు ప్రహ్లాదుని చండామర్కులు అను వారి దగ్గర విద్యాభ్యాసము చేయించినటుల ఆధారం వున్నది. ఎటువంటి వారయినా గురు శుశ్రూష ద్వారా విద్యాజ్ఞానం సముపార్జించితే అది విశేషమయిన విలువలు

కలిగివుంటుంది అని అన్ని పురాణాలు సూచిస్తున్నవి. గురుకుల వాసంలో దుర్మార్గ ప్రవృత్తులు అలవడక అవకాశం వున్నంత వరకు భక్తి, జ్ఞాన, వైరాగ్యములు సాధించుకునే అవకాశం వున్నది.

*సాయంప్రాతరుపాసీత గుర్వగ్న్యర్క సురోత్తమాన్*
*సన్ధ్యే ఉభేచ యత వాగ్జపన్ బ్రహ్మ సమాహితః ॥*

ఉదయ కాలములోను, సాయంకాలములోను గురువును, అగ్నిని, సూర్యుని దేవతా శ్రేష్ఠులను ఉపాసించవలెను. రెండు సంధ్యములలోను మౌనం పాటించవలెను. చిత్త సమాధానము కలవాడై గాయత్రి జపం చేయవలెను. సంధ్యావందనం గాయత్రీ జపం విషయంలో దేవీ భాగవతంలోని విశేషాలు పరిశీలిద్దాం. ప్రాతస్సంధ్య సూర్యోదయానికి పూర్వమే ఆచరించుట శ్రేష్ఠము. బ్రాహ్మీ ముహూర్తం అనగా సూర్యోదయానికి అయిదు ఘడియలు పూర్వము. యిది సంధ్యా వందనమునకు విశేష కాలము. అయిదు ఘడియలు అనగా రెండు గంటలు. ఏదేని శారీరక శ్రమ వలన సూర్యోదయాత్ పూర్వం చేయలేని పక్షంలో "ఉదయాస్తమయాత్ ఊర్ధ్వం యావత్స్యాద్ఘటికా త్రయమ్ తావత్సంధ్యా ముపాసీత ప్రాయశ్చిత్తం తతఃపరమ్ ॥" సూర్యోదయ అస్తమయ అనంతరం మూడు ఘడియల వరకు దోషం వుండదు. సకాలంగానే పరిగణించాలి. ఆ తర్వాత అకాలం అవుతుంది. కావున ప్రాయశ్చితంతో సంధ్యావందనం ఆచరించాలి. కానీ వైదిక సంప్రదాయంలో సూరోయదయ సూర్యాస్తమయముల నుండి ప్రాయశ్చిత్త అర్ఘ్యం యివ్వవలెను. తనూట ఎనిమిది గాయత్రి తప్పనిసరిగా చేయవలెను. సూర్యోపస్థానం వరకు సంధ్యావందనం ఒక స్థానంలోనే వుండి చేయవలెను.

*యస్మిన్ కాలేతు యత్కర్మ తత్కాలా ధీశ్వరీంచతామ్ ।*
*సంధ్యాముపాస్య పశ్చాత్తు తాత్కాలినీం సమాచరేత్ ॥*

ఏ కాలములో ఏ కర్మ చేయవలసి వచ్చిననూ మొట్టమొదట కాలాధీశ్వరి అయిన సంధ్యను ఉపాసించిన పిమ్మట మిగిలిన కార్యములు చేయవలెను. నదీ తీరంలో చేయు సంధ్యావందనముకు విశేషం ఎక్కువ వుంటుంది. సంధ్యావందనం కూడా దేవీ ఉపాసనమే. గాయత్రీ అనుష్ఠానము బ్రాహ్మణుడు నిత్యము చేయవలసినదే. బ్రహ్మాదులు కూడా నిత్యం మూడు సంధ్యల యందు గాయత్రీని ఆరాధింతురు. గాయత్రి మినహా మిగిలిన దేవతారాధనలు నిత్యానుష్ఠానములు కావు. బ్రాహ్మణులు నిత్యం గాయత్రీ అనుష్ఠానం చేయకుండా వేరే అనుష్ఠానం చేయకూడదు అనే నియమం వుంది కాబట్టే బ్రాహ్మణులు అందరూ "శాక్తేయులు" అవుతారు. "తస్మాత్సర్వే ద్విజాః శాక్తాన శైవానచ వైష్ణవాః" అనగా బ్రాహ్మణులు శైవులు కారు "శాక్తేయులు" అని గ్రహించాలి. బ్రాహ్మణ జాతి యందు శైవులు, వైష్ణవులు అనునవి కల్పనలు

మాత్రమే అని గ్రహించాలి. బ్రాహ్మణ జాతి యందు శైవులు, వైష్ణవులు అనునవి కల్పనలు మాత్రమే అని గ్రహించాలి.

బ్రహ్మచారి ధర్మాలలో భిక్షాటన ప్రధాన మయినది. "భిక్షాచర్యంచం" అని వేద వాక్యం. భిక్షాటనలో ఆహారం సంపాదించిన తర్వాత "సాయం ప్రాతశ్చరేద్భైక్షం గురవే తన్ని వేదయత్ । భుజ్జీత యద్యనుజ్ఞాతో నోచేదుపవసేత్ క్వచిత్ ॥" సాయంకాలం, ప్రాతఃకాలములలో సంపాదించిన భిక్షను గురువునకు సమర్పించి గుర్వాజ్ఞతోనే భుజింపవలెను. లేని ఎడల ఉపవసించవలెను. బ్రహ్మచారి తన పనులు తానే స్వయంగా చేసుకొనవలెను. స్త్రీలతోను, స్త్రీలోలురు అయిన పురుషులతోను ఎక్కువగా సంభాషించకూడదు. స్త్రీ విషయముల గూర్చి చర్చ తగదు. స్త్రీ విషయ చర్చ వలన స్త్రీ సంభాషణల వలన పురుషుడు ఇంద్రియ నిగ్రహం కోల్పోవు అవకాశం వున్నది. ఆయుర్వేదం కూడా ఈ విషయ్యాన్ని సమర్థించినది. గురుపాదములు సేవించుట, భోగములు వదలుట వంటివి బ్రహ్మచారి ధర్మములు.

## గృహస్థ ధర్మములు

గృహస్థుకు చెప్పబడిన ధర్మములు చక్కగా పాటించుట వలన అది మోక్షమును కలుగచేయును. చంచలమయిన మనస్సుతో కర్మసన్యాసం చేయుట కంటే స్థిర బుద్ధితోను ధర్మబుద్ధితోను కర్మలు ఆచరిస్తూ గృహస్థాశ్రమ ధర్మం పాటించుట ఉత్తమము. గీతాచార్యుడు కూడా సన్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయ సకరావుభౌః

తయోస్తు కర్మసన్యాసాత్ కర్మ యోగోవిశిష్యతే ॥ అని శలవిచ్చారు.

కర్మాచరణ, కర్మసన్యాసములలో కర్మానుష్ఠానమే గొప్పదని తెలిపారు.

గృహస్థాశ్రమం ఎందుకు? అనే అంశం మీద పురాణాలలో బహు సందర్భాలు గోచరిస్తాయి. వ్యాసమహర్షి తన పుత్రుడు అయిన శుకమహర్షిని వివాహం చేసుకోమని చెప్పే సందర్భంలోను – మదాలస అలర్కుడికి బోధించిన గృహస్థ ధర్మాలు రౌచ్యమనువు తండ్రికి పితృదేవతలు కనిపించి చెప్పిన ధర్మాలు (మార్కండేయ పురాణములోనివి) – శుకమహర్షి జనకునితో చేసిన సంవాదం (శ్రీమద్భాగవతం సప్తమస్కందంలోనివి.) ఇలా ఎన్నో చోట్ల గృహస్థాశ్రమ ధర్మాలు గోచరిస్తాయి. వివాహం విద్యాభ్యాస అనంతరం చేసుకోవాలి. "ఉపనీతోవసేదాదౌ వేదాభ్యాసాయవై గురౌ, అధీత్య వేదాంతాన్ద త్వాచ గురు దక్షిణాం సమావృత్తస్తు గార్హస్థ్యే సదారోనివసేన్మునిః ॥" మోక్షగామి అయినవాడు మొదట ఉపనీతుడై గురుకులమునకు పోయి వేద వేదాంతములను అధ్యయనం చేయవలెను. గురుదక్షిణములు ఇచ్చి సమావర్తన సంస్కారములు పొంది కామియై భార్యతో కూడా ప్రజాతంతును సాగించవలెను. మితభాషి, హితభాషి, సత్యభాషిగా జీవనం సాగించవలెను. నిరాశుడు గాను, నిత్య

సంతోషిగాను ఎప్పుడు శుచిగాను ఉండవలెను. సంతతి వృద్ధి జరిగిన తరువాత తన కుటుంబ బాధ్యతలను పిల్లలకు అప్పగించి వానప్రస్థాశ్రమ వాసమునకు పోవలెను. అందుకే సంతానం అందరికి అత్యావశ్యకము. శ్రీకృష్ణ పరమాత్మ జాంబవతి ప్రేరణతో సంతానం కొరకు శివుని గురించి తపస్సు చేసి సంతానం పొందెను. వ్యాస భగవానుడు కూడా సంతానం కొరకు తపస్సు చేసి శివుని మెప్పించి శుకమహర్షిని సంతానముగా పొందెను. పుత్ర సంతతి వంశవృద్ధి లేని కారణంగా పితృ దేవతలు స్వర్గమునుండి పతనము అధోగతి పొందగలరు. వివాహము అనెడి పవిత్ర కార్యము పుత్రవంతుడు అవ్వడం వంటివి లేనిదే ముక్తికి కూడా దూరం కావలసి వస్తుంది. దేవతలకు, పితరులకు, పూజ్యులకు, ఋషులకు, అతిథిగణములకు యథాశక్తిగా సత్కారములు చేయుటకు గృహస్థు స్వర్గాదిలోకములను అనుభవించ వచ్చును. మార్కండేయ పురాణంలో ఇంకా విశేషములు ఉన్నవి. భార్యను జీవితాంతం విడనాడరాదు. భార్యకు అన్ని విధములుగా రక్షణ చేయవలెను. భార్యారక్షణ చేయుటలో లోపం జరిగిన ఎడల పితృదేవతలకు సద్గతులు ఉండవు. భార్య ప్రక్కన లేకుండా చేయు ఏ నిత్య నైమిత్తిక కర్మ కూడా ఫలితములు ఈయజాలదు. కర్మాను ష్ఠానమునకు భంగము కలుగును. ఒక పక్షం రోజులు కర్మానుష్ఠానము చేయనివాడు అస్పృశ్యుడు అవుతాడు. అంతేకాక అతడు నమస్కారం పొందుటకు కూడా తగనివాడు. భార్యను విడనాడనివాడిని నమస్కరింపకూడదు. అతనికి అర్ఘ్యపాద్యాదులు ఇవ్వరాదు. వివాహం యొక్క వేద మంత్రాల అర్థం కూడా ఇదే. భార్యను విడనాడిన వాడి పితృదేవతలు కూడా అధోగతులు అగుదురు. తన సంపాదనలో నాల్గవ వంతు లౌకిక ధర్మముల కొరకు ఖర్చు చేయవలెను. నడుచుచూ ఆహారం భుజించ రాదు. భోజన సమయంలో మౌనంగా ఉండాలి. జ్ఞాతులకు శక్త్యానుసారంగా సహ కారం చేయవలెను. ఏ వ్యక్తి శ్రీమంతుడై వుండి కూడా జ్ఞాతులకు అత్యవసర స్థితిలో సహకారం చేయకపోతే అతడికి పాపం కలుగును. గృహస్థాశ్రమ ధర్మములు సవ్యంగా పాటించిన ఎడల బ్రహ్మాది దేవతలు, పితృదేవతలు, మహర్షులు, అతిథులు, బంధువులు, పశుపక్ష్యాదుల ద్వారా ప్రసన్నత పొంది వారు క్షేమము కలుగజేయుట తద్వారా సుఖమును పొందవచ్చును. యజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము అనునవి గృహస్థునకు తప్పనిసరి.

**వానప్రస్థ సన్యాస ఆశ్రమ ధర్మాలు:**

వానప్రస్థం స్వీకరింప ఆలోచన ఉన్నవాడు భార్యను పుత్రులకు అప్పగించవలెను. లేదా తన వెంట తీసుకొనిపోవలెను. వనమున నివశించుచూ వల్కలములు, పత్రములు, మృగ చర్మములు, వస్త్రములుగా ధరింపవలెను. వనము నందలి కంద

మూలములు, ఫలములు ఆహారముగా తీసుకొనుచూ కాలక్షేపం చేయవలెను. భూతలశయనం చేయవలెను. కేశములు, నఖములు తీయరాదు. త్రికాల స్నాన సంధ్యలు వదలరాదు. నేటి కాలంలో రిటైర్ అయినటువంటి వ్యక్తులందరూ వాన ప్రస్థమునకు వెళ్ళకపోయినా ఇంటిలోనే వుండి ఈ నియమాలు పాటిస్తే మన యొక్క సంస్కృతి శోధన చేస్తే మనం విజ్ఞానవంతులము అవుతూ మన తర్వాత తరాల వారికి మన యొక్క సంస్కృతి గురించి విశదీకరించి వారిని సన్మార్గంలో నడపవచ్చు. కలియుగంలో వానప్రస్థం కష్టమే గానీ, ఇంటి దగ్గర ఉండి ఆ నియమాలు పాటించవచ్చు. సన్యాసి ధర్మములు ఏమనగా కేవలం దండ కమండల కౌపీనములు మాత్రమే ధరింపవలెను. ఒక్కొక్క గ్రామంలో ఒక రోజు మాత్రమే నిదురింపవలెను. ఈ నియమం నేటి యాంత్రిక జీవనంలో కష్టమే. కానీ ఇతర నియమాలు అన్నీ కూడా ఆచరణీయ సాధ్యము. సదా నారాయణ మంత్రము జపించుచూ ఉండవలెను. మృత్యువును గురించి తలంచరాదు. దేహాభిమానము వదిలివేయవలెను. బహు గ్రంథా భ్యాసము చేయవలెను. సన్యాసి కలత చెందరాదు. ఎవరిని కలత పెట్టరాదు. కేవలం ప్రాణ రక్షణ నిమిత్తంగా మాత్రమే ఆహారం తీసుకొనవలెను. శ్రమము, అహింసా తప్పని సరిగా పాటింపవలెను.

### ◆ "వేంకటేశ్వర స్వామి" కేవలం తలమాత్రమే వున్న విగ్రహం పూజలో వుంచుట మంచిదేనా?

పూర్తిగా అన్ని అవయవములు వున్నట్లుగా వున్న దేవుని విగ్రహాలకే పూజలు చేయుట శ్రేయస్కరము. మొండెము, తల వుండి కాళ్ళు లేకపోయినా, తలవుండి మొండెము, కాళ్ళు లేకపోయినా అవి దేవుని రూపములు అవ్వవు. వాటిని పూజించుట, అటువంటి బొమ్మలు అలంకరణకు వాడుట, అటువంటి ప్రతిమలు బంగారు ధారణ అలంకరణ వస్తువులుగా చేయించుకొనుట శ్రేయస్కరం కాదు. తలవుండి పొట్ట లేకపోతే ప్రాణం వుంటుందా? జీవం ఉండాలి అంటే అన్ని అవయవాలు ఉండాలి.

### ◆ సూర్యారాధన ప.గం. 12.00 లోపుగా పూర్తి అవ్వాలి అనేది సమ్మతమైన వాక్యమా?

నిజమే. యిక్కడ రెండు విషయాలు తెలసుకోవాలి. 1. తూర్పుముఖంగా కూర్చొని అర్చన చేయవలెను. వేరే దేవతల అర్చనల విషయంలో మనం ఒక ప్రతిమను వుంచి దైవారాధన చేస్తాం. కానీ సూర్య ఆరాధన విషయంలో సూర్యుడు ప్రత్యక్షదైవం మనకు ఎదురుగా పగలు 12.00 గంటల వరకు మాత్రమే తూర్పుముఖంగా కూర్చున్న వారికి దర్శనీయం. పగలు 12 దాటిన తర్వాత మనకు వెనకవైపుకు సూర్యగమనం వుంటుంది. 2. యిక రెండవ విషయం శివుడు అభిషేక ప్రియుడు. సూర్యుడు నమస్కార ప్రియుడు పగలు 12.00 దాటితే మనం తూర్పు ముఖంగా వుండి సూర్యునికి అభిముఖంగా వుండి నమస్కారం చేసే అవకాశం లేదు కదా. సూర్యునికి పృష్ఠభాగం

చూపుతూ నమస్కారం చేయరాదు కదా! కానీ సంధ్యావందనం విషయంలో ఈ నియమం లేదు. సూర్యనమస్కారములు అరుణ పారాయణ, ఆదిత్య హృదయం వంటివి పగలు 12.00 లోపుగా పూర్తిచేయాలి.

◆ **మా పిల్లవాడికి ప్రస్తుతం చదువు సరిగారావడం లేదు. ఉపనయనం చేస్తే చదువు బాగా వస్తుంది అంటారు నిజమేనా?**

హాస్పటల్‌లో చేరిన వెంటనే రోగం తగ్గదు. మందులు వాడడం ద్వారా రోగం తగ్గుతుంది. అదేవిధంగా ఉపనయనం అవ్వగానే చదువు బాగా వస్తుంది అనుకోవడం తప్పు. నిత్యం సకాలంలో సంధ్యావందనం, గాయత్రీ ఉపాసన చేయుట ద్వారా తప్పని సరిగా ఎంతటి మూర్ఖులకయినా విద్యాబుద్ధులు బాగా అందుతాయి. గాయత్రీదేవి సరస్వతీ స్వరూపంగా కూడా ఫలితాలను ఇస్తుంది. అంటే గాయత్రీ ఉపాసన వలన చదువు వస్తుంది. అందుకు ఉపనయనం తప్పనిసరి కదా! యితర మంత్రాలకు ఆ బలం లేదు. గాయత్రీకి చదువులు యిచ్చే శక్తి అధికం.

◆ **వేదములకు శాస్త్రములకు భేదము కలదా? వాటి వివరములు తెలుపగలరు?**

వేదములు అపౌరుషేయములు. వేదములు ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అధర్వణవేదం. అని నాలుగు విభాగములు చేశారు. అందులో ఋగ్వేదం నందు ఆయా యాగములకు సంబంధించిన దేవతాస్తోత్రములు మంత్ర పూర్వకంగా వుంటాయి. యజుర్వేదము యాగము యాగసంబంధ దేవతలు యాగము చేయు విధానము, వాటి ఫలితములు తెలుపును. సామవేదమునందు శాంతిక పౌష్టిక కర్మలగూర్చి పూర్తిగా వున్నది.

అయితే ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదములు మూడు యజ్ఞముల యందు అధికంగా వాడకంలో వున్నది. ఈ మూడు వేదములను కలిపి "త్రయీ" అంటారు. ఈ వేదములనుండి షడంగములు ఉత్పన్నం అయినాయి. యజ్ఞయాగాది క్రతు నిర్వహణలో ఈ షడంగములు బాగా ఉపకరిస్తాయి. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషం, కల్పము అనునవి ఆరును షడంగములు. వ్యాకరణం, నిరుక్తము ఈ రెండును వేదగ్రామర్‌గా తెలుసుకోండి. "శిక్ష" వర్ణోచ్చారణ తెలుపును. "ఛందస్సు" వర్ణ నియతిని తెలియచేయును. "జ్యోతిషం" వేదోక్త కార్యాచరణ కాలనిర్ణయం తెలపును. "కల్పము" వేదోక్త యజ్ఞ కార్యాచరణం.

◆ **మహర్షులు చెప్పిన శాస్త్రంలో సైన్స్ ఉన్నదా?**

మీరే పరిశీలించండి. ఒక ట్రయిల్ చూడండి. మలమూత్ర విసర్జనలోను 4,8 సార్లు గండూషము, బయటకు వెళ్ళి వచ్చిన సందర్భంలో నాలుగుసార్లు, ఆహారం తీసుకున్న సందర్భంలో నాలుగుసార్లు చివరలో నోటిలో నీరు పోసుకొని పుక్కిలించి

ఉమ్మివేయమన్నారు. (గండూషము). ఇది ఆచరిస్తే పేస్ట్, బ్రష్ అవసరమా? లేదా? డెంటిస్ట్ అవసరమా? లేదా? ఒక సంవత్సరం తరువాత మీరే చెప్పండి. ఏకాదశీ ఉపవాస వ్రతం, ఆదివారం రాత్రి భోజన నిషేధం, రోజు పగలు మొదట భోజనంలో ఉసిరిక తినడం, రాత్రి ప్రథమ యామంలో భోజనం, రెండవ యామంలో నిద్రకు ఉపక్రమించడం, మూడవ యామంలో మాత్రమే సంసారం, నాలుగవ యామంలో కాలకృత్యములు తీర్చుకొని యోగాచేసి సంధ్యావందనాది క్రియలు చేయడం ప్రారంభిస్తే డాక్టరుతో పని ఉంటుందా? సంతానలేమి ఉంటుందా? షుగరు, బి.పి.లకు అవకాశం ఉంటుందా? మీరే ప్రయత్నించండి? అప్పుడు మహర్షుల శాస్త్రంలో సైన్సు దాగి వున్నదా? లేదా? తెలుస్తుంది.

◆ **"భర్తను వదల కూడదు" అని చెప్పిన శాస్త్రం" భార్యను విడనాడరాదని" కూడా తెలిపినదా?**

భారతీయ ధర్మశాస్త్రం చాలా విశాలమయినది, వివాదంతో భార్యను విడనాడిన భర్తకు అర్ఘ్యపాద్యాదులు యివ్వరాదని శాస్త్రం, మరియు పితృదేవతలకు అధోగతి ప్రాప్తించును అని వున్నది. ఎన్నో విశేషాలు చెప్పబడినవి.

◆ **మోక్షమునకు-భక్తికి కల పొంతన ఏమిటి?**

భక్తి మార్గంలో ప్రతి వస్తువులోను భగవంతుణ్ని చూడడం అనేది జరుగుతుంది. సృష్టి అంతా భతవంతుడు వున్నాడు అనే ధోరణిలో మంచి మార్గంలో జీవించి అవకాశం వున్నది. అలా సత్ప్రవర్తన, భక్తి కలిసిన జీవనం గడిపే వ్యక్తికి జ్ఞానం లభించడం తేలిక అవుతుంది. జ్ఞానమే వైరాగ్యము, మోక్షము అందిస్తుంది.

◆ **గజేంద్రమోక్షం ఘట్టంలో శ్రీమహావిష్ణువు ఆయుధాలు లేకుండా బయల్దేరినాడా?**

వ్యాసభాగవతంలో గజేంద్రుడి ప్రార్థన ఆలకించి సాయుధుడై బయల్దేరినట్లు వున్నది. అయితే పోతన భాగవతంలో మాత్రం "సిరికించెప్పడు" అనే పద్యంలో శంఖచక్రములు లేకుండా బయల్దేరినట్లు వున్నది. గజేంద్రుడిని శ్రీమహావిష్ణువు చేరే లోపల శంఖు, చక్ర, గదా పద్మములు ఆయనను అనుసరించి శ్రీమహావిష్ణువును చేరినవి అని పోతన భక్తితో వ్రాశారు. కానీ వ్యాస భాగవతమే మనకు ఆధారం. ఆయుధములు శరీరంతోనే వెంటనే ప్రయాణం చేస్తాయి.

◆ **మన ఇంటి ముందు ముగ్గు వేరే వారు వేయరాదా?**

ఇంటి ముందు ముగ్గు మరియు ఇంట్లో దీపం మన ఇంట్లో ఉండగా వేరే వారు చేయుట నిషేధము. 1. మన ఇంటి ముందు ముగ్గు వేరే వారు వేయుట 2.మనకు అశౌచాదికములు లేనప్పుడు మన ఇంట్లో వేరే వారు దీపారాధన చేయుట. 3. మన ఇంట్లో ఉండి ఓపికగా ఉండి శౌచంగా ఉండి, దేవుడికి నివేదన వేరే

వారిచేత చేయించుట. 4. దీపారాధన వత్తులు వేరే వారి చేత చేయించుట. ఇవి నిర్లక్ష్య పూజలుగా పరిగణించాలి.

◆ **చంద్రశేఖర సరస్వతీ స్వామివారిని నడిచే దేవుడు అంటారు కదా? మరి జయేంద్ర విజయేంద్ర స్వామివారల మీద గతంలో వచ్చిన అభియోగాల మీద మీ అభిప్రాయం?**

మీ ప్రశ్నలోనే సమాధానం ఉన్నది. నడిచే దేవుడు తన పీఠానికి ఉత్తరాధికారులను సరియైన వారినే నిర్ణయించుకున్నారు. అందుకే వారి అనుష్ఠాన ప్రభావంగా వారిరువురు మరల పీఠంలో ఏ విధమైన కోర్టు కేసులు లేకుండా సుఖంగా ఉండగలుగుతున్నారు. వారు ముగ్గురు నిత్యం ప్రాతఃస్మరణీయులు.

◆ **మీరు ధర్మ వ్యాఖ్యలు చేయునప్పుడు "కలిలో సమాంతర శిక్షలు పడతాయి." అని వ్రాస్తారు దానికి అర్థం ఏమిటి?**

భూమి మీద మనం చేయు పాపాలకు భూమి మీదే సమాంతర శిక్ష అనుభవిస్తాం. పీఠాధిపతిగా ఉన్న ఒక స్వామి వారి మీద అభియోగం వేసి పీఠంలో లేకుండా చేయించిన పాపానికి ముఖ్యమంత్రిగా గెలిచి ముఖ్యమంత్రి సీటులో కూర్చోలేని స్థితి పరిశీలిస్తే సమాంతర శిక్ష భూమి మీదనే పడుతుంది. అని ఉదాహరణగా కనబడుతోంది కదా! అందువలన మనం ఎప్పుడు పాపాలు చేయకుండానే అవకాశం ఉన్నంతవరకు జీవనం గడపాలి.

◆ **రాత్రిభోజనం చేయు విషయంలో అనేక రకాలయిన సిద్ధాంతాలు వున్నాయి. యింతకీ రాత్రిభోజనం నిషేధమా? గ్రాహ్యమా?**

వేద విహితమయిన కర్మలను పూర్తిగా నమ్మాలి. భోజనం చేయునప్పుడు పరిషేచన చేయు విషయంలో పగలు "సత్యం త్వర్తేన పరిషించామి" అని రాత్రి "ఋతంత్వా సత్యేన పరిషించామి" అని తెలియచేశారు. కావున రాత్రి భోజనం నిషేధం కాదు. అయితే ఆహారం ఎటువంటి తీసుకోవాలి అంటే వైద్య సలహాల ప్రకారంగాను మరియు యోగాభ్యాస విధానాలు ద్వారా మన శరీరస్థితిని గమనించి తీసుకోవాలి. ఈ విషయంలో యోగాభ్యాసమునకు ఆయుర్వేదమునకు విభేదములు లేవు. ఎటొచ్చీ మన శరీరం దాని ప్రవృత్తీ ఆధారంగానే పొందేసలహాలలో మార్పు వున్నది.

◆ **గరుడపురాణం యింటిలో రోజు పారాయణ చేయకూడదా?**

గరుడ పురాణంలో నరక విషయాలు మున్నగునవి వున్నవి. అందువలన రోజు ఇంటిలో పారాయణ చేయరాదు అని అంటారు. అది అపోహ మాత్రమే. అయితే గరుడ పురాణంలో అది ప్రేతఖండ మాత్రమే దోషము. అంతేకాక ప్రేతఖండ యితర పురాణాలలో కూడా వున్నది. అది గమనింపక నిత్యం చదవవచ్చు అనే

అంశాన్ని అందరూ పరిగణనలోకి తీసుకోవడం లేదు. గరుడ పురాణంలో ఇంకా ఎన్నో విశేషాలు ఉన్నాయి. అవి అన్నీ కూడా ప్రేత ఖండ మినహా మిగతా అన్నీ ఇంట్లో పారాయణ చేయవచ్చు. పురాణాల గ్రంథములను పుస్తకరూపంలో యింటిలో వుంచాలి. పద్దెనిమిది పురాణాలలో గరుడ పురాణం కూడా ఒకటి అది యింటిలో ఉంటే ప్రత్యేకమయిన చెడు ఏమీ రాదు గరుడ పురాణం ప్రేత ఖండ యింటిలో వుండి చదవడం ఆచారం లేదు. దగ్గర్లోని దేవాలయంలో చదవండి. పెద్దలు ఏర్పరచిన ఆచారాలు పాటించడం వరకే మనకు విధి ఎందుకు అని తెలుసుకోవచ్చు. కానీ విమర్శ పనికిరాదు. గరుడ పురాణం ప్రేత ఖండంలో ఉన్న అంశాలు యితర పురాణాలలో కూడా వున్నాయి. వాటకి లేని నియమం ఈ ఒక్క దానికే ఎందుకు యిచ్చారు అంటే యిక్కడ ఒకే గుంపుగా ప్రేత విషయములు చెప్పబడినవి. యితర పురాణాలలో అక్కడ అక్కడా చెప్పబడినవి. అందువలన ఈ నియమాలు పురాణం ఇంటిలో వుంటే నష్టం లేదు. ఎవరయినా మృతి నొందినప్పుడు మాత్రం ఇంటిలో గరుడ పురాణం ప్రేతఖండ చదవించడం ఆచారం గరుడ పురాణం ప్రేతఖండంలో మనిషి చావు నరకప్రయాణం నరక శిక్షలు వివరాలు వంటివి వున్నాయి.

### ◆ తండ్రీ కొడుకులు ఏయే అంతస్తులలో వుండాలి?

గ్రౌండ్‌ఫ్లోర్‌కు "ప్రధాన గృహము" అని పేరు. పై అంతస్తులకు ఉపగృహాము అని పేరు. ప్రధాన గృహం అయిన గ్రౌండ్ ఫ్లోర్ లేనిదే అంతస్తులు రావు కదా? అలాగే కుటుంబంలో తండ్రి లేనిదే పిల్లలు రారు కదా? అందుచేత కుటుంబమునకు ప్రధానమయిన తండ్రి-ప్రధాన గృహమును (గ్రౌండ్‌ఫ్లోర్) అనుభవించాలి. పిల్లలు ఉపగృహములయిన పై అంతస్థులను అనుభవించాలి.

### ◆ అందరు బ్రాహ్మణులు వేదం చదవలేరు కదా? వారికి అది ఏమైనా దోషమా?

పురాణాలలో వేదము చదవకుండా శాస్త్రం చదవవలదు అని ధర్మం నిర్ణయించి చెప్పబడి వున్నది. అయితే అందరికీ వేదం చదివే అవకాశం రాకపోవచ్చు. వేదం చదవకుండా యితర విద్యలకు ఆకర్షితులయిన బ్రాహ్మణులకు అందరకీ ఆ దోషం పోవడానికై నిత్యం సహస్రగాయత్రీ జపం చేయమని పురాణాలలో చెప్పబడినది. వేదమాత గాయత్రీ అనుగ్రహం లభిస్తే వేదం నేర్చుకోని దోషం పోతుంది.

### ◆ బ్రహ్మకపాలంలో పిండం వేస్తే ఆ తర్వాత ఆబ్దీకములు పెట్టనవసరం లేదా?

బ్రహ్మకపాలంలో పిండం వేయటం ద్వారా మనకు తెలియకుండా ఎగవేసిన పితృకర్మల దోషం పోతుంది. ప్రతి మానవుడు స్పృహలో ఉండగా పితృకర్మలను వదలకూడదు. బ్రహ్మకపాలంలో పిండం వేసిననూ, వేయకున్ననూ చివరి శ్వాస వున్నంత వరకూ ప్రతి మనిషి పితృదేవతలకు ఆబ్దీకం పెట్టవలసినదే.

◆ **ఉపనయనమునకు 2016లో మంచి ముహూర్తములు లేవనుట నిజమేనా?**

"గర్భాష్టమేషు బ్రాహ్మణమునయీత" అనగా గర్భములోవున్న తొమ్మిది నెలలతో కూడి ఎనిమిదవ సంవత్సరం ఉపనయన కాలం విధింప బడినది. అయితే అనివార్య కారణాల వలన ఎనిమిదవ సంవత్సరంలో చేయలేకపోతే "ఆషోడశాత్ బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే" అని 16వ సంవత్సరం దాటితే అకాలం ప్రారంభం అవుతుంది అని చెప్పబడినది. అందువలన అకాలం ప్రారంభం అవుతుంది అని చెప్పబడినది. అందువలన అకాలం వస్తుంది అనుకుంటే 2016లో గ్రహబలం లేని ముహూర్త మయినా వాడుకుని ఉపనయనం చేయడం ముఖ్యలక్షణం. అలాకాని ఎడల 16వ సంవత్సరం రావడానికి బాగా వ్యవధి వుంటే పై సంవత్సరం ముహూర్తాలు సరిగాలేవు కాబట్టి ఆగుదాం అనుకుంటే ఆగవచ్చు. గ్రహబలంకంటే కాలం ప్రాధాన్యం. అందువలన గర్భాష్టమం నడిచే వారి విషయంలో కూడా గ్రహబలం సంబంధం లేదు. భారతీయ సంస్కృతి సంప్రదాయం అంతా కాలమునకు ప్రాముఖ్యం యిచ్చి నిర్మింపబడినవి.

◆ **మా అబ్బాయి ఎప్పుడు ధర్మశాస్త్ర పుస్తకాలు మహర్షుల జీవిత చరిత్రలు చదువుతాడు. కాలేజీ మానేసాడు. వాడి ప్రవర్తన మంచిదే. వాడిని ఏ విధంగా పరిగణించాలి?**

మీ వాడు ధర్మాచరణ చేయని ధర్మశాస్త్రం తెలిసిన అధర్మమూర్తి. ప్రవర్తన మంచిది. ఇది సంఘంలో నేడు చాలా అవసరం. మరి వ్యక్తిగతంగా కుటుంబ పరంగా ఆశ్రమ ధర్మాలు ప్రకారం బ్రహ్మచారిగా విద్యాభ్యాసం చేయని దోషం మీవాడి జీవితంలో ఉంటుంది. రోజు మీరు వంట చేయునపుడు "శ్రీమాత్రేనమః" అంటూ వంట చేయండి. వాడి బుద్ధి మార్పు రావడానికి ఆంజనేయస్వామికి రోజూ 11 ప్రదక్షిణాలు చేయండి. విద్యార్థి దశలో విద్యావ్యాసంగంలో నుండి తప్పుకోవడం తప్పుదోవ పట్టడమే. మీ వాడిని ధర్మబద్ధుడు అనకండి.

◆ **ఇన్స్టెంట్ ఫుడ్, ఫాస్ట్ ఫుడ్ ప్రభావం ప్రజల మనస్తత్వం మీద ఉంటుందా?**

ఉంటుంది, ఉంటోంది. పూర్వం ఏదైనా తినాలి అంటే అమ్మకు చెప్పాలి. ఆవిడ ప్రిపేర్ చేయాలి అప్పుడు మనం తినాలి. అప్పటి దాకా ఓపిక పట్టడం అనే అలవాటు పిల్లల నుండి పెద్దల వరకు ఉండేది. నేడు ఏ అయిటం తినాలి అన్నా! అనుకున్న వెంటనే ఇన్స్టెంట్ ఫుడ్, ఫాస్ట్ ఫుడ్, స్వీట్ షాపు, బ్యాకరీస్ వలన అయిపోతుంది. తల్లితండ్రులు ఇస్తున్నారు. పిల్లలు తీసుకుంటున్నారు. దీని వలన ఓర్పు పట్టడం అనే అవకాశం లేదు. పెద్దలకు చెప్పనవసరం లేని స్థితి ఏర్పడుతుంది. ప్రిపరేషన్ కావలసిన వనరులు, కాలము యొక్క విలువలు పిల్లలకు తెలియడం లేదు. ఇలా పిల్లల మనస్తత్వం మారుతోంది. కాలానుగుణంగా బంధాలలో తల్లిదండ్రులను ఏ.టి.యం కార్డులలాగా వాడుకునే సమాజం వస్తుంది.

◆ **వామనావతారం ముందా? లేక నరసింహావతారం ముందా?**

నరసింహావతారం ప్రహ్లాదుని కాలము. వామనావతారం బలిచక్రవర్తి కాలము. ప్రహ్లాదుని మనమడు బలి కాబట్టి నరసింహావతారమే ముందర. ఆ తర్వాతనే వామనావతారం. అయితే వామనావతారం రెండుసార్లు జరిగినది. నరసింహావతారం వివిధ రూపాలలో జరిగినట్లుగా పురాణాలలో ఉన్నది.

◆ **రింగ్‌టోన్స్‌గా మంత్రాలు, శ్లోకాలు వుంచవచ్చా?**

ఏదేని శ్లోకం, లేదా మంత్రం పూర్తిగా వుంటే దాని యొక్క అర్థం విలువ వుంటాయి. మనం సెల్‌ఫోన్లో మంత్రం లేదా శ్లోకం పూర్తిగా రికార్డ్ చేసినా కానీ, మనకు ఫోన్ వచ్చినప్పుడు మొత్తం శ్లోకం పూర్తి అయ్యేదాకా వుండక మధ్యలోనే ఫోన్ తీస్తాం. అలాంటప్పుడు అసంపూర్తి మంత్రానికో శ్లోకానికో అర్థం వుండదు. పైగా ఆ శ్లోకాలు పూర్తి కాకుండా అడ్డుపడిన దోషం కూడా వుంటుంది. కాలర్ ట్యూన్స్ స్థితి కూడా యింతే.

◆ **ఆదిత్యహృదయాన్ని సాయంకాలం వేళ కూడా చదవవచ్చునా?**

చదవటం వలన పారాయణ ఫలితం లభించదు. ఆదిత్యహృదయం, సూర్యాష్టకం, ఆదిత్య కవచం వంటి సూర్య ప్రార్థనలను ఉదయం పూటనే చదవాలి. పారాయణం అపరాహ్ణానికి ముందుగానే ముగించాలి. సూర్యోదయం వేళలో పారాయణం చేయటం మరీశ్రేష్ఠం. సాయంకాలం వేళ సూర్యాస్తమయ సమయాలలో సూర్య ప్రార్థనలు చేయరాదు.

◆ **ఒకే యింటిలో ముగ్గురు బ్రహ్మచారులు వుండవచ్చా? కేవలం ఉపనయనం చేసి వివాహం చేయకుండా వుండవచ్చా?**

ఒక తండ్రికి చెందిన సంతతి ముగ్గురుకి కేవలం ఉపనయనం చేసి వివాహం చేయకుండా బ్రహ్మచారులుగా వుంచవచ్చు. ఉపనయనం అనేది సంస్కారం. ఈ సంస్కారమునకు కాలమే ప్రధానము. కాలాతిక్రమంతో కూడిన సంస్కారం దోషమే. ఉపనయన కాలము రాగానే ముగ్గురికీ కూడా ఉపనయనం చేయడమే శాస్త్రము. ముగ్గురు బ్రహ్మచారులు అనే నియమం వేరే వేరే యింటికి సంబంధించిన వారు కలిసి ఒక చోట యింట ముగ్గురుగా వుండకూడదు. భారతీయ సంస్కృతికి కాలమే ప్రధానం.

◆ **పూజలో పూర్తి పేరు వాడవలెనా?**

నామకరణం చేసినప్పుడు మీకు పెట్టే పేరు ఒక ప్రత్యేక కారణంతో కూడుకుని వుంటుంది. పెద్దల మీద గౌరవంతో వారి పేరు పెట్టడం లేదా దేవునిపై భక్తితో పెట్టడం, లేదా దేవునితో వున్న మొక్కుబడితో అయినా పెట్టడం జరుగుతుంది. మీరు రిజిష్టర్‌కు అనుకూలంగా పేరు మార్చుకోవచ్చు లేదా పిలుచుటకు అనుకూలంగా పేరు మార్పుచేసుకోవచ్చు. కానీ పూజలు, వ్రతములు, నోములు

యిలా అన్నీ ఆర్షధర్మ కార్యములలో మీ నామకరణం నాటి పేరు వాడకపోతే అది మీకు చెందదు. చేసిన పూజవృధా అవుతుంది.

### ◆ పురాణములు ఎన్ని? వాటి పేర్లు ఏమిటి?

పురాణములు 18. అవి మత్స్య, మార్కండేయ, భవిష్యత్, భాగవత, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, విష్ణు, వామన, వరాహ, వాయు, అగ్ని, నారద, పద్మ, లింగ, కూర్మ, స్కంధ, గరుడ పురాణములు. యిందులో భాగవతం స్థానంలో దేవీభాగవతం అని, వాయు పురాణం స్థానంలో శివపురాణం వున్నాయని మతాంతరం వున్నది.

### ◆ అధర్వవేదంలో ఏమున్నది?

శస్త్రాస్త్ర ప్రయోగవిధానములు వున్నాయి. అంతేకాక యిందులో ఎన్నో సృష్టికి సంబంధించిన రక్షణ విషయాలు మరియు మానవ రక్షణకు అవసరమయిన విషయాలు కూడా వున్నాయి.

### ◆ కాలసర్పదోష శాంతి కేవలం రామేశ్వరం, కాళహస్తి యందే చేయించుకోవాలా? లేక ఎక్కడయినా చేయించుకోవచ్చా? ఎలా?

రాహు, కేతువుల మధ్యలో మొత్తం గ్రహములన్నీ ఉంటే దానిని కాలసర్పదోషం అంటారు. తొమ్మిది గ్రహాలతోను కూడుకున్న దోషము. పురాణకథలో రాహు, కేతువులను తన సుదర్శన చక్రం ద్వారా విష్ణుమూర్తి నాభి వరకు రెండు భాగాలుగా చేసారు కదా! వారిరువురు ఈ గ్రహాల యొక్క మాలికతో కనెక్ట్ అయితే అవి ఉపద్రవం అవుతుంది. కావున పంచాంగ గణిత గ్రంథాలలో దానిని దేశారిష్టయోగంగా అభివర్ణించారు. కాలదోషానికి భయపడేవారు క్షీరసాగరమధనం ఘట్టం మొత్తం చదవవల్సిందే. అప్పుడే జ్యోతిష భాగం మీద పరిశోధన చేస్తే దోశారిష్టయోగమే నిజము అనిపిస్తుంది. ఒకవేళ మనుషులకు కూడా వర్తిస్తుంది ఈ దోషం అనుకుంటే శాంతి ఎక్కడైనా చేసుకోవచ్చు. ఎక్కడయినా చేయించుకోవచ్చు. కాళహస్తి రామేశ్వరంలు ప్రసిద్ధక్షేత్రములు కావున వాటిని గూర్చి మనం అధికంగా వింటున్నాం. అయితే మీరు నివాసం వుండే గ్రామంలోనే శివాలయంలో వున్న నవగ్రహ మండపం కాలసర్పదోష శాంతి చేయుటకు వేదికగా మరల్చుకోవచ్చు. రాహుకేతువుల మధ్య ఏడు గ్రహాలు వుంటే కాలసర్పదోషం అవుతుంది. అంటే ఈ దోషం తొమ్మిది గ్రహాలతోను ముడిపెట్టబడినది. కావున మీరు తొమ్మిది గ్రహాలకు జపం దానం, తర్పణం, హోమం, అర్చన చేయించి రాహువుకు దుర్గ, కేతువుకు గణపతి ఉపాసనా దేవతలు కావున వాటికి విశేష అర్చనలు చేస్తే దోషశాంతి కలుగుతుంది. అంతేకాక కాలసర్ప దోష పీడితులుగా భావిస్తున్నవారు నిత్యం నవగ్రహారాధన మరియు దుర్గ గణపతి ఆరాధనలు చేయవలసినదే. మీ దగ్గరలోని నవగ్రహాలు ఉన్న ప్రతి

దేవాలయంలోను కాలసర్పదోషశాంతి ప్రారంభించడం చాలా అత్యవసం. కాలహస్తి రామేశ్వరం మాత్రమే వెళ్ళనవసరం లేదు.

### ◆ దశావతారములు ఏయే సమయాలలో జరిగినవి?

చైత్ర శుద్ధ తదియ అపరాహ్ణ కాలమున మత్స్యావతారం, వైశాఖ పౌర్ణిమ సాయం కాలం కూర్మావతారం, భాద్రపద శుక్ల తదియ అపరాహ్ణమున వరాహావతారం, వైశాఖ శుద్ధ చతుర్దశీ ప్రదోషకాలంలో నరసింహావతారం, భాద్రపద శుద్ధ ద్వాదశి మధ్యాహ్న కాలములో వామనావతారం, వైశాఖ శుద్ధ తదియ మధ్యాహ్న కాలంలో పరశురామ అవతారం, చైత్రశుద్ధ నవమి మధ్నాహ్న సమయంలో శ్రీరామావతారం, శ్రావణకృష్ణ అష్టమి అర్ధరాత్రియందు కృష్ణావతారం, అశ్విని శుక్ల దశమియందు సాయంకాలమున బుద్ధావతారం, శ్రావణ శుద్ధ షష్ఠి సాయంకాలమున కల్కి అవతారము. ఈ విధంగా అవతారముల తిథులు మరియు కాలములు పురాణములు, వివిధ ధర్మశాస్త్ర గ్రంథములలో చెప్పబడినవి.

### ◆ ఆశ్రమధర్మాలలో ఏ ఆశ్రమధర్మం గొప్పది?

ధర్మం ఏ ఆశ్రమునకు సంబంధించినది అయినా గొప్పదే. దాన్ని పాటించడం వలన ధర్మం యొక్క విలువ పెరుగుతుంది. బ్రహ్మచర్య, గృహస్థ, సన్యాసి, వానప్రస్థ ఆశ్రమాలలో గృహస్థాశ్రమం చాలా గొప్పది. "యధామాతరమ్ ఆశ్రిత్య సర్వే జీవంతి జంతవః। వర్తంతే గృహిణస్తద్వత్ ఆశ్రిత్య–ఇతరాశ్రమాః ॥ అని చెప్పబడినది. అంతేకాక భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ "సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయ సకరావుభౌతయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగోవి శిష్యతే" అని తెలిపారు. అనగా సన్యాస సంసార యోగ భేదాలు తెలిపి ఆరెంటిలోను కూడా సంసార యోగమే గొప్పది అని తెలిపారు. మిగిలిన ఆశ్రమాల ధర్మాలు శ్రీమధ్భాగవతంలో విపులీకరింపబడ్డాయి.

### ◆ దేవాలయాలలో "కానుకలు హుండీలలో మాత్రమే వేయండి" అని వుంటుంది. అర్చకులకు యివ్వకూడదా?

దేవునికి మొక్కుబడి అయితే అది హుండీలోనే వేయాలి. అలా వేసిన కానుక వేరు వేరు రూపాలలో దేవాలయ నిర్వహణ కార్యములలో వినయోగింపబడుతుంది. అయితే ఏ దైవకార్యం చేసినా మన సాంప్రదాయం, బ్రాహ్మణులకు దక్షిణ యివ్వడం అలవాటు. అందువలన దేవాలయములలో వున్న అర్చకులకు "యధాబుద్ధి" దక్షిణ యిచ్చి ఆశీర్వచనం తీసుకోవడం తప్పని సరి.

### ◆ రాములవారు శబరి ఎంగిలి పండ్లను తిన్నారా?

వాల్మీకి రామాయణంలో ఈ విషయాన్ని స్పృశించలేదు. రామచరితకు వాల్మీకి రాసిన రామాయణమే మనకు ప్రమాణం. మిగిలినవి ప్రమాణం కాదు. శబరి

ఎంగిలి పండ్లు తిని రాముల వారికి పెట్టేంత అజ్ఞాని కాదు. ఆమె మతంగ మహర్షి ఆశ్రమంలో ఆశ్రమ నిర్వహణ విషయములను బాగా నేర్చుకున్నది. ఆమెకు రాములవారి సేవాభాగ్యం దొరకగలదు అనే ఆలోచనలతో ప్రత్యేకంగా మతంగ మహర్షి ఆమెను అక్కడ ఆశ్రమంలో వుంచారు. ఆశ్రమ నిర్వహణ తెలిసిన "శబరి" యిటువంటి ఎంగిలిపండ్లు పెట్టుట అనే కార్యం చేసి వుండదు. కారణం అతిథిని గౌరవించే విధానం ఆశ్రమ నిర్వహణలో ఒక భాగము. అందువలన ఈ అంశం రామాయణంలో వాల్మీకి వ్రాయలేదు.

◆ **నేడు ఆర్ష ధర్మ రక్షణలో భాగంగా వేదం, శాస్త్రం ఏది చదువుకుంటే మంచిది?**

సంఘంతో కలిసి సాంఘిక విద్యాభ్యాసం తప్పకుండా చేయాలి. నేడు స్వామీజీలు ఇంగ్లీషులో మాట్లాడుతున్నారు కదా! ఎంత అవసరమో గమనించారా? ఇక వేదం చదువుకునే బ్రాహ్మణుడు సర్వదా పూజనీయుడు. బ్రాహ్మణునికి వేదం చదవకుండా శాస్త్రం చదువవద్దు అని పురాణాలు చెప్తున్నాయి. వేదం, శాస్త్రం ఏదైనా చదివి ఆర్ష విజ్ఞానం రక్షణకు పెంపుదలకు కృషి చేయని బ్రాహ్మణుడు వ్యవస్థలో ఒక మాటలో చెప్పాలంటే ద్రోహిగా పరిగణింపబడతాడు. వేద పరిరక్షణ గోరక్షణ వేదపండిత పోషణ వేద విద్యాలయ రక్షణ, వేదవిద్యాలయ పోషణ, భగవంతుడు మెచ్చేది. కనీసం వేద శాస్త్రాలు చదవకపోతే చదువుకునే వారికి ధన వస్తు రూపంగా ప్రోత్సాహం కూడా ఇవ్వనివారు వ్యవస్థా ద్రోహులే.

◆ **శ్రీ చక్రార్చనలో ఉపనిషత్తు పారాయణ అవసరమా?**

ఎవరి కల్పం వారిది. "శృతి సీమంత సిందూరీ కృత పాదాబ్జ ధూళికా" "శివజ్ఞాన ప్రదాయినీ" "సదాచార ప్రవర్తినీ" "వేదశ్శివః శివో వేదః" "ద్విజ పంక్తి ద్వయోజ్వలా" వీటి అర్థాలు శోధించండి? శ్రీచక్రార్చనలో ఉపనిషత్ పారాయణ అవసరమే. అందుకోసమే వేద పోషణ అవసరం. వేదమే శివుడు అయినపుడు శివుడు లేని శక్తి అర్చన నిరుపయోగమే. అందుకే వేదమంత్రాలు పారాయణ ఉపనిషత్ పారాయణ ప్రత్యక్ష శివరూపం కాబట్టి చక్రార్చన సమయంలో ఉపనిషత్ పారాయణ చేయాలి. "శ్రీ శివా శివ శక్తైక్య రూపిణీ లలితాంబికా" వ్యాకరణ శాస్త్రం చదువుకున్నవాడికి దీని గొప్పతనం తెలుస్తుంది.

◆ **సగోత్ర వివాహం చేయవలసి వచ్చినప్పుడు ఆడపిల్లను వేరే గోత్రీకులకు దత్తత యిచ్చి వివాహం చేయవచ్చా?**

ఆడపిల్లను దత్తత యివ్వడం అనే శాస్త్రం లేదు. ఆడపిల్లకు ఒకసారే గోత్రం మారుతుంది, అది వివాహ సమయంలో. ఒకవేళ మగపిల్లవాడిని వేరేగోత్రికులకు దత్తత యిచ్చిన జనకతండ్రి గోత్రం వారిని మూడు తరాల వరకు వివాహ విషయా

లలో కలుపుకోకూడదు అని ధర్మశాస్త్రం. అంటే మూడవ తరం వెళ్ళేవరకు కూడా వారు సోదరస్థానంలో వారే. అదే రీతిగా సగోత్రీకులు అనగా సోదరులు అనే అర్థం. సోదర వర్గం వారికి వివాహం చేయవలసి రావడమే దౌర్భాగ్యం. దానికి మరల మతాంతరాలు వెదకడం అనేది అతితెలివి అవుతుంది.

**◆ పరశురాముడికి దేవాలయాలు లేవు, పూజలు లేవు ఎందుకు?**

దశావతారములలో ఒకటి అయినప్పటికీ భూమి మీద పరశురామ ఆలయం నిర్మించకూడదు. కారణం ఆయన 21 సార్లు దండయాత్రలు చేసి, భూమిని తన స్వాధీనం చేసుకుని, ఆ తర్వాత సరస్వతీనదీ తీరంలో యాగం చేసి, భూమి మొత్తాన్ని కశ్యపునకు దానం చేశాడు. అప్పటి నుండి భూమికి “కాశ్యపీ” అని పేరు కూడా వచ్చినది. దానం యిచ్చిన వస్తువు మరల అనుభవించ కూడదు కదా! అందుకే ఆయన భూమి మీద నివవసించరు. దేవాలయం నిర్మిస్తే విగ్రహానికి ప్రాణప్రతిష్ఠ జరుగుతుంది. అప్పుడు పరశురాముడు మరల భూమి మీదకు వచ్చినట్లవుతుంది. అలా జరగకూడదు కావున ఆయనకు దేవాలయములు లేవు. రఘురాముడు జానకిని వివాహం చేసుకుని అయోధ్యకు వెడుతున్న సందర్భంలో రఘురామునికి విష్ణు ధనస్సు ఎక్కు పెట్టమని పరశురాముడు యిచ్చారు. అలా విష్ణు ధనస్సు పరశురాముడి దగ్గరనుండి రఘురాముడు తీసుకునే సందర్భంలో పరశురాముని నుండి విష్ణు తేజము రఘురాముడిలో చేరిపోయింది. అందువలన రఘురామునికి పూజ చేయుట వలన పరశురామునికి చేసినట్లే అవుతుంది. కారణం రఘురాముడిలోనే పరశురామ విష్ణుతేజం వున్నది కాబట్టి.

**◆ విశేషవ్రతదినములలో ఉపవాసం చేయడం పుణ్యప్రదమా?**

కేవలం ఉపవాసం చేయడం వృధా. ఏకాదశి, శివరాత్రి వంటి విశేషదినములలో ఆ విశేషదినమునకు సంబంధించిన దేవతా ఆరాధన కూడా చెప్పబడి వుంటుంది. అందువలన ఆ దేవతా ఆరాధన యధాశక్తిగా చేసి దానితో పాటుగా ఉపవాసం కూడా చేస్తే విశేషపుణ్యప్రదం. భగవన్నామస్మరణం కూడా చేయకుండా కేవలం ఉపవాసం చేయడం వృధా.

**◆ శ్రీకృష్ణుడు ప్రేమకు లొంగిన సంఘటనలు ఏమైనా వున్నయా?**

శ్రీకృష్ణ పరమాత్మ ప్రేమమూర్తి, అలాగ అని ప్రేమకు లొంగిన సంఘటన ఎక్కడా లేదు. కర్తవ్యం ప్రధానంగా సాగిన అవతారం శ్రీకృష్ణావతారం. కర్తవ్య నిర్వహణ చేయుటలో ఆయన ఎవరి మీద ప్రేమ చూపలేదు. అయితే అందరూ కూడా ఆయన ప్రేమలో పడ్డారు. ఆయన ప్రేమకు లోనయ్యారు. ఒకసారి శ్రీకృష్ణచరిత పరిశీలిస్తే పుట్టగానే దేవకి నుండి యశోద దగ్గరకు చేరారు. యశోద దగ్గర బాల్యం ముగించి మరల చివర ఆమెకు అగుపించలేదు. అంత ప్రేమగా పెంచిన యశోదకు మరల

దర్శనం యివ్వడానికి చాలా కాలం పట్టింది. మేనమామ కంసునికర్తవ్యం మేరకు సంహరించారు. తను సాక్షాత్ శ్రీమన్నారాయణుడు అయి వుండి తనను నమ్ముకున్న అర్జునుని పక్షం వారిలో తన మేనల్లుడు అభిమన్యుడు వుంటే ప్రేమ పూర్వకంగా అతనిని రక్షించే ప్రయత్నం చేయలేదు. అది కూడా కర్తవ్యమే. ఇలా ఒకటి కాదు ప్రతి విషయంలోను కర్తవ్యం ప్రధానం చేశారు. అందరి ప్రేమ చూరగొని ప్రేమమూర్తి అయ్యాడు. అంతేకానీ ప్రేమ విషయంగా కర్తవ్యం విస్మరించిన సంఘటన ఒకటి కూడా లేదు. అందుకే నేటి తరం మనుషులకు శ్రీకృష్ణచరిత ఒక ఆదర్శగాథ.

### ◆ తల్లి, భార్య ఎవరికి ఎక్కువ ప్రాముఖ్యత యివ్వాలి?

ప్రాముఖ్యతలను గూర్చి చూసుకుంటే ధర్మం చెడుతుంది. సంసారం పాడవుతుంది. వేద ప్రాముఖ్యం అనుసరించి "మాతృదేవోభవ–పితృదేవోభవ". వారిరువురూ లేకపోతే నీవు లేవు నీకు భార్య లేదు. అందువలన ప్రధమంగా వారికి ప్రాముఖ్యం యివ్వాలి. అగ్నిసాక్షిగా అన్ని విషయాలలోను రక్షణ కల్పిస్తాను అని ప్రమాణం చేసి వివాహం చేసుకున్న కారణంగా భార్యకు రక్షణ కలిగించాలి. అది ధర్మం. తల్లివిషయంలో కూడా 'స్వధర్మం మాతృరక్షణం' అని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. రామాయణంలో అయోధ్య కాండలో రాముడు అరణ్యములకు బయలుదేరిన సందర్భంలో కౌసల్యాదేవితో మాట్లాడిన తీరు పరిశీలిస్తే "స్వధర్మం మాతృరక్షణం" అనే ధర్మమే కనబడుతుంది. అందువలన భార్యకు తల్లికి ఇరువురికీ ధర్మబద్ధంగా రక్షణ కలుగచేయుటకు మాత్రమే అవకాశం చూసుకున్నవాడు సుఖిస్తాడు. వారిరువురిలో ప్రాముఖ్యం విషయమై భేదం చూసేవాడు దుఃఖిస్తాడు. యిదే సంసార జీవితం. డ్యూటీ మైండడ్ వ్యక్తి సుఖిస్తాడు. నీ తల్లిని నీ భార్య దూషిస్తుంటే అది నీవు వినరాదు. నీ భార్యను నీ తల్లి దూషిస్తే.., నీ భార్యను రక్షించాలి అంటే ఎలా ప్రవర్తించాల్సి ఉంటుంది. ఇది ధర్మ యుద్ధమే. సగటు మనిషి నలిగిపోతాడు. అందుకే వేరుగా ఉండినప్పటికి ఇరువురికి రక్షణ చేయడం ధర్మం.

### ◆ లింగ పురాణం, శివపురాణం ఒకటి కాదా?

కాదు. లింగపురాణంలో అంశాలు కొన్ని శివపురాణంలో అంశాలు కలుస్తాయి. శివ కళ్యాణం, కుమారోత్పత్తి కథా గమనం శివపురాణంలో ఉన్నవి. పూజాదికాలు వ్రతాదులు రెండు పురాణాలలో ఉన్నాయి. కొన్ని లింగపురాణంలో ఉన్నాయి కొన్ని శివపురాణంలో ఉన్నాయి. శివాద్భుతములు లింగ పురాణం కంటే శివపురాణంలో ఎక్కువ. అఘోర, పాశుపత వంటి పూజలు లింగ పురాణంలో ఎక్కువగా ఉన్నాయి.

### ◆ నేడు ఆంధ్రలో పౌరాణికులు చాగంటి కోటేశ్వర శాస్త్రిగారు సామవేదం షణ్ముఖ శర్మగార్ల ప్రభావం సంఘంలో ఎలాంటి మార్పును ఇస్తుంది?

ప్రశ్న చాలా గొప్పది కాని వారిరువురులో హెచ్చుతగ్గులు చూచుట తప్పు. మల్లాది చంద్రశేఖరశాస్త్రిగారి సమయంలో వీరిరువురుని ఎవరూ ఊహించలేదు.

నేడు సమాజం పాశ్చాత్య నాగరికత వైపు బాగా ఆకర్షితులైన సమయంలో 1990 నుండి యువతకు వృద్ధులకు కూడా నిత్యం రామాయణ భారత, భాగవత ఇతర పురాణాల మీద వారి ఉపన్యాసాల ద్వారా వారి ప్రభావాన్ని చూపించి ప్రజలను భక్తి మార్గంవైపు నడిపే ప్రయత్నంలో వారు 100 శాతం సక్సెస్ అయి ఇవాళ హిందూ ధర్మ పరిరక్షణకు రెండు విద్యుత్ దీపాల వలె వెలుగొందుచున్నారు. వారి అనుయాయులు యింకా శిక్షణ పొంది వారిరువురి వంటివారుగా అనేక మంది ఇంకా సంఘంలోకి రావాలి. మన పురాణ, ఇతిహాస ధర్మాలను ప్రచారం చేస్తూ ధర్మపరి రక్షణకు భారతీయ సంస్కృతి అభివృద్ధికి కృషి చేయాలి. అలా చేయడానికి కేవలం పాండిత్యమే కాక వాక్చాతుర్యమేకాక భగవదనుగ్రహం కావాలి. అది వారి ఇరువురిలో స్పష్టంగా కనబడుతుంది. ఇరువురు చెప్తున్నది రామకథ, కృష్ణకథ, శక్తి కథలే కదా! చెప్పేది. భాగవతులలో ఎక్కువ తేడాలు చూడడం అనేది పాపకృత్యమే అవుతుంది.

### ◆ ఆగమ శాస్త్రం అంటే ఏమిటి?

ఆగమశాస్త్రం అంటే దేవాలయ నిర్మాణం, దేవాలయ నిర్వహణల గూర్చి తెలిపే శాస్త్రం. ఇది ఒక ప్రత్యేకమయిన శాస్త్రం కాదు. కొన్ని శాస్త్రాలలోని విషయాల కలయిక ఆగమ శాస్త్రం. జ్యోతిషశాస్త్రంలోని వాస్తు, ముహూర్త, విషయములు, వేదమంత్రములు, కల్పసూత్రములు, పురాణములలో చెప్పబడిన వ్రతములు, వాటి నిర్వహణ, పంచాంగ గణితం ద్వారా చెప్పబడిన వ్రతముల నిర్ధారణకు ధర్మశాస్త్ర విషయములు, మంత్రముల బీజాక్షర నిర్ధారణ మరియు యంత్ర నిర్మాణం వంటి వాటికి మంత్ర విశేషములు వీటికలయిక ఆగమశాస్త్రం. వీటిలో ఏ ఒక్క విషయంలో అవగాహన లేకపోయినను, వారిని ఆగమ శాస్త్ర పండితులు అని అనకూడదు. నేడు చాలా మంది ఆగమ శాస్త్ర పండితులుగా చలామణి అయ్యేవారు మనకు ఆగమ శాస్త్రం ప్రకారం నిర్మాణం నిర్వహణ ప్రతిష్ఠ విషయాలలో ఎంత అవగాహన ఉంది అనేది వారే ఆత్మవిమర్శ చేసుకోవాలి. కారణం వ్యవస్థా రక్షణ నేటి రోజులలో అత్యావశ్యకమైనది. ఇంటర్నెట్‌లో అనేక గ్రంథాలు, అనేక భాషలలో లభిస్తుంటే అందరూ చదివి విషయం తెలుసుకుంటున్నారు. మరి మనం చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి కదా!

### ◆ మడి-ఆచారము ప్రాంతాలవారీగా మార్పును సంతరించుకుంటాయి. కారణం ఏమిటి?

ప్రకృతి అందించే వనరులు, వాతావరణం, మనకు దొరికే నీటి సౌకర్యముల ఆధారంగా మడి–ఆచారం పెద్దలు నిశ్చయం చేశారు. వీటికి పెద్దల యొక్క నిర్దేశాలే ఆధారం అంతేకానీ ఒక గ్రంథస్థమయిన విషయం ఏమీ లేదు. వాతావరణం అనుసరించుటకు ఉదాహరణ చూద్దాం. ఉత్తరాదిలో చలి తీవ్రతను అనుసరించి వారు చొక్కాధరించి దేవాలయములలో అర్చకులుగా వుంటారు. మన దక్షిణాదిలో

కేవలం పంచె, ఉత్తరీయంతో వుండి చొక్కా వేసుకోరు. యిది యీ నిర్ణయం, నియమం వాతావరణం అనుసరించి ఏర్పాటు చేసినవే. అలాగే యితర ఆచార విషయములు కూడా ఏర్పాటు చేయబడినవి.

◆ **ప్రస్తుత సమాజంలో కొత్తగా వస్తున్న దీక్షలు సరి అయినవేనా?**

కొత్తగా వస్తున్న అనే పదం మీరే వాడారు కదా! మరి నేను చెప్పేది ఏమిటి అంటే ఆయా దీక్షల ప్రభావంగా చాలా మంది భక్తి భావనలతో కొంతకాలమయినా జీవనం చేయగలుగుతున్నారు. దాని వలన సంఘంలో మంచి పెరిగే అవకాశం బాగా వున్నది. అందువలన దీక్షల గూర్చి ఎక్కువగా మిమర్శనాత్మకధోరణి వదిలి దీక్షలు చేసే వారిని ప్రోత్సహించండి.

◆ **సత్సంతానం కలగాలంటే ఏమి చేయాలి? గర్భిణీ స్త్రీ దృష్ట్యా తెలుపగలరు?**

గర్భస్థ శిశువుకు గత జన్మ స్మృతులు పూర్తిగా వుంటాయి. గర్భం నుండి బయటకు వచ్చే సమయంలో గత స్మృతులు పోయి నూతన మనసుతో బయటకు వస్తారు. అటువంటి విషయంలో గర్భిణీ స్త్రీ విషయంలో కశ్యపాది మహర్షులు పురాణాల ద్వారా మనకు తెలియచేసిన విషయం ఏమనగా గర్భిణీ స్త్రీ దుఃఖితురాలు అవ్వకూడదు. అంతేకాక ఆమె ఎంత భగవన్నామ స్మరణ చేస్తే అంత చక్కటి ఫలితాన్ని అందుకునే అవకాశం వున్నది. భోజనం చేసినా యితర ఆహారం తీసుకున్నా కానీ ఆ సమయంలో కూడా భగవన్నామ స్మరణం చేస్తూ వుంటే 100 శాతం సత్సంతానం కలుగుతుంది. గర్భవతిగా వున్న స్త్రీ భగవద్గీత, సౌందర్యలహరి పారాయణ చేయుట ద్వారా అందము విజ్ఞానము కలిగిన సంతానం కలుగుతుంది.

◆ **మతత్రయఏకాదశీ, వైష్ణవఏకాదశీ, స్మార్తఏకాదశీలకు గల తేడా ఏమిటి?**

మతత్రయం అంటే, స్మార్త, మాధ్వ, వైష్ణవ సాంప్రదాయములు మూడింటినీ కలిపి మతత్రయం అంటారు. భారతీయ సంస్కృతిలో ప్రతిరోజూ సూర్యోదయానికి రెండు గంటల ముందు ఉషఃకాలము అంటారు. ఉషఃకాలంలో పూజాదులు నిత్య సంస్కారములు ప్రారంభించవలెనని ధర్మశాస్త్రం చెబుతుంది. ఆ సందర్భంలో ఉషః కాలము ప్రారంభంలో వున్న తిథిని సంధ్యావందనాది నిత్య సంస్కారములలో వైష్ణవులు ఉపయోగిస్తారు. స్మార్తులు (శైవ సాంప్రదాయం) ఉషః కాలంలో నిత్య సంస్కారములు (సంధ్యావందనాదులు) చేసినా సూర్యోదయానికి వున్న తిథిని వాడుకుంటారు. అందువలన ఈ నియమానుసారంగా ఏకాదశుల నిర్ణయంలో మార్పులు సంతరించు కున్నాయి. ఉషః కాలం ఆధారంగా వైష్ణవ ఏకాదశీ,, సూర్యోదయం లెక్కలో స్మార్త ఏకాదశీ నిర్ణయింపబడతాయి. అయితే పండుగల విషయంలో స్మార్తులు తిథి ప్రకారం నిర్ణయిస్తే వైష్ణవులు నక్షత్రం ప్రకారం నిర్ణయిస్తారు.

◆ **రోజు ఎప్పుడు ప్రారంభం అవుతుంది? పంచాంగం అంటే ఏమిటి?**

ఇంగ్లీషు క్యాలెండర్‌లలో అర్ధరాత్రి 12 రోజు ప్రారంభం అవుతుంది. మనకు కూడా అర్ధరాత్రి 12.00 గంటలకు రోజు ప్రారంభం అవుతుంది అని సూర్య సిద్ధాంతం ప్రథమాధ్యాయంలో చెప్పబడినది. రాత్రి 12.00 గంటల నుండి అపర రాత్రిగా పిలువబడును. అయితే మన సాంప్రదాయంలో రాత్రి భాగాన్ని మూడు భాగాలు చేసి మొదటి రెండు భాగాలను ముందు రోజుగాను మూడవ భాగాన్ని మరుసటి రోజుగాను చెప్పి అశౌచప్రకరణంలో వాడుకుంటారు. నిత్యకర్మలకు ఉషః కాగాన్ని మరుసటి రోజులోని వారమును వాడుకుంటారు. పంచాంగం నిర్మాణం వాడుకంలో 'ఉదయాత్ ఉదయం వారం' అనే నానుడి ప్రకారంగా సూర్యోదయం నుండి వారం అంటే రోజు మారుతుంది. పంచాంగం అంటే తిథి, వారము, నక్షత్రం, యోగం, కరణం వీటిని పంచాంగం అంటారు.

◆ **ధృవుడు తన తొందరపాటుకు పశ్చాత్తాప పడిన సందర్భం వున్నదా?**

ఉన్నది. శ్రీహరి ప్రత్యక్షం అవ్వగానే, ధృవుడు శ్రీహరిని స్తుతించి, తన కోరిక వెలిబుచ్చాడు. అది ఏమనగా ఉన్నతమయిన స్థానం పొందడం. అందుకు శ్రీహరి అనుగ్రహించి 'ధృవక్షితి' అనే ఉత్తమమయిన స్థానం అనుగ్రహించి వెడలిపోయారు. అప్పుడు అతనికి స్ఫురించినది ఏమనగా.... నేను దురదృష్టవంతుడను; సంసార బంధాలను హరించే శ్రీహరిని దర్శించి కూడా అనిత్యాలయిన కోర్కెలను కోరుకున్నాను. ఇలాంటి దౌర్భాగ్యం ఎక్కడయినా వుంటుందా? "మూర్తి ఫలదుండైనట్టి పంకజ లోచనుడే చాలప్రసన్నుడై నతనిన్ సంసారికంబర్థిగ్రోరిన నావంటి విమూఢ మానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్? మోక్షప్రదాత అయిన పుండరీకాక్షుడు సాక్షాత్కరింపగా నేను సంసారాన్ని అర్థించాను. నా వంటి మందబుద్ధులు ఈ లోకంలో మరెవ్వరూ ఉండరు అని ధృవుడు తన తొందరపాటుకు పశ్చాత్తాప పడ్డారు.

◆ **పార్వతీదేవి తన వివాహం నిమిత్తంగా శివుని గూర్చి తపస్సు ప్రారంభిస్తూ గణపతిని ఆరాధించినది అంటారు యిది ఎలా సాధ్యం?**

నిజమే అలాగే జరిగింది. గణేశపురాణంలోని విషయం యిది. మీ అనుమానమే మిటి అంటే గణపతి పార్వతీ తనయుడు కదా! వివాహమునకు ముందు ఆమె గణపతిని అర్చించడం ఎలా సాధ్యం అనే కదా! ఒక విషయం తెలుసుకోండి. భారతీయ సంస్కృతికి ఆధారం వేదములు. వేదములు సృష్ట్యాదినుండే వున్నాయి. వేదమంత్రాల లోని ప్రారంభ మంత్రం "గణానాంత్వా గణానాంత్వా గణపతిగ్ంహవామహే". కదా! సృష్ట్యారంభంలో గణపతి ఉన్నాడు. అనే కథనాలతో గణపతితత్వం చెప్పబడినది. మీ అనుమానానికి సమాధానం ఒకటే. పార్వతి పూజించిన గణపతి సృష్ట్యాదినుండి

వున్న గణపతి. గణపతి సృష్టికి మూలం అని "వల్లభేశోపనిషత్"లో వున్నది. లఘువుగా గణపతిని గూర్చి చెప్పడం కష్టమే. వివిధ కల్పాలలో వివిధ కథలు గణపతికి సంబంధించినవి జరిగినవి. బ్రహ్మ వైవర్త పురాణంలో విష్ణువే గణపతి స్వరూపంగా మారిన కథ ఉన్నది. పార్వతిదేవి బ్రహ్మకల్పంలో లేదు. కానీ బ్రహ్మకల్పానికే గణపతి ఉన్నాడు. బ్రహ్మవైవర్త పురాణం మొత్తం చదవండి. పద్మపురాణం చదవండి. ఇంకా విశేషాలు తెలుస్తాయి.

**◆ "సంస్కృతంతో, సంస్కృతితో శాస్త్రాధ్యయనం చేయండి" అని వ్రాస్తారు కారణం?**

శాస్త్రాలు అన్నీ సంస్కృత భాషలోనే మహర్షులు అందచేశారు. ఏ పుస్తకం అయినా వ్యాఖ్యాత తనదైన శైలిలో వ్యాఖ్యానం వ్రాస్తారు. పాఠకుడు ఆ వ్యాఖ్యానం చదువుతూ అదే ఆలోచనలోకి వెళతాడు. అంటే దీని అర్థం. వ్యాఖ్యాత పాఠకుడిని తన భావం వైపు తిప్పుకుంటున్నాడు అన్నమాట. అదే మూలం కనుక మనం క్షుణ్ణంగా తెలిసికొని దానిని వ్యాఖ్యానం మనమే కనుక శోధించగలిగితే – అది ఒక గొప్ప అనుభూతి. అటువంటి సన్నివేశంలో పాఠకుడే వ్యాఖ్యాత కాగలడు. మూలం తెలిసిన ప్రతివాడు వ్యాఖ్యానం కోసం శోధిస్తే ప్రతి అంశం ఎంతో కొంత కొత్తదనాన్ని సంత రించుకుంటుంది. మనకు వున్న అన్ని రకాల శాస్త్రాలు వాటి మూలము సంస్కృతం లోనే అందించడం అయినది. అందువలన సంస్కృతం వస్తే మనకు మూలమును శోధించే శక్తి వస్తుంది. సంస్కృతంలో ఒక్కోపదానికి అనేక అర్థాలు వుంటాయి. ఉదాహరణకు "హనహింసాయామ్" అనే ధాతువులోనిదే "హంతి" అనే రూపం. హంతి అంటే చంపుటకేకాక హింస అనే కార్యమునకు కూడా వాడవచ్చు. మరి ఈ భేదాన్ని గుర్తించగలిగే సంస్కృతిని గురువు దగ్గర విద్యాభ్యాసం ద్వారా నేర్చుకోవాలిసినదే. అందుకే శాస్త్రాధ్యయమునకు "సంస్కృతం–సంస్కృతి" రెండూ అవసరమే.

**◆ దేవాలయంలో చేయు ప్రదక్షిణాల సంఖ్య విషయం శాస్త్రబద్ధమయినదా?**

శాస్త్రాలలో అన్ని విషయాలు వ్రాసివుండవు. దేశకాల పరిస్థితుల దృష్ట్యా పెద్దలు ఆచరించిన ప్రతి విషయాన్నీ కూడా శాస్త్రంగా గ్రహించడం అనేది మన సాంప్రదాయం. అది సత్సాంప్రదాయమయితే ఆచరించితీరవలసినదే. అలాగే దేవుని అర్చించే విషయంలో పెద్దలు ఏర్పాటు చేసిన సాంప్రదాయం ప్రదక్షిణలు. ప్రతి దేవుని పూజలో 'ఆత్మప్రదక్షిణ' చెప్పబడినదే కదా! యిక సంఖ్య విషయంగా సంఖ్యలు ఒకటి, మూడు, అయిదు, పదకొండు, నలభైఒకటి, నూట ఎనిమిది ప్రదక్షిణాల సంఖ్య మనకు పెద్దల ద్వారా చెప్పబడిన సాంప్రదాయము.

**◆ చెట్లు కొట్టడం, బావి పూడ్చడం, వంటివి లక్ష్మీప్రదం కాదు అంటారు. ఎందుకు?**

శ్రీమద్దేవీ భాగవతం నవమస్కంధం (గోలోకఖండం) చదివితే వీటి మీద పూర్తి సందేహ నివృత్తి కలుగుతుంది. యిందలి విశేషం ఏమనగా లక్ష్మీ, సరస్వతీ, దుర్గా,

రాధ ప్రకృతులు. అంటే ప్రకృతి లక్ష్మీ స్వరూపం. లక్ష్మీ స్వరూపమయిన ప్రకృతిని మనం పాడు చేయవచ్చా! పాడుచేయకూడదు. అందుకే ప్రకృతిలో భాగమయిన చెట్లను నరకడం బావిని పూడ్చడం వంటివి లక్ష్మీప్రదం కాదు అంటారు. ఏదేని అత్యవసర విషయ నిమిత్తంగా చెట్టు కొట్టదలచినా, బావిని పూడ్చదలచినా లక్ష్మీ, దుర్గా పూజలు చేసి ఈ పనిని కావిస్తారు.

◆ **రామాయణంలో రాముడు కష్టాలు అనుభవించాడు. కావున "గర్భిణీస్త్రీలు రామాయణం పారాయణచేయవద్దు" అని కొందరు అంటారు. వారి వాదన నిజమేనా?**

రామావతారం, కృష్ణావతారం రెండూ కూడా బాధ్యతలు నెరవేర్చుటకు ఏర్పడిన అవతారములు. రామావతారంలో రాముడు బాధ్యతలు పూర్తి చేసుకున్నాడా? లేక కష్టాలు అనుభవించాడా? రాముడు తాను కష్టపడినట్లుగా ఎక్కడయినా అన్నాడా? భాధ్యత కోసం విశ్వామిత్రుడితో అరణ్యాలకు వెళ్ళారు. బాధ్యత కోసం తండ్రి ఆజ్ఞమేర అరణ్యవాసం చేశారు. బాధ్యత కోసం సీతను రక్షించడం కోసం లంకకు వెళ్ళి రావణవధ చేసి సీతను రక్షించారు. యిలా అసలు రామావతారమే బాధ్యతలతో కూడిన అవతారం. చదివితే గర్భస్థశిశువుకు ధర్మజ్ఞానం కలుగుతుంది. బాధ్యతల పట్ల అవగాహన బాధ్యతల పట్ల అవగాహన బాధ్యతలు నెరవేర్చడం కోసం ఆసక్తి పెరుగుతాయి. అంతేగాదు, శ్రీరామ జననకాండం పారాయణం చేయుటం వలన సుఖప్రసవమవుతుందని ఉమా సంహితలో వుంది. ఇంక సందేహం దేనికీ?

◆ **మనిషికి కష్టం ఎందుకు వస్తుంది?**

"ఆశ" ప్రధానమయిన కారణం. గీతాచార్యుడు దీనికి వివరంగా తెల్పిన విషయం ఏమిటి అంటే విషయవాంఛలయందు ఆసక్తి కలవానికి కోరిన కలిగి అది తీరక క్రోధం కలుగుతుంది. క్రోధం మోహం కలుగచేస్తుంది. యిది చివరకు బుద్ధి నాశన మునకు దారి తీస్తుంది. అందువలన కోరిక అనేది ప్రధానంగా కష్టాలకు మార్గం అయితే మరొక పక్క అనుబంధం అనేది కష్టాలకు ముఖ్యకారణం అవుతూ వుంటుంది. అందువలన బంధు, మిత్ర, వస్తు ఏ విషయంలో అయినా అనుబంధానికి లోనవ్వ కుండా కేవలం డ్యూటీ మైండెడ్‌గా పని చేసుకుంటూ పోయే వారికి సుఖమే లభిస్తుంది. "నేను నా విధి నిర్వహణ సరిగా చేశానా? లేదా?" అనే పరిశీలన మాత్రమే చేసుకుంటూ ఫలితం గూర్చి ఆలోచించని వ్యక్తి ఎప్పుడూ సుఖంగానే వుంటాడు.

◆ **నేటి సమాజంలో "విడాకులు" తీసుకునే దంపతులు ఎక్కువ అయ్యారు. దీనికి దైవ సంబంధంగా ఏదైనా లోపాలు చేయడం మూలంగా ఈ పరిస్థితి ఏర్పడుతున్నదా?**

విధి బలవత్తరం. విధి బ్రహ్మ లిఖితమును ఎవరూ తప్పించలేరు. కానీ మీరు అడిగిన ప్రశ్నను నైతికంగా పరిశీలిస్తే పూర్వం స్త్రీలు "తనను – తన భర్త బాగా

చూసుకోవాలి. తను తన భర్తకు తగిన రీతిలో నడవాలి" అని ఆశించేవారు. ఎంతటి దుర్మార్గుడయిన భర్తను అయినా సరే మార్చుకొని అతనితో జీవితాంతం కాపురం చేయాలి అనే ఉద్దేశ్యంతో కాలక్షేపం చేసేవారు. వారి పెద్దలు కూడా స్త్రీలకు "సతీ-సుమతి సావిత్రి" కథలు బోధించి "భర్తను నీకు అనుకూలంగా మార్చుకో" అని చెప్పేవారు. పురుషులకు వివాహం నాడు అగ్ని సాక్షిగా చేసిన ప్రమాణాలు, వాటి విలువ, ధర్మం బోధించి మార్పుకోసం ప్రయత్నించేవారు. అందువలన విడాకుల విషయం చాలా తక్కువ. అయితే నేటి సమాజంలో భార్యాభర్తలు చాలావరకు ఒకరిని ఒకరు ఆకర్షించి వారిని పరస్పరం తమ వైపుకు తిప్పుకోవడం కోసం ప్రయత్నించ డంలో వారికి ఓర్పు వుండటం లేదు. దానికి కారణం వారి చదువు ఉద్యోగాల ద్వారా వారికి వున్న టెన్షన్స్ మాత్రమే. ఆ టెన్షన్‌ల ప్రభావంగా భార్యాభర్తలు ఒకరిని ఒకరు ఓర్పుగా సరిచేసుకునే ప్రయత్నాలు చేయలేక విడాకులు కోసం ప్రయత్నిస్తున్నారు. సంఘం కూడా విడాకులను వ్యతిరేకించడం లేదు. పెద్దలు సర్దిచెప్పడంలో విఫలం అవుతున్నారు. కారణం పెద్దలు పిల్లల దగ్గర కుటుంబ గౌరవం సాంప్రదాయముల విషయం కన్నా ఉద్యోగ విషయాలకే ప్రాధాన్యతలు యిస్తూ సంచరించడం, సాంప్ర దాయ విషయాలలో ఔన్నత్యం కంటే ధనసంపాదనలోను ఉద్యోగ విషయంలోను ఔన్నత్యానికి ప్రాధాన్యం యివ్వడం పెరిగింది.

### ◆ క్షేత్రాలలో కేశములు యివ్వడం శాస్త్రమా?

శాస్త్రంలో అన్నీ చెప్పబడి వుండవు. సరే యిక క్షేత్రాలలో కేశఖండన విషయం భక్తికి మరియు సాంప్రదాయమునకు సంబంధించిన విషయం. పురుషులు కేశఖండన క్షేత్రములలో చేయించుకొను విషయంలో స్థల పురాణాన్ని అనుసరించి వచ్చింది. యిది వేంకటేశ్వరస్వామి క్షేత్రము నందు స్థలపురాణంగా ప్రారంభింపబడినది ఇంకా ఇతర క్షేత్రాలలో కూడా మొక్కుబడుల రూపంగా దేవతాఆరాధనలతో ప్రారంభం అయిన సంప్రదాయం. యిది ఎలా విస్తరించి యితర దేవాలయములకు, యితర దేవతలకు పాకింది అనే విషయం 1980 నుండి అందరూ చూస్తూనే వున్నారు. కావున దీనిని గూర్చి చర్చ అనవసరం. యిక ఆడవాళ్ళు తలనీలాలు యివ్వడం అనేది కేవలం భక్తికి సంబంధించిన విషయమే కానీ శాస్త్రము, ఆచారము సంప్రదాయములకు సంబంధించిన విషయం కాదు. విరుద్ధం కూడా.

### ◆ కష్టాలను ఎక్కువగా తలవ కూడదు అంటారు. నిజమేనా? కారణం?

నిజమే. మనిషి ఎక్కువగా ఏ విధమయిన విషయాలను గూర్చి చింతన చేస్తాడో, అతడికి ఆ విధమయిన ఫలితాలే అందుతాయి. చెడు విషయాలను చింతన చేయడం, చెడు పనులు చేయడం ద్వారా ఆ మనిషికి "చెడు" అనేది అనుష్ఠానంగా మారి

అతడికి కూడా చేటు జరుగుతుంది. మంచి విషయాలను గూర్చి చింతన చేయడం, మంచి పనులు చేయడం, మంచి వ్యక్తులతో సహవాసం చేయడం వంటి ద్వారా మంచి అనే అనుష్ఠానం జరిగి ఆ వ్యక్తి మంచి ఫలితాలు అందుకుంటాడు. జపం, తపస్సు, అనుష్ఠానం అనే వాటికి సామాజిక అర్థం ఏమిటో తెలుసా? **“ మార్పులేని నిత్యచింతన”**. అందువలన ఎప్పుడూ మంచి గూర్చి మాత్రమే నిత్యచింతన చేయాలి. పాండవులు కష్టకాలంలో కూడా “కష్టం, కష్టం” అని స్మరించలేదు. అప్పుడు కూడా వారు “కృష్ణ, కృష్ణ” అనే తలచారు. అందువలన వారికి కష్ట సమయాలలో భగవానుడు శ్రీకృష్ణుడు ప్రత్యక్షమయి వారి కష్టాలను తీర్చాడు. అందువలన మనం కూడా కష్టాలను గూర్చి ఆలోచింపక భగవన్నామ స్మరణకు అలవాటు పడితే కష్టకాలంలో కూడా సుఖించే అవకాశం వున్నది. ఉదాహరణకు తుఫాను వచ్చింది. పాక పడిపోయింది. “పాక పడిపోయింది” అని చింతిస్తూ కూర్చుంటే ఉపయోగం ఉండదు. పడిపోయిన పాకలో వున్న వస్తు సంరక్షణ మీద దృష్టి పెట్టాలి. మరల వేరొక పాక నిర్మాణం మీద దృష్టి వుంచాలి. అటువంటి వ్యక్తి సుఖించగలడు. అటువంటి ఆలోచనలు రావాలి అంటే నిత్యం మంచి విషయాల మీద దృష్టి వుంచాలి. “సత్సంగత్వే నిస్సంగత్వం”.

### ◆ కర్టెన్స్ మీద, డోర్స్ మీద దేవుడు బొమ్మలు వేయవచ్చా?

వేయకూడదు. కారణం దేవుని బొమ్మలు, చిత్రపటములు మనలో దైవ చింతన పెంచేందుకు ఉపయోగించాలి. వాటిని మన యింటి అలంకరణ కోసం అన్నట్లుగా ఉపయోగించకూడదు. అంతేకాక గుమ్మాల దగ్గర రాకపోకలు జరిగే సందర్భంలో మన పాదములు లేదా మన శరీరం ఆ తలుపుకు తగలితే దోషం అవుతుంది. అందువలన తలుపులు, కర్టెన్స్ మీద దేవుని బొమ్మలు వేయుట శ్రేయస్కరం కాదు. దేవుని రూపాలు స్థిరంగా వుండాలికానీ చంచలంగా వుండరాదు.

### ◆ వివాహం చేసి వధువును శుక్రవారం అప్పగించడం శాస్త్ర విరుద్ధమా?

అప్పగింతలు అనే కార్యక్రమం శాస్త్రమునకు సంబంధించినది కాదు. వైదిక సాంప్రదాయం కూడా కాదు. అయితే దీన్ని ప్రాంతాల వారీగా వేడుక కోసం ఏర్పాటు చేశారు. అందులో భాగంగా ఒక్కొక్క ప్రాంతం వారు ఒక్కో ఆచారం చెబుతారు. అయితే పిల్లవాడికి కన్యాదానం చేసేసిన తర్వాత ఆ పిల్ల–పిల్లవాడికి స్వంతం. అలాంటప్పుడు మరల అప్పగించడానికి ఆ పిల్ల పుట్టింటికి వారికి హక్కు ఏముంటుంది. దానం చేసిన వస్తువును మరల వెనక్కి తీసుకోకూడదు కదా! మరి కన్యాదానం చేసిన పిల్లను మరల పుట్టింటి వారు వెనక్కి తీసుకుని వారికి అప్పగించడం అంటే అది శాస్త్రం ఒప్పుకోదు. అందుకోసమే ఈ అప్పగింతలు అనే కార్యమునకు మంత్ర సంబంధం కూడా లేదు. అలాంటప్పుడు శుక్రవారం అప్పగింతలు అనే చర్చ అపహాస్యమునకు దారి. యిక కన్యాదానం చేయు విషయంలో శాస్త్రం శుక్రవారం

నాడు మంచిదే అని చెబుతుంది. కావున వివాహ సంబంధమయిన ప్రతి కార్యము శుక్రవారం చేసుకోవడం విశేషం. నేటి సమజంలో శుక్రవారంనాడు పసుపు కుంకుమ పెట్టే విషయంగా కూడా చాలా అభ్యంతరాలు చెబుతున్నారు. అది శాస్త్ర విరుద్ధం. శుక్రవారం వివాహ సంబంధమయిన ప్రతిపనీ విశేషమయినదే.

**◆ ప్రజాస్వామ్యం అనేది ఆధునికం కాదు ప్రాచీనకాలంలో కూడా వున్నది అంటారు. నిజమేనా?**

దీనికి పురాణాలు, ఇతిహాసాలు సమాధానం చెబుతున్నాయి. పూర్వం రాజరికంలో వుంటూ ప్రతి పనిని ప్రజాభిప్రాయ సేకరణతో అమలు చేసిన సంఘటనలు ఎన్నో మనకు గోచరిస్తాయి. ప్రజాస్వామ్యం అంటే ప్రజల అభిప్రాయంతో పాలకుల నిర్ణయాలు తీసుకోవడం ప్రాచీన కాలంలో ప్రజాస్వామ్యం గురించి చెప్పడానికి ఉదాహరణ రామాయణం. అయోధ్యకాండ రెండవ సర్గలో శ్రీరామచంద్రునికి పట్టాభి షేకం చేయదలచి ప్రజలందరినీ సమావేశపరచి, “మీ అనుమతి పెద్దలు, గురువుల అనుమతితో శ్రీరాముని రాజుగా పట్టాభిషేకం చేయదలచాను” అని అడిగారు. అంటే ప్రజామోదమయిన ప్రభువునే ఏర్పాటు చేయాలి. అనే ఉద్దేశ్యం ప్రజాస్వామ్య లక్షణాలతో కూడినదే కదా! ప్రజామోదం వుండదనే కారణంగానే భరతుడు పరిపాలనలో మాత్రం వున్నాడుకానీ ప్రభువుగా కూర్చొలేదు అనే విషయాన్ని గ్రహించాలి. తన కుమారుడికి రాజ్యాభిషేకం చేయు అధికారం, స్వాతంత్రం వుండి కూడా దశరధుడు ప్రజాభిప్రాయం అడిగాడు. తనకు పాలనాధికార అవకాశం వచ్చినా – “ధర్మము కాదు – ప్రజలు దూషిస్తారు” అని ప్రజాభిప్రాయానికి గౌరవం యిచ్చాడు భరతుడు. అంటే ప్రజాస్వామ్యం నాడే ప్రారంభం అయినది. ఈ రీతిగానే భోజరాజు పరిపాలన చేశారు అని చెబుతారు. యిలాంటి దృష్టాంతాలు భారతంలో అనేకం. దుర్యోధనుడు కేవలం పాండవుల విషయంగా దుర్మార్గంగా ప్రవర్తించినా ప్రజల విషయంగా ప్రజాభిప్రాయానికి విలువ యిచ్చేవాడని వున్నది. అందువలన ప్రజాస్వామ్యం ప్రాచీనమయినదే కానీ ఆధునికం కాదు.

**◆ దత్తత విషయంలో ధర్మాలు తెలుపండి. ఆడవారిని దత్తత తీసుకోవచ్చా?**

మంత్ర పూర్వకంగా ఆడపిల్లను దత్తత తీసుకోవడం అనేది లేదు. కేవలం సగోత్ర కన్యను దత్తత అనే భావనతో పెంచుకోవచ్చు. అలా పెంచుకోవడానికి అన్యగోత్ర కన్య పనికిరాదు. మగపిల్లవానిని దత్తత తెచ్చుకొనే విషయంలో జ్ఞాతులతో పిల్లలకు ప్రాధాన్యం వున్నది. తర్వాత సగోత్రజులకు ప్రాముఖ్యం. దౌహిత్రుని, భాగినేయుని మాతృభగినీ పుత్రుని దత్తత చేసుకొనవలెను. ఒక కుమారుడుగా పుట్టిన వానిని, జ్యేష్ఠుడుగా పుట్టిన వానిని దత్తత తీసుకొనరాదు. వేరే గోత్ర కన్యకను కూడా అమంత్రకంగా తెచ్చిపెంచుకోవచ్చు.

**◆ పుష్కరాలలో 12 రోజులే పితృశ్రాద్ధ కర్మలు నిర్వహించుట విశేషమా?**

పుష్కరాలు 12 రోజులలో పితృశ్రాద్ధం నిర్వహించడం విశేషం. పుష్కరుడు అసంవత్సర కాలం అంతా అనగా మరల పుష్కరాలు వేరేనదికి ప్రారంభం అయ్యేంతవరకు కూడా ఆ నది మీదనే వుంటాడు. కావున అసంవత్సర కాలంలో ఏ రోజునయినా అపరాహ్ణ కాలంలో చేయు పితృకార్యం పుష్కరాలలో చేసిన ఫలితాన్ని యిస్తుంది. ఆ నదీ తీరంలో పితృకార్యం చేయాలి. అలాగే అపరాహ్న కాలంఓ ఆ నదిలో చేయు స్నానం పుష్కరస్నానం ఫలితాన్ని యిస్తుంది. పుష్కరాలు ప్రారంభమైన 12 రోజులు కూడా ఆ నదిలో ప్రతి నిమిషం విశేషం అయినదే. పురాణముల ఆధారంగా "పుష్కరుడు" అనే వారు ఒక నదిలో ప్రవేశించినది మొదలు ఆ సంవత్సరం అంతా ఆ నదిలోనే వుంటారు. అందువలన మరల వేరొక నదీ పుష్కరాలు ప్రారంభం అయ్యేవరకు అపరాహ్ణ కాలంలో పుష్కరం నదీ తీరంలో చేస్తే పుష్కరాలు 12 రోజులు చేసిన విశేషం వస్తుంది. ఉదాహరణకు మేషే గంగా వృషేరేవా అని కదా! మేషంలో గురువు ప్రవేశించిన 12 రోజులు ఏ సమయంలో గంగా స్నానం చేసినా అది పుష్కర స్నానం చేసినట్లు గురువు ఒకసారి వృషభంలో ప్రవేశించే లోపుగా సంవత్సర కాలంలో ఆ అపరాహ్ణ సమయము చేయు స్నానం ఆబ్దీకం పుష్కరం 12 రోజులు చేయు ఫలితాన్నే చూపుతాయి. అలాగే మిగిలిన నదుల విషయంలో కూడా పుష్కరుడు ఆ రీతిగా బ్రహ్మనుండి వరం పొందినట్లుగా పెద్దలు చెబుతారు అందువలన శారీరక ధర్మం దృష్ట్యా ఒకవేళ పుష్కరాలు 12 రోజులు వెళ్ళలేని వారు ఈ అవకాశం సద్వినియోగం చేసుకోవచ్చును.

**◆ తండ్రి కాలం చేసిన సంగతి నాకు మా సోదరులు తెలియచేయలేదు. మా తండ్రి కాలం చేసిన నెల రోజులకు విషయం తెలిసింది. మా గురువు యొక్క సలహా మేర కర్మకాండ చేశాను. అది ఫలిస్తుందా? యిలా జరిగిన వెంటనే పాటింప వలసిన నియమం ఏమిటి?**

యిటువంటి స్థితి ఎవరికీ రాకూడదనే ఆశించండి. మీకు తెలియచేయని దోషం మిగిలిన సోదరులకు కూడా వుంటుంది. తెలుసుకునే అవకాశం రాకపోవడం మీ అవయోగం. అయితే యిలాంటి వార్త తెలిసిన వెంటనే యధావిధిగా కర్మకాండను ఆచరించాలి. దీనికి ఉదాహరణ రామాయణంలో దశరధుని మరణ ఘట్టమే. దశరథ మరణం రామలక్ష్మణులకు తెలియదు. భరతుడు కర్మకాండ చేశాడు. అనంతరం కొద్ది రోజులకు రామలక్ష్మణులను అరణ్యంలో కలిసి విషయం తెలుపగా శ్రీరాముడు యధావిధి యధాశక్తి కార్యక్రమం నిర్వర్తించారు. అయితే దశరధుని మరణం వెంటనే రామునికి తెలియచేయకపోవుటకు గల కారణం 'అరణ్యవాస దీక్షితుడయిన రాముడు

నగరంలో ప్రవేశించడు" కావున, భరత శత్రుఘ్నులను పిలిచి కార్యం పూర్తి చేశారు. మీ చిరునామా తెలిసి మీకు మీ తండ్రి విషయాన్ని తెలియచేయని దోషం మీ సోదరులకు నూరుశాతం వుంటుంది. దహన సంస్కారం మినహా అంతా కర్మకాండ చేయవలసినదే లేని ఎడల మీరు కర్మభ్రష్టులు అవుతారు. కర్మాధికారులలో ఎవరో ఒకరు దగ్గర ఉంటే జ్యేష్ఠుడు ఉన్నా లేకున్నా కర్మకాండలో దహన సంస్కారం వరకు పూర్తి చేయవలెను. అంతేకాని ప్రేతను మరుసటి రోజు అగ్నికి ఇవ్వకూడదు.

◆ **కేవలం పురాణాల ఆధారంగా నేటి ప్రభుత్వాలకు "ఇలా ఉంటే బాగుంటుంది మన రాజ్యం" అని సలహాలు చెప్పగలరా?**

రామాయణంలో దశరథుడు రాముడిని యువరాజుగా ఎంపిక చేయు సందర్భంలో ప్రజల అభిప్రాయం తీసుకున్నారు అని ఉన్నది. మరి నేడు మన ప్రభుత్వాలు కూడా ఏదైనా నిర్ణయం చేసేటప్పుడు ప్రజల అభిప్రాయాన్ని పరిగణనలోకి తీసుకుంటే ప్రజలు సుఖపడతారు. ఉదాహరణకు స్కాట్‌లాండ్ ఇంగ్లాండ్ నుండి విడిపోయే సందర్భంలో వారు ప్రజలనుండి ప్రత్యక్షంగా అభిప్రాయం తీసుకున్నారు. మరి మన రాష్ట్రం విడగొట్టే సందర్భంలో ప్రజల అభిప్రాయం తీసుకోలేదు కదా! టెక్నాలజీ లేని రోజులలో దశరథుడు ఆచరించిన ధర్మం నేడు మన ప్రజాస్వామ్యంలో అమలు కాలేదు కదా! ఇక నుండి అయినా ప్రజలకు ఇచ్చిన ఆధార్‌కార్డులు ప్రజల చేతిలోని సెల్ ఫోన్‌లు ఆధారంగా తేలికగా పోలింగ్ చేసి ప్రజాభిప్రాయాలను తెలుసుకొని పరిపాలనలో అమలు చేస్తే ప్రజలు ఆనందిస్తారు. దుర్యోధనుడు కూడా కేవలం పాండవులు మీద వైరం పెంచుకున్నాడు కాని ప్రజలను ఇబ్బంది పెట్టినట్టుగా ఎక్కడా లేదు. 2. మన రాజరికాలలో పురాణ గాథలలో రాజులను మంత్రులను ప్రతి సామాన్య వ్యక్తి కూడా ప్రత్యక్షంగా కలుసుకున్నట్టు ఉంటుంది. ప్రజలు దగ్గరకు పరిపాలకులు వారి యొక్క కష్ట సుఖాలు తెలుసుకోవడం కోసం గూఢచారి వ్యవస్థ మరియు పాలకులే స్వయంగా వెళ్ళినట్లుగా పురాణ గాథలు ఉన్నాయి. అలాంటి అవకాశం ప్రజలకు ప్రభుత్వాలు కల్పించాలి. 3. రామాయణంలోని మహాభారతంలోని, శ్రీమద్భాగవతంలోని అయోధ్య, హస్తినాపుర, మధుర పురవర్ణనలు చూసి దాని ప్రకారంగా మన నగరాలు తీర్చిదిద్దుకుంటే కాలుష్యం లేని వాతావరణాన్ని మనం పొందవచ్చు. 4. కాలువ గట్ల వాసులు వారి యొక్క మలమూత్ర వ్యర్థాలను నదులలోను, కాలువలలోను ప్రత్యక్షంగా కలుపుతున్నారు. అలాగే కర్మాగారాల వ్యర్థాలు నదులలో కలుస్తున్నాయి. అటువంటి నీటిని కేవలం క్లోరినేషన్ చేసి మనకు పంపుతుంటే వాటిని మనం త్రాగుతున్నాము. ఇంతకన్నా టెక్నాలజీ లేని పురాణ కాలంలోనే నీటి కాలుష్యం లేదని మనకు పురాణాల ద్వారా తెలుస్తుంది. నీటి కాలుష్యం జరిగిందనే కదా "కాళీయ మర్దనం" ఘట్టంలో శ్రీకృష్ణ లీలలు మనం చూసినది. పాలకులు నీటి

కాలుష్యం చేస్తున్న వారి మీద చర్యలు తీసుకోవడానికి సమర్థంగా వ్యవహరించాలి. 5. యువతరం మంచి పాలన పొందాలంటే యువశక్తిలో మంచి మార్పులు రావాలంటే ఆ యువశక్తి ప్రభుత్వానికి మంచి సూచనలు సలహాలు ఇవ్వాలి. పూర్వ కాలం ఎవరి గ్రామాలలో వారి రక్షణ వారే చూసుకొనేవారు. ప్రభుత్వం కూడా సహకరించేది. నందగోకులం మీద రాక్షసుల దాడికి నందమహారాజుతో కలిపి గ్రామస్థులు అందరూ కలిసి గ్రామ రక్షణ చేసుకున్న విధానం మనం హరివంశం మరియు భాగవతం కథలలో చూడవచ్చు. అటువంటి లక్షణాలు ప్రజలలో అలవాటు చేయాలి. కేవలం నా రక్షణ ప్రభుత్వమే చేయాలి అనే ధోరణి ప్రజలలో పోవాలి అంటే ప్రభుత్వం కొన్ని ప్రత్యేక చర్యలు చేపట్టక తప్పదు అలాగే యువతరంలో మార్పు రాకపోతే సంఘం బాగుపడదు. మన రక్షణ మనమే చేసుకోవాలి. పోలీసు ఉన్న చోటుకు దొంగ రాడు కదా! అలాగే పోలీసు ప్రతిచోట ఉండలేడు కదా! ఇది గుర్తుంచుకోండి. యిలా పురాణ కథలలోని అంశాల ప్రకారం రాష్ట్ర ప్రభుత్వం, ప్రజలు, పాలకులు ఉంటే సంఘం బాగుపడుతుంది.

◆ **కొత్తగా కనుక్కొన్న మూడు గ్రహాల గురించి టి.విలలో ఎన్నో విశేషాలు చెప్పారు? మరి ఆ గ్రహాలు ఏవి?**

వేద ఆధారంగా జ్యోతిషంలో చెప్పిన ప్రకారంగా తొమ్మిది గ్రహాలు సృష్టిని పరిపాలిస్తున్నాయి. వాటి ధాటికి ఈ మూడు గ్రహాలు వెళ్ళిపోయినాయి. సైన్సు ప్రకారంగా కనుక్కొన్న ఆ మూడు గ్రహాలతో సృష్టికి ఉపయోగపడే అంశాలు గతంలో ఏమీ ఉన్నట్లుగా సైంటిస్టులు కనుక్కోలేదు. కేవలం వారు కనుక్కున్నామని గొప్పలు చెప్పారు. ఈ నాలుగు సంవత్సరాలలో వాటి ప్రభావాన్ని మరల చర్చించలేదు. అవి కనిపించిన సందర్భంలో మాత్రం కేవలం టీవీలలో హడావిడి చేసి సాంప్రదాయ పండితులను, స్వామీజీలను అపహాస్యం చేసారు. స్వరూపానంద స్వామీ విశాఖపట్నం వారిని టి.వి.లో అపహాస్యక్రమంలో ఈ విషయమై మాట్లాడారు. మరి వారే ఈ గ్రహాల గురించి మళ్ళీ వెతికి మన అందరికి పాఠం చెప్పాలి.

◆ **సంవత్సర సూతకంలో దానాలు చేయవచ్చా?**

చేయాలి. పుణ్యకార్యాలు చేయాలి. అందుకే పదకొండవ రోజున దశ దానాలు షోడశ దానాలు చేస్తారు. సంవత్సరం లోపు కన్యాదానం విశేషం అని చెప్పారు కదా!

◆ **మేము బ్రాహ్మణులం. చక్రాంతం అయ్యాము. మరి రోజువారి పూజలో మాకు ప్రధాన అంశము ఏది?**

దేవీ భాగవతం 11,12 సర్గలలో బ్రాహ్మణులు, సంధ్యావందనం, గాయత్రీ విశేషాలు వ్రాసి ఉన్నాయి? సృష్ట్యారంభంలో బ్రాహ్మణులు మాత్రమే ఉన్నారు. వారికి

శైవ వైష్ణవ భేదం విషయమై దేవీ భాగవతంలో బ్రాహ్మణుల్లారా! మీరు ఉపనయనం దగ్గర నుండి శాక్తేయులు అంతే గాని మీకు శైవ వైష్ణవ ప్రాధాన్యం ముఖ్యం కాదు, అని చెప్పబడిఉంది. ఉపనయనార్వాత ఉన్నవారికి సంధ్యావందన, గాయత్రీ అనుష్ఠానం ప్రధానం. తర్వాతనే శైవం, వైష్ణవం వంటి విశేషాలు. కాబట్టి చక్రాంతం అయినా లింగధారణ అయినా గాణాపత్యం అయినా సంధ్యావందనాది క్రియల తర్వాతనే ప్రాధాన్యం ఇవ్వాలి. ఇది దేవీభాగవతంలోని మాటలు. నా సొంతం కాదు.

◆ **కౌరవ పాండవ వంశాలలో ఆడ సంతతి ఎవరికీ కలుగలేదా?**

దృతరాష్ట్రునికి వందమంది మగ పిల్లలతో పాటు గాంధారీకి "దుశ్శల" అనే కుమార్తె కలిగింది. దృతరాష్ట్రునికి కౌరవులు వంద మంది మాత్రమే కాదు. "యుయుత్సుడు" అనే కుమారుడు కూడా కలిగాడు. (గాంధారీ వలన కాదు)

◆ **అయ్యా! మా వీధిలో ఎవరైనా కాలం చేస్తే మాకు ఉండే నిబంధనలు ఏమిటి? దేవాలయ నిబంధనలు ఏమిటి?**

మీ వీధిలో ఎవరైనా కాలం చేస్తే వారి పార్థివదేహం తీసుకువెళ్ళేవరకు మీ ఇంట పూజ, వంట, భోజనాదికమలు నిషేధము. ఒకవేళ మీ ఇంట దేవతార్చన వుంటే అనివార్య కారణాల వలన ఆ పార్థివ దేహం వారు ఆ రోజంతా తీసుకువెళ్ళక పోతే మీరు మీ దేవతార్చనను నీటిలో గాని, బియ్యంలో గాని ఉంచండి. మీరు భోజనం కోసం వేరే చోట మార్గాంతరం చూసుకోండి. దేవాలయం విషయంలో పార్థివ దేహం తీసేవరకు విశేష పూజలు పనికిరావు. మరి పార్థివదేహం 1,2 రోజులు తీయని పక్షంలో ప్రాతఃకాలంలో నిత్య పూజ చేసి ప్రాకార గోపురం ఎదుట దేశవాళి ఆవును కట్టివేసి దేవాలయం లోపలే నివేదన తయారుచేసి స్వామివారికి అర్చన, నివేదనలు పూర్తిచేయాలి. అంతేకాని నిత్యార్చనలు ఆపకూడదు కదా మరి! అందుకే ఇవి శాస్త్ర ఆధారంగా పెద్దలు ఏర్పాటు చేసిన కట్టుబడి. ఒక వేళ ఒక రోజంతా నివేదనలు ఆపితే సంప్రోక్షణ కార్యక్రమం చేయాలి.

◆ **అయ్యా! మూఢం వెళ్ళిన వెంటనే రెండు రోజులలో మా అబ్బాయి పెళ్ళి? మరి మూఢమిలో పసుపు కొట్టుకోకుండా పనులు చేసుకొనుట ఎట్లు?**

ఒక మంచి తిథి, వార, నక్షత్రాలు కలిసిన రోజున వినాయకుడికి కొబ్బరికాయ కొట్టి నమస్కారం చేసి అక్కడ నుండి ప్రతి రోజూ కూడా ప్రాతఃకాలంలో వినాయకుడికి అర్చన చేసి వివాహ పనులు అన్నీ కూడా పూర్తి చేసుకోండి. మూఢమి వెళ్ళగానే పసుపు కొట్టుకోండి. పసుపు కొట్టుకోవడం అనేది ప్రాంతీయ ఆచారమే. అయితే పసుపు కొట్టుకోవడం విషయంలో తయారు చేసిన పసుపును పెళ్ళిలో వాడవలెను. వినాయకుడికి ప్రథమత కొబ్బరికాయ కొట్టిన తరువాత మొట్టమొదట పసుపు, కుంకుమ, వక్కలు కొనుట ఆచారము.

### ◆ నమస్కారం ఎవరికి పెట్టాలి?

చాలా మంచి ప్రశ్న. మన సంస్కృతి ప్రకారం పెద్దలు, పూజ్యులు గురువులు అందరికీ నమస్కరించి ఆశీర్వచనం తీసుకోవడం శ్రేయస్కరం. అయితే అందరిలోనూ పూజార్హత గమనించి నమస్కరించుట ద్వారా సంస్కారం పెరిగి భక్తి జ్ఞానమార్గాలు అందుకునే స్థాయి వస్తుంది. బ్రాహ్మణులలో అధిక విద్యావేత్త, అందరి చేత నమస్కరింపదగిన వాడు, క్షత్రియులలో వ్యవహారవేత్త, వైశ్యులలో వ్యాపారవేత్తల స్థాయిని బట్టి, శూద్రులలో వయస్సును బట్టి, పెద్ద చిన్న నిర్ణయించి గౌరవం చేయ మని పెద్దల వాదన. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలో "సంధ్యాహీనో శుచిర్నిత్యం అనర్హస్సర్వకర్మసు" అని శాస్త్రవచనం. సంధ్యావందనం చేయని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు మైలవారితో సమానం. కావున సంధ్యావందనం చేయని వారి నుండి ఆశీర్వచనం తీసుకోకూడదు. నమస్కరింపకూడదు. నిదిరించువారు, భుజించువారు, దంతధావనం చేయువారు, స్నానం పూజ చేసుకొనువారికి అసమయాలలో నమస్కరింప కూడదు. ఇక స్త్రీల విషయంలో సౌభాగ్య చిహ్నాములు అయిన పసుపు, కుంకుమ, రెండు చేతులకు గాజులూ, అంచుకలిగిన చీర, తలలో పుష్పములూ, ధరించువారికి నమస్కరింపవలెను. సౌభాగ్యము లేని పెద్ద వయస్సు స్త్రీలకు నమస్కరించు విషయంలో వయోధర్మమే ప్రాధాన్యము. అట్లే , ప్రతి నమస్కారము మరియూ ఆశీర్వచనము చేయు స్థితిలో లేని వారికి నమస్కరింపకూడదు అని శాస్త్రం. అశౌచములో వున్నవారికి నమస్కరించకూడదు. అశౌచములో వున్నవారు ఎవరినీ ఆశీర్వదించకూడదు.

### ◆ షష్ఠిపూర్తి ఎప్పుడు చేసుకోవాలి? ఎందుకు చేసుకోవాలి? ఎలా చేసుకోవాలి?

అరవై సంవత్సరములు పూర్తి అయి అరవై ఒకటో సంవత్సరం నడుచుచుండగా షష్ఠిపూర్తి కార్యక్రమం చేసుకోవాలి. అరవై సంవత్సరములు నిండిన తర్వాత అరవై ఒకటో సంవత్సరం నుండి శేషజీవితం అంతా సుఖమయంగా నడవడం కోసం... నవగ్రహశాంతి, నక్షత్రశాంతి, ఆయుష్యహోమం, వంటివి చేసి, శరీర అరోగ్యసిద్ధికి సూర్య నమస్కారములు, అపమృత్యుంజయహోమం వంటివి చేయుట మరియూ షష్ఠిపూర్తికల్పంలో చెప్పిన రీతిలో దాన కార్యక్రమములు మరియు మంటపారాధనలు చేయడం ద్వారా, జరిగిన అరవై సంవత్సరములూ, చక్కగా జరిగినందుకు కృతజ్ఞతా పూర్వకంగానూ, రాబోవు కాలం అంతా సుఖమయంగా ఉండేందుకు ప్రార్థనాపూర్వకంగా, ఈ షష్టిపూర్తి కార్యక్రమం చేసుకోవాలని పెద్దలు చెబుతారు. ఈ షష్ఠిపూర్తికి అనుగుణంగానే మృత్తికా స్నానములు, పంచగవ్యప్రాసన, వేదపారాయణం వంటివి కల్పంలో చెప్పబడినవి. యిదే రీతిగా డెబ్బై ఒకటవ సంవత్సరంలోనూ, ఎనభై ఒకటవ సంవత్సరంలోనూ, చేయవలసిన కల్పములు కూడా కలవు. వీటికి ఉగ్రరధశాంతి, భీమరధశాంతి, సహస్రచంద్రదర్శనం అని పేర్లు.

### ◆ తలస్నానం ఎప్పుడు చేయవచ్చు? ఎప్పుడు చేయకూడదు?

పురుషులు నిత్యం ఉదయకాలంలో తలస్నానం చేసిన తర్వాత మాత్రమే పూజాదికములు నిర్వర్తించాలి. స్త్రీలు మాత్రం శుక్రవారం మాత్రమే తలస్నానం చేయాలి. స్త్రీలు రోజూ తలస్నానం చేయకూడదు. ఏదేని శుభకార్యములు, వ్రతములూ, చేయురోజు తప్పనిసరిగా తలస్నానం చేయాలి. శరీరమునకు నూనె రాసుకుని అభ్యంగనస్నానం చేయు విషయంలో ఆడవారికి శుక్రవారం, మగవారికి శనివారం విశేషదినములు. భోజనం చేసిన తర్వాత మరియు మధ్యాహ్నం 12 గంటలు తర్వాత అభ్యంగస్నానం చేయరాదు.

### ◆ కాళీ, చండీ వంటి ఉగ్రదేవతల ఆరాధనలు అందరూ చేయవచ్చా?

మీ ఆలోచనలు తప్పు. కాళీ, చండీ, నృసింహ ఉగ్రదేవతలు కారు. వారి యొక్క ఉద్భవం ఉగ్ర కర్మలకోసం జరిగినది. చండీ, కాళి, నృసింహ, వంటి అవతారములు రాక్షస సంహారం కోసం జరిగాయి. రాక్షస సంహారం అనంతరం దేవతలు ఆ మూర్తులను శాంతింపజేసిన తర్వాత అందరూ అర్చించారు. అటువంటి శాంత మూర్తులను మాత్రమే మనం ఆరాధిస్తున్నాం. వారి ఉద్భవ సమయంలో ఎవరూ అర్చించలేదు, భండాసురుని సంహరించుటకు ఉద్భవించిన లలితా దేవిని ఆవిడ ఉద్భవంతోనే అర్చనలు ప్రారంభించారు. అందువలన మనం ఉగ్రదేవతగా అభివర్ణించడం లేదు. అదే కాళీ, నృసింహ అవతారాలు ఉద్భవించడంతోనే యుద్ధం చేశారు. అందువలన వారిని మనం ఉగ్రమూర్తులుగా భావిస్తున్నాం. అది మన పొరపాటే! దేవతలను ఆరాధించు వ్యక్తి యొక్క మనస్తత్వం ఆధారంగానూ, అతని ఆలోచన ప్రకారం ఉగ్రం, సౌమ్యం, అని దేవతల యొక్క తత్వాలను వర్గీకరించడం తప్పు. అందరు దేవతలు పూజాకార్యంలో సౌమ్యమూర్తులే! అనుగ్రహ మూర్తులే!

### ◆ రికమండేషన్ తో దైవదర్శనం చేయడం ఎంతవరకు మంచిది ?

దైవ దర్శనానికి రికమండేషన్‌తో వెళ్ళాలి అనే ఉద్దేశ్యంతో వున్నవ్యక్తి దేవుని దర్శనంకోసం కంటే, రికమండేషన్ చేసేవాడికోసం ఎక్కువగా దృష్టి వుంచాల్సి వుంటుంది. దేవాలయంలో దేవుని ఎదుట ఒక్క అరగంటమాత్రమే గడుపగలుగుతాడు. కానీ రికమండేషన్‌కోసం ఎక్కువ సేపు దృష్టి వుంచుతాడు. అలాగే దేవుడికి కూడా తన సన్నిధిలో ఎక్కువగా వేచివుండే భక్తులే నిజమైన వి.ఐ.పి.లు కానీ, వి.ఐ.పి. లైన్లో వెళ్ళేవారు వి.ఐ.పి. లు కారు. లైన్లో ఎక్కువ సేపు నిలబడి భగవన్నామం చేసుకుంటూ దైవదర్శనం ఒక్కనిముషంలో ముగించినా అది విశేషమైన ఫలితాన్ని యిస్తుంది. వి.ఐ.పి. లైన్లో వెళ్ళేవాళ్ళు నిజమైన భక్తులకు అవరోధం కలుగచేయువారు. వారిని పురాణ కాలంలో భక్తులకు అవరోధం కలిగించిన రాక్షసులతో పోల్చవచ్చును.

మరలా ఆ రాక్షస సంహారం బాధ్యతకూడా ఆ భగవంతుడే స్వీకరించవలసి వుంటుంది. భగవద్దర్శనంకోసం మామూలు లైన్లో నిలబడిన భక్తులు, వి.ఐ.పి. లకు శాపాలు పెడుతూనే వుంటారు. మీరే ప్రత్యక్షంగా పరీక్షించుకోవచ్చు. రాజరికాలు వున్నవారు, సన్యాసులు, వారికి మాత్రమే మామూలు భక్తులతో కాకుండా విడిగా వెళ్ళి దర్శనం చేసుకునే హక్కు వున్నది.

**◆ వేదధర్మాన్ని ఆచారించే వ్యక్తులకు జీవనం విషయంలో లోటు రాదంటారు. ఎందుకు?**

వేదంద్వారా శాస్త్రాలలో చెప్పబడిన ధర్మాలు పాటించే వారికి కష్టాలు వుండవు. ఉదా:–ప్రతి మనిషి అనుబంధానికిలోనై కష్టాలు పొందుతాడు. ప్రతి మనిషికి విద్య, భోజనం అవసరం భోజనం సంపాదించు కోవడం అలవాటు అయితే, వాడికి సామాన్యంగా ఇక సమస్యలు వుండవు. అలా భోజనం సంపాదించుకొవటం కూడా చిన్న నాటి నుండే అలవాటు చేస్తుంది వైదిక ధర్మం. "భిక్షాచర్యం చర – ఆచార్యా ధీనోభవ" అని వేదంతెలిపింది. "గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత". ఎనిమిదవ సంవత్సరంలో ఉపనయనం చేసి ఆచార్యుని అధీనంలో విజ్ఞాన ఆర్జన చేయుటకు వెళ్ళిన వ్యక్తి అనుబంధాలకు లొంగడం జరగదు. అలాగే అతడు భిక్షాటన ద్వారా ఆహర సంపాదన అలవాటు పడిజీవనం భయంలేకుండా చేస్తాడు. అందుకే వేదధర్మాలను ఆచరించేవాడికి లోటు రాదు. భయంలేదు. నేటి సమాజంలో "సంపాదన కూడా విద్యయే" అనేది తెలియక దాన్ని చిన్ననాటి నుండి అలవాటు చేయక 22 సంవత్సరాల నుండి సంపాదన అనే విద్య అలవాటు చేయడం తప్పు అని నా ఉద్దేశ్యం. అందుకే వృత్తి విద్యా కోర్సులు తప్పనిసరి చేయాలి. కొంత వయస్సు వచ్చినది మొదలు సంపాదించుకుంటూ చదువుకొవటం అలవాటు చేయడం మంచిది.

**◆ నవగ్రహాలకు గర్భాలయాలు వుండవు ఎందుకు?**

నవగ్రహాలకు విడివిడిగా ఆలయాలు కట్టేటట్లుయితే గర్భగుడి కట్టవచ్చు. అరసవిల్లి సూర్యనారాయణుడు అలాగే వున్నాడు కాదా! తమిళనాడులో వైదీశ్వరన్ కోయల్ దగ్గర నవగ్రహాలకు నిడిగా గర్భాలయాలతో ఆలయాలున్నాయి. నవగ్రహాలు ఒకపీఠంమీద నిర్మాణం చేసినప్పుడు ఆ విగ్రహాలు అష్టదిక్కులకు అభిముఖంగా వుంటాయి. అలా వున్నప్పుడు గర్భాలయ నిర్మాణం చేయరాదు. కారణం గర్భాల యంలో వున్న ఏ విగ్రహాన్ని అయినా సరే భక్తులు ఎదురుగా వుండి చూచునటుల విగ్రహాలు ఏర్పాటు అవుతాయి. మరి నవగ్రహాలలో సూర్యశుక్రులు మాత్రమే భక్తుడికి అభిముఖంగా వుండి మిగిలినవి వేరువేరు దిక్కులలో వుంటాయి. కావున వాటిని దర్శించుటకు భక్తుడు విగ్రహం దగ్గరకు వెళ్ళవలసిందే ! లేనిదే ఆ పీఠం మీద మిగి లిన విగ్రహాలు దర్శనీయం కావు. అందువలన భక్తులందరూ లోపలకు వెళ్ళాలంటే

గర్భాలయం లాగా నిర్మాణం చేస్తే ఆగమ ధర్మాలకు విరోధం అవుతుంది కావున ఒక పీఠంమీద తొమ్మిది విగ్రహాలు (నవగ్రహాలు) వుంచినప్పుడు గర్భాలయాలు నిషేధమే!

## ◆ కలిలో సన్యాసాశ్రమం నిషేధమా?

అయ్యా! సన్యాసాశ్రమం నిషేధమైతే శంకరాచార్యులవారు, విద్యారణ్యస్వామి వారు మనకంటే విద్య తక్కువ వారు కాదు కదా! వారు సన్యాసం తీసుకొని వారి తర్వాత తరాల వారు సన్యాసాశ్రమం వైపు మళ్ళే లాగ చేసారు. మరి నేడు కూడా వారి పరంపరలో పీఠాలు, పీఠాధిపతులు వారి శిష్యులుగా సన్యాసులు (యతీశ్వరులు) వస్తున్నారు. మరి మనకంటే వారు ఆర్శ్యవిజ్ఞానం మీద ఎక్కువ జ్ఞానం వున్నవారే కదా! వారు తీసుకోవడం తీసుకున్నాక ఇంకా విద్యాశోధన చేయడం అందరికీ వాటి మీద విజ్ఞానం కలిగేలాగ ఉపన్యసించడం కొత్తవారికి సన్యాస దీక్ష ఇవ్వడం చేస్తున్నారంటే కలిలో సన్యాస దీక్ష అవసరం తప్పులేదు అనేటువంటి వాదన కూడా గ్రంథస్థంగా ఉండి ఉంటుంది. మనకు అంతటి పరిజ్ఞానం లేని కారణంగా మనం తెలిసిన నాలుగు మాటలే శాస్త్రం అనుకుంటున్నాం అది తప్పు. ఇంకా శోధిద్దాం. తెలుసుకుందాం. కలిలో సన్యాసాశ్రమం నిషేధం కాదని శృంగేరి, కంచి వారిని అనుసంరించిన యతీశ్వరులను బట్టి తెలియచున్నది.

## ◆ అభాండములు తొలగాలి. అభాండములు రాకూడదు అనుకుంటే ఏ అనుష్ఠానం చేయాలి? మరి సంఘంలో ప్రాముఖ్యత పొందాలి అంటే ఏ అనుష్టానం చేయాలి?

అభాండము అంటేనే ఏమీ ప్రమేయంలేని విషయంలో మాటపడడం. ఈ అభాండం ఎవరు వేస్తారు? జరిగిన యదార్థం ఏమిటో తెలియనివారు. మరియు యదార్థం గురించి తెలుసుకునే ప్రయత్నం చేయలేని మూర్ఖులు, తెలియక ఏ విషయం గురించి మాట్లాడినా వారిని ‘ అజ్ఞాని’ అంటాం. మరి అజ్ఞానులను, మూర్ఖులను గురించి చింతిస్తే మనం ఇంకా ‘దిగజారిన వారం’ అవుతాము. కావున వాటిని పట్టించుకోకూడదు. రామావతారంలో సీతగూర్చి పట్టాభిషేకం తర్వాత జనాపవాదం విని రాముడు సీతను మరలా అరణ్యాలకు పంపాడు. అయితే అది “ధర్మకార్యం”. అలాగే కృష్ణావతారంలో శమంతకమణి అపహరణ విషయంలో వచ్చిన అపవాదు గూర్చి కృష్ణుడు జాంబవంతుడితో యుద్ధం చేయలేదా? అంటే అది “విధిలీల”, వారికి క్షాత్ర ధర్మం కూడా అందులో ముడిపడియున్నది. అయితే సామాన్య మానవులు అభాండములు, అపవాదులు విని సరిచేసుకోవాలి అనుకుంటే అధిక శ్రమ పొందుతారు. క్షత్రియ ధర్మం ప్రకారం ప్రభువులు అపవాదులు అభాండములు రాకుండా, లేకుండా జీవనం చేయాలి. అయితే అసలు మానవులందరూ అభాండములు లేని జీవితము గడపాలి అంటే సూర్య ఆరాధన చాలా విశేషమయినది. జ్యోతిషశాస్త్ర ప్రకారం సంఘంలో

అధిక గౌరవ మర్యాదలను యిచ్చేవాడు ‘ రవి’. అందువలన నిత్యం సూర్య ఆరాధన చేస్తూవుంటే అభాండములు లేకుండా మంచి గౌరవ మర్యాదలతో జీవనం చేయ వచ్చును. సూర్య ఆరాధనలో సంవత్సర దీక్ష విశేషం. నిత్యం సూర్యోదయ, అస్తమయ కాలంలో నిదిరించుట పనికిరాదు. ఆ సమయంలో భుజింపరాదు. ఇల్లు శుభ్రంగా వుంచాలి. ప్రతి ఆదివారం ఏకభుక్తము, బ్రహ్మచర్యము, విశేషము. యిలా సూర్యుని వ్రత నియమాలు పాటించాలి. అలాగే రోజూ 12 సార్లు ఆదిత్య హృదయం పారాయణ చేసిన వారికి ఆరోగ్యం, ఐగశ్వర్యం, సంఘంలో గౌరవ మర్యాదలు పెరుగుతాయి. నిత్యం శ్రీకృష్ణుని శమంతకోపాఖ్యానం పారాయణం చేయడం వలన అభాండాలు జరుగుతాయి.

### ◆ శుక్రవారం నిశ్చితార్థం, వివాహం చేయకూడదా?

జ్యోతిష్య ధర్మ శాస్త్రజ్ఞులు ఎవరూ కూడా శుక్రవారం విషయంలో నిషేధం చెప్పలేదు. అంతేకాక శుభగ్రహ ఆధిపత్యం ఉన్న పూర్ణేందువారము, బుధవారం, గురువారం, శుక్రవారం చాలా విశేషమని చెప్పారు. అందువలన శుక్రవారం గురిం చిన అపోహమాత్రమే అప్పగింతలు శుక్రవారం చేయకూడదు, అని కొందరు వాదిస్తారు. అదికూడా సరికాదు. కారణం అప్పగింతలు అనేది వేడుక, అంతేకానీ శాస్త్రం కాదు. యిక శుక్రవారం వివాహ నిశ్చితార్థం విషయాలు కూడా “ పసుపు కుంకుమ శుక్రవారం పెట్టవచ్చా? అని కొందరివాదన. శ్రావణ శుక్రవారం నోములు నోచు కుంటూ పసుపుకుంకుమ పెడుతూ వుంటే లేని ఆలోచన శుక్రవారం నిశ్చితార్థం విషయంలో ఎందుకు అక్కర్లేని వాదన? మన సంస్కృతిలో మన యింటికి వచ్చిన ప్రతి సువాసిని స్త్రీకి పసుపు కుంకుమ పెట్టిపంపాలి. అది సౌభాగ్య వృద్ధి. మనం ఎవరింటికి వెళ్ళినా పెట్టించుకురావాలి. అలా చేయడం సౌభాగ్యవృద్ధి, మరియు మంగళ కరము. అయితే శుక్రవారము మాత్రం మన యింటికి వచ్చిన ఆడపిల్లలను పంపకూడదు. అంతవరకే పట్టింపు. వివాహమునకు చెప్పబడిన ప్రతినియమం నిశ్చితార్థమునకు కూడా వర్తిస్తుంది. ఆడపిల్ల ప్రయాణ విషయానికున్న శుక్రవారం నియమ పట్టింపులను దీనికి వర్తించకూడదు.

### ◆ “ధనము,నగలు, ఆహార ధాన్యములు వంటివి విసిరివేయకూడదు” అంటారు. అలాచేయుట తప్పా?

ధనమూ, నగలు, ఆహార ధాన్యములు, ఇవి అన్నీ ఐశ్వర్యం అని అంటారు. ఐశ్వర్యం అంటే లక్ష్మీప్రదం. భారతీయ సంస్కృతిలో అమ్మవారి అనుగ్రహం వుంటే కానీ ఇటువంటి ఐశ్వర్యాలు లభింపవు అని పెద్దలవాదన. లక్ష్మీ అనుగ్రహంతో లభించిన ఈ ఐశ్వర్యాలను విసిరివేయడం అంటే లక్ష్మీదేవిని వద్దనుకోవడమే. అలా లక్ష్మీదేవి ప్రసాదం వద్దనుకునేవారికి దరిద్రం లభిస్తుంది. సౌభాగ్యం నశిస్తుంది.

రామాయణంలో కైకేయి ఒకసారి "రాముణ్ణి అరణ్యములకు పంపుట,భరతుని రాజ్య పట్టాభిషేకం చేయుట, అనే కోరికలు కోరుకునే నిమిత్తంగా అవిడ తన ఆగ్రహా వేశాలతో ఒంటిమీదనున్న నగలు విసిరేసినట్లుగా రామాయణంలో వున్నది. మరి అమ్మవారికి ఆగ్రహం వచ్చిందేమో? కైకేయి ప్రవర్తన ప్రభావంగా దశరథుని మరణం, తద్వారా కైకేయికి సౌభాగ్యలక్ష్మి దూరమైనది. మీరు అడిగిన పై మూడు కాకుండా పనిముట్లు, వంటసామాగ్రి, యిలా ఏ వస్తువు అయినా అమ్మవారి అనుగ్రహం ఉంటేనే వాటిని వాడుకోగలుగుతాం. అందువలన మనం అనుభవిస్తున్న ప్రతి వస్తువును ఆగ్రహంతో చూడకూడదు. విసురుట,కాళ్ళతో తన్నుట, వంటి ద్వారా వాటిని అనుభవించలేని దరిద్రం మరొకరూపంలో ప్రారంభమవుతుంది.

◆ **సర్వేజనాఃసుఖినోభవన్తు....లోకాః సమస్తా స్సుఖినోభవంతు...అని ఎందుకు కోరుకోవాలి.?**

లోకంలో మనం బాగుండాలి, బాగున్నాం! అనుకోకండి, మన చుట్టు ఉన్న సంఘం కరువు దరిద్రములతో బాధపడుతున్నారు అనుకుందాం, వారి దృష్టి ఎలా వుంటుంది. దరిద్రంలో వున్న ప్రజలు వారి కనీసావసరాలు తీర్చుకోవడం కోసం దోపిడీలకు, దొంగతనాలకు అలవాటు పడే అవకాశం వున్నది. వారు అలా ప్రవర్తించడం వలన" వారు మన మీదకు దోపిడీకి వచ్చే అవకాశం వున్నది." అనే భయంతో మనం జీవించాల్సి వుంటుంది. అందువలన మన చుట్టూ వున్న సంఘం బాగుంటే మనకు ఎటువంటి ప్రమాదాలు, భయాలు, ఉండవు. 'సత్సంగం' సంఘస్సత్సు విధీయతాం"- సత్సంగత్వే నిస్సంగత్వం" ఇలా ఎన్నో వాక్యాల గూఢార్థాలు కూడా యివే. అందుకోసమే "సర్వేజనా సుఖినోభవంతు, లోకా సమస్తా స్సుఖినోభవంతు" అని కోరుకోవాలి.

◆ **విధినిర్వహణలో లోపం చేయటం ద్వారా వచ్చే నష్టాలు ఎలా వుంటాయి?**

చేసిన తప్పులకు సమానమయిన శిక్షలు భూమిమీదనే అనుభవించే అవకాశం వున్నది. ఒకసారి మహాభారతం పరిశీలించండి. చక్రవర్తి అయన ధృతరాష్ట్రుడు ఒక పెద్ద విధినిర్వహణ లోపం చేశాడు. తన కుమారుడు పాండుకుమారులను చంపు ప్రయత్నాలను అడ్డుకోలేదు.చక్రవర్తి, సర్వాధికారి అయిన తను అడ్డుకోని కారణంగా తన కుమారులు 100 మంది ధృతరాష్టుడు బ్రతికుండగానే చంపబడ్డారు. అదే భగవంతుడు వేసిన శిక్ష. ఇదేరీతిన వృత్తిరీత్యా చేసిన తప్పులకు సమానమైన శిక్షలనే అనుభవింపవలసి వస్తుంది.

◆ **ఆడవారు అందరూ ధరింపదగిన రత్నాలు ఏవి ఉన్నాయి.?**

పూర్వం ఆడవారు ముత్యం,పగడం,నల్లపూసలు, రవ్వలు, (వజ్రాలు) సౌభాగ్యప్రదము అని తప్పనిసరిగా ధరించాలి అని పెద్దలు చెబుతుండేవారు. ఉన్నతమైన వస్తుధారణ ప్రభావంగా ఐశ్వర్య ప్రాప్తికలుగుతుంది. వజ్రపు ముక్కుపుడక, వజ్రపు కర్ణాభరణములు,

అలంకరణ విషయములో ప్రత్యేకతను పొంది వుండేవి. అలాగే పగడాలు, ముత్యాలు, సౌభాగ్య హేతువులు అందువలన వీటి ధారణ విషయంగా జాతకం చూసేవారు కాదు. నేటికీ ప్రాచీన సాంప్రదాయం నడిపే కుటుంబాలలో ఆడవారి మంగళసూత్రాలలో, నల్లపూస, పగడం,ముత్యం, వేసి తాడుకట్టుకునే అలావాటు మనం చూడవచ్చు. నేటి సమాజంలో నవరత్నాలు పిచ్చి ఎక్కువ అయి సమాజంలో ఆడవారికి పగడం,ముత్యం, వజ్రం, ద్వారా వచ్చే సౌభాగ్య వృద్ధి గూర్చి తెలిపేవారు కరువయ్యారు.

**◆ కార్యసిద్ధికోసం ఏమి పూజలు చేయాలి?**

సర్వదా గణపతి ఆరాధన అన్నిరకములయిన అవాంతరాలను తొలగించి కార్యసిద్ధిని కలుగచేయును. ఎటువంటి కార్యములనైనను సంకల్పం చేసిననాటినుండి కార్యం పూర్తి అయ్యేవరకు రోజూ గరికతో గణపతిని అర్చిస్తే సర్వదా కార్యలాభం చేకూరుతుంది. శత్రువులు బాగా అడ్డం వస్తున్నారు అనే సందర్భంలో అంజనేయ, చండీ, నృసింహ, దుర్గా ఆరాధనలు చేయవలసి వుంటుంది. శక్తిని మించిన కార్యం తలపెట్టినప్పుడు దుర్గా ఆరాధన చేయడం అత్యావశ్యకము.

**◆ వర్షాభావం, వాతావరణం సమతుల్యతను కోల్పోవడం వంటి వాటిపై సమాజంలోని మనుజులకు మంచి సలహా యివ్వండి..?**

1.బిల్డింగ్ శ్లాబ్ వేసుకునేవారు :- "మన శ్లాబ్ రోజున వర్షం పడకుండా వుండి మన శ్లాబ్ కార్యక్రమం నిర్విఘ్నంగా సాగాలి" అని దేవాలయాలలో కొబ్బరికాయలు కొడతారు. 2. యింట్లో ఏదేని శుభకార్యం తలపెడితే ఆ శుభకార్యం రోజున వర్షం రాకుండా వుంటే బాగుంటుంది అని కోరుకుంటారు. 3. ఆహార ధాన్యం నిల్వ చేసి వ్యాపారం చేసే వారు ఈ సంవత్సరం వర్షాలు తక్కువ అయితే వారి దగ్గర నిల్వకు గిరాకీ వుంటుంది, అనే కోరికతో వర్షం రాకుండా వుంటే బాగుంటుంది అని కోరుకుంటారు. 4. ఉద్యోగులు, మార్కెటింగ్ ఉద్యోగులు, వాహనాలు నడిపేవారు యిలా చాలా వర్గాలవారు తమ కార్యక్రమాలకు వర్షం అడ్డం రాకుండా వుంటే బాగుంటుంది, అని అనుకుంటారు. ఇలా ఎందరో తమస్వార్థం కోసం వర్షాన్ని రాకూడదు అని కోరుకునే ప్రజలు సమాజంలో ఎక్కువయ్యారు. అందువలన వర్షం కావాలి అని కోరుకునే వర్గం కంటే వర్షం రాకూడదు అని కోరుకునే వర్గం పెరిగింది. కావుననే వాతావరణం సమతుల్యత కోల్పోయింది. వర్షాభావం ఎక్కువయ్యింది. ప్రజలు వారివారి కోరికలతో వర్షం విషయంలో చేస్తున్న తప్పులు తెలుసుకుని ప్రవర్తిస్తే త్వరలోనే సకాలంలో మంచి వర్షాలకు అవకాశం వుంది.

**◆ పూజ ప్రారంభమునకు ముందు పాటించవలసిన కనీస నియమాలు తెలపండి.**

మగవారి విషయంలో నిత్యం తలస్నానం చేసి పూజకు ఉపక్రమించాలి అనే నియమం వుంది. ఆడవారు కేవలం శుక్రవారం తలంటు పోసుకోవాలి. మిగిలిన

రోజులలో పసుపునీళ్ళు నెత్తిన చల్లుకోవాలి. పూజకు ప్రత్యేక వస్త్రం ప్రతిరోజూ ఉతికి ఆరవేసుకోవాలి. పూజకు ఉపక్రమించినది మొదలు పూజ అయ్యేవరకు మనకు కావలసిన సామాగ్రి ముందుగానే ప్రక్కనే వుంచుకోవాలి. పూజ మధ్యలో లేవకూడదు. మరియు యితర విషయాల గురించి చర్చించకూడదు. దీపారాధన, నివేదన, భక్తిలేని పూజలు వ్యర్థం. ఆసనం వేసుకొని కూర్చోవాలి. మనకంటే వున్నత ఆసనం మీద దేవుడు వుండాలి. పూజా సమయంలో యితరులకు నమస్కరించరాదు. మగవారు శైవులు విభూతి, వైష్ణవులు నామం పెట్టుకోకుండా పూజ చేయరాదు. ఆడవారు నుదుట కుంకుమ, కాళ్ళకు పసుపు లేకుండా పూజ చేయరాదు. కావున పసుపు కుంకుమ ధారణ స్త్రీలకు తప్పనిసరి. పూజా సమయంలో ఆడవారు బొట్టుబిళ్ళలు ధరించుట శ్రేయస్కరం కాదు. పూజ చేసిన తరువాత ఆసనం తీయకపోయినా, నిద్రనుండి లేవగానే పక్కబట్టలు తీయకపోయినా దరిద్రం వస్తుంది. అని పెద్దలు చెబుతారు.

### ◆ వృత్తి ధర్మం సక్రమంగా ఆచరించడంకూడా అనుష్ఠానం అవుతుందా?

ఒకే విషయాన్ని పదే పదే చింతన చేయడాన్ని అనుష్ఠానం అంటారు. అది మంచి విషయం అయినా అవ్వవచ్చు, లేదా చెడు విషయం అయినా అవ్వవచ్చు. అనుష్ఠానం ఎప్పుడు ఫలిస్తుంది అంటే మన దృష్టిలో మార్పు లేకుండా మనం ఏదేని అనుష్ఠానం చేయడం వలన అనుష్ఠానం సిద్ధిస్తుంది. అలాగే వృత్తి విషయాలలో దృష్టి మార్పు లేకుండా వుండి వృత్తి ధర్మాన్ని పాటిస్తే అదే అనుష్ఠానం అవుతుంది. అది సత్ఫలితాలను యిస్తుంది. క్రమశిక్షణ, న్యాయమార్గం తో జీవనం, దుష్ట స్వభావం లేకుండా వుండి చేయు ప్రతి నిత్య కృత్యం అనుష్ఠానమే అవుతుంది.

### ◆ మేము దీర్ఘకాలం యాత్రలకు వెళ్ళాలి, అప్పుడు యింటిలోని దేవతా విగ్రహాల స్థితి ఏమిటి?

దేవతార్చన, దేవతా యంత్రాలు, దేవతా విగ్రహాలు నిత్యం దీప,ధూప, నైవేద్యాలతో అర్చించిన కొలదీ అవి శక్తివంతమయి వుంటాయి. అయితే సాంసారిక జీవనంలో వున్నవారు, గృహస్థ ధర్మం ఆచరించే సందర్భంలో భాగంగా బంధువుల ఇండ్లకు, శుభాశుభ నిమిత్తంగా ప్రయాణం చేయవలసి రావడం, తీర్ధయాత్రలు చేయవలసి రావడం జరుగుతూ వుంటుంది. అటువంటి సంర్భంలో దేవతా విగ్రహాలు, దేవతా యంత్రాలను, దేవతార్చునలను బియ్యం డబ్బాలో పెట్టి మూతవేసి వుంచి, తిరిగి వచ్చిన తరువాత వాటికి సంప్రోక్షణ చేసి, ప్రాణ ప్రతిష్ఠ చేసి యదావిధిగా నిత్యం దీప, ధూప, నైవేద్యాలతో అర్చించుకొనవచ్చును. యిది పెద్దలు ఏర్పరిచిన ఆచారము. ప్రయాణమునకు వెళ్ళేటప్పుడు దేవతార్చన, దేవతా విగ్రహాలు, దేవతా యంత్రాలను వుంచిన బియ్యముతో వంట చేసి దేవతా నివేదన చేయుట ఆచారముగా వున్నది.

### ◆ జీర్ణమయిన దేవతా పటములను, ఫొటో ఫ్రేములు దేవతా విగ్రహములను ఏమి చేయాలి?

జీర్ణమయిన పటములు, విగ్రహముల వంటి వాటిని పూజలో వుంచ కూడదు. రంగులు వెలసి పోయిన పటములు మరియు విరిగిపోయిన విగ్రహములు కూడా పూజలో వుంచరాదు. అటువంటి వాటిని జీవ నదిలో కలిపివేయుట లేదా దేవాలయములలో అప్పగించుట చేయవలెను.

### ◆ ప్రయాణమునకు ముహూర్తము కుదరకపోయినచో ఏమి చేయవలెను?

రోజువారి ప్రయాణములు, వుద్యోగరీత్యా ప్రయాణములు, ప్రమాద స్థలములకు వెళ్ళవలసి వచ్చినప్పుడు ముహూర్తాల కోసం వెదకనవసరం లేదు. అంతే కాకుండా ప్రభుత్వ విషయంగా, ఆరోగ్య విషయంగా, వృత్తి విషయాలలోను ప్రయాణానికి ముహూర్తములు వెతకవలసిన అవసరం లేదు. కేవల వర్జ్యము, దుర్ముహూర్తము మాత్రమే చూసి అవిలేని సమయంలో ప్రయాణం చేయవచ్చును. ప్రయాణమునకు ముందు భగవన్నామ స్మరణ, మంచి శకునములు, భగవద్దర్శనం తో ముహూర్త దోషాలు పోతాయి. ప్రయాణం రోజున తిథి, వార, నక్షత్రములు కుదరకపోతే, అత్యవసరంగా ప్రయాణం చేయవలసి వస్తే హనుమానంజనాసూనుః వాయుపుత్రో మహాబలః, రామేష్టఃఫల్గుణసఖః పింగాక్షో మితవిక్రమః, ఉదధిక్రమణశ్చైవ సీతా శోక వినాశకః, లక్ష్మణ ప్రాణదాతాచ దశగ్రీవశ్చ దర్పహా పారాయణ చేసుకుంటూ ప్రయాణం చేయండి. సుఖ ప్రయాణం జరుగుతుంది. గర్భవతుల విషయంలో ఆషాఢ, భాద్రపద, మౌఢ్య, కర్తరీ దోషాలు ప్రయాణానికి చూడనవసరం లేదు.

### ◆ లక్షవర్తి వ్రతం నియమాలు ఏమిటి?

“నారీణాంగోప్య పాపానాం రజస్సంపర్క జానీచ తాసాం ముక్తిప్రదం గుహ్యం వ్రతం బ్రూహి మహామతే” అని ఋషులు అడిగిన ప్రశ్నకు సూతమహాముని చెప్పిన వ్రతం ఈ లక్షవర్తి వ్రతం. స్త్రీలకు పరగృహవాసము, భర్తృ తిరస్కారము, భ్రూణహత్య, గర్భభేదము, పరపురుషవాంఛ, అసత్యభాషణ, పరవంచన, క్రూరత్వము, లోభితనము మొదలగు దోషములు నశించుటకు ఈ లక్ష వర్తి వ్రతము ఆచరించాలి. యిది పరమేశ్వరుడు పార్వతికి ఉపదేశించిన వ్రతము. స్కంద పురాణ ఉమా మహేశ్వర సంవాదం లోనిది ఈ ఘట్టము. ఆషాఢ శుక్ల ఏకాదశి, కార్తీక శుక్ల ఏకాదశీ, వైశాఖ శుక్ల ఏకాదశీ, చైత్ర, మాఘ శుద్ధ ఏకాదశులు దీనికి విశేషములు. లక్ష్మీ నారాయణ పూజ, నారాయణాష్టాక్షరీ మంత్ర జప తర్పణలు ఈ వ్రతమునందలి విశేషము. లక్ష వర్తులు ఈ వ్రతము చేయుటకు అవసరము. ఋతుక్రమం అయి పోయిన స్త్రీలు మాత్రమే ఈ వ్రతమును ఆచరించవలెను. కాంస్య పాత్ర, బంగారు కొమ్ములు, వెండి గిట్టలతో కూడిన ఆవు దూడను దానమిచ్చుటే గాక, శక్త్యానుసారం

దశ దానములు చేయుట, మంచిది. అంతే కాక ఈ వ్రత ఆచరణ ఒకటే కాకుండా "లక్ష వర్తి వ్రతస్యాస్స నారీవా పురుషోపివా సహాయం యదివాకుర్యాత్స్వర్గం గచ్ఛతి నిశ్చితమ్"। లక్ష వర్తి వ్రతం చేసుకునేవారికి సహాయ సహకారము చేసిన వారికి కూడా స్వర్గ ప్రాప్తి, విష్ణులోక సాయుజ్యము కలుగును.

### ◆ కవలలకు వివాహం ఒకసారే చేయాలా?

కుదిరితే చేయుట విశేషమే. వివాహమునకు ముందు చేయవలసిన ప్రతి క్రియ ఉపనయన, అన్నప్రాశన, అక్షర స్వీకారం వంటివి అన్నీ ఒకరోజే ఒక ముహూర్తంలోనే చేయాలి. వివాహం మాత్రం కుదిరితే ఒకేసారే చేయాలి. లేకపోతే విడిగా అయినా చేయవచ్చు. అంతేకాక కవలలో భూమి మీదకు వచ్చిన మొదటి సంతానము చిన్నవారు అవుతారు. రెండవ సారిగి భూమి మీదకు వచ్చినవారు పెద్దవారు అవుతారు.

### ◆ వాస్తు మానవ జీవితం పై ఏ ప్రభావం చూపుతుంది?

స్థానబలం లేనిదే మనం చేయు ఫలితాలు సక్సెస్ అవ్వడం శ్రమ యుక్తం అవుతుంది. అయితే జాతకరీత్యా వున్న ఫలితాలు వాస్తు కానీ, మరొకటి కానీ మార్చలేవు. వివాహం, సంతానం, మరణం, పితృమరణం, మాతృవియోగం వంటి వాటి యొక్క సమయములు పొరపాటున కూడా వాస్తు మార్చలేదు. వాటిని పొందే విషయంలో సుఖము, దుఃఖము కలుగజేయు అంశాలలో వాస్తు ప్రభావం ఉంటుంది. మన దశ బాగా వుంటే అది తేలికగా మనం అనుభవించడానికి వాస్తు తోడ్పాటు అవు తుంది. దశ బాగా లేకపోతే వాస్తు ఏమీ చేయలేదు. దశ బాగా లేకపోతే మంచి వాస్తు ప్రభావంగా రక్షణ పొందవచ్చు. కానీ యోగం మారదు. ఒక ఉదాహరణ చూద్దాం. ప్రతి మనిషికీ పుట్టగానే జాతక ప్రభావంగా ఏ ఉద్యోగం చేస్తారు, ఎప్పుడు చేస్తారు అనేవి నిర్ణయింపబడివుంటాయి. అయితే వాస్తు బాగా లేని యింట వుండడం ప్రభావంగా ఆ ఉద్యోగం వచ్చే రోజుకంటే ఎక్కువ కాలం ముందుగా ప్రయత్నాలు ప్రారంభించి చాలా ప్రయత్నాలు చేసి చివరకు ఆ జాతక రీత్యా వ్రాసివున్న రోజున అదే ఉద్యోగం అందుకుంటారు. ఈలోగా చాలా మానసిక శ్రమ శారీరక శ్రమ చేస్తారు. దీనికి కారణం వాస్తు బాగా లేకపోవడమే. అదే మంచి వాస్తు వున్న యింట నివాసం వుంటే మనకు సక్సెస్ అయ్యే రోజుకు దగ్గర్లో ప్రయత్నాలు ప్రారంభించడం ప్రశాం తంగా ప్రయత్నించడం, చాలా శాంతంగా అదే ఉద్యోగం పొందడం జరుగుతుంది. వాస్తు బాగా వున్నా లేకున్నా జాతక రీత్యా వున్న రోజున, అదే ఉద్యోగం పొందడం జరుగుతుంది. వాస్తు జాతక యోగాలని మార్చలేదు. అలాగే రత్నాలు కూడా జాతక యోగం మార్చలేవు. జాతక యోగం మార్పు చేయుట దైవానికే సాధ్యం. అందుకే దైవారాధన నిత్యం చేయండి. ఒక ఉదాహరణ చెపుతాను. ఎవరికైనా ఒకరికి 2018

అక్టోబరు 10న పెళ్ళి అని జాతక రీత్యా వ్రాసి ఉంటే వారు వాస్తు ప్రకారంగా ఉన్న ఇంట్లోయైనా, వాస్తు ప్రకారంగా లేని ఇంట్లోయైనా నివాస ప్రభావం పెళ్ళి డేటును మార్చదు. వాస్తు ప్రకారం ఉన్న ఇంట్లో ఉంటే అతి తక్కువ సంబంధాలు చూసి మానసిక శ్రమ లేకుండా పెళ్ళి చేసుకుంటారు. వాస్తు తేడా ఉన్న ఇంట్లో ఉంటే ఎక్కువ సంబంధాలు చూసి పెళ్ళి కాదేమో అని భయం పొంది ఎన్నో శాంతులు చేయించుకొని చివరకు 2018 అక్టోబరు 10న పెళ్లి చేసుకుంటారు. వాస్తు జాతకంలోని ఈవెంట్ టైమ్‌ను మార్చలేరు. మరొక ఉదాహరణ వాస్తు ప్రకారం ఇల్లు కట్టుకున్నామని ఆయుర్దాయం పెరగదు. వాస్తు ప్రకారం ఇల్లు లేదని ఆయుర్దాయం తగ్గదు.

◆ **యిల్లు పూర్తి కాలేదు. దీర్ఘకాలం గృహప్రవేశ ముహూర్తాలు లేకపోతే ఏం చేయాలి?**

మీ ప్రశ్న పూర్తి కాలేదు. అయితే మీ ప్రశ్నలో ఆంతర్యాన్ని బట్టి గృహమునకు పై కప్పు చుట్టూ గోడలు, దర్వాజాలకు(బయటకు వున్నవి) తలుపులు వుంచితే గృహప్రవేశమునకు ఆ యిల్లు సిద్ధం అయినట్లే. కమర్షియల్ కాంప్లెక్స్‌ల విషయంలో స్లాబ్ వేయుట ద్వారానే దానికి గృహప్రవేశం చేయు అవకాశం వచ్చినట్లు. అయితే యిలా అసంపూర్తిగా వుండగా మంచి ముహూర్తం దగ్గర్లో లేదు అనుకున్నప్పుడు గృహప్రవేశంచేసి, తర్వాత మిగిలిన కట్టుబడి పూర్తి చేయవచ్చు. నివాసగృహం విషయంలో మూడు నిద్రలు తప్పకుండా చేయాలి. కమర్షియల్ కాంపెక్స్ విషయంలో మూడు నిద్రలతో సంబంధం లేదు. అయితే నివాసగృహం విషయంలో అయినా కమర్షియల్స్ కాంప్లెక్స్ విషయంలోనైనా ఒక నియమం వున్నది. గృహప్రవేశం అయినది మొదలు ఆ యింట దీపారాధన రోజూ చేస్తూవుంటే ఎప్పుడయినా పునః ప్రవేశం చేయవచ్చు. మరలా ఆ యింట ప్రవేశానికి మూఢమి అధికమాసములు వంటివి పట్టింపులేదు. ఒకవేళ గృహప్రవేశం రోజునుండి దీపారాధన చేయుట కుదరని పక్షంలో పునః ప్రవేశమునకు గృహప్రవేశం వంటి మంచి ముహూర్తం చూసుకొని వెళ్ళాలి. లేని ఎడల దోషం వస్తుంది. ప్రథమ గృహప్రవేశం నుండి దీపారాధన చాలా అవసరం.

◆ **సీమంతం చేసి ఆడపిల్లను పురిటికి అత్తగారింటి నుండి పుట్టింటికి పంపడం శాస్త్రమా? ఆచారమా?**

ఆచారమే. దీనిని గూర్చి ఎక్కువ చర్చకు కూడా అవకాశం యివ్వనవసరం లేదు. అయితే గర్భిణీ స్త్రీ “షాణ్మాసాదూర్థ్వం” ఆరు నెలలు నిండినది మొదలు ఆమె ఎంత ప్రశాంతంగా ఆనందంగా వుంటే అంత చక్కటి సంతానం కలుగుతుంది అని పెద్దల వాదన. ఆయుర్వేదం కూడా అదే చెప్పింది. అంతేకాక ఆరుమాసాలకు గర్భస్థ శిశువుకు రూపం ఏర్పడుతుంది. పురాణాలు, శాస్త్రములు, వైద్యశాస్త్రం

ప్రకారంగా గర్భిణీ స్త్రీ యొక్క నడవడి దృష్ట్యా ఆమె యొక్క ప్రశాంతత లేదా అశాంతిని దృష్టిలో వుంచుకొని అత్తవారింటి కంటే పుట్టింటిలో ఎక్కువ ప్రశాంతంగా వుండే అవకాశం వుంటుంది. అనే దృష్టిలో పుట్టింటికి పంపుతారు ఆచారం. అయితే వివాహానంతరం ప్రతి పనీ అత్తవారింటిలోనే జరగాలి. యిది వైదిక సాంప్రదాయం మరియు శాస్త్రం.

### ◆ రావణాసురుడు అపహరించినది మాయ సీతనా?

ఈ విషయం వాల్మీకి రామాయణంలో లేదు. అయితే దేవీభాగవతంలో చెప్పబడినది. శ్రీరామచంద్రుడు సాక్షాత్ శ్రీమన్నారాయణుడే. సీతాదేవి మహా పతివ్రత. ఆమెను తాకుట అనే అవకాశం రావణాసురునికి లేదు. అందువలన రావణుడు సీతాపహరణకు ఆలోచన చేసిన వెంటనే అగ్నిదేవుడు రాముని దగ్గరకు వెళ్ళి విషయం తెలిపి అసలు సీతను తన వద్ద వుంచుకొని మాయసీతను రావణునికి అందునట్టు చేసెను. అందుకే రాముడు, రావణవధానంతరం సీతను అగ్నిప్రవేశం చేయించి తర్వాత మాయసీతను అగ్నికి అప్పగించి అసలు సీతను పరిగ్రహించెను. మాయసీత కోసం యింత చేయవలసిన అవసరం రాముడికి ఏమిటి అంటే? రామావతార లక్ష్యం రావణసంహారం. సీతను పరపురుషుని చేతికి అందకుండా చేయడం అనేది ప్రధాన ఉద్దేశ్యం. అగ్ని నుండి మరల రావణవధానంతరం సీతను పొందడంలో ఆంతర్యం కూడా మాయ సీతను అగ్నిలోనికి పంపి నిజ సీతను అగ్ని ద్వారా మరల పరిగ్రహించడం అంతా రాములవారి దృష్టితో సాగినదే. అందు కోసమే సీత రాముల వారిని ఎప్పుడూ నిందించలేదు.

### ◆ శంఖుస్థాపన ముహూర్తములు లేవు. కట్టుబడి తప్పదు. ఏమి చేయాలి?

దీనికి శాస్త్రంలో ఎక్కడా ఆధారం లేదు. కానీ మన యాంత్రిక జీవనానికి మరియు అవసరాలకు ముడిపెట్టి పెద్దలు అనుభవం మీద కొన్ని మంచి విషయాలు చెప్పారు. అవి ఏమిటి అంటే ఉన్నంతలో మంచి సమయానికి కట్టుబడి ప్రారంభం చేసి కట్టుబడి జరుగుతూ ఉండగా మధ్యలో వచ్చిన ఒక శంఖుస్థాపన ముహూర్తానికి ఆ శంఖుస్థాపన చేయవలసిన ప్రదేశంలో శంఖు మరియు మత్స్యయంత్రం ప్రతిష్ఠ చేయుట మంచిది అని అనుభవం మీద చెప్పారు? ఇది శాస్త్రం కాదు. దీనిని ఇతర రోజులలో అనగా ముహూర్తాలు ఉన్న రోజులలో అమలు చేయరాదు.

### ◆ రోజు ఎప్పుడు ప్రారంభం అవుతుంది? పంచాంగం అంటే ఏమిటి?

ఇంగ్లీషు క్యాలెండర్‌లలో అర్ధరాత్రి 12 రోజు ప్రారంభం అవుతుంది. మనకు కూడా అర్ధరాత్రి 12.00 గంటలకు రోజు ప్రారంభం అవుతుంది అని సూర్య సిద్ధాంతం ప్రధమాధ్యాయంలో చెప్పబడినది. రాత్రి 12.00 గంటల నుండి అపర

రాత్రిగా పిలువబడును. అయితే మన సాంప్రదాయంలో రాత్రి భాగాన్ని మూడు భాగాలు చేసి మొదటి రెండు భాగాలను ముందు రోజుగాను మూడవ భాగాన్ని మరుసటి రోజుగాను చెప్పి అశౌచప్రకరణంలో వాడుకుంటారు. నిత్యకర్మలకు ఉషః కాలాన్ని మరుసటి రోజులోని వారమును వాడుకుంటారు. పంచాంగం నిర్మాణం వాడకంలో 'ఉదయాత్ ఉదయం వారం' అనే నానుడి ప్రకారంగా సూర్యోదయం నుండి వారం అంటే రోజు మారుతుంది. పంచాంగం అంటే తిథి, వారము, నక్షత్రం, యోగం, కరణం వీటిని కలిపి పంచాంగం అంటారు.

### ◆ సంధ్యాకాలంలో తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమిటి?

సంధ్యాకాలం విశిష్టత గూర్చి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. లక్ష్మీదేవి అనుగ్రహించే కాలం సంధ్యాకాలం. యోగశక్తిని పెంచుకోవాడానికి అనుకూలించే కాలం సంధ్యాకాలం. అటువంటి సంధ్యాకాలంలో వీలయినంత శుచి, శుభ్రత, ప్రశాంతతలు పాటిస్తే మనిషికి జీవనం చాలా చక్కగా నడుచును. అందుకే మన పెద్దలు శుచి, శుభ్రత, ప్రశాంతతలు దృష్టిలో వుంచుకొని కొన్ని నియమాలు అందించారు. ఉభయ సంధ్యలోను మనం మన నివాస పరిసరాలు శుభ్రం చేయడం, స్నానాధికములు పూర్తి చేయడం, ఉభయ సంధ్యలలోను దీపారాధన చేయడం, అవకాశం వున్నంతవరకూ దైవారాధన చేయడం, ధ్యానంతో మౌనముతో ప్రశాంత చిత్తం కోసం మెడిటేషన్ చేయడం వంటివి ఏర్పరచారు. అందుకే స్త్రీలను సంధ్యాకాలంలో యిల్లు వదిలి వెళ్ళవద్దని పెద్దలు చెబుతారు. యిల్లు వూడవడం, కేశాలంకరణ, బట్టలు ఉతకడం వంటివి సంధ్యాకాలమునకు పూర్వమే పూర్తి చేయాలి. యిటువంటి నియమాలు పాటించిన వారియింట లక్ష్మి స్థిరంగా వుంటుంది. అంతేకాక ప్రాంతీయ ఆచారాలు కూడా తెలుసుకొని ప్రవర్తించడం చాలా అవసరం. ప్రాతఃసంధ్యలో యింటి ముందర ముగ్గు ఇల్లాలు వేయుట, సాయంసంధ్యలో తులసి దగ్గర దీపం వెలిగించుట ద్వారా కుటుంబ సమస్యలు తీరగలవు అని పెద్దల వాదన.

### ◆ శంఖుస్థాపన చేయబోవు ప్రదేశంలో పాత యిల్లు పడవేయాలి అంటే - స్థలయజమాని ఏదైనా పూజ చేయాలా?

స్థలయజమాని శంఖుస్థాపన చేయుటకు కార్యోన్ముఖుడయివున్నప్పుడు దానిని వ్యతిరేకమయిన కార్యం జీర్ణగృహం పడవేయడం, శంఖుస్థాపన చేయడం మరియు గృహం పడవేయడం అని రెండు వ్యతిరేక భావనలతో కూడిన కార్యములు ఒకే సీజన్‌లో ఒకే యజమాని చేయకూడదు. అలా చేయవలసి వస్తే – గృహము పడవేయుకార్యము పని వారి చేత చేయించి శంఖుస్థాపన స్థలయజమాని చేయవలెను. అంతేకాకుండా చెట్లు కొట్టడం, పాతయిల్లు పడవేయడం, బావులు పూడ్చుడం వంటివి చేయాలి, అంటే ఆ కార్యములు చేసిన తర్వాత ఆరు నెలలు ఆగడం అవసరం.

మరియు పితృకర్మలు చేసిన సంవత్సరం కూడా శంఖుస్థాపన చేయరాదు. పాత పునాదులు రోడ్‌లెవల్ నుండి ఆరు అడుగులు లోపలకు తీయవలసినదే. పాత టాయిలెట్ ట్యాంక్ ఉండగా రిజిస్ట్రేషన్, శంఖుస్థాపన చేయరాదు.

### ◆ అంచులేని చీరలు "గిఫ్ట్"గా యివ్వకూడదా? యింకా తెలుసుకోవలసిన నియమాలు ఏమిటి?

భర్త వున్న స్త్రీలకు యివ్వరాదు. అలాగే భర్తవున్న స్త్రీలకు నల్లని చీరలు కూడా యివ్వరాదు. నల్లని చీర అంచులేని చీర కట్టుకున్న ఆడవారిని పూజలు వ్రతాల విషముగానేకాక సాధారణ ఫంక్షన్స్‌లో కూడా ముత్తైదువుకు చేయు సపర్యలు చేయ రాదని పెద్దలవాదన. అలాగే ముఖమున కుంకుమ లేని స్త్రీలకు (భర్త ఉన్న స్త్రీలకు) కూడా అలా సపర్యలు చేయరాదు. అనగా ఏ స్త్రీ అయినా ముఖమున కుంకుమ వున్నప్పుడే యితర స్త్రీలు వారిని కుంకుమ బొట్టు పెట్టుటకు అవకాశం వున్నది. అనగా భర్త వున్న స్త్రీ ఎల్లప్పుడు ముఖమున కుంకుమ ధరింపవలసినదే. పెద్దలు ఏర్పాటు చేసిన కట్టుబాట్లు ఆచరించుట శ్రేయోదాయకం. పూజా విధములలో అంచులేని చీర కట్టుకొనుట దోషము.

### ◆ శ్రీరామచంద్రమూర్తికి ఒక సోదరి వున్నదా?

లేదు., దశరధుల వారికి నలుగురు పుత్రులు కలిగినట్లుగానే వున్నది. అనగా రాముల వారికి కేవలం సోదరులు మాత్రమే ఉన్నట్లు మనకు వాల్మీకి రామాయణంలో విశేషం. అయితే "శాంత" అనే ఆమె రోమపాదుల వారికి ఔరసపుత్రిక. ఆమెను ఋష్యశృంగునికి యిచ్చి వివాహం చేసినట్లుగా మనకు రామాయణ వచనం. రాముల వారికి సోదరి అంటే శాంతయే అవుతంది అని భావించి అందరూ చర్చిస్తారు. కాని ఆమె రాములవారి సోదరి కాదు. రోమపాదులకు దశరధుల వారికి స్నేహం ఎక్కువ. వాల్మీకి రామాయణం బాలకాండలో శాంత గురించి ప్రస్తావన వుంది.

### ◆ పురాణాలలో చెప్పిన వ్రతములు అన్నీ ఆచరణీయమోగ్యమా?

పురాణాలలో చెప్పబడిన ప్రతి విషయము వ్రతము ప్రజాక్షేమం ప్రధానంగా చెప్పబడినవే. పూజలు, వ్రతములు, నోములు యివి అన్నీ కూడా అవసరాలను బట్టి, మనసు బట్టి చేయవలసినవే. అవసరం లేకపోయినా వ్రతాచరణ చేయదగిన వ్రతములు కొన్ని చెప్పబడినవి. అవసరం వున్న దానిని అనుసరించి చేయవలసిన వ్రతములు కొన్ని చెప్పబడ్డాయి. మనం మొత్తం వ్రతాలు ఆచరించాలి అంటే మన నిత్యకృత్యాలు ఆగిపోతాయి. వ్రతములు గొప్పవే కానీ నిత్య కృత్యములు అవసరం కదా! అందువలన మన అవసరాలను అనుసరించి వ్రతాలు ఎంచుకోవాలి. పురాణాలలో చెప్పబడిన ప్రతి వ్రతము అనుసరించుటకు సాధ్యమయినవే.

**◆ దేవాలయములు ఎప్పుడు తెరవాలి? ప్రస్తుతం దేవాలయాల్లో జరిగే అర్చన కార్యకలాపాల సమయం, నియమం సరియైనవేనా? ఉషఃకాంతులు ఏ సమయంలో ఉంటాయి? నరశార్దూలములు ఏకాలంలో నిద్ర లేస్తాయి?**

సూర్యోదయానికి రెండు గంటలు ముందు దేవాలయం తెరువవచ్చు. దేవాలయం ఎప్పుడు తెరవాలి అనే అంశానికి “బ్రాహ్మణ ధర్మాలు, ధర్మశాస్త్రం, ఆగమ శాస్త్రం, మూడింటినీ సమన్వయ పరచి చెప్పాలి. బ్రాహ్మణ ధర్మాలు, ధర్మశాస్త్రాలను అనుసరించి బ్రాహ్మణుడు బ్రహ్మముహూర్తం అని పిలువబడే ఉషఃకాలంలో నిద్రలేచి కాలకృత్యములు తీర్చుకుని, సంధ్యావందనములు పూర్తి చేసుకుని, సూర్యోదయం వరకు గాయత్రీ జపం చేసి, సూర్యోదయ కాలంలో “సూర్యోపస్థానం” చెప్పి ఆ తర్వాత ఇతర కార్యక్రమాలు చేపట్టాలి. ఈ విషయంగా బ్రాహ్మణ ధర్మాలు, ధర్మశాస్త్రం, పురాణాలలో మతాంతర పాఠాలు లేవు. అందరూ ఈ విషయాన్ని ఒకే విధంగా తెలిపారు. అంతేకాకుండా ఏదేని అత్యవసర సందర్భాలోను, విశేష దినములు, పర్వదినములలోను యితర కార్యం చేయదలిస్తే, ఉషఃకాలంలో సంధ్యావందనం అర్ఘ్యం యిచ్చి సూర్యోపస్థానం ఆపి, ఆ వేరు కార్యం చేయవచ్చని పెద్దల వాదన. ఆగమశాస్త్ర ప్రకారంగా కొన్ని పాఠాంతరములు ఉన్నా సంధ్యావందనం లాంటి కార్యక్రమములు, స్నానం చేయు కాలం వీటిలో మార్పులేదు. సంధ్యావందనం చేయకుండా బ్రాహ్మణుడు గుడిలో ఇతరులకు అర్చన చేయరాదు. అర్ఘ్యం ఇచ్చి గాయత్రీ అనుష్ఠానం చేస్తూ దేవాలయాన్ని శుభ్రం చేసుకోవడం అలంకారం చేసు కోవచ్చు. రాత్రి మూడవ యామంలో స్నానం నిషేధం దీనికి పాఠాంతరం లేదు. ధర్మం శాస్త్రం బట్టి ఒకటే కాక ఇతర పురాణ గాధలలో కూడా ఉషఃకాలంలో నిద్రలేచి నిత్యకృత్యాలు తీర్చుకుని ఇతర కార్యములకు వెళ్ళేవారని తెలస్తున్నది. ఈ ప్రకారం దేవుణ్ణి కూడా బ్రాహ్మణుడు ఉషః కాలంలోనే నిద్రలేపాలి. ఉషఃకాలమునకు పూర్వం దేవాలయం తలుపులు తీసినవాడు బ్రాహ్మణుడే కాదు. మరలా ఇక్కడ సంధ్యావందన నియమం స్మరిద్దాం. “సంధ్యాహీనో శుచిర్నిత్యం అనర్హస్సర్వకర్మసు” సంధ్యావందనం చేయకుండా ఇతర కర్మలు చేయుటకు బ్రాహ్మణుడు అర్హుడు కాడు. ప్రస్తుతం దేవాలయాలు రాజకీయనాయకులు, ప్రభుత్వాధికారుల చేతిలోకి వచ్చి వారి కమర్షియల్ ఆలోచనల ప్రకారం ఇష్టం వచ్చినట్లు తెరవ వలసిన ఆగత్యం ఏర్పడినది. బ్రాహ్మణులు ధర్మం చెప్పడం, దాని ప్రకారం నడవడంలేదు అని అందరికీ తెలిసిన విషయమే! గతంలో ఈనాడు పత్రికలో తిరుమల విశేషములు 1940, 1970, 1991 ప్రస్తుతం వచ్చిన మార్పులు గూర్చి వ్రాసిన ఆర్టికల్ చదివితే దేవా లయాలు స్వామివారిని పవళింపు సేవకు పంపే విషయంలోను ఉదయం దేవాలయం తెరిచే విషయంలో బ్రాహ్మణ అధికారాలు ఎప్పుడో పోయాయి అని తెలుస్తుంది.

అందుకే ఈ విచిత్రమైన నియమావళి ప్రతి దేవాలయంలోను కనబడుతుంది. 1970, 1980లలో తి.తి.దే. రాత్రి 9.00గంటలకు గుడి కట్టివేసి అర్చకులు వెళ్ళిపోయేవారని పాత ఈనాడు పేపర్‌లలో వ్రాసిన ఆర్టికల్స్ సాక్ష్యం. నేడు గుళ్ళను వ్యాపార కేంద్రాలుగా మార్చేశారు అని అందరూ అంటుంటే అందులో తప్పులేదేమో అనిపిస్తుంది.

### ◆ ఉషః కాలం అంటే ఏమిటి?

ఉషః కాలం అంటే సూర్యోదయానికి పూర్వం రెండుగంటల కాలము. నిత్యంలో ఏ వైదిక కర్మకాండ ఆచరించాలన్నా ఆగమ శాస్త్ర ప్రకారం ఏదేని పూజ నిర్వహించాలన్నా, ఉషః కాలంలోనే వారం, తిథి మార్పును గూర్చి సంకల్పంలో ఉచ్ఛరించాలి. అటువంటి ధర్మాలు బ్రాహ్మణులకి ఉన్నాయి కావున బ్రాహ్మణులైన అర్చకులు ఉషః కాలం సంధ్యావందనాదులు ఆచరించి కానీ దేవాలయం తెరవకూడదు. రామాయణం బాలకాండ 23వ సర్గలో విశ్వామిత్రుడు రామ లక్ష్మణులను గంగా సరయూనదీ తీరంలో నిద్రలేపు సందర్భంలో "కౌసల్యా సుప్రజారామా పూర్వా సంధ్యా ప్రవర్తతే... ఉత్తిష్ఠ నరశార్ధులా కర్తవ్యం దైవమహ్నికం" అని నిదుర లేపారు. భాగవతంలో నందరాజు పొరపాటున రాత్రి మూడవ యామంలో స్నానం చేసిన దోషంగా వరుణుడు తన రాజ్యానికి నందమహారాజును తీసుకుపోయినట్లుగా ఆయనను శ్రీకృష్ణ పరమాత్మ విడిపించి తీసుకు వచ్చినట్లుగా కథలు ఉన్నాయి.

### ◆ ప్రతి హిందువు తెలుసుకొని ఆచరించవలసిన విషయములు ఏమిటి? జ్యోతిశ్శాస్త్రం చదవాలి అంటే ఏ గ్రంథాలు చదవాలి?

హిందువు అయిన ప్రతివాడు నేను భారత సంస్కృతికి అద్దం పట్టే హిందూ మత గ్రంథాలు ఏమి చదివాను? ఎంత వరకు తెలుసుకున్నాను అని తనను తాను ప్రశ్న వేసుకోవలెను. హిందూ ధర్మం నాకు తెలియకుండా నేను హిందువునవుతానా! అనే ప్రశ్న ప్రతి హిందువు వేసుకోవాలి. ఇతర మతస్తులు వారి వారి మత సంరక్షణ, పోషణ నిమిత్తంగా వారి మత గ్రంథాలు చదవడం తప్పనిసరిగా దేవాలయములకు వెళ్ళడం చేసుకుంటారు. మరి మన మతాచారములను మనం పాటిస్తున్నామా? లేదా? అనే ప్రశ్న అందరిలోను రావాలి. రామాయణ, భారత, భాగవత గ్రంథాలు చదవాలి లేదా ప్రవచనాలు జరిగే చోట తప్పని సరిగా వినడానికి వెళ్ళాలి. ధర్మ విషయాలు ఉపన్యాసం జరుగుతుంటే వాటిని ప్రోత్సహించాలి అవకాశం కుదిరితే పురాణములు కూడా చదవవలెను. కనీసం ఆ గ్రంథాలను ఇంట్లో సంరక్షణ చేస్తే మనకు ఎప్పటికైనా చదివే బుద్ధి కలుగవచ్చు. జ్యోతిషం నేర్చుకోవడానికి బృహత్‌సంహిత, జాతకపారిజాతం, సారావళీ, ఫలదీపిక, పరాశరీహోరశాస్త్రం, సర్వార్థచింతామణి, వాస్తుసుధ, ముహూర్తసుధ, గ్రహచారదర్పణం, ముహూర్తదర్పణం, కాలామృతం, ముహూర్త చింతామణి వంటివి చదవాలి.

**◆ శంఖుస్థాపనలో ఏమి యంత్రాలు వేయాలి?**

ఏ యంత్రమునూ వేయకూడదు. యంత్రం పూజచేసి ఏర్పాటు చేస్తారు. శంఖుస్థాపన దగ్గర నుండీ గృహనిర్మాణం పూర్తి అయ్యే వరకు కూడా ఆ గృహంలో అందరూ నియమబద్ధమైన సంచారం చేయరు. అంతే కాక యంత్రం వేసిన ప్రదేశం కాంక్రీటుతో పూడ్చబడి వుంటుంది. దాని మీద నడుస్తూ వుంటారు. పూజ చేసిన యంత్రాన్ని కాళ్ళతో త్రొక్కకూడదు కదా? అందుకని గృహ ప్రవేశం దాకా యంత్రాలు వేయ కూడదు. మరో కోణంలో ఆలోచిస్తే, యంత్రమును పూజయంత్రంగా వేస్తే నిత్యం పూజ చేయాలి. ప్రతిష్టా యంత్రం అయితే అక్కడ శంఖుస్థాపన చేయుచోట ప్రతిష్టా కలాపన చేయుటకు అనుకూలం కాదు. కావున శంఖుస్థాపన సమయంలో యంత్రాలు వేయుట అజ్ఞానులు చేయుపని.

**◆ పూజాయంత్రాలు, ప్రతిష్ఠాయంత్రాల తేడా ఏమిటి? నియమాలు ఏమిటి?**

ప్రతిష్ఠాయంత్రాలు రెండు రకాలు. దేవాలయాలలో విగ్రహాలకు చైతన్యం కోసం ప్రతిష్ఠించేవి. మరొకటి గృహాలలో మత్యయంత్రం వంటివి ప్రతిష్ఠ చేస్తారు. అయితే దేవాలయాలలో వేసే ప్రతిష్ఠ యంత్రాలకు ఏ విధంగా కలాపం జరుగుతుందో అదే విధంగా ఇళ్ళలో వేయు యంత్రాలకు కూడా కలాపం జరిపించాలి. ఇళ్ళలో యంత్రాలు ప్రతిష్ఠ జరిగిన తర్వాత ప్రత్యేక నియమాలు వుండవు. పూజా యంత్రాలు దేవతా మందిరాల్లో, ప్రతి యింట ఉండదగినవి వీటికి కొన్ని ప్రత్యేక నియమాలు ఉన్నాయి. నియమ బద్ధంగా యంత్రాలను పూజిస్తే ఆ మంత్ర దేవతల అనుగ్రహం తప్పక లభిస్తుంది. యంత్రదేవతను యంత్రరూపంలో నిత్యం అర్చించవలెను. నిత్యం ధూప, దీప, నివేదనలు సమర్పించవలెను. అలా చేసి సదాచార సంపత్తితో జీవనం చేసిన యింటికి దేవత అనుగ్రహం వలన అష్టైశ్వర్యములతో తులతూగే అవకాశం కలుగు తుంది. అంతేకాకుండా యంత్రం ద్వారా ఫలితాలు త్వరగా అందుతాయి.

**◆ స్వంత అన్న భార్య మరణిస్తే.., ఆమెకు స్వగృహం లేకపోతే.., మన ఇంట ఆమె పార్థివదేహం ఉంచవచ్చా?**

ఉంచవచ్చును., ఉంచాలి. శుభ, అశుభ కార్యక్రమాలలో అనదమ్ముల మధ్యలో భేదం పనికి రాదు. అన్నగారికి స్వంత ఇల్లు ఉండి తమ్ముడికి లేకపోయినా, తమ్ముడికి స్వంత ఇల్లు ఉండి అన్నగారికి లేకపోయినా వారు పరస్పరం శుభ అశుభ కార్యక్రమాల విషయంలో ఆ ఇంటిని స్వంత ఇంటిగా భావించి కార్యక్రమాలు చేసుకోవాలి. వివాహం అయినది అనుకోండి పసుపు కొట్టే విషయం సత్యనారాయణ స్వామి వ్రతం విషయం ఆ ఇల్లు సొంత ఇల్లుగా భావించి చేసుకోవచ్చు. మీ తల్లి దండ్రుల ఆబ్ధీకాలు ఆ ఇంట అందరూ కలసి చేయుట అందరూ స్వంత ఇంటిలో చేసుకున్న

ఫలితం వస్తుంది. ఈ నేపథ్యంలో అన్నగారి భార్య పార్థివ దేహం స్వంత ఇల్లు లేని కారణంగా రోడ్డున ఉంచితే ఆ దోషం ఆ మిగిలిన తమ్ముళ్ళకు వర్తిస్తుంది. అన్నగారి భార్య మీ ఇంటి కోడలే కదా! అందువలన మీ కోడలి పార్థివదేహం నడిరోడ్డున ఉన్నది అంటే మీ ఇంటి పేరు మీద మీకు అవమానం జరిగినట్లే. వేరే బంధువుల విషయంలో పార్థివదేహం ఇంటిలో ఉంచే విషయమై మానసిక ప్రవృత్తికి ప్రధాన్యం. దుర్యోధనుడు పాండువైరంతో ద్రౌపదిని ఇబ్బంది పెట్టాడు కాని అజ్ఞాత వాసం అరణ్యవాసంకు వెళ్ళిన సందర్భంలో పాండుమాత కుంతీదేవిని తన రాజ్యంలో ఉంచుకున్నారు. ఇబ్బంది పెట్టినట్లుగా ఎక్కడా చరిత్ర ఆధారం లేదు.

### ◆ శుభకార్యం చేసిన ఎన్ని రోజుల లోపుగా ఆబ్దీకం పెట్టరాదు?

'ఆబ్దీకం పెట్టరాదు' అనే వాక్యం తప్పు. శుభకార్యం చేసిన ఒక నెల లోపు ఆబ్దీకం రాకుండా ముహూర్తం నిర్ణయించుకోవాలి. నోములు వ్రతములు వంటివి అబ్దీకం ముందురోజు, మరుసటి రోజు పనికిరాదు. తల్లిదండ్రులకు ఆబ్దీకం మానడం చాలా తప్పు. అందువలన అబ్దీకములను దృష్టిలో వుంచుకొని శుభకార్యములు ముహూర్తాలు పెట్టించుకోవాలి. అబ్దీకం అనంతరం శుభకార్యం దోషం లేదు. అబ్దీకమునకు నెలరోజులు ముందు శుభకార్యం దోషంలేదు.

### ◆ వెండి విగ్రహాలకు పూజలు చేయవచ్చా?

మట్టి, రాగి, ఇత్తడి, వెండి, బంగారం వంటివి అన్ని దేవతా విగ్రహాలు చేయడానికి ఉపయోగించవచ్చును. అయితే ఏ విగ్రహం అయినా లోపల వైపు డొల్ల(ఖాళి) లేకుండా వుండేలాగ గట్టిగా చేయించి పూజలు చేసుకోవాలి. డొల్ల విగ్రహాలకు పూజ చేయుట ద్వారా కార్య వైఫల్యాలు ఎక్కువ అవుతాయి. స్టీల్, ఇనుము విగ్రహాలకు పూజలు చేయరాదు. ఫోటో ఫ్రేమ్స్ కేవలం అలంకరణ కోసమే కానీ పూజార్థం పనికిరావు. వాటికి మేకులు ఉంటాయి కదా!

### ◆ లోకం సుభిక్షంగా వుండాలి - దేశంలో వాతావరణం సమతుల్యతలో పెరగాలి అంటే ఏమి చేయాలి?

"సర్వేజనా స్సుఖినో భవంతు" అని రోజూ అందరూ అనుకోవాలి. సృష్టి పరిపాలకుడు శ్రీమన్నారాయణుడు. అందువలన రోజు సృష్టి క్రమం సరిగా సాగవలెను అనే సంకల్పంతో యధాశక్తిగా శ్రీమహావిష్ణు ఆరాధనం చేయుట ద్వారా ఎన్నో రకాలయిన మంచి మార్పులు సృష్టిలో ఆరంభం అవుతాయి. ప్రతి రోజూ లోక కళ్యాణార్థం అనే సంకల్పంతో పూజలు చేయడమే కాకుండా రోజూ అందరూ సత్ప్రవర్తనతో జీవనం సాగిస్తే సృష్టి చక్కగా సాగుతుంది. సత్పురుషులు సంచారం చేయుట వలన లోకములు సువృష్టిని పొందివుంటాయి. సత్పురుషులు అంటే సత్ప్ర

వర్తనతో కూడిన మనుషులే సత్పురుషులు. మనం అందరం సత్ప్రవర్తనతో వుంటే మనమే సత్పురుషులం అవుతాము. మనమే సత్పురుషులం అయితే మన లోకం సస్యశ్యామలం అవుతుంది.

### ◆ వెండి ఆభరణాలు ధరింపవచ్చా?

ధరింప కూడదు. వెండి అనే లోహం కేవలం పాత్రలకు మాత్రమే. లేదా విగ్రహాలకు, పూజా సామాన్లుకు వాడుకోవాలి. అంతేకానీ ఆభరణాలుగా వెండి వస్తువులు వాడరాదు. బంగారం, రాగి వస్తువులను ధరింపవచ్చు కానీ వెండి వస్తువులు మాత్రం ధరింప కూడదు. వెండి వస్తువుల ధారణ మూలంగా ఐశ్వరం పోతుంది అని పెద్దలు చెబుతారు. మగవారికి మొలతాడు, ఆడవారికి కాలికి పట్టీలు, మెట్టెలు మాత్రం వెండివి ధరించాలి.

### ◆ పెండ్లి చూపుల సమయంలో పెండ్లి కుమార్తె తరపు వారు తీసుకోవలసిన జాగ్రత్తలు?

పిల్లను తూర్పు ముఖంగా మాత్రమే కూర్చొండపెట్టి చూపించాలి. అమ్మాయికి తారాబలం లేని రోజులలో చూపరాదు. మంగళవారం పెళ్ళిచూపులు పనికిరాదు. మూఢమి రోజులలో పెళ్ళిచూపులు పెట్టవలసి వస్తే దేవాలయముల్లో చూపవచ్చు. దుర్ముహూర్తం, వర్జ్యం వంటివి లేని సమయాల్లో పెళ్లి చూపులు చూపాలి. నలుపు రంగు బట్టలు ధరించి పెళ్ళిచూపులకు కూర్చుండ పెట్టరాదు. అలంకారము లేకుండా, కాళ్ళకు పసుపు, నుదుట కుంకుమ లేకుండా పెళ్ళిచూపులకు కూర్చుండ బెట్టరాదు. సంక్రమణ దినములు, ఆబ్దీక దినములలో పెళ్ళిచూపులు పనికిరాదు.

### ◆ యాగశాల లేకుండా దైవప్రతిష్ఠలు చేయవచ్చా?

చేయరాదు. పైన కప్పు లేకుండా ఎటువంటి హోమములు చేయరాదు. ప్రతిష్ఠలో యంత్ర ప్రతిష్ఠకు తప్పకుండా హోమములు చేయవలెను. కావున తప్పని సరిగా యాగశాల నిర్మాణం చేయవలెను. చాలామంది "యాగశాల బదులు దేవాలయంలోని ముఖ మండపమును యాగశాలగా వాడవచ్చును కదా?" అని అనుకుంటారు. కానీ దేవాలయ ప్రతిష్ఠతో అనుగుణంగానే ముఖ మండపము ప్రారంభం చెయ్యాలి. అందువలన – దేవాలయ ప్రతిష్ఠ పూర్తవ్వకుండా ముఖ మండపములో ఎటువంటి హోమములు చేయరాదు. ఈ నేపథ్యంలో విడిగా యాగశాల నిర్మాణం చేయకుండా ఎటువంటి ప్రతిష్ఠలు చేయరాదు.

### ◆ సంసార సంబంధమయిన యిబ్బందులకు శివకుటుంబంలోని దేవతారాధనలు ఎక్కువగా శాంతికోసం చేయిస్తారు కారణం ఏమిటి?

కుటుంబం అంటే శివకుటుంబం లాగానే వుండాలి అంటారు. కారణం ఏమిటి అంటే విరోధములు ఎన్ని వున్నా కుటుంబంలోకి వచ్చేసరికి వైరభావం వుండరాదనే శివకుటుంబం మనకు సూచిస్తుంది. శివుడు వాహనం నంది అమ్మ వాహనం సింహం

ఈ రెంటికి వైరం. కానీ శివకుటుంబంలో అవి కలిసేవుంటాయి శివుడి ఆభరణాలు నాగులు – కుమారస్వామి వాహనం మయూరం – నాగజాతికి మయూరి జాతికి శతృత్వం అయినా శివకుటుంబంలో అవి కలిసే వుంటాయి. గణేశుని శిరస్సు గజం – అమ్మవాహనం సింహం గజముకు – సింహముకు శతృత్వం అవి శివ కుటుంబంలో కలిసే వుంటాయి. యిలా శతృత్వాలు వున్నవి అన్నీకూడా శివకుటుంబంలోకి వెళ్ళేసరికి కలిసి వుంటాయి. అందుకే వుంటే శివకుటుంబంలాగ వుండాలి అని సామెత. అందుకే సంసార భాధలు తొలగాలి అంటే గౌరీ, సుబ్రహ్మణ్య, గణపతి ఆరాధనలు పెద్దలు చెబుతూవుంటారు.

### ◆ పంచాంగంలో వ్రాసే "భుక్తి" అంటే అర్థం ఏమిటి?

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరగడానికి ఒక సంవత్సరకాలం పడుతుంది. భూమి తన చుట్టూ తాను తిరగడానికి ఒక రోజు పడుతుంది. సూర్యుడు అన్ని వైపులనుండి కాంతిని వెదజల్లుతుంటారు. భూమి తన చుట్టూ తాను తిరిగే సమయంలో సూర్యుని వైపు వున్నదేశాలలో పగలు, వ్యతిరేక దిశలో వున్న దేశాలలో రాత్రి ఏర్పడుతుంది. జ్యోతిష శాస్త్ర రీత్యా భూమి తిరిగే కక్షను, సూర్యుడు తిరిగే కక్షను 12 రాశులుగా విభాగం చేశారు. భూమి తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యుడి చుట్టూ తిరిగేందుకు పట్టే సంవత్సర కాలంలోనే సూర్యగమనం ఆధారంగా జ్యోతిషశ్యాస్త్రం ప్రకారం 12 రాశులను సంచరిస్తునట్లు ఒక్కో రాశికి 30 డిగ్రీలు గాను అలాగే రాశి చక్రం 360 డిగ్రీలను – సూర్య,భూమి సంచార క్రమాన్ని 365 రోజులలో రాశిచక్రం పూర్తి చేస్తున్నట్లుగాను జ్యోతిశ్యాస్త్రం మనకు తెలియ చేయుచున్నది. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరగడానికి తన కక్షలో గలిగిన చలనాన్ని – రాశి చక్రంలో సూర్య గమనానికి సమాంతరంగా వచ్చే చలనాన్ని జ్యోతిశాస్త్ర రీత్యా భుక్తి ఘడియలుగా సూచిస్తారు. యిలాంటి భుక్తి ఒక నెలరోజులు గడిస్తే సూర్యుడు ఒక రాశి నుండి మరొకరాశిలోకి ప్రవేశించే కాలం వస్తుంది. యిదే భుక్తి ఘడియల సూక్ష్మ సమాచారం.

### ◆ వైవాహిక జీవితంలో వుండి సంతానం కనినవారిని కూడా బ్రహ్మచారులుగా సంబోధించవచ్చా?

గృహస్థాశ్రమ ధర్మం విడనాడకుండా వుండేవారి విషయంగా మీరు ఈ ప్రశ్న అడుగుతున్నారు. "ప్రజాయై గృహమేదినాం" సంతానంకోసమే వైవాహికజీవితం – గృహస్థ ధర్మం. ధర్మశాస్త్ర రీత్యా కేవలం సంతాన అపేక్షతో భార్యను పొందవలెను అని వున్నది. అంతేకాకుండా ఋతు మతి అయిన భార్యను నాల్గవ దినము నుండి పదహారవ దినం వరకు మాత్రమే, భోగంచుట సంతానాపేక్షతో కూడిన గృహస్థ

ధర్మము. 17వ దినము నుండి భార్యను భోగించుట కామాపేక్షయే. యింతే కాకుండా ధర్మశాస్త్రరీత్య భార్యతో రతి విషయంగా ఎన్నో ధర్మాలు చెప్పబడినవి. అలా ధర్మం ప్రకారం సంసార జీవితం గడిపేవారిని బ్రహ్మచారిగానే భావించాలి అని పెద్దల వాదన. అయితే ఈ కలియుగంలో అది సాధ్యం కాదు. సరే పైన చెప్పబడిన ధర్మాల కోసం ఉదాహరణగా రామాయణంలో విశ్వామిత్ర పాత్ర గోచరిస్తుంది. అయన రాజర్షి అవ్వడం కోసం తప మాచరించే సమయంలో నలుగురు పుత్రులు కలిగారు. అయినా ఆయనకు దీక్షాభంగం కాలేదు రాజర్షి అయ్యారు. తర్వాత బ్రహ్మర్షి అయ్యే ప్రయత్నం మేనక ద్వారా శకుంతలను కన్నారు. దీక్షాభంగం అయినది. తపస్సు చెడినది. దీని ఆంతర్యం ఏమిటి? అంటే దీక్షలో కూడా నియమబద్ధుడయి స్వభార్యా సంపర్కం ధర్మ శాస్త్రోక్త నియమాలతో చేయువారికి దీక్షా భంగం అవ్వదు, యితరత్రా చేయు పనులతోనే దీక్షాభంగం అవుతుంది. దీక్షభంగం కానివాడు బ్రహ్మచారియే. యింకా చాలా శాస్త్రం వున్నది.

◆ **మనకు వున్న మనువుల పేర్లు తెలుపగలరు?**

1. స్వాయంభువ 2. స్వారోచిష 3. ఉత్తమ 4. తామస 5. రైవత 6. చాక్షుష 7. వైవస్వత 8. సూర్యసావర్ణి 9. దక్షసావర్ణి 10. బ్రహ్మసావర్ణి 11. ధర్మసావర్ణి 12. రుద్రసావర్ణి 13. రౌచ్య 14. బౌత్య - యివి 14 మంది మనవుల పేర్లు. మనం ప్రస్తుతం వైవస్వత మనువు కాలంలో వున్నాము.

◆ **శ్రీమన్మహాభారతంలో అతి ముఖ్య పాత్ర ఎవరిది? విదురుని జన్మ విశేషం ఏమిటి?**

అందరూ ముఖ్యభూమికను పోషించారు అయితే శ్రీవేద వ్యాసులు భారతానికి ఆధారం. చిత్రాంగదుడు విచిత్ర వీర్యుడు కాలం చేసిన తర్వాత కురువంశానికి తర్వాత ఎవరు అనే సమస్య ఏర్పడినది. వున్న భీష్ములవారు బ్రహ్మచర్య దీక్షతో జీవనం చేయుటకు ప్రతిజ్ఞ చేసివున్నారు. అటువంటి సమయం యిక భారతం జరగడానికి కూడా అవకాశంలేని సమయం. అటువంటి సమయంలో సత్యవతి ప్రార్థింపగా శ్రీవేదవ్యాసులు ప్రత్యక్షం అయి ఆమె కోరగా అంబిక అంబాలికలకు ధృతరాష్ట్ర పాండురాజులను ప్రసాదించారు. వీరిరువురు సత్యవతికి కోడళ్ళు, దేవర న్యాయం చేత భర్తపోయిన తర్వాత వేదవ్యాసులు వారు వీరికి పుత్రసంతానం ప్రసాదించారు. యిక్కడ ఈ ప్రకారం ధృతరాష్ట్ర పాండురాజులే లేకపోతే దుర్యోధనాదులు ధర్మరాజాదులు లేరు. భారతమూలేదు. వారి ఉత్పత్తికి కారకుడైన వేదవ్యాస మహర్షియే మహాభారతానికి మూల పురుషుడు. అంతే కాకుండా ఆయనే ఈ భారతం వ్రాసి మనకు అందచేయుట చాలా విశేషం కూడా. ప్రారంభం నుండి చివరిదాకా వుండి చూసి తానూ ఒక పాత్ర వహించి ఆ తర్వాత ఈ గ్రంథ రచన చేయడం చాలా

గొప్ప విశేషము. యిక విదురుని విషయం ఒకప్పుడు మాండవ్య మహర్షి యమ ధర్మరాజును శపించాడు. శాపం ఏమనగా " భూలోకంలో పుట్టి ధర్మము చెబుతూ జీవించమని." అందుకే ఆ శాప ప్రభావంగా వ్యాసుల వారి అనుగ్రహంతో అంబిక దగ్గర వున్న దాసికి విదురుడు పుట్టెను.

**◆ పూజ చేయునప్పుడు చేయవలసిన షోడశోపచార పూజల యందు ఏది ముఖ్యము?**

రోజూ షోడశోపచార పూజలతో పూజలు చేయుట విశేషం. రోజు వారీ పూజలలో అయినా విశేష పూజలలో అయినా సరే దీపారాధన చేయకుండా పూజచేయరాదు అలాగే నివేదన లేని పూజవ్యర్థము. మిగిలినవి యధాశక్తిగా మార్చవచ్చు. ఏ దేవతా ఆరాధన చేయదలచావో, ఆ దేవతా ఆవాహనం, దీపం, నివేదనలు తప్పదు. శక్తి లేనప్పుడు లఘువుగా పూజ పూర్తి చేయవచ్చును. నివేదన చేసిన పదార్థములు ప్రసాదంగా గ్రహింపక పోయినా అది పారవేసినా చేసిన పూజ వృధా అవుతుంది. దీపారాధనకు ఆవునెయ్యి విశేషం. అలాగే నివేదన చేయుటకు ఉపయోగించే వండిన పదార్థముల మీద నెయ్యి వేయకుండా నివేదన చేయకూడదు. రోజూ అవకాశం కుదిరి దేవతారాధనలో పంచామృతాలతో స్నానం (అభిషేకం) చేయుట చాలా విశేషము.

**◆ దేవతల రూపాలు మనం ప్రస్తుతం దేవాలయాలలో విగ్రహాల రూపంగా చూస్తున్నాము అవి సరియైనవేనా?**

పరమాత్మ స్వరూప సౌందర్యలావణాలను గూర్చి తెలుసుకోవాలి అంటే అది తపస్సు ద్వారా మాత్రమే సాధ్యము. అయితే అందరికీ అంత తపశ్శక్తిని అందుకోవడం సాధ్యంకాదు కాబట్టి దేవాలయాలలో దేవాతారూపాలు నిర్ణయంచేశారు. శ్రీమద్భాగ వతంలో ఈ విషయమై శ్రీకృష్ణుడు ఉద్ధవునికి బోధించిన విషయం పరిశీలిస్తే మన అనుమానం తీరుతుంది.

***చిన్మయస్య అద్వితీయస్య నిష్కలస్య అశరీరిణః***
***ఉపాసకానాం కార్యాణాం బ్రహ్మణో రూప కల్పనా.***

చిన్మయము అద్వితీయము, నిష్కలము ఆయినది శరీరము లేని పరబ్రహ్మ స్వరూపాన్ని బ్రహ్మ ఉపాసకుల కార్యసిద్ధి కొరకు దేవాలయములలో దేవతామూర్తులుగా సృష్టించారు అని చెప్పారు.

**◆ కులం అంటే ఏమిటి? కుల దేవతలు అంటే ఎవరు?**

కులం అంటే వంశం. అంతేగానీ, ఈ రోజుల్లో సమాజంలో వ్యవహరింపబడు తున్న కులాలు కావు. రఘు కులం అంటే రఘు వంశం. శ్రీరాముడిని రఘు కులానికి రత్న దీపం అని అన్నారు. కులం అంటే వంశం అని అర్థం చేసుకోవాలి. యిలా అయితే చాలా కులాలు వస్తాయి కదా! అవును వస్తాయి. అయితే దోషం ఏమీ లేదు.

తన వంశంలోని పూర్వీకులు పూజించిన దేవతలు వారి వారి కులదేవతలు అవుతారు. వారిని పూజించడం వలన వంశవృద్ధి కలుగుతుంది. కుల దేవతారాధన విస్మరించడం బహుదోషం. ఈ కుల దేవతలు, విష్ణువు, రాముడు, శివుడు, కృష్ణుడు, లక్ష్మీ పార్వతీ, దుర్గ ఎవరైనా కావచ్చు. గ్రామ దేవతలైన పోలేరమ్మ, గంగమ్మ, పెద్దమ్మ ..... ఇలాగే ఎవరైనా కావచ్చు. పూజా సమయంలో కూడా కుల దేవత పేరు చెప్పుకోవాలి. కనీసం కులదేవతాభ్యో నమః అని అయినా చెప్పుకోవాలి. గురునాథుని పొంగళ్లుకూడా కులదేవతను ఆరాధించటమే అవుతుంది. కుల దేవతలను పూజించడం వలన ప్రస్తుత తరం వారు, రాబోయే తరాల వారు సిరిసంపదలతో సుఖసంతోషాలతో జీవిస్తారు. కుల దేవత పూజను నిర్లక్ష్యం చేస్తే, కులదేవత అనుగ్రహం కలుగదు సరి కదా, వంశ పారంపర్యంగా వచ్చే అభివృద్ధి కుంటుపడుతుంది.

◆ **నా వయస్సు 40 సంవత్సారాలు. నేను వృత్తిరీత్యా బాగా సంతృప్తికరంగా సంపాదించాను. ప్రస్తుతం దానిని ఆపివేసి దానధర్మాలు చేసుకుంటూ జీవనం చేద్దాం అనుకుంటున్నాను. భక్తి జ్ఞాన వైరాగ్య విషయాలను గూర్చి మీ ద్వారా తెలుసుకోవాలి. నా ఆలోచనలో ఏదైనా తేడా వున్నదా?**

వేద శాస్త్ర పురాణాల ద్వారా మనకు తెలిసిన విజ్ఞానం ప్రకారం మనం సంపాదించిన దానిలో కొంత దానధర్మ పుణ్యకార్యము నిమిత్తంగా ఖర్చు చేయమని చెప్పారు. అందువలన మీరు చేసిన ఆలోచన ప్రకారం దాన ధర్మ పుణ్య కర్యానుష్ఠానం మంచిదే. కానీ వృత్తి మానివేసి ఈ కార్యం చేయుట సరి అయినది కాదు. అంతే కాకుండా వృత్తి విషయంగా పెరిగిన కొద్దీ ఆదాయం పెరుగుతుంది. ఆదాయం పెరిగినకొద్దీ మీకు పుణ్యకార్యములు చేసే అవకాశం పెరుగుతుంది. **ప్రథమత:-** మీ భార్యా పిల్లలకు మీరు చేయవలసిన ఏర్పాటు చేయండి. భుక్తి, విద్య, ఆరోగ్యం శుభకార్య నిమిత్తంగా కావలసిన ధనాన్ని భార్యా పిల్లల కోసం ఏర్పాటు చేసి ఆ తరువాత మిగిలినది మీరు దానధర్మ నిమిత్తంగా ఖర్చు చేసుకోండి. "ఉద్యోగం పురుషలక్షణము" ఏ వ్యాపకము లేని మనిషి మనస్సుకు చెడు ఆలోచనలు బాగా దగ్గరకు వచ్చే అవకాశం వున్నది. అందువలన చిన్నదయినా పెద్దది అయినా ఉద్యోగం కానీ, వ్యాపారంకానీచేయండి అలావృత్తి విషయంలో పెరుగుతూ దానధర్మకార్యములు నిర్వహించడం ధన సంపాదన పెరిగే కోద్దీ సత్కార్యాల వలన విషయం పెరుగుతుంది. పుణ్యకార్యములు చేయాలి అంటే ధనం ఎంత వుంటే మనం అంత చేయవచ్చు. యికపై మీరు పుణ్యకార్యాలు చేయడంకోసం సంపాదించండి. వృత్తి విషయంగా కాలక్షేపం చేయు సమయంలో మీరు ధర్మబద్ధంగా వ్యవహరించండి. ధర్మబద్ధంగా వృత్తివిషయాలు నడిపి తద్వారా వచ్చే ఆదాయం దానధర్మాలకోసం వినియోగించడం

ద్వారా మీరు పుణ్యపరంగా విశిష్ఠస్థానం సంపాదించగలుగుతారు. ధానధర్మాలు చేయు విషయంలో పేదవిద్యార్థులను ఉన్నత విద్యవరకు సహకరించి వారికి అభివృద్ధిని ఏర్పాటు చేస్తే సంఘం బాగుపడుతుంది. మీరు చేసే ఈ కార్యం ద్వారా సంఘం బాగుపడితే అందరి ఆశీర్వచనం మీకు లభిస్తుంది. తద్వారా మీ యొక్క పురోభివృద్ధి పెరుగుతుంది. మరొక ముఖ్య విషయం "భార్యకు యిష్టం లేని దానధర్మాలు చేయడం సరికాదు".

ఇక భక్తి జ్ఞాన వైరాగ్య విషయ బోధన మనసంస్కృతి చాలా గొప్పది. భగవంతుడు సర్వాంతర్యామి అనే వాదనతో చెట్టు, పుట్ట యిలా ప్రతి వస్తువులోను భగవంతుడు వున్నాడు అనే రీతిగా మనిషికి భక్తి మార్గం ఏర్పాటు చేశారు. అంతటా భగవంతుడు వున్నాడు అని నమ్మిన వ్యక్తి, మనం చేయు ప్రతిపనినీ భగవంతడు పరిశీలిస్తుంటాడు అనే ధోరణి కలిగిన వాడయి మంచి ప్రవర్తనకు దగ్గర అవుతాడు. అంతేకాక మంచి ప్రవర్తనతో కూడిన వ్యక్తి త్వరగా జ్ఞానమార్గం చేరు అవకాశం వున్నది. తనకు కలిగిన జ్ఞానంతో ప్రతిమనిషికీ అంతః శత్రువులు అయిన కామక్రోధ లోభమోహ మద మాత్సర్యములు అనెడి అరిషడ్వర్గను సాధించి తాను వైరాగ్య జీవనానికి దగ్గర అవుతాడు. వైరాగ్యం పొందాలి అంటే జ్ఞానం తప్పక రావాలి. జ్ఞానమార్గంతోనే "ధ్యాయతో విషయాన్పుంస: సంగస్తేషూప జాయతే– సంగాత్సం జాయతే కామః కామాక్రోధోభి జాయతే, క్రోధాత్ భవతిసంమోహః సమ్మోహాస్మృతి విభ్రమః స్మృతి భ్రంశాద్బు ద్ధినాశో– బుద్ధి నాశాత్ ప్రణశ్యతి" అనే గీతాచార్యుడి వాక్యాన్ని తన జీవన గమనంలో అమలు చేయగలరు. దానితో అరిషడ్వర్గునకు మూలమయిన విషయ వాంఛలకు దూరం అవ్వగలుగుతారు. అలా విషయవాంఛలకు దూరం అవ్వడం కోసం ఆత్మానాత్మ వివేకం, నిత్యానిత్య వస్తు విషయ శోధనలకు జ్ఞానమార్గం ఎంతగానో ఉపయోగపడుతుంది అంతేకాకుండా వైరాగ్య,మోక్షసాధనలకు జ్ఞానమార్గము పునాది. అందుకే జీవితంలో ఆరంభ గురువులయిన తల్లి తండ్రులద్వారా భక్తిమార్గం అభ్యసిస్తే తర్వాత విద్యా బుద్ధులు నేర్పే గురువు ద్వారా జ్ఞానమార్గం అభ్యసించి త్వరగా మోక్షం చేరవచ్చు. అందుకు సద్గురువును ఆశ్రయించడం తప్పనిసరి.

### ◆ శ్రీకాళహస్తి గోపురం మీద మీ అభిప్రాయం?

హిందూ దేశము అని చెప్పుకునే మన భారతదేశంలో దేవాలయ నిర్వహణల విషయంగా ప్రత్యక్షంగా హిందూ ఆచారమే నాశనం చేయబడింది. మీరు బాగా ఆలోచించండి. క్రమక్రమంగా ఆలయ నిర్వహణ వ్యాపార ధోరణిగా నడపబడు తోందా? లేదా? దేవాలయం నిర్వహణ ప్రధానంగా అర్చకుని నియమాల మీద నిర్ణ యాల మీద ఆధారపడి వుండడం లేదు. అర్చకుడితో ప్రాధాన్యత లేకుండా వ్యాపార ధోరణితో ఆలయ కమిటీవారు ప్రవేశపెడుతున్న పూజల మూలంగా అర్చకుడికి, దేవుడికి కూడా యిబ్బంది కరమయిన ఘటనలు వస్తున్నాయి. ఆలయం తెరవవలసిన

కాలం కంటే ముందే తెరవడం, మూయవలసిన కాలం కంటే ఆలస్యంగా మూయడం వంటివి చేసి అటు దేవుడ్ని యిబ్బంది పెడుతున్నారు, యిటు అర్చకుని, అర్చనా నియమాలు తగలేస్తున్నారు. అర్చకుడికి సంధ్యా వందనాదులు చేసుకునే కనీస అవకాశం కూడా లేకుండా దేవాలయాలు తెరుస్తున్నారు. బ్రాహ్మణుడు సంధ్యా వందనం చేయకుండా ఏ యితర కార్యము చేయకూడదు. పూర్వసంధ్యలో అంటే సుమారు 5-00 గంటలకు ఆలయాన్ని తెరిచి సుప్రభాత సేవ చేయాలి. ఆ తరువాతనే అభిషేకాదులు, పూజలు చేయాలి. కానీ మనవాళ్ళు 4-00 గంటలకే ప్రతి ఎండోమెంట్ దేవాలయంలోను పూజలు ఏర్పాటు చేశారు. సంధ్యావందనం చేయని బ్రాహ్మణుడు మైలవాడితో సమానం. మరి దేవాలయంలో 9-00 లోపు పవళింపు సేవ పూర్తి చేయాలి. ఉత్సవాలలో మార్పు ఉన్నవి. అలాంటిది దేవాలయాలు అవసరాన్ని బట్టి తెరిచే వుంచుతున్నారు. మీరు సుమారు 2008లో ఈనాడు పేపర్‌లో ఆర్టికల్ చదివితే 1970 లో తిరుపతిలో అర్చకులు దేవాలయం రాత్రి వేళ 8-00 లకు పూర్తిచేసి అర్చకులు కొండదిగిపోయేవారు అని వ్రాశారు. దేవాలయమును ఆలయ కమిటీవారు వారి ప్రాబల్యంతో ధర్మ విరుద్ధంగా కాలం కాని కాలంలో తెరవడం మూయడం, చేసి మన భారతీయ సంస్కృతిని పాడుచేశారు. యిలా చేసినవారు వారు కనీసం ఆలయ రక్షణ బాధ్యతల విషయంలో విస్మరణ ధోరణితో వ్యహరిస్తున్నారు. దేవాలయ మును వ్యాపారంగా మార్చి దేవాలయ రక్షణ విషయంలో బాధ్యతా రహితంగా ప్రవ ర్తించడం వలననే కాళహస్తి గోపురానికి ఈ దౌర్భాగ్యం. యిప్పటికైనా అర్చకులు దేవతార్చన విషయంలో ధర్మబద్ధంగా బాధ్యతలు కమిటీ వారితో సంబంధం లేకుండా స్వయంగా ప్రాచీన సాంప్రదాయంలో దేవాలయ నిర్వహణ చేపట్టాలి. ప్రజలు కూడా కొంత దేవాలయ విషయంగా ధర్మం తెలుసుకుని కమిటీ నిర్ణయాలు విభేదించడం వంటివి చేయాలి. పవిత్ర ఆలయాల ధర్మ పరిరక్షణ కోసం అందరూ సహకరించాలి. యిదివరలో మనం శ్రీకాళహస్తిలో లేని, చూడని ఈ రాహు కేతు బ్యాచ్‌ల వారీ పూజలు ఎందుకోవచ్చాయో పరిశీలించాలి. అంతే కాకుండా శివకేశవ భేదం లేకుండా ప్రజలు లోక కళ్యాణార్థం నిత్యం గౌరీశంకర పూజ, లక్ష్మీనారాయణ పూజలు చేయడం, దేవాలయం ప్రాంగణంలో నిత్యం గోమాతకు పూజలు చేయించే బాధ్యతలు చేపట్టడం వంటివి చేయాలి. నిత్యం సర్వదేవతా స్వరూపమయిన గోమాతను పూజించండి. లోక కళ్యాణార్థం అని సంకల్పించి పై అర్చనలు చేయండి. సృష్టి సక్రమంగా నడిచే లాగా సహకరించండి. లోక కళ్యాణం కోసం అందరం ప్రార్థిస్తే భగవంతుడు చక్కటి ఫలితాలు యిస్తారు. లేకపోతే ఈ దేవాలయాల రూపంలోనే అరిష్టాలు కలుగుతాయి. యింకా రాబోవు కాలంలో విచిత్ర నష్టాలు మనం చూడబోతున్నాం. వాటి పరిష్కారం కోసం కూడా అందరం రోజూ లోకకళ్యాణార్థం లక్ష్మీనారాయణ, గౌరీ శంకర పూజలు చేయడమే శరణ్యం. మన దేవాలయాలలో వ్యాపార ధోరణితో కూడిన నియమాలు మానిపించాలి.

◆ **ఉద్యోగ రీత్యా దీర్ఘకాలం వేరే దేశం వెళ్ళాలి. నేను నా భార్యను ఆమె పుట్టింట దింపడం మంచిదేనా? లేక మా అమ్మగారి యింట దింపడం శ్రేయస్కరమా? ఏది శాస్త్ర సమ్మతం. అసలు మా అత్తగారి బంధు సహకారం నేను తీసుకోవచ్చా?**

వివాహం అయిన తర్వాత ఆడపిల్ల తన జీవితాంతం అత్తగారింట్లో గడపడమే శాస్త్రవచనము. వివాహ సుముహూర్తం అయిన ప్రభృతి ఆమెకు కావలసిన ఏర్పాట్లు భర్త ద్వారానే జరగాలి. అంతేకాక ఆమెకు పురుడు కార్యములు కూడా భర్తయే చేయాలి. బాధ్యత భర్తదే. అయితే లోకాచారం ప్రకారం స్నేహ పూర్వక ధోరణితో తల్లి యింట, అత్తగారి యింట సంచారం చేయడం ఏర్పాటు చేశారు. అనుకూల వాతావరణం దృష్ట్యా తల్లి యింట పురుడు పోసుకోవడం అనేది ఒక ఆచారంగా ఏర్పాటు చేశారు. అలా అవసరాలకు అనుగుణంగా అత్త యిల్లు, పుట్టిన యిల్లు రెండూ విని యోగించుకోవడం జరుగుతుంది. యిది శాస్త్ర విరుద్ధం కాదు. కానీ ఆచారమే.

వివాహం అయినది మొదలు 'ధర్మేచ అర్థేచ కామేచ' నాతి చరితవ్యాః నాతి చరామి. అని ప్రమాణం చేసిన కారణంగా భార్యను విడనాడి దీర్ఘకాలం వుండడం చాలా తప్పు. యిది వృత్తి రీత్యా తప్పడం లేదు అనే వాదన నేటి సమాజంలో మనం బాగా వింటున్నాం. కానీ ధర్మ విరుద్ధంగా ఆమెను దీర్ఘకాలం వదిలి వెళ్ళడం వలన చాలా సామాజిక దోషాలు కూడా వస్తాయి. సరే యిక మీరు అడిగిన ప్రశ్నకు సమాధానంగా చూస్తే, అరణ్యవాసమునకు వెడుతూ అర్జునుడు తన భార్యను (సుభద్రను) ఆమె సోదరుల సంరక్షణలో వుంచారు. అలాగే రామాయణంలో లక్ష్మణుడు రామునితో అరణ్యవాసానికి వెడుతూ తన భార్య ఊర్మిళను అయోధ్యలోనే వుంచారు. యిలా ఆలోచిస్తే దీర్ఘకాలం భార్యను వదిలి వెళ్ళవలసి వస్తే ఆమె రక్షణ దృష్ట్యా అవకాశాన్ని బట్టి అత్తగారింట్లో నయినా లేక పుట్టింట్లోనయినా వుంచవచ్చు. సరే అత్తగారి బంధువర్గం సహకారం పొందే విషయం – స్నేహం బంధం పెరిగి పరస్పర సహాయ సహకారము పెంచుకోవడం కోసమే కదా! వివాహ వ్యవస్థ ఏర్పరిచినది. అందువలన ఈ విషయాలు ఎక్కువగా ఆలోచించనవసరం లేదు. కురుక్షేత్ర సంగ్రామంలో పాండవుల తరఫు సహకారం అందించిన శ్రీకృష్ణుడు మరియు దృష్టద్యుమ్నుడు – సుభద్ర, ద్రౌపదిల సోదరులే కదా! భార్య తరఫు బంధు సహకారం తీసుకోవడం తప్పుగా భావించడమే తప్పు అని భావించండి.

◆ **గ్రహణం సమయం పుణ్యకాలమా? లేక అశౌచ కాలమా? గ్రహణ స్నానం ఎందుకు విధించారు. గ్రహణ నియమాలు ఏవి?**

అశౌచ కాలంలో జపము, పూజ, హోమం వంటివి చేయకూడదు. యిందులో మతాంతర పాఠం లేదు. గ్రహణ సమయంలో చేయు పూజాదికాలు జపము మరియు హోమం యివి చాలా విశేష ఫలితాన్ని యిస్తాయి. ప్రకృతికి ప్రత్యక్ష దైవములు

సూర్యచంద్రులు. వారికి రాహు కేతువుల ద్వారా వచ్చే అవరోధమే గ్రహణము. అటువంటి గ్రహణ కాలంలో ఎవరు ఏ జపము చేసినా ఏ విధమయిన కామ్య సంకల్పమూ వుండదు. దానికి కారణం గ్రహణ కాలంలో చేయు జపం సూర్య చంద్రులకు ధారాదత్తం చేయునది. అందువలన మన కోసం సంకల్పాలు చెప్ప కూడదు. ఏ విధమయిన దీక్ష చేసినా దీక్షారంభంలో స్నానం, చివర్లో అవభృధ స్నానం చేసినట్లే గ్రహణారంభంలోను అంత్యంలోను స్నానం చేయుట దీక్షాస్నాన లక్షణమే. భోజనం చేస్తే జపము చేయుటకు అనుకూలంగా శరీరము, శరీరంలో వున్న మూలా ధార చక్రం వంటివి సహకరించవు. యోగ శాస్త్ర ప్రకారం యోగము చేయుటకు నాలుగు గంటల పూర్వము ఆహారం తీసుకోరాదు అనే నియమాలను ఉద్దేశించి గ్రహణమునకు పూర్వము రెండు ఝాముల కాలము ఆహారము తీసుకోరాదని నిర్దేశించారు. యిలాగ గ్రహణకాలము పుణ్యకాలముగానే ఉద్దేశించి నియమాలు విధించారు. గ్రహణం అమావాస్య, పౌర్ణిమలు రోజున వస్తుంది. అది అనధ్యయన దినములు. ఎటువంటి నూతన విద్యాభ్యాసమునకు మంచిది కాదు.

### ◆ దేవాలయాలకు, గోపురాలకు బంగారం అవసరమా? TTD VS TV మీద మీ అభిప్రాయం?

ఈ ప్రశ్నకు కొంచెం ముతక సమాధానం చెప్పాలి. అంటే నీ చేతికి ఉంగరం అవసరమా? మెడలో అంత బంగారం అవసరమా! అని అడిగితే ఎలా వుంటుంది? మీ సమాధానం ఏమిటి? అలాగే మనం మన వృద్ధిని బట్టి విలువయిన వస్తువులు ఎలా ధరిస్తామో దేవాలయం దేవాలయ అభివృద్ధిని దృష్టిలోవుంచుకొని దేవాలయాన్ని ఎక్కువగా అలంకరణ చేయాలి. భక్తుడు "తన స్వామిని పెద్ద స్థాయిలో చూద్దాం" అనుకుంటాడు. దాంతో మీకు వచ్చే సమస్య ఏమిటి. సరే యిదే ప్రశ్న ఒక సిక్కు జాతీయుణ్ని వేయగలరా? మీకు స్వర్ణదేవాలయం అవసరమా! అని. అలాగే వేరే మతాలయాల విషయంలో ఈ ప్రశ్న వేయగలరా? యిది కేవలం హిందూదేశంలో హిందువులకు హిందూ మతాచరణ విషయాలకు జరుగుతున్న హీనమయిన స్థితి. మీరు అడిగిన విషయానికి శాస్త్రవచనం చెప్పాలి., అంటే శ్రీమద్భాగవతంలో శ్రీకృష్ణుడు ఉద్ధవుడికి బోధించిన దేవాలయాలు నిర్మాణ విషయాలు, నిర్వహణ విషయాలు తెలుసుకోవాలి. అలాగే ఆగమ శాస్త్ర ప్రకారం నిర్మాణ విషయాలు తెలుసుకోవాలి. మన యిల్లు కాంపౌండ్, కాంపౌండ్ గేట్ వివిధ గదులు ఎలా నిర్మాణం చేసుకుంటాం. మన జీవన శైలికి తగిన విధంగా అలాగే దేవాలయాన్ని కూడా ప్రాకారము, ప్రాకార ద్వారగోపురాలతో ప్రారంభించి దేవాలయ అర్చన నిర్వహణకు అగమ శాస్త్రం ప్రకారం చెప్పబడిన గదులు మండపాలు ఉదాహరణకు యాగశాల, వాహనశాల, పూతోట, కొలను, అంతరాలయం, ముఖమండపం, కళ్యాణ వేదిక వంటివి నిర్మాణం చేయాలి.

వాటికి యిక అలంకరణ అనేది దేవాలయ ఆదాయం, ఖర్చు, నిల్వ నిర్వాహణాధికారుల బుద్ధి, భక్తుల కోరిక వీటిని ఆధారం చేసుకొని దేవాలయం గోపురము స్వర్ణమయం చేయవచ్చు లేదా దేవాలయం మొత్తం స్వర్ణమయం చేయవచ్చు. ఆదాయం సరిగా లేకపోతే మనం ఫ్లోరింగ్ నాపరాయి వేస్తాం ఆదాయం బాగుంటేమనం ఫ్లోరింగ్ మార్బుల్ వేస్తాం. అది మన ఆదాయం, మన కోరిక. అలాగే దేవుడి విషయంలో మట్టి విగ్రహం దగ్గర నుండి రాగి, రాతి, వెండి, లోహం, బంగారు ప్రతిమలకు పూజచేయమని ప్రతివ్రత కథలలో చెప్పబడడానికి కారణం మనకు వుండే ఆర్థిక శక్తి అలాగే దేవాలయం నిర్మాణంలో కట్టడాలు శాస్త్రంలో నిర్వచించారు. వాటి అలంకరణ మాత్రం భక్తుల కోరిక అనుసారమే, అది తప్పు అనుట విమర్శించుట తప్పు.

యిక VS కి జవాబు ప్రతి లోను పొరపాట్లు వుంటాయి. వాటిని వెలుగులోకి తీసుకురావడం వాళ్లు చేస్తున్న గొప్పకార్యం. ఈ కార్యం కృతకృత్యతకు నోచుకుంటే గొప్ప. లేకుంటే వృధా. దేవుడి సొమ్ము వక్ర మార్గం లేకుండా చేయగలిగితేనే VS సక్సెస్ అయినట్లు. మనం అందరం అప్పుడు చేసిన యుద్ధాన్ని గౌరవిద్దాం. యిలా మోస పూరిత ప్రతీ వ్యవహారంలోనూ యుద్ధం చేసి గెలవాలని ప్రార్థిద్దాం. యుద్ధం మోస పూరితం కాకూడదు.

◆ **నా పుత్రుడు గంధర్వ విధిగా వివాహం చేసుకున్నాడు. ఇప్పుడు పెద్దల అంగీ కారంతో మామూలు వివాహం చేయాలి. ఏయే కార్యక్రమం చేయాలి?**

మీరు చాలా గొప్ప అదృష్టవంతులు. మీ పిల్లవాడు సమకుల యువతిని వివాహ మాడడం మీ వియ్యంకులు యిరువురూ అదృష్టవంతులే. మీ పిల్లలకు మరల వివాహం చేయదలిస్తే కన్యాదాన కార్యక్రమం చేయరాదు. మీ అమ్మాయి గాంధర్వ విధిలో వేరే వారికి భార్య అయినది. వేరేవారి భార్యను మీరు మరల కన్యాదానం అనే పేరుతో చేయుటకు అధికారం లేదు. అందువలన కన్యాదానం కార్యక్రమం ఆపివేసి మిగిలిన వేడుకలు అన్నీ చేసుకోవచ్చు. అగ్నిహోత్ర ప్రాధాన్యం వున్నవారు సముహూర్త కార్య క్రమాల తర్వాత అన్ని కార్యములు యధావిధిగా చేయవచ్చు. ఒక వేళ మీ పిల్లలు యధావిధిగా వివాహం చేసుకుంటే మరల అగ్ని హోత్రం కార్యములు చేయరాదు. వేడుకలే చేయాలి.

◆ **మనం నివాసం వుండే యిల్లు అద్దెకు యివ్వవద్దు అని పెద్దలు చెబుతారు. మరి దానికి వాస్తు శాస్త్రం ఆధారమా లేక యితర శాస్త్రాలు ఆధారమా?**

మంచి ప్రశ్న వేశారు. యిది శాస్త్రములు ఆచారములు కూడా ముడివేసిన ఆచారం. చాలా బలమైన ఆచారమే అందుకే పెద్దలు ఈ నిర్ణయం చేశారు. వాస్తుని నమ్మితే యితర హిందూ ఆచారాలు కూడా పాటింపవలసినదే. ఒక వేళ అద్దెకు యిస్తే వాస్తు రీత్యా ఏర్పాటు చేయబడిన గర్భం పంచుకున్నట్లు అవుతుంది. యితర దోషాలు వస్తాయి. 1. ఒక కుటుంబానికి ఒక యజమాని, ఒక గృహానికి ఒక

సింహద్వారం" 2. మరి యజమాని (యింటికి) సంబంధించినవాడు సింహద్వారంలో నడవాలి. 3. అద్దెకు వుండే యజమాని యితర ద్వారాలలో నడవడం అంటే అతడి రాజసం పోయినట్లే. 4. అందుకే అద్దెలకు యివ్వడానికి, మనం నివాసం వుండడానికి వేరేవేరేగా యిల్లు కట్టుకోవాలి. యిదే కాక వాస్తు రీత్యా యింకా యిబ్బందులు వుంటాయి. యిక ఆచారముల రీత్యా కొన్ని అవరోధాలు వున్నాయి. అవి 1. ఉదయకాలంలో సూర్యోదయానికి ముందే వాకిలి కడిగి ముగ్గువేసి ఉదయలక్ష్మిని ఆహ్వానించాలి. మీరు పాటిస్తారు. అద్దెకు వున్నవారు పాటింపకపోతే? 2. మీ యింటిలో అద్దెకు వున్నవారికి సెంటిమెంట్లు లేకనో, లేక, తెలియకనో శనివారం నాడు ఉప్పు, చెప్పు, కఱ్ఱ, పత్తి వంటివి కొనడం లేదా మార్గశిర లక్ష్మీవారం నోములో చెప్పినట్లుగా సాయం సంధ్యాకాలంలో యింటికి తాళం వేసి బయటకు వెళ్ళడం లేదా సంధ్యాకాలంలో గుమ్మంలో కూర్చొని తలదువ్వుకోవడం వంటివి చేయడం వంటివి చేస్తే గుమ్మంలోకి వచ్చిన లక్ష్మి వెనక్కువెడితే మరి ఆ యింటి యజమాని స్థితి? అందుకే ప్రధాన గృహము అయిన గ్రౌండ్ ఫ్లోర్ యజమాని పూర్తిగా అనుభవించి ఉపగృహాలు అయిన పై అంతస్థులు అద్దెకు యివ్వాలి తప్పనిసరి అయితే. నేటి స్పీడ్ యుగంలో అద్దెకు ఎవరికైనా యివ్వక తప్పదా. అందుకు గాను ఉపగృహాలు అద్దెకు యివ్వండి. ప్రధాన గృహం మీరే అనుభవించండి. ప్రధాన గృహం గ్రౌండ్ ఫ్లోర్. దానికి పెట్టేది మాత్రమే సింహద్వారం అంటారు. కమర్షియల్+రెసిడెన్షియల్ బిల్డింగ్‌లకు ఈ నియమం వర్తించదు.

### ◆ మత మార్పిడి చేసుకోవడం తప్పా?

రాజ్యాంగం స్వేచ్ఛగా యిష్టానుసారంగా చేసుకోవచ్చు. అయితే యిలా మార్పు చేసుకోవడం విషయంలో ప్రలోభం, బలవంతం, వ్యాపారధోరణి వుండ కూడదు. అన్ని మతాలు శాంతినే బోధిస్తాయి. సన్మార్గమే బోధిస్తాయి. కేవలం మతం మార్చుకున్నంత మాత్రాన పుణ్యమూరాదు, మోక్షమూ రాదు. మతంలో బోధించిన నీతి పాటించకుండా మత మార్పు చేసుకోదలచిన వారు వారి పాత మతంలో చెప్పిన నీతి పాటించామా? ఎందుకు పాటించలేకపోయాము? కొత్త మత నీతి మనం ఎంత వరకు పాటింపగలము ఆలోచించి అడుగు ముందుకు వేయాలి. ఒక డాక్టరు చెప్పిన మందు వేసుకోకుండా, మరో డాక్టరు దగ్గరకు పరుగెడితే ఉపయోగముంటుందా? "సత్యంవద ధర్మంచర" కంటే యింకా ఏ యితర ధర్మము ఏ మతంలోను ఉండదు. ఇవి ఆచరించకుండా మతం మారడం మతాలను అపహాస్యం చేసినట్లు అవుతుంది.

### ◆ వేదము గొప్పదా? జ్యోతిష్యము గొప్పదా? అలాగే సిద్ధాంతి, జ్యోతిష్కుడు, వేద పండితుడు వీరిలో తేడా ఏమిటి?

వేదములో అంతర్భాగము జ్యోతిష్యము. వేదము సర్వ శాస్త్ర నిక్షిప్తము. వేదములో కేవల జ్యోతిషం ఒకటే కాక యితర శాస్త్రాలు కూడా వున్నాయి. వేదము నుండే

సకల శాస్త్రాలు ఉద్భవించాయి. అందువలన వేదమే గొప్పది. తల్లివేదము, సంతతి శాస్త్రము. అందుకే పురాణాలలో వేదము చదవకుండా శాస్త్రం చదివిన వారిని నిందితులుగా చెప్పి, వేదం చదవని దోషం పోవడానికి రోజూ సహస్ర గాయత్రీ చేయమని చెప్పారు. అంతేకాక వేదం చదివిన వారిని వేదపండితులు అనీ, శాస్త్ర పండితులు (శాస్త్రి) అంటారు. వేదంలో గ్రేడ్‌లను బట్టి క్రమపాఠీ (అవధాని) ఘనపాఠీ, అని వున్నాయి. కేవలం జ్యోతిషం చదివిన వారిని "జ్యోతిష్కుడు" అని పంచాంగ గణితం చేయగలవారిని "పంచాంగ కర్త" అని అంటారు. జ్యోతిష శాస్త్రమునకు ఆధారం అయిన పంచాంగ గణితాల మీద విమర్శ చేయగల చర్చ చేయగల ధీరులను సిద్ధాంతి అనాలి. అలాంటి సిద్ధాంతులు యావద్భారతంలో అతిస్వల్ప సంఖ్యలో వున్నారు. సుమారు వంద సంఖ్యలోపు వున్నారు. జ్యోతిషశాస్త్రంలో వైదిక కర్మకాండ ప్రారంభమునకు సంబంధించిన ముహూర్తములు వుంటాయి. అందుకే వేదమునకు జ్యోతిషము నేత్రముల వంటివి అని చెబుతారు. వేదపండితుడు సర్వశాస్త్రములు మీద అవగాహన కలిగివుంటే అతడే వేద సంస్కృతికి మూలపురుషుడు, యోగి అవుతాడు.

### ◆ స్వరములు అనగా ఏమి?

వివిధ శాస్త్రములలో వేరువేరుగా దీని గూర్చి చెప్పబడ్డాయి. ఉదాహరణకు సంగీతంలో సప్తస్వరములు అనే పేరుతో "సరిగమపదని"లను చెబుతారు. వేదంలో పలుకుబడికి సంబంధించి స్వరం అంటారు. అనుదాత్త ఉదాత్త స్వరితములు అనేవి స్వరమునకు సంబంధించిన విశేషములు. పలుకుబడి ప్రధానంగా వున్నది వేదం. దానికి శబ్దము స్వరం విశేషం. వ్యాకరణ శాస్త్రంలో "అచ స్వరాః" అని సూత్రం. అనగా అచ్చులు స్వరములుగా చెప్పబడ్డాయి.

### ◆ నివేదన గురించి పాటించవలసిన నియమములు?

యిది తెలుసుకునేటప్పుడు పూర్వం నుండి మనం మనపెద్దలు ఆచరించిన కొన్ని ఆచారాలు తెలుసుకోవాలి. అవి 1. నివేదన చేసిన ఏపదార్థం అయినా ప్రసాదం అవుతుంది. అటువంటి ప్రసాదం పారవేయకూడదు. పనివారికి యివ్వవలసి వస్తే వారికి కూడా "విస్తరి" వేసి వడ్డించి తినిపించాలి. అంతేకానీ ఆ పదార్థం పారవేస్తే అవమానం చేసినట్లు అవుతుంది. అందుకే నివేదన చేయు పదార్థం వేరేగా ఒక పళ్ళెంలోకి తీసి నివేదన చేయాలి. అది లఘువుగా వుంటుంది కావున పారవేయు అవకాశం వుండదు. 2. నివేదన చేసిన పాత్ర "దేవుడికి సంభంధించిన వస్తువు" అవుతుంది. దేవుడికి సంబంధించిన ఏ వస్తువులు అయినా పనివారికి యిచ్చి శుభ్రం చేయిస్తే అష్టఐశ్వర్యాలలో ఏదో ఒక ఐశ్వర్యలోపం కలుగుతుంది. 3. ఈ దృష్ట్యా వండిన పాత్రలతో ప్రత్యక్షంగా నివేదన చేయడం పనికిరాదు. 4. వండిన గిన్నెలో నుండి

వేరే పళ్ళెంలోకి తీసి నివేదన చేసి అ నివేదన చేసిన పదార్థం యింటిలోని వారు (ప్రధానంగా యజమాని) తినడం అనేది ఒక ఆచారంగా ఏర్పాటు చేశారు. 5. అందుకే అందరూ భోజనం చేయునప్పుడు వారి వారి పాత్రలలోని పదార్థములు నివేదన చేయడం ముఖ్యము. దేవునికి నివేదన చేయని పదార్థం భుజింపరాదు. ఈ విషయాల ఆధారంగానే యింటిలో పాత్రలు శుభ్రం చేయువారికి ఎంగిలి వస్తువులు కడుగుటకు వేయుట నిషేధము అని, ఎంగిలి పాత్రలు వెంటనే శుభ్రం చేయకపోతే ఆయింట లక్ష్మికి ఆగ్రహం రాగలదని కనీసం ఎంగిలి పాత్రలు వెంటనే కడగాలి అని చెబుతారు. యిలా దేవుని పాత్రలు, నివేదన పాత్రలు, ఎంగిలి పాత్రలు ఒక చోట వుంచకూడదు అనే విషయంగా యింత కట్టడి చేశారు. అన్నీ కూడా శాస్త్రాలను ఆధారం చేసుకొని చెప్పనవే.

### ◆ సంఘంలో మనం చేస్తున్న పొరపాటులు ఏమిటి?

చాలా చేస్తున్నాం. ఉదాహరణకు కవర్ల మీద, సంచుల మీద, బిల్‌బుక్స్ మీద అన్నింటి మీద దేవుడు బొమ్మలు వేస్తున్నాం. అవసరం తీరిపోగానే ఆ బొమ్మలు ఎక్కడికి వెళుతున్నాయి. చెత్తలోకి వెళుతున్నాయి. మరి మనమే స్వయంగా దేవుడు బొమ్మలు చెత్తలో వేయు అవకాశం ఖండించడంలేదు కదా! అలాగే దేవుడు తలలు నరికినట్లుగా గోచరించే దేవతల శిరస్సులు మాత్రమే పూజలో పెట్టుకోవడం. ఉదాహరణకు మొండం వరకే ఉన్న వెంకటేశ్వరస్వామి బొమ్మ కేవలం గణపతి తలకాయ బొమ్మ పూజలో పెట్టి పూజ చేస్తున్నాము. అలాగే ఎన్నో రకాలయిన తప్పులు మనం చేస్తున్నాము.

### ◆ పురాణాలలో ఒకే రకమైన కథలు ఆవృతం అయినాయా?

అయినాయి. సృష్టిక్రమం, ధృవ, హరిశ్చంద్ర, రామ, నృసింహ, కృష్ణ, దక్షయజ్ఞ, బలిచక్రవర్తి, ద్వీపవర్ణన, శ్రాద్ధకల్పములు ఇలాంటివి ఆవృతం అయినాయి.

### ◆ గాయత్రీ చేయకుండా యితర పూజలు చేయరాదా?

గాయత్రీ అనుష్టాన అధికారం వున్నవారు గాయత్రీ జపం చేయకుండా యిక ఏ ఇతర జప, దాన, హోమాది కర్మలు చేసినా అవి నిష్ప్రయోజనమే నేటి ఆధ్యాత్మిక గురువులు ఈ విషయం సరిగి ప్రచారం చేయడంలేదు.

పురాణాలలో గాయత్రీ మహిమ చాలా చెప్పబడినది.

మూడు కాలములలోను ఎక్కడవున్నడూ గాయత్రీ విధిగా చేయవలెను.

*"నగాయత్ర్యాః పరంమంత్రం నమాతుః పరదైవతమ్"*

### ◆ అన్ని రకాలయిన యాగములలోను, వేద పారాయణ, సూర్య నమస్కారములు చేయిస్తారు కారణం తెలుపగలరు. శివ కేశవ భేదం వున్నదా?

వేదము సృష్ట్యారంభంలో అపౌరుషేయంగా వచ్చినది. యిది పూర్తి శివమే "వేదః శివః శివః వేదః." సర్వ విజ్ఞాన గని వేదం. సృష్టి విషయాలు అన్నీ వేదంలో

వున్నాయి. అలాగే సర్వ దేవతా మంత్రాలు వేదంలో వున్నాయి. అందుకే వేదధ్వని వింటే ఎన్నో లాభాలు కలుగుతాయి అని పెద్దలు చెబుతారు. అమ్మవారికి సంబంధించిన యాగాలు చేస్తున్నారు "చండీయాగం" "లక్ష్మీయాగం" "దుర్గాయాగం" వంటివి. మరి ఆ యాగాలలో వేద పారాయణ ఎందుకు అని అనుమానం రావచ్చు. జగదంబ ఎవరు? సాక్షాత్ "శివజ్ఞాన ప్రదాయినీ" అని లలితా సహస్రంలో వున్నది. అలాంటి శివ జ్ఞానం అంటే ఏమిటీ వేదః శివః శివః వేదః అనుకున్నాం కదా ! శ్రీలలిత శివజ్ఞానం అందించే మాత కావున ఆవిడ శివజ్ఞాన ప్రదాయినీ కావున అంబ సంభంధమయిన యాగాలు అన్నింటిలోను వేద పారాయణ చేయడం శ్రేష్ఠం. మరియిక యితర యాగాలు శివ సంబంధమయినవి రుద్రయాగం, గణపతి, మన్యు, సుబ్రహ్మణ్య వంటి శివ గణాల సంబంధమయిన యాగాలలో సాక్షాత్ శివ స్వరూపంగా చెప్పే వేద పారాయణ లేకుండా యాగం చేయకూడదు. విష్ణు సంబంధం శోధిస్తే శివకేశవులకు భేదం లేదు అని కదా! అందువలన వేదపారాయణ విష్ణు యాగాలలో చేయవలసినదే. "శివాయ విష్ణు రూపాయ శివరూపాయ విష్ణవే". అంతేకాక శివకేశవులకు భేదం లేదు. యిరువురూ ఒకటే అని సాక్షాత్ విష్ణ్వాంశ సంభూతుడు వేదవ్యాసుడు రాసిన పురాణాలు అన్నింటిలోను వున్నది. శివుడు అంటే మంగళప్రదుడు. అందుకే మంగళప్రదమయిన వేదమును యాగాలలో ఉపయోగించేది. అంతేకాక ప్రత్యక్ష నారాయణుడు సూర్య నారాయణుడు. ఈయనను సూర్యనమస్కారములు రూపంగా అర్చించడం యాగాలలో జరిగే విశేషం.

### ◆ పంచక రహితం, పుష్కరాంశ అనేవి చాలా అత్యావశ్యకమయిన విషయములా?

ఈ రెంటిని ముహూర్తాలు శోధించే విషయంలో ముఖ్యమయిన అంశాలుగా ఆంధ్రదేశంలో మాత్రమే ప్రచారంలో వున్నది. యిక యితర రాష్ట్రాలలో లేదు. ప్రస్తుతం పంచకరహితం యితర రాష్ట్రాలవారు చూడడం లేదు అనుటకు తార్కాణం వారి వారి ప్రాంతాలలో జరిగే శుభకార్య ముహూర్తాలు మాత్రమే మనకు ఆధారం. అలాగే పుష్కరాంశ అనేది చెప్పిన శాస్త్రజ్ఞుడు "కునవాంశ" అనే అంశం కూడా చెప్పారు. అంటే ఏక వింశతి దోషములలో ఒకటి అయిన "కునవాంశ" ఆధారంగా కేవలం పుష్కరాంశకు మాత్రం అంత గొప్ప ప్రాధాన్యత యివ్వనవసరం లేదు అని తెలుస్తోంది. అందుకే తమిళనాడు కర్ణాటక వంటి రాష్ట్రాలలో ముహూర్తాలు 7-30 నుండి 8-00 అని 9-00 నుండి 9-30 అని యిలాగ యిస్తారు. దీని ప్రకారం చూస్తే వారు కునవాంశ విషయం ఆధారంగా ముహూర్తాలు నిర్ణయం చేస్తున్నారు. మనవారు కేవలం పుష్కరాంశ ఆధారం చేసుకొంటున్నారు. రెండూ గ్రాహ్యములే. నిందితి తములు కానివి అందరూ ఆచరిస్తున్నవి కావున రెండు విధానాలు అమలు చేయ వచ్చు. కేవలం పుష్కరాంశ విధానం కూడా దోషం కాదు. అదే ఆధారం కాదు.

◆ **భోజనం అయిన తరువాత భోజన పాత్ర కడగకపోతే "దరిద్రం" అంటారు. దరిద్రం అంటే ఏమిటి?**

సామాన్య మానవుడు అనుభవించవలసిన వనరులను దేనినయినా సరిగా అనుభవింపకలేకపోతే దానిని దరిద్రం అనే పదంతో సంబోధించటం పెద్దల అలవాటు. "ప్రకృతి అంతా లక్ష్మి స్వరూపమే" అని దేవీ భాగవతం తెలియజేస్తుంది. ప్రకృతి సిద్ధంగా జీవన శైలిలో దేనిని అనుభవింపలేకపోతున్నామో! అనుభవించటానికి కావలసిన వనరులను దేనిని పొందలేకపోతున్నామో అవన్నీ దరిద్రంగా సంబోధించాలి. దరిద్రం అంటే కేవలం ధనం లేకపోవడమే కాదు. ధనం ఉండి అనుభవింప లేకపోయిన స్థాయిని దరిద్రంతో సంబోధించాలి. ఆహారం, ఆరోగ్యం, సంతానం, మానసిక ప్రశాంతత, కుటుంబ సౌఖ్యం, విద్య, ధైర్యం ఇలా ఎన్నో ముఖ్య అంశాలు జీవితంలో పొందలేకపోతే అది మనిషికి సాఫల్యతను ఇవ్వదు. అందువలన ఇలాంటివి ఏది లేకపోయినా అది దరిద్రమే. సంపూర్ణ మానవుడు పైన ఉదహరించినవి అన్నీ అనుభవించాల్సిందే. సుఖము సంతృప్తి అనేవి ఐశ్వర్య ప్రదములు. ధనము ఒకటి ఉన్నవాడు ఐశ్వర్యవంతుడు కాడు. **అన్ని విధాలుగా సుఖము సంతృప్తి ఉన్నవాడే ఐశ్వర్యవంతుడు.** ఇక ఇలా ప్రశాంత జీవనం ద్వారా ఐశ్వర్యవంతులు కావడం కోసమే మనవారు ఎన్నో రకాలైన ఆచారములు ఏర్పరచారు. అందులో ఒకటి ఆహారం తినిన వెంటనే పాత్రలు శుభ్రం చేయడం అనేది. దీనికి కారణం ఇంట్లో దేవతా నివాసం ఉంటుంది కదా! భారతీయ సంస్కృతి ప్రకారం ఇంట్లో "లక్ష్మి" దేవత తిరుగాడుతుంది అని భావన అందరికి ఉంటుంది. అందుకే మనం సుఖంగా ఉన్నాం అనేది మన భారతీయుల భావన. అలాంటి సందర్భంలో లక్ష్మి తిరుగాడు గృహంలో ఎంగిలి పాత్రలు ఉంచరాదు కదా? ఇంకా ఏమైనా విశేషాలు చెప్పారా? అనే అంశం ప్రస్తావించారు బాగుంది. ప్రాచీనులు చాలా చెప్పారు. రోజు మనం నడవడి ఆధారం చేసుకుని చాలా నియమాలు చెప్పారు. అందులో ప్రతి అంశము – వైద్యము, భౌగోళిక స్థితి, వాతావరణము, వైదిక నియమాలు, వాస్తు వంటి శాస్త్రములు ఆధారం చేసుకుని నియమబద్ధమైన జీవనశైలి అందించటం కోసం మనకు ధర్మశాస్త్రంతో కలిపి తెలియచేశారు. అన్ని నియమాలు ఇక్కడ తెలియచేయడం కష్ట సాధ్యం.

◆ **ఆడవారు తలనీలాలు ఇవ్వవచ్చా?**

ఆడవారి విషయమే కాకుండా మగవారు కూడా పూర్తిగా తలనీలాలు తీయడం శాస్త్రదూరమైన విషయం. తిరుమల స్వామికి తలనీలాలు యివ్వడం కలి ఆరంభం నుండి వున్నది. అయితే అందరూ గతంలో తిరుపతి వరకు వెళ్ళలేక ప్రతి ఊరిలోని వేంకటేశ్వరుడికి తలనీలాలు యివ్వడం జరుగుతున్నది. అంతవరకు సమంజసమయిన విషయమే. వేంకటేశ్వరుని విషయంలో తలనీలాలు ఆడవారు యివ్వడం అనే

విషయమై చర్చ చేయకూడదు. “ఆత్మ బుద్ధి స్సుఖంచైవ”. మరి శక్తి క్షేత్రాలలో అమ్మవారి ఆలయాలలో పసుపు కుంకుమలు యివ్వాలి కానీ జుట్టు యివ్వడం సరికాదు. అది 100శాతం తప్పు. రెండవ విషయం వేంకటేశ్వర క్షేత్రాలలో కాక యితర క్షేత్రాలలో జుట్టు యివ్వడం అనేది వ్యాపార దృక్పథమే. దీనిని కాదనటానికి ఆధారం లేదు. సౌభాగ్య వస్తువులలో పుష్పం ఒకటి. దానిని రోజూ శిగలో ధరించాలి. మగవారికి తలనీలాలు యిచ్చే విషయంలో శిఖ ప్రమాణం వుంచి మిగిలినవి మాత్రమే యివ్వాలి అని శాస్త్రం. యిక ఆడవారు పూలు ధరింపకుండా సౌభాగ్య స్త్రీలు వుండరాదు. పూర్తిగా (శిఖ లేకుండా) మగవారే తలనీలాలు యివ్వడం తప్పు అనినప్పుడు ఆడవారి విషయంగా ఎలా ఒప్పు అవుతుంది. శిఖ లేకుండా శిఖా బంధనం చేయకుండా ఆచమనం చేయరాదు. ఆచమనం చేయనిదే పూజలు పనికిరావు కావున మగవారు పూర్తిగా తలనీలాలు యివ్వడం నిషేధం. భర్త పోయిన ఆడది మాత్రమే తలనీలాలు తీయడం సాంప్రదాయం. ప్రయాణ సౌకర్యాలు లేని రోజులలో దగ్గర్లోని క్షేత్రంలో పుట్టు వెంట్రుకలు తీయడం ఆచారంగా మారి అదే యిప్పుడు శాస్త్రం అయి విలసిల్లుతోంది. దేవాదాయ శాఖవారు దానితో వ్యాపారం చేయుచున్నారు. భర్త వున్న స్త్రీ తలనీలాలు యివ్వడం తప్పు.

### ◆ దేవాలయానికి, మందిరానికి తేడా ఏమిటి?

దేవాలయమునకు సంబంధించిన నియమములను కొన్నింటిని ఆచారముల తోను, కొన్నింటిని సామాజిక నియమములతోను, వైద్య విజ్ఞాన నియమములతోను నిర్ణయించారు. ఈ నియమాలు ఎన్నో వైజ్ఞానిక విశేషాలతో ఏర్పరచినవి. శ్రీమద్భాగ వతంలో శ్రీకృష్ణుడు ఉద్దవుడికి బోధించిన ఆగమ శాస్త్రం, మత్స్యపురాణం. అగ్ని పురాణాలలో ఆగమ శాస్త్రముల దృష్ట్యా మహర్షులు యింకా ఎన్నో విశేషాలు యిచ్చారు. దేవాలయ నియమాలకు ప్రధాన ఆధారం ఆగమ శాస్రం. ఈ ఆగమ శాస్త్రంలో పాంచరాత్ర ఆగమం, వైఖానస ఆగమం, శైవా(స్మార్తా)గమం మూడు ప్రధానమయినవి. ఆగమ శాస్త్రంలో ఆలయ నిర్మాణ నిర్వహణ విశేషాలు చెప్పబడ్డాయి. ఆలయమునకు ధ్వజం, గోపురం, యాత్రం వాహనం వుంటాయి. మందిరానికి వుండవు.

### ◆ విగ్రహారాధన ఎందుకు?

ఆలయాలు ఎందుకు “చిన్మయస్య అద్వితీయస్య నిష్కలస్య అశరీరిణః ఉపాసకానాం కార్యాణాం బ్రహ్మణో రూపకల్పనా” అని భాగవతంలో శ్రీకృష్ణ ఉవాచ. విగ్రహారాధన ఎందుకు అనే విషయయంలో చిన్మయము, అద్వితీయము, నిష్కళము అయిన పరమాత్మను ఉపాసకులకు కార్యసిద్ధి కొరకు బ్రహ్మగారు విగ్రహాలుగా రూపొందిం చారు. అశరీరమయిన పరమాత్మకు వివిధ రూపాలను ఉపాసకుల సౌలభ్యం కోసం రూపకల్పన చేయబడినది.

◆ **ఆలయాల్లో చేసే పూజలు, ఇండ్లలో చేసే పూజలు ఒకటేనా?**

అటువంటి దేవతామూర్తుల విగ్రహాలను మన కోసం యింటిలోను, మన అందరి కోసం దేవాలయాలలోను అర్చన చేయు విధానం ఏర్పాటు చేశారు. కొందరు దేవతామూర్తులు స్వయంభువుగా వస్తే కొందరిని మన పూర్వీకులు నిర్మాణం చేశారు. అందు భాగంగా దేవాలయంలో చేయు అర్చనలకు యింటిలో చేయు అర్చనలకు షోడశోపచార పూజా క్రమ విశేషములు ఒకటే అయితే ఆగమ శాస్త్ర రీత్యా దేవాలయంలో అర్చనా విధానాలు ఏర్పాటు చేశారు.

◆ **దేవాలయమున ప్రవేశించేటపుడు ముందుగా కాళ్లు కడుక్కోవాలా?**

దేవాలయమునకు అయినా యింటి లోపలకు అయినా బయట నుండి రాగానే కాళ్ళు కడుగుకోవాలి. కాళ్ళు కడుక్కోకుండా యింటి లోపలకు వస్తే ఇంట్లో లక్ష్మి నిలవదు. ఈ నియమంలో బయట తిరిగి లోపలకు వెళ్ళి కాళ్ళు కడుగుకొని దేవాలయంలోకి వెళ్ళాలి. రహదారి వీధిగా యింటికి వెడతాం కావున యింటి లోపలకు వెళ్ళేటప్పుడు కాళ్ళు కడుగుకుంటాం.

◆ **దీపాలను దేవునికి ఏ ప్రక్కన ఉంచాలి?**

దేవాలయంలో అయినా యింటిలోనయినా దీపాన్ని యిరువైపులా వుంచాలి. ఒక ప్రమిదలో దీపారాధన చేయు సందర్భంలో దేవునికి కుడివైపు దీపారాధన వుంచాలి. అలాగే ఒక ప్రమిదలో ఒక వత్తితో ఒక దీపం దేవునికి చూపరాదు. ఒక కుంభ వత్తి ఊర్ధ్వదిశగా వెలుగునట్లుగాను ప్రమిదలో మరొకటి తూర్పు లేదా ఉత్తరదిశలలో ఉండునట్లు వెలిగించాలి. రెండు దీపాలు కాకపోతే ఒక ప్రమిదలో చతుర్దిక్షులకు నాలుగు దీపాలు ఒక ఊర్ధ్వదీపం (కుంభ వత్తి) వేసి దీపారాధన చేయాలి. దీపారాధన నేల మీద వుంచరాదు. ప్రమిద క్రింద ఏదేని ఆకు ఉంచాలి.

◆ **స్త్రీలు పురాణములు చదవవచ్చా?**

స్త్రీలు పురాణములు చదవడం వలన వారికి పౌరాణిక విజ్ఞానం పెరుగుతుంది. తత్ప్రభావంగా సాత్వికత మరియు సందర్భానుసారంగా ప్రవర్తించడం వంటి లక్షణాలు పెరుగుతాయి. పురాణ ప్రవచనం మరియు శ్రవణం ఇవి రెండు మనిషికి భక్తి జ్ఞాన చైతన్యం ఇచ్చేవి కావున వీటిలో ఆడవారికి, మగవారికి అనే భేదం లేదు. మంచి మాటలు వినడం, పఠనం చేయడం సర్వదా శ్రేయస్కరమే కదా! స్త్రీలు పురాణ పఠన, శ్రవణాదులు చేయడం వలన వారి పిల్లలు కూడా సన్మార్గంలోకి వెళ్ళే అవకాశం ఎక్కువగా ఉంటుంది. వంశవృద్ధి ధర్మరక్షణతోనే ఉంటుంది.

◆ **పూజకు, హోమంకు తేడా ఏమిటి?**

హోమం యాగం వంటివి విశేషం. అగ్ని ద్వారా దేవతలకు నివేదనలు పంపడాన్ని హోమం, యాగం అంటారు. అగ్ని పవిత్రం కదా! నివేదన చేయు వస్తువులు అగ్ని

ద్వారా పంపుట, ఆ దేవతలకు ప్రీతి అయిన వస్తువులు పంపుటను విశేషంగా ఆగమశాస్త్రం తెలుపుతోంది. షోడశోపచార పూజలలో దీపం, నివేదన ప్రధానమయినవి. అందుకే వాటిని స్వగృహంలో చేసుకోవచ్చు హోమం చేయాలి అంటే యింట్లో అంతా పవిత్రంగా వుండాలి. లేని ఎడల దేవాలయంలో చేసుకోవడం మంచిది. నదీ తీరం పుణ్యక్షేత్రం వంటి వాటికి అపవిత్రత లేదు అని శాస్త్రం. అందుకే నదిలో నీరు బాగా లేకపోయినా నదీ స్నానం విశేషం. తీర్థం తీసుకుని చేయి కడుక్కుంటే ఫలితం పోతుంది. అందుకే తీర్థ సేవనం అనంతరం చేయి తలకు రాసుకోవాలి.

### ◆ దేవాలయాల్లో ఎన్ని ప్రదక్షిణలు చెయ్యాలి?

దేవాలయాలలో ప్రదక్షిణాలు మహర్షులు అనుకూలం కోసం ఏర్పరచినవే. 1,3,11 అన్ని చోట్లా విశేషం. శివాలయంలో చండీ ప్రదక్షిణాలు విశేషం అని చెప్పబడ్డాయి. సోమసూత్రం దాట వద్దని అందుకుగాను ధ్వజస్తంభం సోమసూత్రం నంది ఆధారంగా చండీ ప్రదక్షిణలు ఏర్పరచారు. 41, 108 ప్రదక్షిణాలు కూడా చేయవచ్చు.

### ◆ కోపం, కోరిక అనర్థాలకు కారణమా?

***ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తే షూపజాయతే***
***సంగాత్ సంజాయతే కామః కామక్రోధోధి జాయతే***
***క్రోదాధ్భవతి సమ్మోహః సంమోహ స్మృతివిభ్రమః***
***స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి***

అయ్యా! దయచేసి ఈ శ్లోకం అర్థం తెలుసుకోండి. భగవద్గీత చదవండి. రామాయణం, బాలకాండ 51వ అధ్యాయం నుండి 57వ అధ్యాయం వరకు విశ్వామిత్రుల వారి కథ చదివితే క్రోధం వలన ఆయన చేసిన పొరపాట్లు తెలుస్తాయి. అలాగే ధృవచరితలో కూడా కోపం వలన సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షం అయినపుడు ఆయన మోక్షం కోరుకోకుండా ఉన్నత స్థానం కోరుకుని పొరపాటు పడ్డాను అని బాధపడిన సందర్భానికి కారణం క్రోధమే అని మనకే తెలుస్తుంది.

### ◆ దేవుని పూజ చేయించే సమయంలో మన పేరు చెప్పాలా? ప్రత్యక్షంలో ఉండాలా?

దేవునికి పూజచేసినా లేదా హోమం, యాగం, అన్నప్రాశనాది కర్మలు ఏమి చేసినా పూర్తి పేరు వాడకపోతే అది ఆ వ్యక్తికి చెందదు. మన గ్రామంలో జరిగే పూజలు మనం లేకుండా మన పేరున జరిగితే అది అరిష్టము. పూజా కాలంలో ఒక వేళ మనం నిద్రలోనే లేక బాత్, టాయ్‌లెట్ వంటి వాటిలో ఉన్నప్పుడు దోషం వస్తుంది. అందువలన మనం ప్రత్యక్షంగా వుండి మాత్రమే పూజలు చేయించుకోవాలి. మనం ఎక్కడో వుండి డబ్బులు కడితే అది రాజసం అవుతుంది. దేవుని దగ్గర రాజసం సర్వం

క్షౌరం చేస్తుంది. యితర గ్రామాలలో దేవాలయాలలో మాత్రం మనం లేకుండానే మన పేరున పూజలు జరగవచ్చు.

### ◆ శఠగోపం ఎందుకు?

దేవుని దగ్గర పాదముల మీద పుష్పములు వుంచి అర్చన చేస్తాం. ఆ పాదములు స్పృశించి నమస్కరించి పుష్పములు "శిరసాధారయిష్యామి" అంటారు. కావున ఆ పాదములు స్వయంగా తాకడం కుదరదు. కావున ఆ పాదముల ప్రతిరూపంగా శఠగోపం మీద వున్న పాదుకలను స్వామి వారి పాదములు అని భావించి వాటిని శిరస్సున వుంచుకొని ఆ తర్వాత స్వామికి పూజించిన అక్షతలు శిరస్సున ధరించాలి.

### ◆ 'కానుకలను హుండీలోనే వేయండి' అని బోర్డులు పెడతారు? అదే సరైనా విధానమా?

శఠగోపం పెట్టించుకొన్న తర్వాత, మంత్రపుష్పం ఆ తర్వాత మనం మన శక్త్యానుసారంగా భగవంతుడికి కానుకలు ఆ పాదాల దగ్గర వుంచాలి. ఆ కానుకలు స్వామిపాదాల దగ్గర వుంచడం కుదరదు కావుననే పాదుకలతో కూడిన శఠగోపం వుంచిన పళ్ళెంలోనే కానుకలు వుంచాలి. నేటి రోజులలో ఎండోమెంట్స్ వారి దౌర్భాగ్య పాలన వలన స్వామికి కానుకలను హుండీలో వేయడం జరుగుతోంది. పాదుకల దగ్గర (శఠగోపం దగ్గర) వేయడం కుదరడం లేదు.

### ◆ తోరణములు ఎందుకు కడతారు?

కొబ్బరి అరటి మామిడి మంగళప్రదమయినవి అందుకే వాటిని పూజా సమయంలో వాటి ఆకులతో తోరణములుగాను వాట ఫలములు నివేదనకు వాడతారు. కొబ్బరి, అరటి చెట్లు యొక్క పుట్టుకలో కూడా ఒక విశేషం వున్నది అని పురాణ వాదన. అవి పచ్చదనపు శోభను కలిగిస్తాయి. ప్రత్యేకించి మామిడి ఆకులు పచ్చగా ఉన్నంతసేపు ప్రాణవాయువు అయిన ఆక్సిజనును అందిస్తూ, ఆహ్లాదకరమైన వాతావరణాన్ని కలిగిస్తాయి.

### ◆ దేవుని ఎదుట టోపీ ధరించవచ్చా?

దేవతార్చన సమయంలో తలపాగా (టోపి) కిరీటం వంటివి వుంటే దేవుని ఆశీర్వచనం వాటికి పోతుంది. పూజ చేయువాడికి అందదు. దేవుడి పాదాల దగ్గర మన దృష్టి ఉండి దేవుడి ఆశీర్వచనం మన శిరస్సుకు ప్రత్యక్షంగా అందాలి. దానికి టోపి అడ్డుకారాదు.

### ◆ రాముని కంటే సీత పెద్దదా?

చాలామంది అనవసరమైన ఈ సందేహాన్ని కలిగిస్తారు. సీత రామునికంటే చిన్నదే కానీ, పెద్దది కాదు. వివాహ సమయానికి రాముని వయస్సు పన్నెండు లేక పదమూడు సంవత్సరములు, సీతకు ఆరుసంవత్సరములు. వివాహానంతరం వారు

పన్నెండు సంవత్సరములు అయోధ్యలో వున్నారు. వనావాసానికి బయల్దేరినపుడు రాముని వయసు ఇరవైఅయిదు సంవత్సరములు సీత వయస్సు పదునెనిమిది సంవత్సరములు. రామాయణంలో సీత చెప్పిన దానిని బట్టి పెద్దలు చేసిన పరిష్కారం.

### ◆ వేద విభాగం రామాయణ కాలం నాటికి వున్నదా? వుంటే మరి ద్వాపర యుగంలో చేసిన వ్యాసుల వారికి వేద విభాగ కృత్యం ఏమిటి?

వేదము మొదట సృష్ట్యారంభంలో ఒక రాశివలె వుండెడిది. దానిని వ్యాసుల వారు ప్రతి ద్వాపర యుగంలోను అవతరించి వేదాలను ఋక్, యజుః, సామ, అధర్వ వేదములుగా విభజన చేస్తారు. వ్యాసుడు ప్రతి ద్వాపర యుగంలోను మారతారు. ఆయన చేసిన విభాగం ప్రకారమే తర్వాత వచ్చే కలి, కృత, త్రేతాయుగాలలో వేద మంత్రము వాడకం జరుగుతుంది. రాములవారు రామాయణంలో అరణ్య వాసమునకు వెళ్ళే ప్రయత్నంలో తన అంతఃపురంలోని వస్తువులు దానం చేయదలచిన సందర్భంలో ఆయన వివిధ వేద శాఖలకు చెందిన బ్రాహ్మణులు వేర్వేరు వస్తువుల దానం చేయుటలో ఒక తృప్తి వున్నట్లు చెప్పిన అంశం అయోధ్యాకాండలో వున్నది. అక్కడే ఈ శాఖల స్మరణ రామాయణంలో వున్నది. యిక్కడ ఒక విషయం బాగా గుర్తుంచుకోవాలి. మనకు మొదటి త్రేతాయుగంలో రామాయణం జరగలేదు. అయితే ప్రతి ద్వాపర యుగంలోను "వేద వ్యాస" ఆవిర్భావం జరుగుతుంది.

### ◆ రజస్వలా - నియమాలు వంటివి కూడా వేదంలో చెప్పబడ్డాయా? యివి ధర్మ శాస్త్రం పేరుతోమహర్షులు సృష్టించినవా?

వేదంలో తెలుపబడని సృష్టి రహస్యం ఏదీ లేదు. అన్నీ వేదంలోనే నిక్షిప్తం అయినాయి. మానవ జీవన శైలి వేదాలను పూర్తిగా పరిశోధించి తెలుసుకోగలిగే విధానానికి దూరంగా వున్న కారణంగా మనకు వాటిలోని విలువలు తెలియడం లేదు. సృష్టి విషయాలను పూర్తిగా వేదం మనకు అందించినది. వేదాలు అనంత శాఖలుగా వుండి అందు ఎన్నో నిగూఢమయిన అంశాలు నిక్షిప్తం చేయబడ్డాయి. యిక మీరు అడిగిన ప్రశ్నకు సమాధానం "మల వద్వా ససా నసంవదేత – నా సా అన్నమద్యాత్" మలవద్వాససా అనగా రజస్వల అయిన స్త్రీలు అని అర్థము. అటువంటి స్థితిలో వున్న ఆమెతో మాటలాడరాదు, ఆమెతో కూడా కూర్చొనరాదు. ఆమె యొక్క అన్నము తినరాదు అని అర్థము. యిలా ఎన్నో విషయాలు యింకా ఈ రజస్వలా నియమాలను గురించి వేదములో చెప్పబడినవి. మహర్షులు వేదంలో లేనివి ధర్మశాస్త్రాల ద్వారా మనకు అందించలేదు. వారు సులువుగా అర్థం అయ్యేం దుకు ధర్మ శాస్త్రం రూపంలో వేదంలోని విషయాలను సరళీకరం చేసి చెప్పారు. పురాణాల యందు ఉన్న ధర్మశాస్త్రం వేదంలోనిదే.

◆ **పుష్కరాలకు వెళ్ళే అవకాశం కుదరని పక్షంలో ఏమిచేయాలి?**

పుష్కరుడు ప్రతి నదిలోను ఒక సంవత్సరం నివసిస్తారు. ప్రారంభం 12 రోజులలో పూర్తిగా 24 గంటలు విశేషమయిన కాలము. అయితే మిగిలిన సంవత్సర కాలము అపరాహ్ణ కాలములో పుష్కరస్నానం, పుష్కరశ్రాద్ధం రెండు సమఫలితాన్నే యిస్తాయి. అందువలన పుష్కరాలు ప్రారంభం 12 రోజులలో నదీ స్నానం పుష్కర శ్రాద్ధం చేయలేనివారు తర్వాత కాలంలో సంవత్సరంలోపుగా సద్వినియోగం చేసుకోవచ్చు. అది కూడా చేయలేకపోతే సత్ఫలితం రాదు.

◆ **ముహూర్తములో పాపగ్రహాలు విశేష దృష్టితో లగ్నాన్ని చూడవచ్చా?**

కాదు. "త్రిషడాయ గతాః పాపాః" మూడు ఆరు పదకొండు స్థానాలలో వున్న పాపగ్రహములు ముహూర్త విషయంలో చాలా మంచి చేస్తారు అని శాస్త్రం. ఈ విషయంలో పాఠాంతరములు నాకు తెలిసి ఎక్కడాలేవు. అలా అందరు మహర్షులు ఒప్పుకున్నారు అంటే ఆరులో వున్న కుజుడు ఎనిమిదవ దృష్ట్యా లగ్నాన్ని చూస్తారు. 11వ యింట వున్న శని మూడవ దృష్ట్యా లగ్నాన్ని చూస్తారు. మరి అలాంటి విషయం మహర్షులకు తెలియకనే చెప్పారా! కాదు ముహుర్త భాగంలో కేవలం ఏడవ దృష్టి ఒకటే వుంటుంది. యితర విశేషదృష్టులు 3,4,5,8,9,10 వుండవు.

◆ **మేము నివాసార్థం ఒక స్థలం తీసుకున్నాం. అది దిక్సూచి సరిచూపడం లేదు. ఏమి చేయాలి?**

శాస్త్రంలో దిక్సాధన చేసి గృహనిర్మాణం చేయమని చెప్పబడివున్నది. దిక్సాధన చేయు సందర్భంలో ఆ వీధిలోని వారు అందరూ దిక్సాధన చేసి ఒకే రీతిగా నిర్మాణం చేయాలి. కొందరు దిక్సాధన దిక్సూచి ప్రకారం చేసి, మరికొందరు వీధిని ఆధారం చేసుకొని నిర్మాణం చేపట్టుట శాస్త్ర సమ్మతం కాదు. అంతేకాకుండా దిక్సూచి ప్రకారం స్థలం సరిచేయుట కుదరని సందర్భాలలో రాజవీధిని ఆధారంగా చేసుకొని గృహనిర్మాణం చేయమని వాస్తు శాస్త్ర వచనం రాజవీధి దిక్సూచికి ప్రకారం $0^0$ డిగ్రీల నుండి 22.1/2 డిగ్రీల వరకు దిశ ఉత్తరం బాగా వున్నట్లే లెక్క. 0 డిగ్రీలకు కొంచెం తగ్గినా స్థలం ఆగ్నేయం తిరిగినట్లు. మరి యిలా రాజ వీధి ఆధారం సబబే అనే విషయం కోసం విశ్వకర్మ, మయమతం చదవండి.

◆ **చింతామణి, కామధేనువు, కల్పవృక్షము వీని తేడా ఏమిటి?**

మొదటిది మణి, రెండవది గోవు, మూడవది వృక్షము. చింతామణి వలన లౌకికమైన చింతలు తొలగిపోతాయి. కామధేనువు వలన కోరికలు నెరవేరుతాయి. కల్ప వృక్షము వలన సంకల్పము నెరవేరుతుంది. చింతలు, కోరికలు, సంకల్ప వికల్పాలు త్యజించిన వారు లోక కళ్యాణార్థం కొరకు జీవిస్తారు. వారికి వచ్చే ప్రతీ ఆలోచన లోక కళ్యాణం అవుతుంది.

### ◆ షిరిడీ సాయిని దేవుడు అని కొందరు పూజిస్తారు. హిందువులు ఆయనను కొలవవచ్చా?

దేవడు అనే పదమునకు అర్థం పూర్తిగా ఎవరి భావనను బట్టి వారికి వుంటుంది. మనకు మన వేదం ప్రథమతః "మాతృదేవోభవ" "పితృదేవోభవ" "ఆచార్యదేవోభవ" అని ఉపనిషత్‌ల ద్వారా తెలియచేసినది. ఎవరి మనోభావాలు (దేవుని విషయంలో) ఎలాగవున్ననూ వేద ఉపదేశం ఆధారంగా మనకు ప్రత్యక్ష దైవం తల్లి, తండ్రి, గురువు. అందుకే తల్లితండ్రులకు బతికివున్నప్పుడు గౌరవం చేయడం, వారు కాలం చేసిన తర్వాత పితృకార్యముల రూపంగా అర్చించడం జరుగుతుంది. వివిధ మతాలకు వివిధ దేవతలు వున్నారు. మీరు మత గ్రంధాలు అన్నీ పరిశీలిస్తే అందులో మీకు ఉపదేశించిన తత్వం అంతా ఒకటే. శాంతి, అహింస, ప్రేమ, ధర్మమార్గంలో నడవడి, యితరులను మోసగించకుండుట యిటువంటివే ఉపదేశించినది. అలాంటప్పుడు వాటిని ఆచరించవలెను అనే ఆలోచనలు చేయాలి **"ఆచరించని వాడికి విచారణ చేయు హక్కు లేదు. అచరించే వాడికి విచారణ అవసరం లేదు"** మరి షిర్డిసాయి బోధించినవి మంచి సూక్తులు. అన్ని మతాల వారు ఉపదేశించిన సూక్తులు. వాటిని మనం మంచి అనుకుంటున్నాం కదా! మంచిమాటలు వినడానికి తెలుసుకోవడానికి ఆయనను గురువుగా భావించేవారికి "ఆచార్యదేవోభవ" అనే వేదనాదం ప్రకారం ఆయన దేవుడే. అందువలన షిరిడిసాయిని దేవుడిగా భావించే వారికి దేవుడు, గురువుగా భావించేవారికి గురువు. నేటి సమాజంలో దుర్మార్గం బాగా ప్రబలే ఈ రోజులలో షిరిడీసాయి, పుటపర్తి సాయి, గణపతి సచ్చిదానంద, కంచి స్వామి శృంగేరీ భారతీ తీర్థస్వామి వంటి వారి బోధలు విని వారి ఉపదేశాలను అమలుచేయుట సంఘానికి శ్రేయస్సు. అంతేకానీ రంధ్రాన్వేషణ చేసి నాస్తిక వాదన చేయుట, విమర్శించుట వంటివి సంఘవిద్రోహమే అవుతుంది. ఎవరి బోధలు అయినా, ఆచారములు అయినా పూర్తిగా అమలు చేయువారికి శాంతి ఆనందం లభ్యం అవుతాయి.

### ◆ మనువుకు మన్యువుకు తేడా ఏమిటి? ఏకాదశ రుద్రుల పేర్లు?

ఓ మనువు జీవితకాలం 71 చతుర్మహా యుగాలు. ఒక కల్పం అనగా బ్రహ్మకు ఒక రోజు. ఓ కల్పంలో 14 మంది మనువులు జన్మించి సృష్టిని పాలిస్తారు. ప్రతి మనువు కాలంలోను ఇంద్రుడు, సప్తర్షులు మారుతూ వుంటారు. మనువుల చరిత్రలు మార్కండేయ పురాణంలో పూర్తిగా విశదీకరింపబడినది. మనువుల పేర్లు వరుసగా 1. స్వాయంభువ 2. స్వారోచిష 3. ఉత్తమ 4. తామస 5. రైవత 6. చాక్షుష 7. వైవస్వత 8. భౌత్య 9. దక్షసావర్ణి 10. బ్రహ్మసావర్ణి 11. ధర్మసావర్ణి 12. రుద్రసావర్ణి 13. సూర్యసావర్ణి 14. రౌచ్యః. ఒక మనువు యొక్క పరిపాలనా కాలమును ఒక మన్వంతరం అంటారు. ప్రస్తుతం మనం వైవస్వత మనువు కాలంలో వున్నాం.

దేవతల పరిరక్షణ కోసం పరమేశ్వరుడు తన మూడవ కంటి నుండి సృష్టించిన శివాంశయే “మన్యువు”. మన్యువు అంటే కోపం అని కూడా అర్థము వున్నది. అధర్వణ వేదంలో “మన్యుసూక్తం” వున్నది. యిది పారాయణ చేయడం వలన ఎంతటి శత్రువులనయినా జయింపవచ్చును. కశ్యపుని కోరికపై శివుడు కశ్యపునికి పుత్రుడుగా ఏకాదశ రుద్రావతారములు ఎత్తెను. శివపురాణం శతరుద్ర సంహితలో ఈ వివరం వున్నది. ఏకాదశ రుద్రులు కపాలి/పింగళ/భౌమ/విరూపాక్ష/విలోహిత/శాస్త్ర/అజపాత్/అహిర్బుధ్న్య/శంభ/చండ/భవుడు. యివి ఏకాదశ రుద్రుల పేర్లు.

**◆ విష్ణుసహస్రనామంలో “వ్యవసాయో వ్యవస్థానః” అని వున్నది వ్యవసాయం అనగా ఏమిటి?**

“విశేషేణ అవసీయతే బధ్యతే వ్యవసాయః” జ్యోతిశ్చక్రాదులను విశ్వము అనెడి చక్రాన్ని చక్కగా నియంత్రించి (కట్టడి చేసి) వాటికి ఆధారమయి నడుపువాడు అని శ్రీహరికి ఆ నామము. బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో విష్ణువు సృష్టిని పాలించే అధి కారం కలవాడు అయి వున్నారు కదా! ఆ నేపథ్యంలో సృష్టిని పాలించడాన్ని ఒక విధంగా చెప్పాలి అంటే వ్యవసాయం అనాలి. వ్యవసాయం – అనగా కచ్చితమయిన అర్థం “విశేషేణ అవబద్ధం – నిబద్ధం అస్మిన్ ఇతి వ్యవసాయః” విశేషముగా తన యందు నిబద్ధము చేయువాడు అని అర్థము. వృక్షమూలం మీద వృక్షం అంతా ఆధారపడి వున్నది కదా! అలాగే ఈ విశ్వం అంతా శ్రీవిష్ణువు నందే నిబద్ధమయినది. శ్రీమహావిష్ణువు మీద విశ్వం అంతా ఆధారపడి వుండగా దానిని పరిపాలించుటకుగా ఆయన విశ్వాన్ని చక్కగా అమర్చినవాడు కావున “వ్యవసాయః” అన్నారు.

**◆ స్థలం తీసుకునే ముందు దిక్కు సింహద్వారం కోసం నిర్ణయిస్తారు అది ఎలా?**

స్థలం తీసుకునే వారి జన్మరాశి ప్రకారం నిర్ణయించే విధంలో మేషరాశివారికి తూర్పు, దక్షిణం, ఉత్తరం, ఉత్తర ఈశాన్యం విశేషం/అలాగే వృషభరాశికి తూర్పు ఈశాన్యం, పశ్చిమ వాయవ్యం, ఉత్తరం, ఉత్తర ఈశాన్యం/మిధునరాశివారికి ఈశాన్యం, పశ్చిమం/కర్కాటకం రాశివారికి తూర్పు, దక్షిణం, పశ్చిమం/సింహరాశివారికి పశ్చిమవాయవ్యం, తూర్పు, దక్షిణ ఆగ్నేయం/కన్యారాశివారికి ఉత్తరం, దక్షిణం/తులారాశివారికి ఉత్తరం, దక్షిణం/వృశ్చిక రాశివారికి ఉత్తర ఈశాన్యం దక్షిణం/ధనూరాశి వారికి తూర్పుపడమర, మకరరాశివారికి తూర్పు పశ్చిమం/కుంభరాశి వారికి దక్షిణ ఆగ్నేయం పశ్చిమం/మీనరాశివారికి దక్షిణం పశ్చిమం సింహద్వారములు నప్పుతాయి. అందువలన ఆయా దిక్కుల ప్రకారం నిర్ణయించాలి.

**◆ నవదుర్గలు వాటి పేర్లు తెలియచేయగలరు? ఉపపురాణములు, ఉపొపపురాణముల పేర్లు తెలపండి?**

నవదుర్గలు 1. శైలపుత్రి 2. బ్రహ్మచారిణీ 3. చంద్రఘంట 4. కూశ్మాండ 5. స్కందమాత 6. కాత్యాయినీ 7. కాళరాత్రి 8. మహాగౌరీ 9. సిద్ధిధాత్రీ.

**ఉపపురాణములు :-**

1. సనత్కుమార 2. నరసింహ 3. నారద 4. శివధర్మ 5. దుర్వాసో 6. కపిల 7. మను 8. ఉశనస 9. వరుణ 10. కాళికా 11. సాంబ 12. నందీశ్వర 13. సౌర 14. పరాశర 15. ఆదిత్య 16. మహేశ్వర 17. భాగవత 18. వశిష్ఠపురాణములు

**ఉపోపపురాణములు :-**

1. సనత్కుమార 2. బృహన్నారదీయ 3. ఆదిత్య 4. మానవ 5. నందికేశ్వర 6. కూర్మ 7. భాగవత 8. వశిష్ఠ 9. భార్గవ 10. ముద్గల 11. కల్కి 12. దేవీ 13. మహాభాగవతం 14. బృహద్ధర్మ 15. పరానంద 16. వహ్ని 17. పశుపతి 18. హరివంశపురాణం.

◆ **ఆబ్దీకాదులు అన్నదమ్ములు అందరూ కలిసిపెట్టవలెనా? పెట్టుట శ్రేయస్కరమా?**

విభక్త ధనులయిన వారి విషయమున అబ్దీకాదులు వేరుగానే పెట్టవలెను. విభక్తధనులు అనగా 1.తండ్రి అనంతరం ఆస్తి విషయంగా విడిపోయిన వారు. 2.తండ్రి వున్ననూ లేకున్ననూ వేరుగా వంటలు చేసుకొనువారు. ఈ రెండు విధాలుగా వున్నవారి విషయంగా అబ్దీకాదులు విడిగానే పెట్టవలెను. అవిభక్తులు అనగా "బహువః స్యుః యదాపుత్రాః పితురేకత్ర వాసినః" అందరూ ఒకచోటనే నివాసం చేయువారి విషయంలో "జేష్ఠస్యకర్తృత్వేపి సరేఫలభాగినః" పెద్దవాడు చేసినట్లయితే మిగిలిన వారందరూ అ కర్మను చేసినట్లవుతుంది. పెద్దవాడు చేసిన కర్మఫలాన్ని అందరూ ఫలాన్ని పొందుతారు. విభక్తులయిననూ అవిభక్తలయిననూ సపిండీ కరణాంతములైన పదహారు శ్రాద్ధములు ఏవైతే వున్నాయో అవి విడివిడిగా చేయరాదు. "విభక్తాస్తు పృధక్కుర్యుః ప్రతిసంవత్సరాదికం" విభక్తులు ప్రతి సంవత్సరం అబ్దీకములు విడిగానే అనుష్ఠించవలెను. మహాలయం, పుష్కరం వంటి వాటిలో విశేషాదులు వస్తాయి కాబట్టి వాటిని విడివిడిగానే అనుష్ఠించాలి. ఈ మహాలయాదులు విషయంలో విభక్తులకు అవిభక్తులకు ఒకటే నియమం. అయితే ధర్మసింధులో వున్న విశేషం ఏమనగా అవిభక్తులయినచో ఒకేమారు చేయదలచిన ఎడల జ్యేష్ఠుడే చేయవచ్చును. తీర్థశ్రాద్ధాదులు వేరువేరుగ అవిభక్తులయినచో ఒకేమారు చేయదలచిన ఎడల జ్యేష్ఠుడే చేయవచ్చును. తీర్థశ్రాద్ధాదులు వేరువేరుగ ప్రాప్తించినచో వేరుగానే చేయవలెను అని వున్నది. సపిండీ కరణాంతములయిన పదహారు శ్రాద్ధములు ఏవైతే వున్నాయో అవి విడివిడిగా చేయరాదు. "సపిండీ కరణాంతాని యాని శ్రాద్ధాని షోడశ, పృధఙ్నైవ సుతాః కుర్యుః పృథక్ ద్రవ్యా అపిక్వచిత్. ఊర్ధ్వం సపిండీ కరణాత్ సర్వే కుర్యుః పృథక్ పృథక్ ॥ ఒక వేళ విభక్తులయిననూ సపిండీ కరణాంత శ్రాద్ధములు కలిపి చేయవలసినదే. ఆ తర్వాత మాత్రం విడిగానే చేయమని శాస్త్రం. దీనికి పెద్దలు చెప్పే ఆచార వ్యవహారములు కూడా పరిగణనలోకి తీసుకోవాలి. అలాగే నేడు ఉద్యోగ విధి నిర్వాహణ విధానాలు వున్నాయి. కావున యింకా ఎన్నో ధర్మశాస్త్ర విషయాలు తెలుసుకొని నిర్ణయించాలి.

**◆ ఓంకారం చెబూతూ లలితా నామావళీ చెప్పవచ్చా? ఆడవారికి ఓంకారం చెప్పే అధికారము వున్నదా?**

లలితా నామావళీ చెప్పే సందర్భంలో ఓంకారం చెప్పనవసరం లేదు. అందుకే అక్కడ శక్తి బీజాలు "ఐం హ్రీం శ్రీం" ప్రారంభంలో చెప్పి నామాలు చెబుతారు. శక్తి బీజాలు చెప్పకుండా నామాలు చెబితే ఫలితం తక్కువ వుంటుంది. అందువలన అందరూ లలితా అష్టోత్తర, సహస్రంలో ముందుగా ఈ బీజాలు చెప్పి చేయండి. ఓంకారం ఆడవారికి అధికారం వున్నదా? ఈ చర్చ చేయు స్థాయిలో నేను సరిపోను. పెద్దలు బాగా శోధన, శాస్త్ర చర్చలు చేసినవారి మాటలు, వారి దగ్గర నేను విన్న విషయాలు చెబుతాను. ఆడవారికి ఋతుకాలంలో వేదం వినిపించకుండా వుండే వారు. అంతేకాక వారి చేత ఆ కాలంలో ఏ పనీ చేయించేవారు కాదు. కారణం వారు ఋతుకాలంలో ఎంత శ్రమచేసినా అది వారి శారీరక మానసిక స్థితిలో బహు ప్రమాదాలకు దారి తీస్తుంది. యివి కాలక్రమంలో వెంటనే కనబడే ప్రమాదాలు కాదు. క్రమేణా వారికి శారీరక మానసిక సమస్యలకు కారణం అవుతుంది. అందుకే "అంటు" అనే పేరుతో వారిని దూరంగా వుంచి వారికి యితరులు సేవ(సర్వీస్) చేసేవారు. నేటి సమాజంలో అందరూ టెక్నాలజీ పెరిగినది అనే మాటతో శ్రమ చేస్తున్నారు. వారు చెడు ఫలితాలు అనుభవిస్తున్నారు. కానీ యిప్పటికీ పాతవాళ్ళు చెప్పిన దానిలో మంచి వున్నది అని గ్రహింపలేకపోతున్నారు. మీరు పరిశోధించండి, 75శాతం ఆడవారు యిబ్బంది పడుతున్నారు. వేదానికి ప్రారంభం "ఓం"కారం. వేదం ఉచ్చరించే అధికారం ఆడవారికి లేదని పెద్దలు చెబుతారు. కారణం వారికి వేదోచ్చారణ ద్వారా శారీరక సహజస్థితి, ఋతుక్రమం యిబ్బంది పడే అవకాశం వున్నది. అయితే దీని మీద పిడి వాదనలు నాస్తిక వాదనలు చేయడం కంటే ఆచ రించడం మంచిది. ఈ క్రమంలో వేదోచ్ఛారణ అధికారం స్త్రీలకు లేదు కావున వేదారంభంలోని ఓంకారం ప్రణవం ఉచ్ఛరించే అధికారం స్త్రీలకు లేదని పెద్దలు శాస్త్రాలు రీసెర్చి చేసిన ఫలితాంశం. నాకు సాంప్రదాయంగా వస్తున్న విషయాలు తెలుసు కావున చెబుతున్నాను. నాతో దీని మీద చర్చ చేయకండి.

**◆ బ్రాహ్మణులలో అనేక నాడీ భేదములు వున్నవి. ఒక నాడీవారు మరొక నాడీ భేదంతో వున్నబ్రహ్మణులకు పిల్లలను వివాహ నిమిత్తంగా యిచ్చి పుచ్చుకోవడం సమంజసమేనా?**

సృష్ట్యారంభంలో బ్రహ్మణుడు అనే జాతి ఉద్భవించినప్పుడు ఒకే విభాగం వున్నది. ఆ తర్వాత ఒక్కొక్క ఋషి తన వంశాన్ని వృద్ధి చేయడం ద్వారా గోత్రాలు, వారికి సంబంధించిన ఋషులు వచ్చాయి. ఆ నియమం ఆధారంగా ఒకే గోత్రంలో వారు అందరూ అన్నా చెల్లెళ్ళు, అక్కా తమ్ముళ్ళు వలె వుంటారు. ఒకే గోత్రీకులకు వివాహం

చేస్తే అన్నా చెల్లెలకు వివాహం చేసినట్లే. కారణం ఆ గోత్రజులకు మూల పురుషుడు ఒకరే అయిన కారణంగా. అలాగే ఈ గోత్రజుల ఉత్పత్తికి కారణభూతులే ఋషులు. గోత్రము ఋషి ఒకరు అయితే ఆ పిల్లలకు వివాహం చేయరాదు. వారు అందరూ సోదర సమానులే అని మాత్రం ధర్మశాస్త్రం చెబుతోంది. అయితే మీరు అడిగిన నాడీ విచారం కోసం కొంత చరిత్ర కూడా తెలుసుకోవలసినదే. బ్రాహ్మణులలోనే ఆర్యావర్తనం నుండి సంచారం చేస్తూ జీవన క్రమంలో ద్రవిడ దేశంలో స్థిరపడ్డవారు ద్రావిడులు. ప్రాచీనకాలంలో ఆర్యావర్తనం నుండి యజ్ఞం చేయించడానికి కోనసీమకు వెళ్ళినవారు కోనసీమద్రావిడులు. కోనసీమ బైట విడిది చేసినవారు ఆరామద్రావిడులుగా చెప్తారు. తెలంగాణాలో స్థిరపడ్డవారు తెలగాణ్యులు, వెలమ దేశంలో స్థిరపడ్డవారు వెలనాడులు, కోసల దేశంలో స్థిరపడ్డవారు కాసలనాడీ. ప్రభుత్వ పాలనా విషయంగా నియోగింప బడినవారు నియోగులు. యిలా వందల సంవత్సరాల క్రితం జీవనోపాధి నిమిత్తంగా వారు వివిధ ప్రాంతాలలో స్థిరపడ్డారు. వారు ఆ ప్రాంత విషయంగా నాడీ వచ్చినది. అయితే ధర్మశాస్త్రంలో ఆచార వ్యవహారములు బ్రాహ్మణులకు అందరికీ ఒకే విధంగా చెప్పినా-వనరుల లభ్యమునకు సంబంధించిన ఆధారంగా ఆచార వ్యవహారములలో మార్పులు వచ్చాయి. ఆచార వ్యవహారములు తేడాగా వుంటే ఒకరి జీవన శైలి ఒకరికి అర్థంగాక సమస్యలు ఉత్పత్తి అవుతాయి అనే కారణంగా నాడీ భేదంలో వివాహం చేయవద్దు అని పెద్దలు చెప్పేవారు కానీ అది ధర్మశాస్త్రం కాదు. నేటి సమాజంలో ఏ నాడీకి సంబంధించిన బ్రాహ్మడయినా పూర్వ ఆచారాలు పాటించే స్థాయిలో లేరు. జీవనోపాధి, విద్యా విషయం, మీడియా ఎఫెక్ట్‌ల మూలంగా అందరి ఆచార వ్యవహారములు ఒకే రీతిగా వచ్చాయి అని చెప్పవచ్చు. అంతేకాక ఉమ్మడి కుటుంబంలో నుండి విడిగా వచ్చిన కారణం ప్రధానంగా అందరిలో మార్పు తీసుకువచ్చినది. యిలా అందరు ఒకే రకమయిన జీవనశైలి సాగిస్తున్న ఈ రోజులలో నాడీ విచారంతో వివాహం చేయనవసరం లేదు. "బ్రాహ్మణాది జాతి సృష్టి వరకే భగవంతుడు చేశారు. కావున జాతి మార్పు వివాహం ధర్మశాస్త్ర బద్ధంగా నిషేధం – బ్రాహ్మణులలో నాడీ సృష్టి మానవులు చేసినది కావున నాడీ మార్పులు దోషం కాదు. దీని గూర్చి ధర్మశాస్త్రం ప్రస్తావించలేదు". వర్ణ సంకరం నిషేధంగానీ, నాడీసంకరం గ్రాహ్యమే.

◆ **లలితా త్రిశతీలో "కకారరూపా కళ్యాణీ" అని ప్రారంభం - కకార రూపం విశేషం ఏమిటి?**

అమ్మవారి లలితా త్రిశతీలో మొత్తం పంచదశీ మంత్రం యొక్క వివరణ యిమిడి వున్నది. పంచదశీ మంత్రంలో ప్రతి అక్షరమునకు సంబంధించిన కొన్ని శ్లోకాలు వరుసక్రమంలో యిక్కడ యివ్వబడ్డాయి. అందులో అమ్మవారి పంచదశీ మంత్ర ప్రథమాక్షరము "క" – క బీజాలు మూడు సార్లు పంచదశీ మంత్రంలో ఆవృతం

అవుతాయి. పంచదశీ యంత్రంలో "కత్రయం హద్వయం చైవ శైవభాగః ప్రకీర్తిత" "క" అక్షరము మూడు "హ" అక్షరములు రెండునూ శివభాగములని చెప్పబడును. యిక మీరు అడిగిన "కకార రూపాయై నమః" అనే పదమునకు ఛాందోగ్యోపనిషత్తు ద్వారా కొంత విషయం తెలుసుకోవాలి. "కం బ్రహ్మం ఖంబ్రహ్మం" అని శృతి. కం = సుఖము బ్రహ్మము. ఖం = ఆకాశము బ్రహ్మము. కం, ఖం. వర్ణములు బ్రహ్మ వాచకములు. దహరాకాశము (కారణాకాశము) సుఖ స్వరూపము, పరమ ప్రేమాస్పదము అగుటవలన అది అభిలాషణీయము అగుచున్నది. అదే విధముగా కవర్ణము కూడా అతి ప్రీతి విషయమగు పంచదశీ మూలమంత్ర ప్రధమాక్షరమగుటవలన జనులచే గౌరవార్హ మగుచున్నది. కావున శ్రీదేవీ కకార రూపాయై నమః అనే నామంతో చెప్పబడుచున్నది.

సృష్టిలో కకార రూపములు – హిరణ్య గర్భుడు, ఉదకము, శిరస్సు, సుఖము, మొదలగునవి. "కకారః రూపం, వాచకం. యేషాంతే కకార రూపాః హిరణ్యగర్భః ఉదకం ఉత్తమాంగం సుఖదయాశ్చ – హిరణ్య గర్భనిష్ఠ జగద్ధారక జగత్కర్తృత్వాది గుణవత్వం కకారస్య వ్యంజనాది మవర్ణత్వేన వర్తత ఇతి తద్వాచ్య తయాతథా! ఉదక నిష్ఠాన్నాది ద్వారా జగత్సంజీవన హేతుత్వమపి కకారస్య విద్యాగ్రిమవర్ణత యాస్తీతి తద్రూపావా! హిరణ్యగర్భునియందున్న సృష్టిస్థితి లయ కర్తృత్వరూప జగద్ధారకత్వ రూపగుణములను, వ్యంజనములలో (హల్లు) మొదటి అక్షరమగు కకార మందుండుట చేత శ్రీదేవీ కకార రూపా – కకారమునకు ఉదకమను అర్థమున్నందు చేత ఉదకమునకు ఏ విధంగా అయితే అన్నోత్పాదన శక్తి ద్వారా జగత్సంజీవన లక్షణం వున్నదో అలాగే పంచదశీ కాది విద్యా అగ్రిమవర్ణమునకు కలదు. కావున శ్రీదేవీ కకారరూపం. కకారమునకు శిరస్సు అను అర్థము కలదు. సర్వప్రాణులకు శిరస్సునందు అమృతము వున్నది. యోగమార్గమున కుండలినీ శక్తి సంచారమున శిరస్సు నందున్న అమృత ప్రవాహ మున మునిగిన యోగులు ఈశ్వరసామ్యము పొందుదురు అని యోగశాస్త్ర వచనము. అదే విధముగా ఈ పంచదశీ మంత్రము శిరస్థానమున వున్న "క" వర్ణము. దానిని పురశ్చర్యా పరాయణులయిన వారికి శివభావమును యిచ్చును. అందుకే అమ్మవారు "కకార రూపాయై నమః" అని కొలువబడుచున్నది. మా పెద్దలు మంత్ర శాస్త్ర దురంధరులు.., వారి ద్వారా మాటలను యిక్కడ ఇచ్చాను.

### ◆ పుష్యమాసం ఆషాఢ మాసములలో సుముహూర్తములు చేయరాదా?

సూర్యమానం ప్రకారం రవి ఉత్తరాయణ సంచారిగా మారిన ప్రభృతీ అనగా మకర సంక్రమణం అయి మరల ఆయన కర్కాటక సంక్రమణంతో కర్కాటక సంచారిగా మారే కాలం (జనవరి 15 నుండి జులై 16/17) చాలా విశేషం. ఆ కాలంలో చాంద్ర మాన రీత్యా ఒక వేళ పుష్యమాసం. ఆషాఢమాసం కలిసినా కానీ, అక్షరస్వీకారం,

ఉపనయనం, విద్యారంభం, దేవతాప్రతిష్ఠల వంటివి చేయవచ్చు. యిది ఆంధ్రదేశంలో మాత్రం ఆచారములో లేదు. కేవలం పుష్యమాసం, ఆషాఢమాసం అనే విషయం మన ఆంధ్రదేశంలో మాత్రమే వున్నది. దానికి బలమయిన కారణాలు గోచరించడం లేదు. కేవలం చాంద్రమాన వశాత్ అనే కారణమే గోచరిస్తుంది. శాస్త్రంలో మాత్రం పై నాలుగు కార్యక్రమాలకు ఉత్తరాయణం విశేషం అని చెప్పబడినది. అయితే యితర కార్యక్రమాలకు మాత్రం ఉత్తరాయణం విశేషం అనే విషయంగా యితర రాష్ట్రాలలో శుభ కార్యాలు నడుచుచున్నాయి. మనకు మాత్రం పుష్యమాసం, ఆషాఢమాసం, అనే పట్టింపు బాగా నడుచుచున్నది. ఆషాఢంలో అత్తాకోడళ్ళు ఒక యింట వుండరాదు అనే ఆచారం ప్రకారం ఆషాఢంలో వివాహం నిషేధమే. ఉత్తరాయణంతో కూడుకున్న పుష్య ఆషాఢములకు ఉపనయనాది సంస్కారముల విషయంగా దోషం లేదు.

◆ **వివాహంలో గౌరీ పూజ సమయంలో లలితాసహస్రనామపారాయణ విశేషమా?**

చేయించే వశిష్ఠుల వారికి వివాహ కార్యక్రమం సరిగా చేయడానికే సమయం ఇవ్వడం లేదు. మరి గౌరీపూజ టైంలో లలితాసహస్రనామపారాయణ విశేషం అని ఒకరు.., లలితా సహస్ర పారాయణ 11 సార్లు చేస్తే విశేషం అని మరి ఒకరు ఇలా ఉపదేశం చేసుకుంటూ పోతే ప్రాథమిక వైదిక ఆచారం పాడుచేయడం అవుతుంది. ప్రాచీనంగా వస్తున్న వైదిక ఆచారం పాటిద్దాం. "వివాహం చేసేటప్పుడు వశిష్ఠుల వారు చెప్పిన ధర్మమే ధర్మము."

◆ **స్త్రీలు పూజలు చేయరాదు, శ్రీసూక్తం పారాయణ చేయరాదు అని ఒక టివి ఛానెల్లో చెప్పారు. యిది ఎంతవరకు సమంజసం?**

స్త్రీలు పూజ చేయరాదు అంటే పెళ్లిలో గౌరీపూజ చేయువారు ఎవరు? గౌరీపూజ స్త్రీలు కాకుండా పురుషులు చేస్తున్నారా? చేస్తారా? స్త్రీలకు పూజచేయు అధికారం లేదు పూజ చేయనవసరం లేదు అనే వాదనలు పిచ్చి వాదనలు. వారు నోములు వ్రతాలు కూడా చేయాలి. రోజువారి పూజ, దీపారాధన చేయాలి. ఆర్ష సాంప్రదాయం ప్రకారం రోజూ పూజ కార్యములలో దీపారాధన చేయు అధికారం స్త్రీకి మాత్రమే వున్నది. అలాగే ఉభయ సంధ్యలలో దీపారాధన స్త్రీ మాత్రమే చేయాలి. వరలక్ష్మీ వ్రతం పూజ ఎవరు చేస్తారు, స్త్రీనా? లేక పురుషుడా? పురుషుడు హోమం చేయదలచిన ఎడల ఆ అగ్ని హోత్రం స్త్రీ అలంకరించాలి. స్థాలీపాకం అనే కార్యం వున్నది. ఆ కార్యం చేయు సందర్భంలో "స్త్రీ చేత బియ్యం తీసుకుని వండించి స్థాలీపాకం కార్యం చేయవలెను" అని శాస్త్రం. యిలా పూజలలో వ్రతాలలో పురుషులు చేయు వాటిలో స్త్రీకి ప్రాముఖ్యం యిచ్చారు. అయితే స్త్రీలు మాత్రం చేయు వ్రతాలలో పురుషుడు వుండవలసిన ప్రాధాన్యత లేదు. సావిత్రీ బొమ్మలనోము, పౌర్ణమి నోములు, వరలక్ష్మీ

వ్రతం, గౌరీవ్రతం, వుండ్రాళ్ళతద్ది, అట్లతద్ది పూజలలో కేవలం స్త్రీలు ఒకరే వుండి పూజ చేసుకుంటారు. పురుషుడు ఆమెను ఆశీర్వచనం మాత్రమే చేస్తారు. ఒక వేళ పురుషుల్లో (భర్త) వేరే గ్రామంలో వున్ననూ ఈ వ్రతాలు ఆడవారు ఒకరే వుండి చేసుకుంటారు. పుట్టింటిలో కొన్ని వ్రతాలు చేయునపుడు భర్త ప్రక్కన వుండరు కదా! ఉదాహరణకు మొదటి సంవత్సరం శ్రావణ మాస నోములు. అయితే పురుషుడు చేయవలసిన వ్రతాలలో స్త్రీ ప్రక్కన వుండగానే సంకల్పం చేయాలి. నేను చెప్పిన ఈ విషయం మీరు ప్రత్యక్షంలో ఎక్కడయినా చూడవచ్చు. యిక లలితా సహస్ర పారా యణ ఆడవారు కూడా చేయవలెను. కలియుగంలో స్త్రీలు చేయు పూజలు స్తోత్రాలు వ్రతాలు త్వరగా సిద్ధిస్తాయి అని విష్ణు పురాణంలో చివరి అధ్యాయాలలో (కలి విశే షాలు) వున్నది. వేద వ్యాసులవారే తను వ్రాసిన పురాణాలలో స్త్రీలకు ఎన్నో వ్రతాలు, నోములు, పూజలు సూచించారు. మనం గ్రంధ పఠనం అలవాటు తగ్గించుకొని ఎవరో టివిలలో ఆకర్షణీయంగా చెప్పే మాటలకు ఆకర్షితులం అయిన కారణంగానే సంఘంలో ఈ అనుమానాలు ఎక్కువ అవుతున్నాయి. లలితా స్తోత్ర పారాయణం స్త్రీలు సదా చేస్తూనే వుండాలి. అలా చేయడం వలన ఆ ఫలితం ఆ కుటుంబానికి బాగా ఉపయోగపడుతుంది. యిక "శ్రీసూక్తం" వేద మంత్ర మయం. వేద మంత్ర ఉచ్ఛారణ స్త్రీలకు నిషేధం తెలిపారు. వేదమంత్రోచ్ఛాటనాధికారం స్త్రీలకు లేదు కావున శ్రీసూక్త పారాయణ స్త్రీకి అధికారం లేదు. అయితే కొందరు పెద్దలు శ్రీసూక్తపారాయణం స్త్రీలు చేయవచ్చని చెబుతారు. శ్రీసూక్తం స్తోత్ర సమానం అని కొందరి వాదన. స్వరరహితంగా శ్రీసూక్త పారాయణ ఆచారం ఉన్నది.

### ◆ షణ్మతాలు ఏవి? అవి వేద సమ్మతమయినవా?

గాణాపత్యం, సౌరం, శైవం, వైష్ణవం, శాక్తేయం, స్కాందం యివి షణ్మతములు. 1. గాణాపత్యం అనగా శ్రీగణపతి ప్రధానంగా అర్చించే మతం. "గణానాంత్వా గణపతిగ్ం హవామహే" అనే మంత్రాలు వేదంలోనివే... మరియు అధర్వణవేదం ఋగ్వేదంలో ఎన్నో గణపతి సూక్తాలు వున్నాయి. "సౌరం" సూర్యుని ప్రధాన దేవతగా ఆరాధన చేయునది. సంధ్యావందనం, అరుణం సౌరం వంటివి వేద మంత్రాలు సూర్యుని గురించి వున్నాయి. శైవమతం శివుని ప్రధాన దేవతగా ఆరాధించేది. నమకం చమకం మహన్యాసం అంతా వేద మంత్రాలేకదా? "వైష్ణవం" విష్ణువును ప్రధాన దేవతగా ఆరాధించేది, నారాయణ సూక్తం, పురుషసూక్తం వంటివి వేద మంత్రాలు విష్ణువు సంబంధించినవి వేదంలో వున్నాయి. "శాక్తేయం' గాయత్రి వేదమాత శాక్తేయ సంబంధమే. గాయత్రీ ఉపదేశం కాకుండా ఏ మంత్రము ఉపదేశం చేయరు కదా! అందుకే దేవీపురాణంలో మీరు శైవులు వైష్ణవులూ కాదు ప్రధమతః

శాక్తేయులు అని వివరింపబడినది. "స్కాందం" సుబ్రహ్మణ్య స్వామిని ప్రధాన దేవతగా వుంచి అర్చనలు చేయు అలవాటు వున్న మతం. సుబ్రహ్మణ్య మంత్రాలు వేదంలో చాలా చోట్ల చెప్పబడినవి. యజ్ఞాలలో కూడా సుబ్రహ్మణ్యారాధన తప్పకుండా వుంటుంది. యీ విధంగా ఆరు మతాలకు వేదం సమ్మతించిన మంత్రాలు వున్నాయి. అయితే షణ్మతాలలో ఏది ప్రధానం అయినా గాయత్రిని అందరూ ఉపనయనార్హత వున్నవారు అర్చింపవలసినదే. వేదమాత్రమే లేకపోతే షణ్మతం లేదు.

**◆ కృష్ణా పుష్కరాల సందర్భంగా సంవత్సరం కాలం పాటు వివాహాది శుభకార్యములు ఆ తీరవాసులు చేయరాదా?**

చేయవచ్చు. పుష్కరాలు 12 రోజులు మాత్రమే నిషేధం. గతంలో ఈ పిచ్చి ఆచారం ఎవరూ ఆచరించలేదు. ఈ విషయాన్ని మీరు పాత పంచాంగాలు చూస్తే అర్థం అవుతుంది. ఎవరైనా దీనికి సరియైన శాస్త్ర ఆధారం చూపించగలిగితే పుష్కరాలు అయిన తరువాత వారిని సన్మానిద్దాం. గోదావరి మినహా 11 నదులకు ఇదే నియమము.

**◆ రాహుకాలంలో దీపారాధన దేవాలయంలోనే చేయవలెనా? నియమాలు ఏమి?**

మంగళవారం రాహువుకు ప్రీతి అని రాహుకాలంలో మంగళవారం దీపారాధన చేస్తారు. నిమ్మకాయ చిప్పలలో దీపారాధన చేస్తారు. అయితే రాహుకాల దీపారాధన ప్రతిరోజూ కూడా చేయడం శ్రేయస్కరం. దీపారాధన చేయుకాలంలో దుర్గాఅష్టోత్తరం పారాయణ చేయడం అవసరం. దేవాలయంలో తలుపులు తెరిచివుంటేనే రాహుకాల దీపారాధన చేయవలెను. రాహుకాల దీపారాధన చేయువారు ఉపవాసం (దీపారాధన చేయువరకు) వుండాలి. నిత్యం ఆడవారు తలమీద పసుపునీరు చల్లుకొని తర్వాత దీపారాధన చేయాలి. ఒకవేళ దేవాలయం మూసివేసివుంటే యింటిలోనే దుర్గాఅర్చన చేసి దీపారాధన చేయవలెను. పరిశుభ్రమయిన నియమాలు పాటిస్తే యిల్లు కూడా దేవాలయం మాదిరి విశేషాలు కలిగివుంటుంది. దుర్గాపూజ లేని దీపారాధన – దీపారాధన లేని దుర్గాపూజ వృధా.

**◆ హనుమత్ప్రదక్షిణతో సర్వకార్యసిద్ధి అంటారు నిజమేనా? నియమాలు తెలుపగలరు?**

"కలౌకపివినాయకః" అని మంత్రద్రష్టలు చెబుతారు. కలియుగంలో వినాయక, ఆంజనేయ ఆరాధనలలో త్వరగా కార్యసిద్ధి వుంటుంది అని చెబుతారు. ఆంజనేయ స్వామి ఆరాధనలో "శౌచము" ప్రధాన నియమం "శుచేర్భావః శౌచం", శుచి అనే విషయం ప్రతి అంశంలోను ప్రదర్శించాలి. తత్ప్రభావం చేత త్వరగా ఆంజనేయా నుగ్రహం లభిస్తుంది. ప్రదక్షిణాలు చేయు సమయంలో "శ్రీరామ జయరామ జయ జయరామ" అని అంటూ ప్రదక్షిణాలు చేయడం ద్వారా ఆంజనేయ స్వామి ప్రసన్నం అవుతారు. నిత్యం ఉతికిన గుడ్డలు ధరించడం, శిరస్నానం చేయడం, పగలు నిద్రా

వస్తు వినియోగం చేయకుండడం, సాత్వికాహార భోజనం, సదా రామనామ స్మరణ, అవకాశం వున్న సమయంలో సంక్షిప్త సుందరకాండ పారాయణం చేయడం అవసరం. పక్క గుడ్డల మీద పగలు కూర్చున్నా నిదురించినా వెంటనే శనైశ్చరుడు ఆవహించి కార్య విలంబం చేకూరుస్తారు. ఒకవేళ పగలు నిదురించవలెను అనే ఆరోగ్య నియమం వున్నవారు పగటి నిద్రకు ప్రత్యేక ఏర్పాటు చేసుకోవచ్చు. సంతాన వృద్ధి, సంతతి యొక్క అభివృద్ధి, దేహసౌఖ్యం, ప్రశాంత చిత్తం, దృఢచిత్తం, విద్యాయోగం, కార్యజయం కావలసినవారు నిత్యం రామనామంతో ఆంజనేయునికి ప్రదక్షిణ చేయుట సర్వదా క్షేమం. అలాగే సుందరకాండ పారాయణ చేయుటకు అలవాటు పడండి.

◆ **ఇంటిలో ఏ విధమయిన చెట్లు పవిత్రతతో కూడినవి వుండాలి? వాస్తు విషయంగా ఏదేని విశేషం కలిగిన చెట్లు వున్నవా?**

తులసి లేకుండా యిల్లు వుండరాదు. స్త్రీ నివసించు ప్రతి యింటా తప్పక వుండ వలసిన అవసరం వున్నది. సౌభాగ్య వృద్ధిని కలుగచేస్తుంది. యిక పూజకు ఉప యోగించు గన్నేరు, మల్లి, జాజి, వంటివి ఏదో ఒకటి లేకుండా యిల్లు వుండకూడదు. "పారిజాత తరుమూల వాసినం" అని ఆంజనేయస్వామి వారికి ప్రత్యేకత వున్నది. కావున పారిజాత వృక్ష మూలంలో వున్న ఆంజనేయస్వామి సదా మనల్ని, మన యింటిని రక్షణ చేస్తారు. అందుచేత ప్రతి యింటా పారిజాత వృక్షం వుండడం వలన దృష్టి దోషాలు వంటివి పోతాయి. నరఘోష, భూతబాధ, వంటివి పారిజాత వృక్షం వున్న యింటిలోని వారికి తగలవు. ప్రతి యింటా ఈశాన్యంలో మారేడు వృక్షం వుంటే అది ఐశ్వర్య ప్రాప్తిని కలిగిస్తుంది. మారేడు, తులసి రెండూ వున్న యింట హరి హరులు యిరువురూ నివాసం చేస్తారు. యిదికాక వాస్తు శాస్త్రం ప్రకారం అనుభవం మీద పెద్దలు చెప్పే మాట ఏమిటి అంటే ప్రతి యింటిలోను మామిడి, పనస, కొబ్బరి వృక్షాలు వుండడం దృష్ట్యా అవి వాస్తు దోషాలు హరిస్తాయి. ఈ మూడు చెట్లు దక్షిణ, పశ్చిమ దిశలలో వుండాలి. అనగా ఆగ్నేయం నుండి ప్రారంభించి వాయవ్యం వరకు ఎక్కడయినా వుండవచ్చు.

◆ **'ప్రభు' అని మన హిందువులు కూడా నామకరణం చేసుకోవచ్చా?**

ప్రభుః అనగా "ప్రభవతీతి సమర్థోభవతీతి ప్రభుః" సమర్థుడగువాడు అని అర్థం. అంతేకాక విష్ణుసహస్రనామాలలో 35వ నామం "ప్రభు!" అని వున్నది. 299వ నామం కూడా ప్రభుః అనే వున్నది.

*"సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వర;"*

*"కామహా కామకృత్కాన్తః కామః కామప్రదః ప్రభుః"*

సర్వసమర్థుడు, సర్వాధికారి – జగత్‌ను నిర్వహించే విషయంలో సృష్టిస్థితిలయలు వీటిని బ్రహ్మవిష్ణుమహేశ్వరులు పంచుకున్నారు కదా! అందులో సృష్టి పరిపాలన

అంతా శ్రీమహావిష్ణువుది కదా! అందుకే ఆయన జగత్ప్రభువు అయ్యారు. ఆయన మీద ప్రేమతోమనం మన సంతతికి ప్రభువు అని నామకరణం చేయడం ద్వారా సదా విష్ణుసహస్రంలో రెండునామాలను పలికిన లాభం చేకూరుతుంది. అంతేకాక "ప్రభుకృప", "ప్రభుసదన్", "ప్రభునివాస్" అని గృహములకు నామకరణం చేస్తే మన హిందూ ధర్మం ప్రకారం అవి శ్రీమన్నారాయణ నామాలే అవుతాయి. ఇంకా స్పష్టత రావాలనుకుంటే విష్ణుప్రభు, నారాయణప్రభు అని నామకరణం చెయ్యవచ్చు.

**◆ యింటిలో ఈశాన్యంలోనే దేవుడు వుండాలా? గూడు ఎత్తుగా వుండవచ్చా?**

శాస్త్రంలో ఎన్నోరకాలయిన మతాంతరములు వుంటాయి. వాస్తు శాస్త్రంలో ఈశాన్యంలో దేవతామందిరం నిర్మాణం చేసుకోమని తెలిపారు. అయితే తూర్పు ఉత్తర సింహద్వారగృహాల విషయంలో ఈశాన్యం దేవతా మందిరం ప్రైవసీ దృష్ట్యా కష్టం. అందుకే శాస్త్రంలో పద్ధతి ఒకటి ఏర్పరచారు. అందులో భాగంగా గృహమునకు వెనుక గదులలో వంట, భోజన, దేవతార్చన వంటివి ఏర్పరచుకోమని చెప్పారు. మధ్యభాగంలో పడక, ధననిక్షేపం వంటివి, ముందుభాగంలో విద్య, బంధుమిత్ర కలయిక గదులు వంటివి ఏర్పరచమని తెలియచేశారు. యిది అంతా రక్షణ, ప్రైవసీ దృష్ట్యా చేసిన శాస్త్రమే. అందువలన మనం యింటి వెనుక గదులలో దేవునిగది నిర్మాణం చేసుకోవడం వాస్తువిరుద్ధం కాదు. యిక దేవుడు మందిరం వీలయినంత ఎత్తులోను మనం కూర్చుని పూజించేటప్పుడు అందుబాటులో వుండేటట్లుగాను ఏర్పరచుకోవాలి. దేవుని గది శుభ్రం చేయు సందర్భంలో ఆ రేణువుల కూడా దేవునికి తగలకూడదు. కావున మందిరం ఎత్తులో వుండాలి. కూర్చుని పూజచేయునప్పుడు మనకన్నా ఉన్నతాసనంలో దేవుడు వుండాలి కావున దేవతామందిరం ఎత్తుగానే వుండాలి.

**◆ భారతదేశంలో రామునికి రామాయణానికి ఎందుకు అంత గౌరవం? ప్రాధాన్యం?**

మన కంటే ఇండోనేషియా వారు రామాయణాన్ని ఎక్కువగా గౌరవిస్తున్నారు. జాతీయ గ్రంథంగా చేసారు అని చరిత్ర మనం తెలుసుకోవాలి. వాల్మీకి రామాయణం, దానికి ధర్మశాస్త్ర వ్యాఖ్యలు చదివినవారికి రామాయణం మీద గౌరవం యింకా పెరుగుతుంది. 'రామోవిగ్రహవాన్‌ధర్మః" రాముడు ధర్మస్వరూపుడు. ఆయన రామాయణంలో చూపిన ప్రతి అంశము ధర్మబద్ధంగా వుంటుంది. రాజ్యపాలనలో ప్రజలందరూ సుఖించేలాగ ఆయన నడచారు. తండ్రితోను, సోదరులతోను, పిల్లలతోను, ప్రజలతోను, గురువుతోను ఎవరితోనయినా ఎలాగ వుండాలి అనే అంశం నేర్చుకోవాలి అంటే రామాయణంలో రాముని పాత్ర ద్వారా తెలుసుకోవలసినదే. మనం మంచిగా, మన పిల్లలు మంచినడవడితో వుండాలి అనినా మనం రామాయణం చదివి పిల్లలకు కూడా రామాయణం తెలియచేయవలసినదే. యిలా ఎన్నో ధర్మ సంబంధ అంశాలు వున్న చరిత్ర కావుననే రాముడు/రామాయణం అంటే భారతీయులకు అత్యంత గౌరవం.

### ◆ మనుష్య జన్మ చాలా గొప్పదా? "సాధన చతుష్టయం" అంటే ఏమిటి?

మీరడిగిన ప్రశ్నకు కేవలం వివేకచూడామణి గ్రంధం నుండి మొత్తం సమాధానం యిస్తాను.

**"జన్తూనాం నరజన్మ దుర్లభమ్"** అని **"దుర్లభమ్ త్రయమేవైతద్దేవానుగ్రహ హేతుకం మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః"** అని శంకరులు చెప్పారు. మనుష్యశరీర ప్రాప్తియు, మోక్షము మీద కోరిక మహాపురుష (గొప్ప వ్యక్తుల) సేవ అనే మూడు అంశములు దుర్లభమయినవి. దైవానుగ్రహం వలన కానీ లభింపవు అని తెలియచేశారు. "సత్సంగము" అన్ని విషయాలలోను చాలా అవసరం అని అందరూ తెలియచేస్తున్నవే కదా! సజ్జన సాంగత్యం వలన మనిషికి చాలా లాభం చేకూరుతుంది. తద్వారా ప్రతి మనిషీ మోక్షసాధనకు ప్రయత్నం చేయు కోరిక కలుగుతుంది. దాని కోసమే "సాధనచతుష్టయమ్" అనేది చెప్పబడింది. చతుష్టయం అంటే నాలుగు. వాటిని సాధించేవరకు చేసేదే సాధన. రెంటినీ కలిపి సాధన చతుష్టయం అంటారు.

**ఆదౌనిత్యానిత్య వస్తు వివేకః పరిగణ్యతే**
**ఇహాముత్ర ఫల భోగ విరాగ స్తదనన్తరమ్**
**శమాది షట్క సంపత్తిర్ముముక్షుత్వమితిస్ఫుటమ్**

"చతుష్టయం"లో మొదటిది

**1. "నిత్యా నిత్య వస్తు వివేకము"**. ఏది "నిత్యము" ఏది అనిత్యము అనే వస్తు వివేకం వుండాలి. నిత్యమయినది (బ్రహ్మము) పరమాత్మ ఒకటే. అది తప్ప మిగిలిన ప్రపంచము అంతా మిధ్యయే. బ్రహ్మాతిరిక్తము అంతయు మిధ్య. సకల ప్రపంచము మిధ్య అశాశ్వతం, అనిత్యం అనెడి నిశ్చయజ్ఞానమే నిత్యానిత్య వస్తు వివేకము. యిది తెలిసిన వ్యక్తి మోసగించి సంపాదించవలెను అనెడి కాంక్షకు దూరంగా వుంటాడు.

**2. "ఇహాముత్ర ఫలభోగవిరాగం"**

ఇహలోక పరలోక సుఖాలపై విరాగం. దేహము మొదలు బ్రహ్మపర్యంతము గల సమస్త అనిత్య వస్తువుల యొక్క దర్శన, శ్రవణ, భోగములందు ఇచ్ఛలేకుండుట. దీనికే వైరాగ్యము అని పేరు.

**3. శమాది షట్కసంపత్తి**

1. శమము 2. దమము 3. ఉపరతి 4. తితిక్ష 5. శ్రద్ధ 6. సమాధానం

3A. మనోబుద్ధి చిత్తాహంకారములు అనెడి అంతరింద్రియములను సర్వదా బ్రహ్మ లక్ష్యమందే నిలుపుటను "శమము" అంతరింద్రియములను సర్వదా బ్రహ్మ లక్ష్య మందే నిలుపుటను "శమము" అంటారు.

3B . జ్ఞానేంద్రియములు అనెడి శ్రోతము, త్వక్ (చర్మము) నయనము (కన్ను) జిహ్వ (నాలుక) ఘ్రాణము (ముక్కు)లను మరియు కర్మేంద్రియములు అనెడి వాక్ పాణి పాదపాయు ఉపస్థలను కేవలం పరబ్రహ్మ మీదనే ఐక్యము చేయడం "దమము" అంటారు. నిగ్రహ బుద్ధితో వుండడం.

3C. "ఉపరతి" బాహ్యవిషయముల నుండి చంచలమగు మనస్సును నిగ్రహింపచేసి పరమాత్మయందే దృష్టి వుంచి జీవనం సాగించడం "ఉపరతి" అనబడును.

3D."తితిక్ష" శీతోష్ణములు, ఆకలి దప్పికలు, మానావమానములు వంటి వాటి వలన కలుగు దుఃఖములను ఓర్చుకొనుచు, మనసు వాటి వలన బాధపడనీయ కుండా చేసుకొనుచూ మనస్సును పరబ్రహ్మ మీద వుంచడమే "తితిక్ష" అంటారు.

3E. "శాస్త్రస్య గురు వాక్యస్య సత్యబుద్ధ్యావ ధారణా" శాస్త్రమున్నూ గురువాక్యమున్నూ సత్యమనెడి నిశ్చయ బుద్ధిని కలిగి వుండడమే శ్రద్ధ. ఈ శ్రద్ధ వలన "అహం బ్రహ్మోస్మి" అనెడి నిశ్చయ జ్ఞానం కలుగును.

3F సమాధానం :- మనస్సును విషయ వాంఛల నుండి దూరం చేసి గురువు మీద, భగవంతుడి విషయంలో ఏకాగ్ర చిత్తముతో వుంచడమే సమాధానం

**4. సద్గురు బోధ**ల వలన మోక్షం మీద తీవ్రమయిన ఆసక్తి "ముముక్షుత్వం" # ఈ నాలుగు వున్నవారు సాధన సంపత్తి గలవారు. వీరు వేదాంత విద్యకు అర్హులు. శాశ్వత మయిన సుఖం, ఆనందం పొందేవారు. ఈ సాధన చతుష్టయం ఆధారంగా మొత్తం వేదాంత శాస్త్రం చెప్పబడింది. వివేక చూడామణి చదవండి.

### ◆ విష్ణుమూర్తికి ఒక్కో మాసంలో ఒక్కో రకమయిన పుష్పములతో అర్చించుట విశేషమా?

చాలా విశేషం. యిది పద్మ పురాణాంతర్గతమయిన విషయం. పద్మపురాణం ఉత్తరఖండంలో పార్వతీ మహదేవుల సంవాందంలో పవిత్రారోపణం, విష్ణుపూజా విషయంగా పుష్పవిశేషాలు, మహాదేవుడు పార్వతీదేవికి చెప్పిన అంశములు వున్నవి. చైత్రమాసంలో సంపంగి మల్లెపూవులతో మరియు ఎర్రటి పుష్పములతో పూజించ వలెను. వైశాఖంలో కేతకీ పుష్పములు విశేషం. జ్యేష్ఠమాసంలో వివిధ రకములయిన పుష్పములు అని చెప్పారు ప్రత్యేక విశేషం చెప్పలేదు. ఆషాఢమాసంలో ఎర్రటి పుష్పములు, కలువలు, గన్నేరు పూలలోను కడిమి పూలు (కదంబపూవులు) అర్చనకు విశేషం, తులసీ అర్చన విశేషం.శ్రావణమాసంలో అవిసె పూవులు, భాద్రపదంలో సంపంగి, తెల్ల పుష్పములు రక్తసింధూరవర్ణ పుష్పములు ఆశ్వీయుజ మాసంలో సన్నజాజి, మల్లి వంటి పుష్పములు, కార్తీక మాసంలో ఋతువుకు సంబంధంగా లభ్యమగు అన్ని పుష్పములు, మార్గశిరంలో కూడా అదే రీతిగా విశేషంగా లభించు అన్ని రకములయిన పుష్పములు అర్చనకు విశేషం. పుష్యమాసంలో తులసీదళములు, కస్తూరీ మిశ్రిత జలము అర్చనకు విశేషములు. మాఘ ఫాల్గుణ మాసములలో నానావిధములయిన పరిమళ పుష్పవిశేషములు చెప్పబడినవి.

### ◆ వేదశాస్త్ర పురాణములలో ధర్మవిషయమై వేదములకు ప్రథమ స్థానమా?

**వేదాః ప్రమాణం ప్రథమం స్వత ఏవతతఃపరం**
**స్మృతయశ్చ పురాణాని భారతం మునిపుంగవాః**
**అన్యాద్యపి మునిశ్రేష్ఠాః శాస్త్రాణి సుబహూనిచ**
**సర్వం వేదా విరోధేన ప్రమాణం నాన్యవర్త్మనా** (సూతసంహిత)

వేదములు స్వతహాగా ప్రమాణములు. తరువాత స్మృతులు, భారతం, పురాణం, ఇతర శాస్త్రములు పురాణాది గ్రంథములు అన్నియు వేదమును అనుసరించియే ప్రమాణములు.

**శృతిస్మృతి పురాణానాం విరోధోయదిదృశ్యతే**
**తత్రశ్రౌతం ప్రమాణంతు ద్వయోర్ద్వైధే స్మృతిర్వరా** (వ్యాసస్మృతి)

శృతి స్మృతి పురాణాలలో విరోధ వాక్యం గోచరించినపుడు శృతినే పరిధిలోకి తీసుకోవాలి.

### ◆ మా అమ్మగారు కాలం చేసారు? నా భార్య ప్రస్తుతం గర్భిణి., ఆమెకు సీమంతం చేయవచ్చా?

చేయాలి. పుంసవనం సీమంతములకు జాతకర్మ, నామకరణ అన్నప్రాశనలకు మూధమి సంవత్సరాశౌచం వంటివి ఉండవు. గర్భశుద్ధి కోసం చేయు సీమంతం పుంసవనాలకు గర్భంలో ఉండగా ఆ విశేషాలు చేయకపోతే కర్మలోపం వస్తుంది. అందువలన చేయవలసిందే. సంస్కార లోపం జరిగితే జాతకర్మాది కర్మలకు ఉపనయనంలో మతాంతరం ఉంది కాని పుంసవన సీమంతాలకు లేదు. కావున చేసి తీరవలసినదే.

### ◆ సంధ్యాకాలంలో పూజలు చేయుట మంచిది అంటారు కదా? దానికి ప్రత్యేక సమయం వున్నదా?

సంధ్యాకాలం అంటే పగటికి రాత్రికి మార్పు ఆరంభం అయ్యేకాలం. రాత్రి పూర్తి అయి సూర్యోదయం ప్రారంభం దగ్గర నుండి ప్రాతస్సంధ్య. సూర్యోదయానికి ముందు రెండు గంటల కాలం ఉషఃకాలం. 1-12ని॥లు ముందు ప్రాతః సంధ్యా కాలం. పగటికాలమును ప్రాతః, సంగవ, మధ్యాహ్న, అపరాహ్ణ, సాయం సమయా లుగా విభజించారు. ప్రాతఃసంగవ, మధ్యాహ్నకాలములు దేవతా ఆరాధనలకు అర్చనలకు, వ్రతములకు విశేషం. అందులో ప్రాతస్సంధ్యా కాలములో అర్చన చేయు అలవాటు వున్నవారు సూర్యోదయానికి రెండుగంటల ముందు ప్రారంభించి దేవతా అర్చనలు చేయవచ్చు. సంధ్యావందనం అర్హత ఉన్నవారికి యితరదేవతా ఆరాధన సంధ్యావందనం ముందు చేయుట సరికాదు. సంధ్యలో సూర్యారాధన ప్రధానం. యిక ఇతరులకు సంధ్యావందనం లేని వారి విషయమై ఉదాహరణకు సూర్యోదయం 6-00లకు అనుకోండి. ఉదయం 4-00 నుండి దేవతా ఆరాధనలు చేయవచ్చు. 4-00 ముందు చేయరాదు. దేవతలను నిదుర లేపరాదు. పంచాంగంలో వ్రాసిన సూర్యోదయానికి 48 నిమిషాల లోపు అర్చనలు పూర్తిచేసి సంధ్యాకాల పూజలు

చేయుట చాలా మంచిది. ప్రాతస్సంధ్యలో సూర్య ఆరాధన, తులసీ అర్చన విశేషం . సాయం సంధ్యాకాలంలో కూడా పంచాంగంలో ఉటంకించిన సూర్యాస్తమయమును ప్రారంభించి 48 నిమిషాల వరకు విశేషం అని చెప్పబడింది. ఉభయ సంధ్యలలో దేవతా అర్చన చేయువారిని భగవంతుడు త్వరగా అనుగ్రహిస్తారు. సాయంసంధ్యలో తులసి అర్చన నిషేధం. దుర్గా అర్చన విశేషం. సాయం సంధ్య అంటే పగలు వెళ్ళి పోతూ రాత్రి ప్రారంభం అయ్యే కాలము అని అర్థం. 1-12 నిమిషములు సాయంసంధ్య ప్రదోషం అంటే సూర్యాస్తమయం తరువాత 2-24 ని॥లు. సూర్యోదయ సూర్యాస్తమయ ములు పంచాంగం లేదా క్యాలెండర్ ద్వారా తెలుసుకోవచ్చు. ఉభయ సంధ్యలలోను సూర్య ఆరాధన చేయువారికి ఆరోగ్యం ఐశ్వర్యం, భోగభాగ్యం లభిస్తాయి. సాయం సంధ్యలో దుర్గా అర్చన చేయువారికి నరఘోష నివారణ, కార్యసిద్ధి వంటి ఫలితాలు అందు తాయి. అపరాహ్ణకాలము పూజలకు నిషేధము. పితృకార్య విశేషం అపరాహ్ణ కాలం.

◆ **ఇంటి ముంగిట ముగ్గుకు విశేషములు ఏమైనా వున్నవా?**

భారతీయ సంస్కృతిని గౌరవించేవారికి యింటి ముంగిట ముగ్గు చాలా విశేషం కలిగి వున్నది. నిత్యం యింటి ముంగిట ప్రాతఃకాలంలో శుభ్రం చేసి కడిగి ముగ్గు వేయటం అనేది ఒక ప్రత్యేక నిబంధనం. అంతేకాకుండా ప్రాతఃకాలంలో యింటిలోని వారు బయటకు వెళ్ళవలెను అనినా! డబ్బులు ఖర్చు చేయదలచినా! బయట ముగ్గు వేయకుండా వెళ్ళకూడదు అని పెద్దల వాదన. యిల్లు శుభ్రం చేసి పూజా గది ముంగిట, యింటి ముంగిట, తులసికోట ముంగిట ముగ్గు వేసిన తర్వాతనే దేవతార్చనలు చేయడం ఒక అలవాటు. ముగ్గుతో అలంకరణ జరగనిదే దేవతాహ్వానం చేయరాదు అని నిబంధన. "ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసాం" అని ఘంటా నాదం చేయు సమయానికి యింటి ముంగిట శుభ్రం చేసి ముగ్గులు వేయడం ద్వారానే దేవతలు లోపలకు వస్తారు అని పెద్దల వాదన. అందువలన ఈ మంచి కార్యమును ఆచరించి ఐశ్వర్యవంతులు కావాలి. ముగ్గు లేకుండా పూజ ప్రారంభిస్తే దేవతలు లోపలకు రారు. మన యింటి ముందు ముగ్గు ఎవరో వేరే వారు వేయుట శ్రేయస్కరం కాదు.

◆ **నేను మార్కెటింగ్ వుద్యోగిని. నాకు పూజకు సమయం ఎక్కువ వుండదు. ఏదైనా ప్రత్యామ్నాయం వున్నదా? ఎక్కువసేపు ప్రయాణం చేయవలసి వుంటుంది?**

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం" భగవానుని పూజామందిరం ఎదురుగా వుండి అర్చన చేయడం ప్రదానం. అలాగ చేయలేని వారి విషయంలోనే యిలాంటి ప్రత్యామ్నాయములు చెప్పారు. భగవన్నామం సదా శ్రవణం చేయవచ్చు. మనకు సెల్‌ఫోన్ లలో కూడా ఈ అవకాశం వున్నది కదా! ప్రయాణం చేయు సమయాలలో సదా భగవన్నామం శ్రవణం చేయండి. అలాగే భగవన్నామ స్మరణ

చేయండి, భగవన్నామం మననం చేయండి. యిలా సదా భగవన్నామ పారాయణ, స్మరణ, మననం చేయడం వంటి వాటి ద్వారా మనకు భగవానుని అర్చించిన ఫలితం వస్తుంది. మీరు ప్రాతః కాలంలో యింటిలో నుండి బయల్దేరు సమయానికి యింటి ముంగిట రంగవల్లి వేసి పూజామందిరంలో దీపారాధన చేసి ఏదో ఒక పదార్థం నివేదన చేయండి. యిక ప్రయాణం ప్రారంభించి సదా నామస్మరణతో సాగండి. మీకు ఎక్కువ సమయం భగవంతుడితో కాలక్షేపం చేసిన ఫలితం వస్తుంది. కేవలం పూజా మందిరం ఎదురుగా కూర్చుని మాత్రమే భగవన్నామ స్మరణ చేయమని ఏ పురాణంలోనూ చెప్పలేదు.

### ◆ జ్ఞాతి శత్రువయితే సహకరించకపోవడం దోషమా?

జ్ఞాతి కనీస అవసరాలు తీర్చుకోలేని స్థితిలో వున్నప్పుడు ఆ అవసరాలు తీర్చగల వనరులు మన దగ్గర వుంటే వాటితో జ్ఞాతికి సహకారం అందించక పోవడం మహా పాపం అని పురాణాలు తెలియచేస్తున్నాయి. జ్ఞాతితో శతృత్వం వున్ననూ వారికి సహకారం చేయవలసినదే. అందుకే కదా ధర్మరాజాదులు వనవాసంలో వుండగా – దుర్యోధనుని గంధర్వులు బంధిస్తే ఆ సమయంలో దుర్యోధనుని రక్షించుటకు భీముని పంపుతాడు ధర్మరాజు. ఘోషయాత్రలో గంధర్వులు దుర్యోధనుని అపహరించారు. శతృపీడ వదిలింది అని అనుకోవచ్చు పాండవులు కానీ అలాగ చేయలేదు. ధర్మరాజు ధర్మం తెలిసినవాడు కదా అందుకే ఆయన దుర్యోదనాదులను రక్షించమని భీముడిని ఆదేశించారు. భీమార్జునులు, నకులసహదేవులు వెంటనే వెళ్ళి చిత్రసేనాది గంధర్వులతో పోరుజరిపి కౌరవులను రక్షించారు. జ్ఞాతులయిన కౌరవులు సహజంగానే శతృవులు. అంతేకాక కౌరవులు ఘోషయాత్ర పేరుతో ధర్మరాజాదులకు యిబ్బందికి గురిచేయుటకే వచ్చారు. అయినా ఘోషయాత్రలో యిబ్బందికి గురిఅయ్యారు కావున వారిని రక్షించవలసిన బాధ్యత ధర్మరాజు పూర్తిచేశారు. యిలాగే ఎవరైనా జ్ఞాతిశతృవు అయినా కష్టంలో వుంటే సహకారం అందించవలసినదే. ఒకవేళ మనమే అశక్తులం అయితే దోషంలేదు. జ్ఞాతిధర్మం విశేషమే.

### ◆ 'పంచసంఖ్యోపచారిణీ' అని లలితాసహస్రనామంలో వున్నది కదా! పంచోపచారములు అనగా ఏమి?

పంచోపచారములు అనగా గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యములు – మనకు షోడశోపచారములు విశేషంగా చెప్పబడినవి. అయితే దీపం లేకుండా అర్చన చేయరాదు కదా! అలాగే నివేదనచేయనిదే అర్చనం సంపూర్ణం కాదు అందువలన ఏ దేవతా అర్చనలోనయినా దీప నివేదనలు చాలా ప్రధానమయినవి. అంతేకాక నిత్యం మనం నుదుటన గంధం కుంకుమ ఎలాగ ధరిస్తామో అది అలంకారముకు ఎంత ప్రధానమో, అదే రీతిగా గంధం – అలాగే పుష్పములు లేనిదే అర్చనయే లేదు

కదా! అందుకోసమే నామాలు చదువుతూ పుష్పాలతో అర్చన చేయడం. నిత్యంలో షోడశోపచార పూజలు చేయు శక్తి లేనివారు కనీసం పంచోపచారములు అయినా చేయాలి. దీపం వెలిగించి, జగదంబకు ధూపంవేసి (కనీసం అగరుబత్తి వెలిగించడం) గంధంతో అలంకరించి, పుష్పాలతో నామార్చన చేసి నివేదన చేయడం పంచోపచారములు అనబడతాయి. యివి చాలా ప్రధానము. సందర్భం కలిసినది కావున యిక్కడ షోడ శోపచారపూజలు ఏవి అనే వివరం కూడా యిస్తే మీకు పంచోపచారములు ప్రాధాన్యం బాగా తెలుస్తుంది. 1. ఆవాహనం 2. ఆసనం 3. పాద్యం 4. అర్ఘ్యం 5. ఆచమనం 6. స్నానం 7. వస్త్రధారణం 8. యజ్ఞోపవీతం 9. గంధం 10. పుష్పం 11. ధూపం 12. దీపం 13. నివేదన 14. తాంబూలం 15. నీరాజనం 16. నమస్కారం - ఉద్వాసనం. యివి షోడశోపచార పుజాలు. యిందు అంతర్భాగమే పంచపూజలు .

### ◆ 'సదాచారము' అనగా ఏమి?

మీ ప్రశ్నను బట్టి మీరు లలితాసహస్రంలో నుండి "సదాచారప్రవర్తికా" అనే నామం ఆధారంగా "సదాచారం" గురించి అడిగినట్లు తెలుస్తోంది. సత్ ఆచారం మంచిదయిన ఆచారం. అందరికీ ఆమోదయోగ్యమయిన ఆచారం - దీనిని సదా చారం అనాలి. అందరికీ ఆమోదం అయ్యేది అంటే మంచివారికి అందరికీ ఆమోద మయినది అయి వుండాలి. అది ఎలా వస్తుంది అంటే - గురువులు వేదశాస్త్ర పురాణ, అవగాహనతో ఆచరించిన నడవడి ఏదయితే వుంటుందో దాన్ని మనం అనుష్ఠిస్తే అది సదాచారము అవుతుంది. ఆధారం లేనిది యితరులకు యిబ్బంది కలిగించేది సదాచారం కాదు. మనం ఏ పనిచేసినా (భక్తి, జ్ఞాన, యోగ, వేదాంత, కర్మకాండ, వైరాగ్య విషయాలకు సంబంధించిన వంటి వాటిలో) అది ఒక పురాణ ఆధారమో, వేద ఆధారమో, శాస్త్ర ఆధారమో, మహర్షిప్రోక్తమో అయివుండాలి. అటువంటిది సదాచారం. మన బుద్ధికి తోచిన విధంగా ప్రవర్తించినా అది ఒక వేళ శాస్త్ర ఆధార మయిన విషయం అయితే అది సదాచారమే, అలా కాకపోతే "సదాచారం" అనిపించు కోదు. సదాచారం కానిది ఏదయినా వుంటే అది అనుష్ఠించేవారి వలన సజ్జనులు ఎప్పుడూ యిబ్బందిపడుతూ వుంటారు.

### ◆ శ్రీకృష్ణుడు మధుర నుండి ద్వారకకు వెళ్ళడంలో ఆంతర్యం - "జరాసంధుడు అంటే భయమా?" అలా వెళ్ళడం రాజనీతియేనా?

కారణజన్ములు చేసిన పనులు దోషపూరితం అని తలంచుచూ విమర్శించడం తప్పు. వారు చేయు ప్రతి పనిలోను ఒక మంచి దాగివుంది. మనం దానిని గ్రహిం చాలి. ఎన్నో సార్లు జరాసంధుడు దుర్మార్గమయిన ఆలోచనలతో మధుర మీద దాడిచేశాడు. అలాంటి సందర్భంలో జరాసంధుని మీద కృష్ణబలరాములే గెలిచారు.

ఎన్నో సార్లు జరాసంధుని శ్రీకృష్ణుడు చంపలేదు. కారణం వాని మరణం భీమసేనుని చేతిలోవున్నదని శ్రీకృష్ణుల వారికి తెలుసు. అందుకే ఎన్నో సార్లు తాను విజయం సాధించిననూ జరాసంధుని వధించకుండా వదిలివేశారు. మరి చివరి సారి జరా సంధుడు – కాలయవనుడు యిరువురూ ఒకేసారి దండయాత్రకు వచ్చే సందర్భం గోచరించినది. అప్పుడు మధుర ప్రజల రక్షణ భారం దృష్ట్యా శ్రీకృష్ణులవారు విశ్వకర్మ సహాయంతో ద్వారకానగర నిర్మాణం చేయించి అక్కడకు మధుర ప్రజలను మార్చినట్లు మనకు శ్రీమద్భాగవతం దశమస్కధం తెలియచేస్తోంది. ఎన్నో సార్లు గెలిచినవాడు చివరిసారి ఎందుకు భయపడతాడు. కాలయవనునితో తాను యుద్ధం చేయు సంద ర్భంలో మరొక ప్రక్కనుండి జరాసంధుడు మధుర మీద దాడిచేస్తే అప్పుడు ప్రజారక్షణ కష్టం అవుతుంది. అందుకే ద్వారకకు మరలిపోయారు. ప్రజారక్షణ ప్రభువుల బాధ్యత. కేవలం శత్రువుతో యుద్ధం చేయడం ఒకటే రాజలక్షణం కాదు. ప్రజలకు యిబ్బంది కలగకుండా చేయడం కూడా రాజులబాధ్యతయే. అందుకే ద్వారకకు మారడం రాజలక్షణం అయినది. యిలాగే రామాయణంలో శ్రీరాములవారు వాలిని చెట్టుచాటునుండి కొట్టినా, కురుక్షేత్రంలో యుధిష్టరుడు "అశ్వత్థామహతాః కుంజరః" అని అనినా అది ధర్మ సూక్ష్మాలతో కూడిన అంశములు. వీటిని పరిశీలిస్తే ప్రతిమనిషీ సందర్భానుసారంగా పట్టువిడుపులు ప్రదర్శించాలి అని తెలుస్తుంది. కేవలం పట్టుదల ఎప్పుడూ పనికిరాదని తెలుస్తుంది. క్షేమం ఎక్కువ దృష్టిలో వుంచుకొని మనం ప్రవర్తిస్తే అంతా సుఖమయ జీవనం సాధించవచ్చు అని తెలుస్తుంది. రామాయణ భారత భాగవతంలోని అంశాలు విజ్ఞానంతో నీతితో కూడినవి. వాటిని విమర్శించడం తప్పు.

### ◆ ఇతిహాసం, పురాణములకు భేదం ఏమిటి?

ఇతిహాసం ఒకే నాయకునికి సంబంధంగా చరిత ముడిపెట్టుకుని ఉంటుంది. రామాయణంలో రామచరిత, భారతంలో పాండు చరిత ప్రధానాంశములు., కాబట్టి ఇతిహాసములు అయినవి. పురాణములు పంచలక్షణ సామాన్య ధర్మములతో సాగుతాయి. సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము కలిగి పురాణాలు సాగుతాయి. ఒక ప్రధాన నాయకుడు మాత్రమే ఉండరు.

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంతరానిచ**
**వంశాను చరితం చేతి లక్షణానాంతు పంచకం**

### ◆ షణ్ముఖ మహాసేన, స్కంధ కార్తికేయ వంటి పేర్లతో భేదం ఏమిటి?

దీనికి అనేక చోట్ల అనేక కథలు వున్నాయి అయితే నేను మీకు వామన పురాణం లోని (57వ అధ్యాయం) గోరఖ్‌పూర్ వారి ప్రతి నుండి సమాధానం యివ్వదలచితిని. తారకాసుర సంహారం కోసం కార్తికేయుని జననం జరిగింది. ఒకానొక సమయంలో శివుని వీర్యం కొద్ది రోజులు అగ్నిదేవుడు భరింపవలసివచ్చినది. దానిని కొద్ది రోజుల

తర్వాత "కుటిల" అను అమె గర్భమందు ప్రవేశపెట్టారు. అగ్నిదేవుడు ఆమె ఆ గర్భముతో అయిదు వేల సంవత్సరములు గడిపి తరువాత భరింప శక్యము కాక బ్రహ్మ కడకు పోయి ఆయన సలహా మేర రెల్లు (శరవణ వనం)లో వేసినది. అక్కడ బాలుడుగా ఉద్భవించగా అక్కడ సంచరించుచున్న దివ్య తేజస్వినులు కృత్తికలు ఆ బాలునికి "పాలునేనివ్వవలెను" అంటే "నేనుయివ్వవలెను" అని పోటీపడిరి. అది చూసి ఆ బాలుడు ఆరు ముఖములు (షణ్ముఖుడు) కలవాడు అయి అయి ఈ కృత్తికల కోరిక తీర్చెను. యింతకీ యీ బాలుడు ఎవరి పుత్రుడు అనే అనుమానం వచ్చినప్పుడు శంకరుల వారు సమాధానం తెలిపారు. 1. నామ్నాతు కార్తికేయోహి యుష్మాకం తనయ స్త్వహౌ - కుటలాయాః కుమారేణి పుత్రేయం భవితావ్యయః 2. స్కంధ యిత్యేవ విఖ్యాతో గౌరీపుత్రో భవత్వపౌ - గుహ యిత్యేవ నామ్నాచ మమాసౌతనయ స్మృతః 3. మహాసేన ఇతిఖ్యాతో హుతాశశ్యాస్తు పుత్రకః శారద్వత యితిఖ్యాతః సుతః శరవణస్య చ అని వామన పురాణంలో వున్నది. అతని నామ వివరములు శంకరులు యిలా తెలిపిరి. ఈ బాలుడు కృత్తికలకు కార్తికేయుడు పుత్రుడగును. కుటిలాదేవికి "కుమార" నామంతో పుత్రుడగును. గౌరీపుత్రుడుగా స్కంధుడని పిలువబడగలడు. "గుహుడు" అనే పేరుతో నాకు (శంకరునికి) పుత్రుడుగా ప్రసిద్ధి గాంచగలడు. "మహాసేనుడు" అగ్నిదేవుని పుత్రుడు గాను శరవణవనంలో ఉద్భవించిన కారణంగా శారద్వతుడుగా ప్రఖ్యాతిగాంచగలడు.

శివ వీర్యం - అగ్నిదేవుడు దానిని కొన్నాళ్ళు భరించారు - కుటిలాదేవి గర్భంలో కొన్నాళ్లు వుండడం - శరవణ వనంలో పుట్టడం - కృత్తికలు పాలివ్వడం - ఉమాపుత్రుడు అనే అంశాలు దృష్ట్యా గుహుడు - మహాసేనుడు కుమారుడు - శారద్వతుడు - కార్తికేయుడు - స్కంధుడు అను పేర్లు వచ్చాయి. అయితే కృత్తికలు పాలిచ్చే సమ యంలో ఆరు ముఖాల గలవాడుగా మారాడు కావున షణ్ముఖుడు అయినాడు. మనకు షణ్మతములు అని భారతీయ సంస్కృతి తెలియచేస్తోంది. అందులోనిది ఈ కుమార మతం - 1. సౌరమతం 2. శాక్తమతం 3. వైష్ణవమతం 4. గాణాపత్యమతం 5. శైవ మతం 6. కుమార మతం అని ఆరు మతములు. ఎవరికి వారు వారి యిష్ట దైవాన్ని ప్రధానంగా ఈ మతాలలో అర్చిస్తారు. మరొక ముఖ్య విషయం కుమారస్వామిని అర్చిస్తే శివశక్తులను మరియు లక్ష్మీనారాయణులను కలిపి అర్చించినట్లే. కుమారస్వామి జ్ఞానప్రదాత. రామాయణంలోను మరియు మహాభారతంలోను కుమారస్వామి చరిత వున్నది. రామాయణంలో శ్రీ వాల్మీకి మహర్షి - "కుమార సంభవం" అని శివపార్వ తుల కళ్యాణగాధకు వాడారు. దానిని కాళిదాసు "కుమార సంభవం" అనే గ్రంధంగా వ్రాశారు. సుబ్రహ్మణ్యస్వామికి ప్రత్యక్షంగా సంబంధం వున్న క్షేత్రాలు ఆరు. అవి పళని, స్వామిమలై, తిరప్పరకుండ్రమ్, తిరుచెందూర్, తిరుత్తణి, పళముదిర్ చోళై - యివి షట్ సుబ్రహ్మణ్య క్షేత్రములుగా పిలువబడుతున్నాయి.

**◆ పరమేశ్వరుని "విష్ణువల్లభుడు"అని అనుటలో ఆంతర్యం ఏమిటి?**

"వల్లభ" అంటే ప్రియమైనవాడు అని అర్థం. "వల్లతి ప్రీణాతి వల్లభం" వల్లప్రీతౌ. ప్రీతిని కలుగచేయునది అని అర్థం. "వల్లతీతి వల్లభః" ప్రియమును చేయునది అని అర్థం. యిలా వల్లభ అనే పదానికి వ్యుత్పత్తి చూడగా వల్లభః అనగా ప్రియమైనవాడు అని అర్థం వచ్చినది కదా. విష్ణువల్లభః అంటే విష్ణువుకు ప్రియమయినవాడు అని అర్థం వస్తుంది. మరి శివుడికి విష్ణువు ప్రియమయిన వాడే కదా! "శివాయ విష్ణు రూపాయ శివరూపాయ విష్ణవే" అంతేకాక విష్ణువుని ఆరాధన చేయకుండా కేవలం శివుడిని మాత్రమే ఆరాధిస్తే శివానుగ్రహం లభించదని సాక్షాత్ పరమేశ్వరుడే చెప్పినట్లు పురాణాలలో వున్నది. అంటే వారిరువురిదీ ఎంతటి అనుబంధమో తెలుస్తోంది. శివవిష్ణువులలో భేదం లేదు కదా! వారిరువు యొక్క స్నేహభావం తెలిపే నామమే "విష్ణువల్లభః" అనెడి "శివసహస్రనామం"లోని నామం.

**◆ శివాలయాలలో చండీ ప్రదక్షిణ మాత్రమే చేయవలెనా? మామూలు ప్రదక్షిణలు చేయరాదా? యిది తప్పక ఆచరింపవలసిన నియమమా?**

ధ్వజస్తంభం, నంది లేని దేవాలయాలలో చండీ ప్రదక్షిణ చేయవలసిన అవసరం లేదు. స్వయంభూదేవాలయములలో, జ్యోతిర్లింగములు, సిద్ధలింగ ప్రతిష్ఠ జరిగిన చోట, స్ఫటికలింగ కలిగి ప్రతిష్ఠ జరిగిన దేవాలయములలో చండీశ్వరుని ప్రతిష్ఠ జరగదు. అందువలన ఆ దేవాలయములు యందు కూడా చండీ ప్రదక్షిణ ఆవశ్యకత లేదు. యిక శివాలయంలో అభిషేకం చేసి ధార వెలుపలకు వచ్చే స్థానంలో "చండీశ్వ రుడు" ప్రతిష్ఠించి వుంటే అక్కడ అటువంటి శివాలయంలో చండీప్రదక్షిణం మాత్రమే చేయాలి. అభిషేకధారను దాటటం శ్రేయస్కరం కాదు. అంతేకాకుండా యితర ఏ శివాలయంలో అయినా శివమందిరం అయిన అభిషేకధారను దాటరాదు. చండీశ్వర ప్రతిష్ఠ లేని శివాలయంలోను, నంది, ధ్వజం ప్రతిష్ఠ లేని దేవాలయంలోను చండ్రీ ప్రదక్షిణం చేయనవసరం లేదు.

**◆ దత్తాత్రేయుడు శ్రీమన్నారాయణ అంశయా? అత్రి అనసూయకు పుట్టిన త్రిమూర్తి స్వరూపములు ఏవి?**

అనసూయ అత్రిమహర్షి యొక్క పుత్రుడు దత్తాత్రేయుడు. అత్రిమహర్షి శ్రీమహా విష్ణువు గూర్చి తపస్సు చేసి ఆయనను పుత్రుడుగా పొందుటకు వరము పొందెను. ఆయన తపస్సుకు మెచ్చి త్రిమూర్తులు ఒకసారిగా ప్రత్యక్షమయిరి. అంతేకాక అత్రి మహర్షి భార్యకు త్రిమూర్తులు ఆమె యొక్క పాతివ్రత్యము పరీక్షించి ప్రసన్నులయి మేము మా అంశలతో మీకు పుత్రులుగా పుట్టెదమని వరము యిచ్చిరి. అందులో భాగంగానే విష్ణు అంశతో దత్తాత్రేయుడు ఉద్భవించాడు. అలాగే రుద్రాంశతో

దూర్వాసో మహర్షి జన్మించిరి. బ్రహ్మ యొక్క అంశతో చంద్రుడు ఉద్భవించెను. శ్రీమద్భాగవతం ప్రకారం అత్రి మహర్షి తపస్సు మెచ్చి "దత్తామయాహమితి యద్భగవాన్ సదత్తః" తనని తాను పుత్ర రూపంగా ఇచ్చుకొని యిలా దత్తానామధేయుడయ్యారు. అలాగే అత్రికి తనయుడు కనుక "ఆత్రేయుడు"గా రెంటిని కలిపి దత్తాత్రేయ నామధేయుడు అయ్యారు. ఈ విధంగాశ్రీదత్తాత్రేయుడు శ్రీమన్నారాయణ అంశయే. మార్కండేయ పురాణంలో దీనికి సంబంధించిన వివరము వున్నది.

**◆ అయ్యప్ప దీక్షలో వుండగా భార్యతో కలిసి గృహప్రవేశం వంటివి చేయవచ్చునా? భార్యకు ఈ దీక్షతో ప్రమేయం వుండదా?**

అయ్యప్ప దీక్ష చాలా విశేషమయినది. గొప్ప నియమాలతో కూడినది. అయితే ఈ దీక్షాకాలంలో భార్యతో కలిసి చేయు గృహప్రవేశాదికములు వివాహాదులు చేయరాదు అని గురుస్వామి దీక్షానియమాలు తెలియచేస్తారు. యిది తాత్కాలిక దీక్ష, మనం మన వైదీక సాంప్రదాయం పరిశీలిస్తే వివాహంలో "ధర్మేచ అర్థేచ కామేచ నాతి చరితవ్యాః" అని వున్నది కదా! ధర్మార్థకామ కార్యములలో భార్యను విడనాడను అని. మరి అయ్యప్పదీక్ష ధర్మకార్యమే కదా! ధర్మకార్యం పుణ్యకార్యం అయిన ఈ అయ్యప్ప దీక్షా కాలంలో భార్య లేకుండా సంకల్పం చేయడం ఎలాగ పనికి వస్తుంది. మనవారు చేయు యజ్ఞయాగాది క్రతువులలో కూడా భార్యతో కలిసి సంకల్పించి యజ్ఞయా గాదులు బ్రహ్మచర్య దీక్షతో పూర్తి చేస్తారు. అలాగే అయ్యప్ప దీక్ష అనే ధర్మకార్యం పూర్తి చేయాలి. వివాహం నాడే నీకు "శాశ్వతదీక్ష" విధింపబడినది. నీవు చేయు ప్రతి పుణ్యకార్యం శుభకార్యం ధర్మకార్యం భార్యలేకుండా చేయరాదు అని. యాత్ర కూడా భార్యలేకుండా చేయరాదు. కానీ శబరిమల స్థలపురాణ నియమానుసారంగా భార్య లేకుండా యాత్ర చేయడం ఒక నియమం. యిక మిగిలిన నియమాలు అన్నీ బ్రహ్మచర్య నియమములే. భూతల శయనం, శీతలస్నానం వంటివి. మన భారతీయ వేద సంస్కృతి ప్రకారం భార్యకు దూరంగా వున్నవారు పూజనీయులు కాదు. దీని మీద మార్కండేయపురాణంలో మనువుల కథలు వున్నవి. అది చదివితే భార్య లేకుండా భర్త ధర్మకార్యం, పుణ్యకార్యం చేయడానికి ఎంత అనర్హుడో తెలుస్తుంది. ఒక అయ్యప్పదీక్షయే కాదు ఏవిధమయిన దైవదీక్ష అయినా యజ్ఞయాగాది క్రతువులు అయినా భార్యతో కలిసి సంకల్పించి బ్రహ్మచర్యదీక్షతోనే పూర్తిచేయాలి. నాకు అయ్యప్ప దీక్షయే ప్రధానం అనుకుంటే దీక్షాకాలంలో గృహప్రవేశాదికములు రాకుండా చూసుకో వాలి. దీక్షాకాలంలో పితృదేవతా కార్యములు రాకుండా చూసుకోవాలి. దీక్షతో వున్నాము అని పితృకార్యములు విడనాడరాదు. అయ్యప్ప దీక్ష కంటే ప్రతి మనిషీ తన తల్లితండ్రుల ఆశీర్వాదములకే ప్రాధాన్యం యివ్వాలి. వేదవాఙ్మయం విలువలు పాటింపక

భార్యతో సంబంధం లేకుండా ఆమెతో కలిసి సంకల్పించకపోతే అయ్యప్పదీక్ష తప్పే అవుతుంది. మీరు దీక్షలో వుంటే ఆమె కూడా దీక్షలోకి పరోక్షంగా వస్తుంది. మీకు భిక్ష తయారు చేయుటలోను, దేవతా అర్చనకు సంబంధించి సంభారములు ఏర్పాటు చేయడం అలాగే యితర సౌకర్యాలు చేయుటలోను, మీకు దీక్షాకాలంలో మీకు అను కూలంగా గృహమును అమర్చుటలోను, మీకు ప్రతిబంధకాలు రాకుండా చూసుకో వడంలో మీ భార్య మీకు పరోక్షంగా దీక్షలో సహకారిణి అవుతుంది. అందుకే భార్యతో కలిసి ఆమె అనుమతితోనే దీక్షలు చేయమని వైదీక సాంప్రదాయం. ఒక వేళ భార్య వుండగా సన్యసించవలెను అని తలచినా ఆమె అంగీకారంతోనే సన్యసించవలెను. అందుచేత ఒకసారి వివాహంలో "నాతిచరామి" అని అగ్ని సాక్షిగా ప్రమాణం చేసి భార్య చేయి అందుకోగానే జీవిత దీక్ష, శాశ్వతదీక్ష ప్రారంభం అయినది. అందుచేత శాశ్వత దీక్ష నియమాలే ప్రధానం. తాత్కాలిక అయ్యప్ప దీక్ష భార్య అనుమతితో భార్యతో కలిసి గణపతి పూజ చేసి ప్రారంభించవలసినదే. ఆమెకు ఈ దీక్షలో ప్రత్యక్ష ప్రమేయం వున్నది.

### ◆ దేవాలయంలో విగ్రహం నుండి తీసి యిచ్చిన దండలు మనం ధరించవచ్చా! ఏమి చేయాలి?

దేవునికి అలంకరించిన వస్తువులు పవిత్రమయినవి. వాటిని చాలా గౌరవ ప్రదంగా చూడాలి అనేది మన సంస్కృతి. బ్రహ్మాండపురాణంలో శ్రీహరి యొక్క ధారణ మాలను దుర్వాసో మహర్షికి యివ్వగా ఆయన దానిని గౌరవంగా తలమీద పెట్టుకొని చాలా గౌరవించారు. అయితే ఆయన ఆ మాలను యింద్రునికి యివ్వగా యింద్రుడు దానిని ఐరావతం మీద పెట్టారు. అది అపహాస్య ధోరణిగా జరిగిన కారణంగానే యింద్రుడు భండాసురుని వలన రాజ్యం కోల్పోయారు. అందువలన ముఖ్యంగా అందరూ తెలుసుకోవలసిన విషయం దేవుడికి ఒక సారి ధరింప చేయబడిన వస్తువు అతి పవిత్రమయిన గొప్ప వస్తువు. పవిత్రతను దృష్టిలో వుంచుకొని దేవాలయంలో విగ్రహం నుండి తీసి యిచ్చి వస్తువులు, దండలు వంటి వాటిని పవిత్రమయిన ప్రదేశంలో వుంచాలి. గుమ్మాలకు తగిలిస్తే పూరేకులు రాలినప్పుడు వాటిని తొక్కితే అది దోషము. అందు వలన ఎవరూ తొక్కకుండా వుండే పవిత్రమయిన ప్రదేశాలలో వుంచాలి. అంతేకాకుండా వాటిని మనం ధరించే విషయంలో మనం ధరించదగ్గ స్థాయివారమా? కాదా! అనేది మనమే ఆలోచించాలి. పవిత్రమయిన దేవుని ధారణామాలలు విగ్రహం నుండి తీసి మనం ధరించడం దేవాలయ ఆగమ శాస్త్ర పండితుల ద్వారా తెలుసుకో వడం మంచిది. యిలా చేయడం అనేది అందరూ ఈ మధ్యన కొత్తగా ప్రారంభించిన అంశము. నేడు పెద్దలందరూ వాహనాలు పూజ చేయించుకుంటూ అమ్మవారి మెడలో మాలను తీసుకొని వాహనంకు తగిలిస్తున్నారు. ఇంద్రుడు బ్రహ్మాండ పురాణంలో ఈ విధంగానే రాజ్యం పోగొట్టుకున్నట్లుగా కథ ఉన్నది కదా! మరి గమనించండి.

**◆ నవరత్నాలు ధారణ జాతక రీత్యా బలహీన గ్రహముల విషయంగా ధరింప వలెనా? లేక బలముగా వున్న గ్రహముల విషయంగా ధరింపవలెనా? నిర్ణయం ఎట్లు?**

జాతక రీత్యా జన్మలగ్నం నుండి అనుకూలించే గ్రహమా? కాదా? తెలుసుకోవాలి. తొమ్మిది గ్రహములు అవి యిచ్చు కారకత్వములు అందరికీ అవసరమే. అయితే అవి పాలించే భావముల ప్రకారం మంచి చేయు గ్రహమా? లేక చెడు చేయు గ్రహమా? అనేవి భావ ఆధిపత్యం ప్రకారం తెలుస్తాయి. చెడు చేయు గ్రహములకు సంబంధిం చిన గ్రహముల జాతిరాళ్ళు ధరించరాదు. మంచి చేయు గ్రహములు బలహీనమ యిననూ, బలముగ వున్ననూ ఆ గ్రహ సంబంధమయిన జాతిరాళ్ళు ధరింపవచ్చును. జాతిరాయి ధారణతో గ్రహముకు బలం పెరుగుతుంది. మంచి గ్రహమునకు బలము పెరిగితే మంచి ఫలితము. ఉదాహరణకు షష్ఠ, అష్టమ, వ్యయ స్థానముల యొక్క ఆధిపత్యములు వచ్చిన గ్రహముల యొక్క జాతిరాళ్ళు ధరించడం మంచిది కాదు. ఈ స్థానముల యందు వున్న గ్రహముల సంబంధమయిన గ్రహములు రాళ్ళు కూడా ధరించరాదు. ఒక వేళ నవరత్నములు అన్నీ కలిపి ధరింపదలచిన ఎడల అందు అన్ని గ్రహములు అనుకూల స్థాయి ఫలితములనే యిచ్చును. నడుచుచున్న దశను అనుసరించి రత్న నిర్ధారణ మరియు, జన్మనక్షత్రము ప్రకారము రత్న నిర్ధారణ వంటివి వున్నాయి. వాటి విషయంలో కూడా ఆయా గ్రహములు లగ్నాత్ మంచి ఆధిపత్యము, మంచి స్థానము కలిగి వున్నవా! లేదా! అనునవి చూసి ధరింపవలెను. చెడు స్థానముల ఆధిపత్యము వచ్చిన గ్రహముల యొక్క రత్నధారణ ద్వారా గ్రహమునకు బలము పెరిగి చెడు ఫలితము పెంచును.

సూచన : సౌభాగ్యవృద్ధి విషయంలో ఆడవారు పగడము, ముత్యము, నల్లపూస, రత్నము (వజ్రము) ధరించవలెను. అనెడి వైదీక సాంప్రదాయం వున్నది ఆ విషయంలో జాతకములు చూచుట తప్పు. భర్తృ ఆకర్షణ, సౌభాగ్య వృద్ధి చేయు లక్షణములు ఈ రాళ్ళకు వున్నవి.

**◆ ఆబ్దీకం, సంవత్సరాశౌచాలలో మగవారు బంగారు ఆభరణాలు ధరించరాదా? నిత్య పూజల పరిస్థితి ఏమిటి?**

సంవత్సరాశౌచంలో నిత్య పూజలు ఆపరాదు. కొత్త పూజలు చేయరాదు. బంగారు ఆభరణాలు ఆబ్దీకం రోజున, మరియు సంవత్సరాశౌచంలో ధరించరాదు. కుటుంబ ఆచారం, ప్రాంతీయ ఆచారం ప్రకారంగా కొన్ని నిబంధనలు ఉపనయనార్హత లేనివారి విషయంలో మార్పులు ఉంటాయి.

**◆ నరఘోష యంత్రములు, నరఘోష ప్రభావములు నిజంగా వుంటాయా? నరఘోష అంటే ఏమిటి?**

నరఘోష అనేది జీవిత ప్రధాన అంశములను మార్పు చేయలేదు. అయితే మానవులకు నరఘోష వలన యిబ్బందులు రాగలవు అనుటటే సందేహం లేదు.

వృద్ధిగా వున్న అంశములు చూచి యితరులు అతిగా సంభాషించెదరు. దుష్టభావనతో చూచెదరు. అనుకూలంగా సంభాషించిననూ, ప్రతికూలంగా సంభాషించిననూ, దుష్ట భావనతో చూచిననూ ఆ అంశమును చేయు వారలకు అడ్డంకులు రావడం, వారి పనికి కావలసిన వనరులు లభింపకపోవడం, వారి యొక్క లక్ష్య ఛేదనలో శారీరక ప్రతిబంధకాలు రావడం వంటివి జరుగుతుంటాయి. యిటువంటి నరఘోష ప్రభావం మార్పు చేయుటకు యితరుల దృష్టి మరల్చుటకుగాను నరఘోష యంత్రములు తయారు చేయబడినవి. వీటిని ధరించుట వలన నరుల దృష్టి మరలి వారికి సంబంధించిన చర్చలు వేరే అంశాలపై సాగే అవకాశం వుంటుంది. అందువలన మన యొక్క ప్రతి కార్యము అవరోధ రహితములుగా ప్రశాంతంగా సాగుతాయి. నరఘోష మార్పునకు యంత్రములే కాక యితర సాధనములు కూడా వుంటాయి.

### ◆ భగవంతుడు వున్నాడని మనకు ఎలా తెలుస్తుంది?

మనం ఫ్యాన్ వేసినప్పుడు స్విచ్ కనబడుతుంది. తిరిగే ఫ్యాన్ కనబడుతుంది. అయితే ఆ ఫ్యాన్ తిరగడానికి అవసరమయిన కరెంట్ కనబడుతోందా! మీరు కరెంట్ అనే శక్తిని చూడగలరా! కరంట్‌ను ఒక చోట నిలువ చేయగలరా? ప్రయత్నంతో కరెంట్ సాధించగలరు. ఉత్పత్తి చేయగలరు. సరఫరా చేయగలరు. యిదే రీతిగా మీకు కలిగిన అనుభూతులను ఎవరికైనా యధావిధిగా సరఫరా చేయగలరా? చూపగలరా? అదే రీతిగా దేవుడిని గుర్తించడం కష్టం. అలాగే అనుభూతిని చూపడం కష్టము. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్". అంతేకాక భగవంతుడి లీలా విశేషాలు గుర్తించినవాడు పొందే ఆనందం అంతులేనిది. భాగవతంప్రధమ స్కంధంలో అర్జు నుడు యాదవులతో యుద్ధం చేయలేక గోపికలను రక్షణ చేయలేని సందర్భంలో., చేతిలో వున్న గాండీవము చూచి, కురుక్షేత్రం చేయగలిగినాను అంటే అది గాండీవం ప్రభావమో లేక నా యుద్ధ విద్యా నైపుణ్యమో కాదు అది భగవానుడు శ్రీకృష్ణుని ప్రభావం అని గుర్తించాడు. అలాగే ప్రతివాడికి సందర్భం వచ్చినప్పుడే భగవంతుడు వున్నాడని గుర్తించగలుగుతాడు. భగవంతుడ్ని చూడాలి అనే కోరిక గొప్పది. అది కలిగినప్పుడు సాధన ప్రారంభిస్తే అతి తేలికగా గోచరిస్తాడు దేవుడు.

### ◆ దేవతా సంబంధమయిన దీక్షలు, యజ్ఞములు, యాగములు మధ్యలో ఆపవచ్చా?

ప్రారంభించిన కార్యం పూర్తి చేయడమే లక్ష్యంగా చేయుటను దీక్ష అంటారు. సానుకూలంగా కార్యాంతం చూస్తే అది కార్యసిద్ధి యిచ్చిన దీక్ష అవుతుంది. "దీక్షా అస్యసంజాతా దీక్షితః" అలాగ దీక్షగా వున్నవాడు దీక్షితుడు అవుతాడు. భగవద్గీతలో "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" వంటి శ్లోకాలతో చెప్పినది అంతా దీక్ష యొక్క గొప్పదనమే. లక్ష్యం లేని జీవితం వృధా అని మన శాస్త్రజ్ఞులు అభిప్రాయం

అందుకే లక్ష్యం సాధించడం కొరకు "దీక్ష" అనే నియమం ఏర్పరచారు. కర్తవ్యం మధ్యలో వదిలి వేయడం వలన దీక్షాలోపం జరుగుతుంది. తద్వారా లక్ష్యం చెడుతుంది. అది అభివృద్ధి హేతువు కాదు. దీక్ష అంటే అర్థం, కాలము, నియమములు పాటిస్తూ చేయు వ్రతములు. కాలము నియమములు పాటించి చేయు ప్రతి పనికీ దీక్ష, అని పేరు. భవానీ దీక్ష అయ్యప్పదీక్ష వంటివి 41 రోజులు కాలము వుంటాయి కదా! పురుడు, మైల వంటివి సంభవించినప్పుడు అవి భంగం అవుతాయి. ఆ సందర్భంలో మరల సంకల్పించిదీక్ష 41 రోజులు పూర్తి చేయవలసినదే. భంగం కలిగినది కదా! అని దీక్ష విరమిస్తే అది చెడు ఫలితాలను యిస్తుంది. యిక యజ్ఞములు యాగములు మధ్యలో ఆపరాదు. యజ్ఞ యాగములు పూర్తిచేయటవలననే లోకం సుభిక్షంగా వుంటుంది. యజ్ఞం, యాగం, సత్పురుషులు లోకంలో వున్నంతవరకే లోకంలో మంచి జరుగును. అనివార్యకారణాలు యజ్ఞం మధ్యలో వచ్చినా యజ్ఞం పూర్తి చేయవలసినదే. దీనికి ఉదాహరణ దక్షయజ్ఞం. దక్షుడు చేసిన పనికి సతీదేవి ఆత్మార్పణం చేయడం, వెంటనే శివుడు వీరభద్ర గణములు పంపడం వారు దక్షయజ్ఞ ధ్వంసం చేశారు కదా! పరమేశ్వరుడు శాంతించగానే మొదట చేసిన పని దక్షునికి మేక తల పెట్టి ప్రాణం పోసి యజ్ఞం పూర్తిచేయించారు. సాక్షాత్తు శివుడు అనుగ్రహం వున్నప్పుడు దక్ష యజ్ఞం పూర్తి అయినట్లే అని ఆపకుండా యజ్ఞం పూర్తిచేయించారు. పూర్ణాహుతి కానిదే యజ్ఞం అవ్వదు. యజ్ఞం మధ్యలో ఆపడం సరికాదనే పరమేశ్వరుడు దక్షుని చేత యజ్ఞం పూర్తి చేయించారు. మరొక ఉదాహరణ బలిచక్రవర్తిని వామనుడు దానం అడిగాడు, ఆయన యిచ్చాడు. అయితే బలిని సుతలమునకు పంపు విషయం యజ్ఞం పూర్తి చేసిన తరువాతనే జరిగినది. శ్రీమద్భాగవతంలో అష్టమస్కంధం 23వ అధ్యాయంలో శ్రీహరి వామనావతారంలో రెండు పాదములతో భూమి ఆకాశం ఆక్రమించాక బలిచక్రవర్తి "స్వామీ నీ మూడవ పాదం నా శిరమున వుంచుము" అన్నాడు. బ్రహ్మ శ్రీహరితో బలిని శిక్షింపవలదు అని ప్రార్థించాడు. సరే శ్రీహరి బలిని సుతలమునకు పొమ్ము, సుతలములో ప్రహ్లాదునితో కలిసి వుండుము. నీకు నేనే రక్ష అని తెలిపి.., శుక్రాచార్యుని పిలిచి బ్రాహ్మణ శ్రేష్ఠుడా! యజ్ఞము చేయువాడు నీకు శిష్యుడు అగు బలి. యజ్ఞమున ఏ దోషములు, న్యూనత (మిగులు) వున్నదో వానిని పూర్తి చేయుము. బ్రాహ్మణుల దృష్టిచే అటువంటి వైషమ్యము వుండరాదు. అనగా శుక్రాచార్యుడు శ్రీహరితో స్వామీ సర్వకర్మ ప్రవర్తకుడవు. యజ్ఞఫల ప్రదాతవు. యజ్ఞపురుషుడవు. నిన్ను పూజించిన ఈ బలిచక్రవర్తి యజ్ఞములో కర్మవైషమ్యము ఎట్లు కలుగును. అయినను నీ ఆదేశము పాలించెదను. అని యజ్ఞం పూర్తి చేసినాడు. సాక్షాత్ యజ్ఞఫల ప్రదాతలు పరమేశ్వరుడు దక్షయజ్ఞంలోను, శ్రీహరి బలిచక్రవర్తి యజ్ఞములోను ఈ ఆదేశం చేశారంటే యజ్ఞం మధ్యలో ఆపరాదనే కదా! శాస్త్రం.

**◆ శివ పంచాక్షరీ జపం ఎప్పుడూ చేసుకోవచ్చా?**

ఎప్పుడూ సదా శివుని ధ్యానంలో వుండడం చాలా అవసరం. శివపురాణంలో "గచ్ఛ తస్తిష్ఠతో వాపి స్వేచ్ఛయా కర్మ కుర్వతః అశుచేర్వా శుచేర్వాపి మంత్రోయః న చ నిష్ఫలః" అని వున్నది. కలియుగంలో ఈ మంత్రం నడుస్తూ, నిలబడి, తనకు నచ్చిన పని చేసుకుంటూ, శుచి కానీ, శుచి కాకుండా కానీ జపం చేసిననూ ఈ మంత్రం చేయుట వ్యర్థం కాదు. భక్తి లేకుండా చేయు ఈ మంత్రం ఫలితము ఈయదు.

**◆ పురాణాలలో రుద్ర సృష్టి అని వుంటుంది. రుద్రుని ఎవరయినా సృష్టించారా?**

బ్రహ్మదేవుడు కల్పం యొక్క ప్రారంభంలో తనకు ఈడు అగు కొడుకు కోసం తపస్సు చేయసాగెను. అంతట అతని ఒడిలో నీలలోహితుడు అగు కుమారుడు ఉదయించెను. అతడు సుస్వరముగా రోదించసాగాడు. అతడికి 'రుద్రుడు" అని పేరు పెట్టారు. ఆ తరువాత మరల ఏడుసార్లు ఏడవగా అతనికి భవుడు, శర్వుడు, ఈశానుడు, పశుపతి, భీముడు, ఉగ్రుడు, మహదేవుడు అని పేర్లు పెట్టారు. వీరికి సూర్యుడు, జలము, మహి, వాయువు, అగ్ని, ఆకాశము, దీక్షితుడయిన బ్రాహ్మణుడు, సోముడు అనునవి స్థానములు. వీరికి సువర్చల, ఉష, సువేశి, శిల, స్వాహా, దిక్కులు, దీక్షా, రోహిణి అనువారు భార్యలు. పురాణాలలో రుద్రసృష్టి యిదే.

**◆ భారతంలో శ్రీకృష్ణ పరమాత్మ పాండవులను చేరేసరికి (బాల్యంలో) అప్పటికి కర్ణుడు కౌరవుల దగ్గరనే వున్నాడా? శ్రీకృష్ణ కర్ణుల సందర్భాలు ఎప్పుడు ఆరంభం అయినవి?**

మీరడిగిన ప్రశ్న ప్రకారం మహాభారతంలో కానీ శ్రీమద్భాగవతంలో కానీ పాండవులు శ్రీకృష్ణుడు కలుసుకున్న సందర్భానికి ముందే కర్ణుడు కౌరవులతో సహవాసం ప్రారంభించినటులుగా వున్నది. శ్రీమన్మహాభారతం ఆదిపర్వం 133వ అధ్యాయంలో రాజ కుమారాస్త్ర విద్యా ప్రదర్శన 135 అధ్యాయంలో కర్ణరాజ్యాభిషేకం వర్ణింపబడినది. అప్పటికీ భారతంలో శ్రీకృష్ణ బలరాముల ప్రస్తావన రాలేదు. ఆదిపర్వం 183వ అధ్యాయంలో ప్రారంభించి 191 వరకు ద్రౌపదీ స్వయంవరం వివరాలు యివ్వబడినవి. అక్కడ శ్రీకృష్ణుల వారి ప్రస్తావన ప్రారంభం అయినది. అంతేకాక 187వ అధ్యాయంలో "ప్రణమ్య శిరసాదేవమ్ ఈశానంవరదంప్రభుమ్. కృష్ణంచమనసాకృత్వాజగృహే చార్జునోధనుః" అని వున్నది అనగా వరప్రదాత అయిన ఈశానునికి శిరసు వంచి నమస్కరించి కృష్ణుని మనసా ధ్యానించి అర్జునుడు ధనస్సును అందుకున్నాడు అనునది శ్లోకం యొక్క అర్థం. అక్కడ ద్రౌపదీ స్వయం వరంలోనే మొదట పాండవులు శ్రీకృష్ణుడు కలుసుకున్నట్లు వున్నది. అంతకు పూర్వమే జరిగినది కుమారాస్త్ర విద్యా ప్రదర్శన. కావున శ్రీకృష్ణుడు ప్రవేశించే కాలముకు పూర్వమే కర్ణుడు భారతంలో గోచరించాడు. అయితే పాండవులకు శ్రీకృష్ణులవారికి

కలయిక మొదట ఎప్పుడు జరిగినది అనే అంశం ప్రస్తావనకు వచ్చినప్పుడు మాత్రం శ్రీమద్భాగవతం కొంత విశేషం చూపుతుంది. శ్రీమద్భాగవతంలో కూడా శ్రీకృష్ణుల వారు పాండవులతో కలసిన సందర్భానికి కర్ణుడు కౌరవుల దగ్గర అంగరాజ్యాభిషేకం పొంది వున్నాడు. యిందులో భేదంలేదు. అయితే భాగవతంలో శ్రీకృష్ణులవారు పాండవులతో కలసిన ప్రస్తావన వేరుగా వున్నది. కంససంహారం చేసి ఉగ్రసేనునికి పట్టాభిషేకం చేయించిన పిమ్మట ఉద్ధవుని నందగోకులమునకు పంపి అక్రూరుని హస్తినాపురమునకు పంపారు. పాండవ క్షేమ సమాచారములు తెలుసుకొని వారికి మేలు చేయమని పంపిరి. ఆ తరువాత మరల శ్రీకృష్ణ పాండవులు కలయిక రాజసూయ యాగంతో ప్రారంభం అయినది. ధర్మరాజు చేత రాజసూయయాగం చేయించు కోరికతో శ్రీకృష్ణ ధర్మరాజు సంభాషణతో శ్రీమద్భాగవతంలో ప్రారంభం అయినది శ్రీకృష్ణుని పాత్ర. అయితే కేవలం శ్రీకృష్ణ మహిమలు తెలుపుటకుగాను చేసినది శ్రీమద్భాగవతం. అందువలన మిగిలిన అంశాలు ప్రస్తావనకు రాలేదు. కాబట్టి దానిని తప్పుగా భావింపరాదు. మొత్తం మీద కర్ణుడు మాత్రం విద్యా ప్రదర్శన సమయంలో వచ్చారు. కృష్ణుడు మాత్రం పాండవులతో కర్ణుని తరువాత తన పాత్రను పోషించారు.

### ◆ శంకరుడు సుప్రభాతం అనుగ్రహించారా? అది ఎందులోనిది? ఇంకా విశేషం ఏమిటి?

"సుకేశి" అను రాక్షసుని వృత్తాంతం చెప్పిన సందర్భంలో మనకు శంకరుడు అనుగ్రహించిన సుప్రభాతం చెప్పబడివున్నది. నిద్రలేవగానే మంచి స్మరణ చేయుచూ నిద్ర లేచేవారికి ఆ రోజంతా మంచి ఫలితాలు అందుతాయి. అందులో భాగంగానే మనకు శంకరులు అనుగ్రహించిన సుప్రభాతం అందుబాటులో వున్నది. యిది స్మరిస్తూ లేవడం వలన వారికి రోజంతా మంచి జరుగుతుంది. భగవద్ధ్యానం చేయుచూ నిద్ర లేవమని కొందరు చెబుతారు. కొందరు మన కుడి అరచేయి చూస్తూ "కరాగ్రేవసతే లక్ష్మీ కర మధ్యే సరస్వతీ కరమూలే తధా గౌరీ ప్రభాతే కర దర్శినీ" అని పారాయణ చేసి భూమికి నమస్కరించి శయ్య నుండి లెమ్మంటారు. కొందరు భగవన్నామ సంకీర్తనలు చేయుచూ శయ్య దిగమని చెబుతారు. అయితే పురాణాల మీద బాగా అవగాహన వున్నవారు శంకరకృత సుప్రభాతం పఠించి దినచర్యలో అడుగు పెట్టమని చెబుతారు. ఆ స్తోత్రం చూద్దాం.

1. *బ్రహ్మో మురారి స్త్రి పురాంతకారీ భానుః శశీ భూమిసుతో బుధశ్చ*
   *గురుశ్చ శుక్రః సహ భాను జేన కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్"*
2. *భృగుర్వసిష్ఠః క్రతురంగిరాశ్చ మనుః పులస్త్యః పులహః సగౌతమః*
   *రైభ్యో మరీచిశ్చ్యవనో ఋభుశ్చ కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్*
3. *సనత్కుమారః సనకః సనందనః సనాతనో ప్యాసురి పింగళౌచ.*
   *సప్తస్వరాః సప్తరసాతలాశ్చ కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్*

**4. పృథ్వీ సగంధా సరసాస్తథాఽ ఽ పః స్పర్శశ్చ వాయుర్జ్వలనః సతేజాః**
**నభః సశబ్దంమహతా స హైవ యచ్ఛంతు సర్వే మమ సుప్రభాతమ్**

**5. సప్తార్ణవాః సప్త కులా చలాశ్చ సప్తర్షయో ద్వీప వరాశ్చసప్త**
**భూరాది కృత్వా భువనాని సప్తదదంతు సర్వే మమ సుప్రభాతమ్"** యివి అయిదు శ్లోకాలు శంకరులు అనుగ్రహించినవి. శంకరులు అంటే పరమశివుడు అనుగ్రహించి నవి. ఈ సుప్రభాత పారాయణతో నిద్రలేచినవారు సుఖ జీవనం చేస్తారు.

### ◆ ఉపన్యాస ధోరణి పెరగాలి అంటే ఏ దేవతారాధన చేయడం మంచిది.

"తన్మహేశాయ విద్మహే వాగీశాయ ధీమహి" అని పరమశివుని మంత్ర గాయత్రీ. వాక్ ఈశాయ వాక్కు అధిపతి అని చెప్పారు. ఉపన్యాసం అంటే వాక్ సంబంధం అయినది కదా. కాబట్టి మంచి వాక్ కలిగి ఉపన్యాస ధోరణి బాగా రావాలి అంటే "ఓం నమశ్శివాయ" మంత్రం మెడిటేషన్ చేయడం చాలా మంచిది. శ్రీమాతకు "వాగీశ్వరీ" అని పేరు వున్నది. అందువలన జగదంబను అనుష్ఠిస్తే మంచి వాక్ రావడం జరుగుతుంది. "శివా" "శివ"లు యిరువురూ వాక్‌ను అందించడంలో సిద్ధహస్తులు "శివ"ను లేదా శివానీని అర్చిస్తే శుభం క్షేమం. వాక్, ఉపన్యాసం కుదురుతాయి. శ్రీ శివా శివ శక్త్యైక్య రూపిణీ లలితాంబికా.

### ◆ ధర్మం అంటే ఏమిటి?

శాస్త్ర విహితమయిన కర్మలు "ధర్మం" అనబడతాయి. మన నడవడి, మన చేష్టలు, మన వృత్తి యితరులకు యిబ్బంది కలిగించనివి, సజ్జనులకు హాని కలిగించనివి ధర్మం అనిపించుకుంటాయి. వ్యవస్థాగతంగా వున్న నియమాలు, సంఘ నియమాలు, సంస్కృతి నియమాలు ధర్మ మార్గాలు అనిపించుకుంటాయి. స్వాధ్యాయం, బ్రహ్మచర్యం, దానం, యజనం, ఔదార్యం, సారళ్యం, దయ, అహింస, ఇంద్రియ విజయం, క్షమాగుణం, ఆత్మ సంయమనం, శుచిత్వం, సత్సంకల్పత్వం, శివకేశవ భాస్కర దేవ్యాదుల పట్ల భక్తి యివి మానవులు అనుష్ఠించవలసిన ధర్మాలు. వీటిలోనే వృత్తిరీత్యా కులం రీత్యా కొన్ని మార్పులు శాస్త్రాలలో చెప్పారు. ఉదాహరణకు అందరికీ అహింసయే పరమధర్మం అని చెప్పినా సైనికులకు మాత్రం శత్రుజయం ధర్మం అని చెప్పారు. ఇలా ఎన్నో ధర్మ మార్గాలు పురాణాలలో తెలుపబడ్డాయి.

### ◆ సాలగ్రామములు ఒకటే వుంచి అర్చన చేయవచ్చా?

మీరు అడిగే ప్రశ్నలో ద్వంద్వార్థం వస్తోంది. 1. పంచాయతనంలో ఒకటే సాలగ్రామం వుంచుకోవచ్చా అని ఒక అర్థం వస్తోంది దానికి సమాధానం పంచాయ తనంలో ఒకటి, నాలుగు, పన్నెండు సంఖ్యా సాలగ్రామములు వుంచడం ఒక సాంప్రదాయం పెద్దలు ఏర్పాటు చేశారు. పన్నెండు సాలగ్రామాలు వున్న పంచాయ

తనం వున్న యిల్లు క్షేత్రంతో సామానంగా విలసిల్లుతుంది అని చెబుతారు. ఒక సాలగ్రామంతో కూడిన పంచాయతనం కూడా మంచిదే. 2. కేవలం సాలగ్రామం ఒక దానికే అర్చన చేయవచ్చా? అని రెండవ అర్థం. మరి దీనికి సమాధానం పనికిరాదు అని చెప్పాలి. కారణం పురాణాలలో శివుని విస్మరించిన విష్ణుపూజ, విష్ణువును విస్మరించిన శివపూజకు విలువ వుండదు అని వున్నది. శివకేశవుల ఏకత్వం గూర్చి ఎక్కువగా వివరింపబడినది. అయితే సాలగ్రామ వివరాలలో కేవలం సాలగ్రామమునకు అర్చన చేసి తీర్థం తీసుకోవచ్చు అని కూడా వాదన వున్నది. అందుకే తీర్థం తీసుకునేటప్పుడు "సాలగ్రామ శిలావారి పాపహారి విశేషతః ఆ జన్మ కృతపాపానాం ప్రాయశ్చిత్తం దినే దినే" అని చెబుతారు. ఒకవేళ శివ పంచాయతన అర్చన చేసినా తీర్థం తీసుకునే సందర్భంలో చెప్పే శ్లోకం యిదే. అందువలన కేవలం సాలగ్రామం ఒకటే వుంచి కూడా అర్చన చేసుకోవచ్చు అని అర్థం గోచరిస్తుంది. సాలగ్రామ శిలల వివరాలు వున్న దేవీ భాగవతం తులసీ ఉపాఖ్యానం దగ్గర్లో వుంటాం. అక్కడ వీటిని పరిశీలిస్తే ఒక సాలగ్రామం వుంచి అర్చన చేయవచ్చు అని మనకు అర్థం గోచరిస్తుంది.

### ◆ పంచాంగాలలో వ్రాసే గోచార ఫలితాలు అందరికీ సమాన ఫలితాలు యిస్తాయా?

గోచారంలో మిధునరాశి వారికి ఉద్యోగ ప్రాప్తి అంటారు. మిధునరాశిలో అప్పుడే పుట్టిన వారుంటారు. అలాగే 80 వసంతాల వృద్ధులు వుంటారు. మరి వారికి ఉద్యోగంతో పనిలేదు కదా! పంచాంగంలో వ్రాసిన ఈ ఫలితం ఎవరికీ అంటే ఉద్యోగ ప్రయత్నాలలో వున్నవారికి మాత్రమే అన్వయం చేయాలి. అలాగే వివాహ విషయం, మొదలగు అంశాలు. అయితే మిధునరాశి వారికి ఉద్యోగ ప్రాప్తి అని వున్న విషయంలో అందరికీ ఉద్యోగం వస్తుందా! అంటే వారి పుట్టిన సమయ, తేదీల జాతకం ఆధారం చేసుకుని దాని అనుసంధానంగా దశ అంతర్దశ ఫలితాలకు గోచార ఫలితాలకు సంబంధం పెట్టి ఫలితాలు చెప్పాలి. దశ అంతర్దశ బాగుండి గోచారం బాగుంటే ఫలితాలు ఆశించిన దానికంటే ఎక్కువ స్థాయి ఫలితాలు అందు కుంటారు. అప్పుడు పంచాంగంలో గోచార ఫలితాలు వ్రాసిన రీత్యా శుభఫలితాలు అందుతాయి. అలాగే దశ అంతర్దశ బాగా లేనప్పుడు గోచారం బాగా లేకుంటే పంచాంగంలో వ్రాసిన చెడు ఫలితాలు అందుతాయి. పంచాంగంలో వ్రాసిన మంచీ చెడు ఫలితాలు పంచాంగకర్తల నైపుణ్యమే. అంతేకాకుండా జ్యోతిష గ్రంథాలలో గోచార ఫలితాలకు అష్టక వర్గ విధానంతో ముడిపెట్టి చెప్పే విధానం జన్మ జాతకంతో ముడిపెట్టి చెప్పినదే. అందువలన పంచాంగంలో ఇచ్చిన గోచారం మరియు జన్మ జాతకంతో ముడిపెట్టి జాతకం చెప్పించుకుంటే ఫలితాలు సంపూర్ణంగా వుంటాయి.

### ◆ వివాహం రోజున ఉపనయనం చేయవచ్చా?

భారతీయ సంస్కృతి మీద జరిగిన ఎన్నో దాడుల ప్రభావంగా వైదిక సంస్కారములు, వాటిని విలువలు ప్రజలకు తెలియని స్థితి ఏర్పడినది. గర్భాష్టమేషు బ్రాహ్మణ

మూపనీయిాత, గర్భంలో కలిపి ఎనిమిదవ సంవత్సరం నడుచుచుండగా ఉపనయనం చేయమని నియమం. ఉపనయనం నాటి నుండి బ్రహ్మచారిగా పిలువబడతారు. “ద్వాదశ వర్షాణి బ్రహ్మచర్యం ఆచరేత్” పన్నెండు సంవత్సరములు బ్రహ్మచర్యం పాటించాలి. బ్రహ్మచర్య కాలంలో విద్యాభ్యాసం చేయించి ఆ తరువాత గోదాన వ్రతం, వేదవ్రతములు, స్నాతకం చేసుకొని వివాహం చేసుకోమని బ్రాహ్మణులకు చెప్పబడింది. పదకొండవ ఏట రాజులకు, పన్నెండవ ఏట వైశ్యులకు ఉపనయనం చేసి బ్రహ్మచర్య దీక్షానంతరం వివాహం చేయమని చెప్పారు. నేటి సమాజంలో మన వారికి మన సంప్రదాయములు తెలియవు, తెలుసుకోరు. ఒక వేళ ఎవరయినా చెప్తే చాదస్తం అని విసుక్కుంటారు. బ్రిటీషు వారి కాలంలో వచ్చిన ప్రతిబంధకాల దృష్ట్యా, వివాహం నాడు ఉపనయనం చేయడం ఆరంభించారు. మరొక కారణం ఆర్థిక స్థితి. ప్రస్తుతం సమాజం ఆర్థికంగా బలపడినప్పటికినీ, చిన్నతనములో ఉపనయనం చేయుటకు ప్రజలు మక్కువ చూపించడం లేదు. వివాహం నాడు ఉపనయనం సమర్థించతగిన అంశము కాదు. బాల్యంలోనే ఉపనయనం చేయాలి.

### ◆ తిలదర్భల ఉత్పత్తి ప్రాధాన్యము వివరింపగలరు?

పద్మ పురాణం ఉత్తరఖండం ఉత్తరార్థం 134వ అధ్యాయంలో వీటి విషయం వస్తుంది. యివి విష్ణుభగవానుని నుండి ఉద్భవించాయి. ‘విష్ణోర్దేహాత్ సముద్భూతాః కుశాః కృష్ణతిలాః స్మృతాః” “దూప్యం దర్భాః తదాగావో దౌహిత్రః కుతపాస్తితాః” వెండి, దర్భలు, ఆవులు, దౌహిత్రుడు (కుమార్తె యొక్క కుమారుడు) తిలలు వీటికి కుతప ములు అని పేరు కుతపము అనగా “పాపం కుత్సత మిత్యామః తస్యంసంతాప కారకాః” పాపమునకు కుత్సతము అని పేరు. పాపమును నాశనము చేయునవి కుతపములు అనే పేరు శాస్త్రములో చెప్పబడినది. మరి యొక్క చోట పురాణ వాక్యమే, విష్ణుభగవా నుడు వరాహావతార సమయంలో స్వామివారి శరీరము పైన వున్న స్వేదబిందువుల తిలలు అయినవి. ఏదయినా విష్ణువు ద్వారా ఉత్పత్తి నొందినవే దర్భలు, తిలలు. సమస్తమయిన వైదిక కర్మ కాండలకు సంబంధించి దర్భ లేకుండా ఏ పనీ చేయరు. అలాగే తిలలు లేని పితృకార్యములు నిష్ప్రయోజనములు. పంచమహాయజ్ఞములు అన్నింటిలో విశేషములయిన పితృ యజ్ఞములందు దర్భలు, తిలలు విశేషము.

### ◆ పౌర్ణమినాడు అక్షరాభ్యాసం చేయవచ్చా?

పౌర్ణమి అనధ్యయన దినము. అనధ్యయనం అనగా చదువుటకు పనికిరానిది. అధ్యయనం చేయకూడని తిథిని అనధ్యయనంగా పిలుస్తారు. పాడ్యమి, చతుర్దశి, అష్టమి, పౌర్ణమి, అమావాస్యలను అనధ్యయనములుగా పరిగణించారు. వీటిలో అధ్యయనమే పనికిరాదు. కనుక అక్షరాభ్యాసం కూడా పనికిరాదని, ఉపనయనము చేయరాదని జ్యోతిష్యశాస్త్ర రీత్యా నిర్ధారించారు.

### ◆ ఉపపాండవులను శ్రీకృష్ణ పరమాత్మ ఎందుకు కాపాడలేదు?

శ్రీమన్మహాభారతంలో ప్రతిఘట్టము కూడా "జరిగేది జరగక మానదు" అనే అంశం ఎక్కువగా గోచరిస్తుంది. ఉదాహరణకు జరాసంధుడిని అనేకసార్లు శ్రీకృష్ణ పరమాత్మ ఓడించారు కానీ చంపలేదు. కారణం జరాసంధుడు భీముడు చేతిలోనే చావవలసిన అంశం. అలాగే భగవద్గీతలో కూడా కర్మను ఆచరించడం వరకే మన బాధ్యత కర్మఫలం మాత్రం పరమాత్మకే పరిమితం అని పరమాత్మ శ్రీకృష్ణులవారు చెప్పారు. ఆయన భాగవత, భారతాలలో అదే రీతిగా ప్రవర్తించడం గమనార్హం. ఒకటి ఆలోచించండి. పాండవ సహవాసంలో ఆయన ఎక్కువ శ్రమ చేశారు. సాక్షాత్ శ్రీమహావిష్ణువుఅయిన శ్రీకృష్ణులు దుర్యోధనుని బుద్ధి ఒకసారి మార్చి వేస్తే శ్రమ వుండేది కాదు కదా! అలాగ చేయలేదు ఎందుకంటే అది అలాగ జరగాల్సినదే కాబట్టి యిక ఉప పాండవ విషయం గత జన్మ వివరాలు తెలుసుకోవాలి. విశ్వామిత్రుడు హరిశ్చంద్రుడు కథ తెలుసుకదా. రాజసూయ యాగదక్షిణను విశ్వామిత్రులవారు హరిశ్చంద్రుని అడిగి ఆయన రాజ్యమును తీసుకొని భార్యా పిల్లలను నారబట్టలతో కాశీకి పంపివేసెను. ఆ సందర్భంలో విశ్వామిత్రుల వారి ప్రవర్తనకు బాధపడిన విశ్వే దేవులు అయిదుగురు "ఈ విశ్వామిత్రుడు ఎట్టి పాపలోకములు పొందునో కదా! యజ్ఞములు చేయువారిలో శ్రేష్ఠుడు అగు ఈ రాజును రాజ్యభ్రష్టుని చేసిన కౌశికుని నరకలోకములు వచ్చును." అని బాధపడిరి. అది తెలిసి విశ్వామిత్రులవారు విశ్వే దేవులను శపించిరి. "శశాపతాన్మనుష్యత్వం సర్వేయూయ మవాప్స్యథ. ప్రసాదితశ్చ తైః ప్రాహ పునరేవ మహామునిః మునుషత్వేపి భవతాం భవిత్రీనైవ సంతతిః నదార సంగ్రహశ్చైవ భవితానజ మత్సరః కామక్రోధ వినిర్ముక్తా భవిష్యధ సురాః పునః మీరు అందరు మనుష్య జన్మలు పొందెదరు. అంతట విశ్వదేవులు ప్రార్థింపగా విశ్వామిత్రులు శాపోపశమనంగా మానవ జన్మలు పొందినను మీకు సంతతి కలుగదు. దారా సంగ్రహం కలుగదు. కామక్రోధ వినిర్ముక్తులయి తిరిగి మరల దేవతలు అగుదురు అని వరమిచ్చెను. ఆ విశ్వదేవులే ఉపపాండవులు. వారే యుద్ధానంతరం అశ్వత్థామ చేత మరణించి తిరిగి విశ్వదేవులు అయినారు. భారతంలో అందరూ కారణ జన్ములే కదా! గ్రంథ పఠనం ఎక్కువ అయిన కొద్దీ అనుమానములు తగ్గే అవకాశం వుంటుంది. భారత భాగవతాల్లోని పాత్రల జన్మ కారణాలు వేరే గ్రంథాలలోనే లభిస్తాయి.

### ◆ పురాణవేత్తను సర్వజ్ఞుడని పిలువవచ్చు అంటారు నిజమేనా?

యుగ ధర్మం అనుసరించి ఒక మాట చెబుతాను ఎటువంటి బిరుదు పొందినా ఆ బిరుదు పొందినవారికి ఆత్మవిమర్శ అవసరం. చాలామంది వారికి విజ్ఞానం ఆ బిరుదు అందుకునే స్థాయి వున్నదా? లేదా? అనేది వారికి తెలుసు అయినా సంఘంలో గౌరవ మర్యాదలు పెంపు కోసం బిరుదులు పెట్టించుకునేవారున్నారు. యిక పద్దెనిమిది

పురాణాలు తెలిసిన పురాణవేత్తను సర్వజ్ఞుడు అనవచ్చు. అయితే పద్దెనిమిది పురాణాలలో వేదముల, బ్రాహ్మణముల, ఉపనిషత్తుల యందు విషయాలు మరియు చాలా చోట్ల ఇతర శాస్త్రవిషయాలు చర్చింపబడినవి. ఉదాహరణకు మత్స్యపురాణం, అగ్ని పురాణాలలో వాస్తుశాస్త్రం, శిల్పశాస్త్రం, రాజనీతి, అలాగే యితర శాస్త్రాలు చెప్పబడినాయి. మరి వాటి విశేషాలు కథలు చదివినట్లుగానే కాకుండా వాటిని సునిశితంగా గురువు దగ్గర చదవి వుండాలి. ఎన్నో ధర్మ శాస్త్ర విషయాలు ప్రతి పురాణంలోను చర్చకు వస్తాయి. ఉదాహరణకు మార్కండేయ పురాణంలో మదాలస అలర్కసంవాదం, మనువుల చరిత్రలు వంటి వాటిలో ఈ వివరాలు వున్నాయి. అలాంటి పురాణాలు వైద్యశాస్త్రం కూడా చెప్పబడినది. యిక సృష్ట్యాది విషయాలు యివి గురు ముఖతః తెలుసుకున్నవారికి వైదీక సాంప్రదాయాలు అమలు చేయుటకు ఉపయోగించే కల్పసూత్రం కూడా యిక్కడ వివరింపబడినది. మరి వ్రతములు యాగములు ప్రయోగ విధానం తెలుసుకోవాలి. యిలా తెలుసుకున్న పురాణవేత్త సకల భారతీయ వైదిక వాఙ్మయమును ఔపాసన పట్టిన వాడుగానే చెప్పబడతాడు. కావున సర్వజ్ఞుడు అని పిలువబడడంలో అతిశయోక్తిలేదు. శ్రీమద్భాగవతం ఉపదేశిం చాలి అంటే షడ్దర్శనములు షట్ శాస్త్రములు మీద అవగాహన అధికంగా వుండాలి. యేత్వేతాని సమస్తాని పురాణానిచ జానతే. భారతించి మహాబాహుతే సర్వజ్ఞా మతానీణామ్ మంచి విచక్షణా జ్ఞానంతో కూడిన పాండిత్యం రావడం కోసం పురాణ విషయాలు తెలుసుకోవాలి అని బ్రహ్మాండపురాణం తెలుపుచున్నది. పురాణవేత్త సరిగా అభ్యాసం చేసినవాడయితే "సర్వజ్ఞుడు" అనబడుతాడు.

### ◆ చైనావారి వాస్తు యింత గొప్ప ప్రాచుర్యం పొందడానికి గల కారణం ఏమిటి?

అడిగినందులకు మీకు చెప్పినందుకు నాకు ధన్యతను కలిగించే చక్కటి ప్రశ్న యిది. ఒక ఉదాహరణ చెబుతాను. తల్లి తండ్రులకు మనం యివ్వవలసిన కనీస మర్యాదలు యివ్వకపోవడం కూడా తల్లి తండ్రుల మీద దాడి చేసినట్లే అనే విషయం ఒకటి గుర్తుంచుకోండి. యీ విషయం ఈ సమాధానం చివరిదాకా ఓర్పుగా చదివితే మీకు అర్థం అవుతుంది. భారతీయ సంస్కృతి మీద మొఘలాయి చక్రవర్తులు, బ్రిటీష్‌వారు యిలా ఎందరో గతంలో దాడి చేసినది మనం వింటున్నాం. కానీ నేటి సమాజంలో హిందువులే భారతీయ సంస్కృతి మీద దాడి చేస్తున్నారు. దానిలో ఒక ఉపమానం మీ ప్రశ్న నా సమాధానం. చరిత్ర తెలిసినవారు వాస్తు తెలిసినవారు చైనావాస్తు (ఫెంగ్ షుమ్) భారతీయ వాస్తు రెండు సమానమే అంటారు. నిబద్ధత క్రమశిక్షణ మహర్షులు చెప్పినది చెప్పినట్లు చేయడం అనేవి చైనావారి గొప్ప నియమాలు అందుకే వారి పనులు మొత్తం ప్రపంచాన్ని ఆకర్షించేవిగా వున్నాయి. మన పెద్దలు చెప్పినవి

మనకు ఛాదస్తం అనేవిగా గోచరిస్తున్న కారణంగా మన యువత మన శాస్త్రాలు చదవడం ఆచరించడం వంటివి చేయడం లేదు. నిబద్దత, క్రమశిక్షణ లేకపోవడం అనేది ఎక్కువ మన సమాజంలో వున్నది. యిక వాస్తు విషయాలకు వస్తే సింహద్వారం యింటి నిడివి మొత్తం తొమ్మిది భాగాలు చేసి అందు 4,5,6 భాగాలలో వుంచమన్నారు. కానీ మనవారు ఏం చేస్తున్నారు. ఈశాన్య సింహద్వారం అని బాగా వెంటబడి పోతున్నారు. అరే ఎందుకు యిలా తేడాగా వున్నది అని మహర్షులు చెప్పిన విశ్వకర్మ, మయ వాస్తువంటివి శోధించడం చేయడం లేదు. అదే చైనా వారు వారి సిద్ధాంతం ప్రకారం సింహద్వారం యింటికి మధ్యలోకి వచ్చేలాగ చేస్తారు. మన మహర్షులు చెప్పిన రీతిగా "గృహాయతే నంద విభాగ భాజతే శరాంశకే దక్షిణ భాగమాధికం" అనే సింహద్వార నియమం చైనావారి నియమం ఒకటే మనం వదిలివేశాం. వారు మహర్షులు చెప్పిన శాస్త్రమే పాటిస్తున్నారు. రెండవ విషయం నైఋతి మాస్టర్ బెడ్‌రూమ్ అనేది నేటి సమాజంలో ఒక విధిగా భావిస్తున్నారు. బ్రహ్మ గంధర్వ మనుష్య రూపంగా గృహ విభాగం చేసి అందు యింటి మధ్యలో పడక గది ఏర్పాటు చేసుకోమని మన మహర్షులు చెప్పిన శాస్త్రం నైఋతిలోనే కాదు. ఒక మూల వున్న గదిలో నిదురించవద్దని శాస్త్రం ఈ నియమం మనం విడనాడాము. చైనావారు యిదే నియమం యింకా పాటిస్తున్నారు. అదే రీతిగా యింటిలోకి రాగానే వంట గది ఎదురవ్వకూడదు అనేది మన ప్రాచీన శాస్త్రవచనం. యిది అందరూ మనవారు విడనాడారు. ఆగ్నేయంలో మాత్రమే వంట గది, నిర్మాణం ప్రాధాన్యం అని సాగుతున్నారు. మరి తూర్పు దక్షిణ సింహద్వారములు వారికి ఆగ్నేయంలో వంట గది వుంటే యింటిలోకి రాగానే మనకు వంటగది కనబడుతుంది కదా! యిలా మహర్షులు చెప్పిన అంశాలు విడనాడి మహర్షులు చెప్పని అంశాలు పాటిస్తూ దానికి వాస్తు అని పేరుపెట్టాం మనం. కానీ ఫెంగ్‌షుమ్ మన మహర్షులు చెప్పిన శాస్త్రం రెండూ దగ్గర దగ్గరగా వుంటాయి. కఠినమైన నిబద్ధత కలిగి వారు ప్రాచీన శాస్త్రాన్ని విడనాడక ముందుకు ముందుకు వెళుతున్నారు. అందుకే వారి ద్వారా శాస్త్రం బాగా ప్రచారంలోకి వెడుతోంది. మన హిందువులే భారతీయ సంస్కృతి మీద దాడి చేస్తున్నారు అనుటలో యిదే ఉదాహరణ. సింహద్వారం, మాస్టర్ బెడ్‌రూమ్, వంటి లౌకిక ఎన్నో విషయాలు మహర్షులు చెప్పినవి ఎవరు పాడుచేశారు? మన హిందువులే పాడుచేశారు. కేవలం వాస్తు మాత్రమే కాదు. యితర శాస్త్రాలు, ఆచార వ్యవహారములు కూడా పెద్దలు చెప్పిన రీతిగా చేయకుండా ఎవరికి తోచిన రీతిగా వారు ఆచరించి అసలు అయిన శాస్త్రం పాడుచేస్తున్నారు. యిలాగ మన సంస్కృతి వెనకబడిపోయేలాగ చేశారు. ఇంటర్‌నెట్‌లో శాస్త్ర గ్రంథాలు లభిస్తుంటే, శాస్త్ర వచనం ఒక రకంగా, మన ప్రవర్తన మరొక రకంగా వుంటే మన శాస్త్రాలు ఎవరు నమ్ముతారు,

పాటిస్తారు. చైనావారు చెప్పే శాస్త్రం అమలు చేసే విధానముకు వెనుక మహర్షి వాక్యాలు వున్నాయి. అందుచేత వారు అభివృద్ధిలోకి వచ్చారు. యింకా వస్తారు. ఆధారం లేని శాస్త్ర వాక్యాలు అభివృద్ధిలోకి రావు.

◆ **ఉపనయనం "వేడుక కాదు" అంటారు నిజమేనా? యింకా మంచి వివరాలు చెప్పండి?**

వేడుక కోసం ఉపనయనం చేయరాదు. ఉపనయనం అనేది సంస్కారం మాత్రమే. వేడుకగా కాక సంస్కారం కోసం చేస్తున్న కార్యక్రమంలో సంస్కారవంతులయిన వారు పాల్గొనడం సర్వదా శ్రేయస్కరం. వేడుక కార్యములలో ఎవరయినా పాల్గొన వచ్చు. సంస్కారములలో మాత్రం అందరూ పాల్గొనరాదు. ఉపనయనంతో వేదోక్త మయిన సంస్కారములు యజ్ఞ యాగాది క్రతువులు చేయడం కోసం అధికారం వస్తుంది. గాయత్రీ అనుష్ఠానంతోనే అన్ని రకాలయిన అనుష్టానములు చేయుటకు అధికారం వస్తుంది. వేదోక్తమయిన కర్మకాండల అన్నీ వేడుక కోసం చేసేవి కావు. గాయత్రీ మంత్రం మీద గౌరవం వున్నవారు గాయత్రీని ఉపదేశం రోజు నుండి అనుష్ఠిస్తారు. అటువంటి వారు ఉపనయనంలో పాల్గొనాలి. అలాగ కానివారు గాయత్రీ మంత్రం మీద లక్ష్యం లేనివారు అనే కదా అర్థం. ఉపనయనార్హత వున్నవారు వారి పిల్లలకు ఉపనయనం నిశ్చయం చేసిన దగ్గర నుండీ అయినా కొంచెం అధిక స్థాయిలో గాయత్రీ మంత్రానుష్ఠానం చేసి తరువాత ఉపనయనం చేయుట ద్వారా పిల్లలకు మంచి జరుగుతుంది. పిల్లవాడి ఉపనయనం రోజు తండ్రి తప్పనిసరిగా సంధ్యావందనం చేసి ఉపనయనం చేయాలి. సంధ్యావందనం చేయనివాడు మైలవాడు అని శాస్త్రవచనం. యిలా చాలా నియమాలు వున్నాయి. అన్నీ పాటింపదగినవే. కానీ మనం మన సంస్కృతిని వదిలి వేశాం. సంధ్యావందనం చేయువారు ఉపనయనంలో పాల్గొనరాదు. కారణం వారు మైలవారతో సమానమని దేవీభాగవత వచనం.

◆ **లీపు సంవత్సరం నియమాలు పంచాంగాలకు కూడా వుంటుందా?**

అలాగ పొంతన చేసి సమాధానం చేయడం కష్ట సాధ్యం. అయితే పంచాంగంలో రవి పదకములు చంద్ర పదకములు అని రెండు వుంటాయి. రవి పదకములు 365 వుండి నాలుగు సంవత్సరములకు ఒకసారి 366వ పదకం వస్తుంది. యిది అంతర్గత విషయం కేవలం పంచాంగ కర్తలకు మాత్రమే తెలిసే విషయం అయితే రవి యొక్క సంక్రమణాలు పరిశీలన చేస్తే మనకు కొంత పరిజ్ఞానం లభిస్తుంది. అది ఏమనగా సంక్రమణం మరల పై సంవత్సరంలో వచ్చే సంక్రమణ మనకు ఒక సంవత్సరం పదకొండు తిథుల 15 ఘడియల కొన్ని విఘడియల వ్యత్యాసం చెప్పారు. అందువలన సంక్రమణం ఈ సంత్సరం ఉదయం వస్తే నాలుగు సంవత్సరాల దగ్గర మరల అదే సమయానికి వస్తుంది. యిలాగ పన్నెండు సంక్రమణాల విషయాలలో

వ్యత్యాసం వుంటుంది. లగ్నాంత కాలములలో కూడా ఈ సంవత్సరానికి పక్కన సంవత్సరానికి ఒక నిమిషం తేడా వుండి క్రమంగా మరల నాల్గవ సంవత్సరంలో సమానంగా వస్తాయి. ఈ విధంగా కొన్ని పోలికలు వుండగా వాటి మీద శోధన చేయడం జరగడం లేదు కావున పూర్తి నిర్ధారణగా మన పంచాంగాలకు లీపు సంవత్సరానికి కల సంబంధం నేను నిర్ణయించి చెప్పలేను. పంచాంగకర్తగా నాకు ప్రతి నాలుగు సంవత్సరాలకు ఎదురు అవుతున్న ఈ అనుభవముల దృష్ట్యా సంబంధం వున్నది అనే అంశం నిర్ధారణ చేయుట వరకు మాత్రమే నాకు అవకాశం వున్నది. యిక మరొక విషయం లీపు సంవత్సరాలకు ఒకసారి 30వ రోజు రావాలి. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరగడానికి 365 రోజుల 6 గంటల పైన కొన్ని సెకన్లు చెప్పేవారు దాని ప్రకారం లీపు సంవత్సరానికి 400 సంవత్సరాలు దగ్గర 30వ రోజు వచ్చే అవకాశం వున్నది.

### ◆ సంవత్సరసూతకంలో ఉన్నవారు ఉపనయనములు వివాహములలో పాల్గొనవచ్చా?

పనికిరాదు. ఒక వేళ పాల్గొన్నా అక్షంతలు వేయుట, గిఫ్టులు ఇచ్చుట వంటివి చేయరాదు. బట్టలు పెట్టించుకొనరాదు. కేవలం పాల్గొని భోజనం చేసి వెళ్ళవచ్చు. భోజనం చేయనప్పుడు కూడా అందరితో కలిసి కూర్చున్నా ఎవరిని తగలరాదు.

### ◆ ఆడవారికి చెవికమ్మలు, ముక్కుపుడక అవసరమా?-

అవి సౌభాగ్య వస్తువులుగా నిర్ణయించారు. ఈ రెంటినీ ధరించినవారికి భర్త సౌఖ్యము మరియు, సౌభాగ్యము కలుగుతాయి అని వున్నది. దీని గురించి బాగా వివరణ కావాలి అంటే లలితా సహస్రనామాలు "తాటంక యుగళీభూత తపకుడుప మండలా".. "నవచంపకపుష్పాభనాసాదండవిరాజితా" తారాకాంతితిరస్కారీ నాసాభరణ భాసురా" ఈ నామాలకు అర్థం వ్యాఖ్యానం భాష్యం తెలుసుకోండి. అలాగే సౌందర్యలహరిలో 55వ శ్లోకం నుండి 10 శ్లోకాలు సవిస్తరం వ్యాఖ్యానం పండితుల ద్వారా తెలుసుకోండి. తద్వారా వాటి గొప్పదనం తెలుస్తుంది. చెవి కమ్మలు ముక్కుపుడక అవకాశం వుంటే వజ్రాలతో కూడా ధరిస్తే యింకా మంచిది. లేని ఎడల ఏదో ఒక సమస్య తప్పక వుంటుంది.

### ◆ శంఖుస్థాపన పగలే చేయాలా? గృహప్రవేశం రాత్రి కాలంలో అని వున్నదా?

అసలు వాస్తు కర్మలు ఏవైనా పగలు మాత్రమే చేయమని శాస్త్రం. శంఖుస్థాపన, బోరింగ్‌లకు నాల్గవయామం రాత్రికాలంలో పనికివస్తుంది అని బృహద్వాస్తుమాల అనే గ్రంథంలో ఉదహరించారు. దీని ప్రకారం ఉదాహరణకు సూర్యోదయం 6.00 అనుకోండి ఉదయం 3.00 నుండి పగలు 12.00 వరకు శంఖుస్థాపన పనికి వస్తుంది. ఉదయం 6.00 నుండి పగలు 12.00 వరకు మాత్రమే గృహప్రవేశం పనికి వస్తుంది. అగ్ని ప్రాధాన్యంలేని వారికి ఉ.3.00 నుండి పగలు 12.00 వరకు గృహప్రవేశం పనికి వస్తుంది. రాత్రులందు గృహప్రవేశం నిషేధం అని భరద్వాజ సూత్రం అయితే

మనవారు రాత్రియందే గృహప్రవేశం విశేషం పగలు నిషేధం అని దుష్ప్రచారం చేశారు. అయితే రాత్రులందు ఒకవేళ గృహప్రవేశం చేయవలసిన ఎడల వైదిక ఆచారములను గౌరవించి వారి సూచనల మేర గృహప్రవేశం చేసుకోవాలి.

**◆ పెళ్ళి అయిన ఆడవారు నల్లపూసలు, పగడం ముత్యం ధరించవలసిన ఆవశ్యకత ఉన్నదా?**

పెద్దలు ఏర్పరిచిన అనేక కట్టుబాటులు విస్మరిస్తున్నాం. వాటితో పాటే నల్లపూసలు, పగడం, ముత్యం ధారణ కూడా విస్మరించాము.

**◆ నాస్తిక వాదన చేయువారికి పురాణాల ద్వారా ఏమైనా చెప్పదలచారా?**

అయ్యా! ధర్మశాస్త్రం ప్రకారం వివాహం ఇలా చేసుకోవాలి అని చెప్పారు. మరి నాస్తికవాదులు అంగీకరించలేదు. ప్రాథమిక ధర్మం తప్పాక ఇక వివాహం ఎలా చేసుకోవాలి అనే ప్రశ్న ఉత్పన్నమౌతుంది. అప్పుడు ఎవరికి తోచిన విధానం వారు చెపుతారు. మరి వారి చెప్పిన విధానం ప్రకారమే ఎందుకు చేసుకోవాలి., అని ప్రశ్న వేస్తే వారి దగ్గర సమాధానం ఉండదు. ఆస్తికవాదులకు మాత్రం మా పూర్వులు, మహ ర్షులు ఇలా చెప్పారు. మేము ఆచరిస్తున్నాం అనే సమాధానం ఉంటుంది. వ్యవస్థా ధర్మంలో అందరూ ఒక్కసారిగా ధర్మం మీద నిర్ణయం తీసుకుంటే తప్పులేదు కానీ ఎవరికి తోచిన ధర్మాలు వారు మార్చుకుంటూ పోతే వ్యవస్థ ఎక్కువకాలం నిలువదు కదా! అలాగే కేవలం వివాహమే కాకుండా మిగిలిన అన్ని ధర్మాలలోను వ్యవస్థను దృష్టిలో ఉంచుకొని మహర్షులు ఆచార వ్యవహారాలు నిర్దేశించారు. వారిని తెలివి తక్కువ వారిగా భావించి ఉపయోగం లేదు కదా! మనం ఒక వేళ తెలివిగలవారమయితే మన సమయాన్ని సంఘానికి ఉపయోగపడే కార్యముల మీద దృష్టి ఉంచాలి. ఉదాహర ణకు కార్పోరేట్ స్కూల్ టీచర్ల జీతం కంటే గవర్నమెంట్ స్కూల్ టీచర్ల జీతం అధికంగా ఉన్నా మరి గవర్నమెంట్ స్కూల్ పిల్లలు ప్రైవేట్ స్కూల్ పిల్లలతో పోటీపడి మార్కులు ఎందుకు సంపాదించటం లేదు. అది టీచర్ల లోపమా! లేక పిల్లల లోపమా! అనే విషయం మీద దృష్టి పెట్టాము అనుకోండి ఎంతోమంది పిల్లలు మంచి విద్యా బుద్ధులతో సంఘంలోకి వస్తారు. మీరు కూడా సంఘాన్ని బాగు చేసినవారు అవుతారు. ఇలాంటి అవసరమయిన విషయాలు ఎన్నో ఉన్నాయి. వాటిని దృష్టిలో ఉంచుకొని సంఘాన్ని బాగుచేయు కార్యం చేపట్టండి. ప్రపంచం నలుమూలల ప్రతి గ్రామం పట్టణాలలో దేవాలయాలు భక్తులు ఉన్నారు. వారందరిని దేవుడుకి దూరం చేయడ మనేది శక్తమయ్యే అంశం కాదు. రాష్ట్రం విడిపోయాక డబ్బులతో ఉన్న శాఖ దేవాదాయశాఖ మాత్రమే. ఎంతోమంది ఉద్యోగులకు ప్రభుత్వానికి కూడా ఉపయోగ పడే శాఖ దేవాదాయ శాఖ. దేవుడు లేడు అనే విషయాన్ని ప్రభుత్వ వ్యతిరేక చర్యగానే పరిగణించాలి. డబ్బులు ఇచ్చే శాఖను మూసివేస్తామా! ప్రభుత్వానికి ప్రత్యక్ష దైవంగా అగుపించే శాఖ దేవాదాయశాఖయే.

### ◆ శివకేశవులకు బేధం చూపవచ్చా? శివుడు గొప్పా? లేక విష్ణువు గొప్పా?

ఈ విధమైన ఆలోచన యే తప్పు. పురాణాలు వ్రాసిన వేద వ్యాసుల వారు శ్రీ మహావిష్ణువు యొక్క అంశ. ఆయన శివుడు పార్వతీ చరిత్రలతో కూడిన శివపురాణం, లింగపురాణం, మార్కండేయ పురాణం బ్రహ్మాండపురాణం ఎందకు వ్రాశారు. పురాణాలలో అందులోను విష్ణ పురాణంలోనే శివకేశవులకు బేధం లేదని చెప్పబడివున్నది. శివునికి, విష్ణువుకు బేధం చూచువారిని నరకప్రాప్తి అని వున్నది. సృష్టిని చక్కగా రక్షించడం కోసము మరియు మోక్షం అందించడం కోసమే వీరిరువురువున్నారు. "శివాయ విష్ణ రూపాయ శివ రూపాయ విష్ణవే – శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ంశివః॥ అటువంటి శివకేశవులు ఇరువురు కలిసి సృష్టికార్యంలో, రక్షణలో పాల్గొన్నట్లు పురాణాల్లో వున్నది. పురాణాల జ్ఞానం లేని వారికి వారిరువురిలో భేదం చూసే అవకాశం ఉంటుంది.

### ◆ అమ్మవారు సింహవాహినా? మరి వ్యాఘ్రం ఏమిటి?

అమ్మవారు సదా సింహవాహినియే. మనకు ఎప్పుడూ సింహవాహినిగానే దర్శనం యిస్తుంది. మహిషాసుర సంహారం శుంభ నిశుంభ సంహారం ఇటువంటి ఘట్టాలలో అమ్మవారితోపాటు యుద్ధంలో సింహం యొక్క పాత్రతను కూడా వర్ణించారు. ఇక వ్యాఘ్రం సంగతి, ఇది శివ పురాణంలో వాయవీయ సంహిత పూర్వభాగం నుండి వున్న అంశాల ద్వారా వివరిస్తాను. పార్వతీదేవి యొక్క అంశతో అయోనిజకన్యగా పుట్టిన దేవి వలన మరణించే లాగ శుంభ నిశుంభులు వరం పొందారు. సరే వారి ఆగడాలు మితిమీరాయి. వారిని సంహరించవలసిన కాలం వచ్చినది. ఆ సందర్భంలో పార్వతీ దేవిని శివుడు 'కాశీ' అని హేళన చేయసాగాడు. 'కాశీ' అంటే నల్లనిదానా? అని అర్థం. పార్వతిదేవికి కోపం వచ్చినది. 'తపస్సు చేసి నా శరీరమును గౌరవర్ణములోకి మార్పు చేసుకుంటాను' అని హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేసినది. ఆమె తపస్సు చేయు కాలములో ఒక పులి ఆమె చెంతనే ఉండెడిది. అది పార్వతీదేవి యొక్క తపస్సుకు యితర జంతువుల ద్వారా భంగం రాకుండా కాపాడేది. పార్వతీదేవి తన నలుపు శరీరం ఛాయ విడువగా అందుండి ఒక కన్యక ఆవిర్భవించింది. ఆమెయే శుంభ నిశుంభులు వధ చేసి 'కౌశికి'. పార్వతిదేవి గౌరీగా అయినది. ఆమె తిరిగి కైలాసమునకు వెడుచూ ఆ వ్యాఘ్రమును తీసుకొని పోవుటకు బ్రహ్మను అడిగినది. అది క్రూర జంతువు వద్దని చెప్పాడు బ్రహ్మ. శరణు కోసం వచ్చిన వ్యాఘ్రము కావున రక్షణకు తీసుకొనిపోయినది. ఆ వ్యాఘ్రమునకు పార్వతి యొక్క కోరిక మేరకు మహాదేవుడు అంతఃపుర ద్వారము దగ్గర రక్షణకు ఉండునట్లుగా గణాధ్యక్ష పదవి ఇచ్చినారు. ఆ వ్యాఘ్రమునకే 'సోమ నంది' అని పేరు. అంతేకానీ వ్యాఘ్రము అమ్మవారికి వాహనం కాదు. అమ్మవారు సింహవాహినియే.

**◆ శ్రీచక్రార్చన చేయించుకోవడం వలన ఫలితాలు ఏమిటి? ఇవి ఇంటిలో చేయించు కోవడం మంచిదా? లేక దేవాలయంలో శ్రేయస్కరమా?**

భారతీయ సంప్రదాయంలో నదీతీరము, దేవాలయముల విషయంలో ప్రత్యేక పవిత్రతను తెలియచేశారు. ఈ రెండు స్థానముల యందు చేయు ఏ అర్చనలకైనా స్థాన బలం ఎక్కువ అనే చెప్పాలి. భక్తులు భక్తితో చేయు ప్రార్థనలు పూజల వలన క్షేత్రంలో మహాత్యం, విగ్రహంలో శక్తి ఎప్పుడూ పెరుతుతుంటాయి. అందువలన దేవాలంయలో చేయు శ్రీచక్రార్చన విషయంగా ఎక్కువ వ్యక్తిని సంపాదించుకునే అవకాశం వుంటుంది. మరియిక శ్రీ చక్రార్చన ఇంటిలో చేయించుకోవచ్చా! అనే ప్రశ్నకు సమాధానం పరిశీలిస్తే మనము ఇంటిలో సదాచారంగా వుంటూవుంటే శ్రీచక్రార్చన చేయవచ్చు. లేని ఎడల శ్రీచాక్రార్చన ఇంటిలో చేయడం శ్రేయస్కరం కాదు. ఇంటిలోనే శ్రీచక్రార్చన చేయించుకోవాలి అనే కోరిక బలంగా వుంటే ఒకసారి ఆ ఇంటిలో శుద్ధి పుణ్యాహ వాచనం చేయించి, గోవును ఒకదానిని తెప్పించి యింటి యందు వుంచి అప్పుడు శ్రీచక్రార్చన చేయండి. గోవు సన్నిధి పవిత్రమయినది. దానికి క్షేత్రంతో సమానమయిన బలం వుంటుంది. అందువలన మనం చక్రార్చన చేయబోవు స్థలం పవిత్రముగా వుంటే ఆ అర్చన ఫలితం మనకు త్వరగా సిద్ధిస్తుంది. శ్రీమాత – "శ్రీచక్రరాజనిలయా", శ్రీచక్ర సంచారిణీ" అని పిలువబడుతోంది. శ్రీమాత నివాస స్థానం శ్రీచక్రం జగదంబను ఏ అవసరంతో మనం పిలిచినా, అర్చించినా త్వరగా వచ్చి మన అవసరాలు తీరుస్తుంది. శ్రీమాత "శ్రీచక్రసంచారిణీ" కావున ఆమెను శ్రీచక్రరూపంలో అర్చిస్తే మనకు సకల శుభాలు కలుగుతాయి. ఆమె అనుగ్రహం కోసం శ్రీచక్రార్చన చేసినవారికి సకలదేవతల యొక్క అనుగ్రహం కూడా లభిస్తుంది.

లింగార్చన, శ్రీచక్రార్చన వంటివి సకల దేవతలకు ఒకేసారి అర్చనలను అంద చేయు క్రియాకలాపములు. చాలా విశేషమయినవి. దేవతా అనుగ్రహం లభిస్తే వచ్చే ఫలితాలను మనం ప్రత్యేకంగా తెలుసుకోనవసరం లేదు. సృష్టిలో ఏ కార్యము అయినా శ్రీమాత అనుగ్రహంతోనే అందుతుంది. శ్రీచక్రం తొమ్మిది ఆవరణలతో వెలుగొందు తుంది. అనేక మయిన కోణములు కలిగి వుంటుంది. ప్రతి కోణములో ఒక దేవత ప్రతి ఆవరణలో కొందరు దేవతల సమూహము వుంటుంది. శ్రీ చక్రంలోని అందరు దేవతలను అర్చిండమే శ్రీచక్రార్చన.

ప్రస్తుతం ప్రతి శక్తిదేవాలయంలోను శ్రీచక్రమే స్థాపన చేయుచున్నారు. భక్తులు దానిని భక్తితో అర్చిస్తే తద్వారా దేవతామూర్తిలో చైతన్యం పెరుగుతుంది. తద్వారా ఆ క్షేత్రంలో అర్చనలు చేయించుకొనే భక్తులకు కూడా శ్రేయస్సు పెరుగుతుంది.

**◆ రాబోవు 2016 కాలంలో కుజస్తంభన విశేషములు ఏమిటి? శాంతి మార్గం ఏమిటి?**

కుజుడు ప్రతి 40 రోజులకు ఒక్కోరాశి మారుతుంటారు. అటువంటి కుజుడు అధిక కాలం ఒకే రాశిలో వుంటే దానిని స్తంభన అంటారు. కుజుడు కలహ

కారకుడు. అగ్నికి కారకుడు, పరిపాలనలో నేతృత్వం ఆయనదే. అనారోగ్య కారకుడు ఋణ కారకుడు యిలా మంచి ఆధిపత్యములు అయినవి.

దేశగోచారం చెప్పేటప్పుడు "సింహాంగారకదోషం" అని చెబుతారు. అదేకాక కుజస్తంభన కూడా దోషమే. కుజుడు 2016లో తుల వృశ్చిక రాశులలో ఎక్కువగా వుండి స్తంభన దోషం కలుగచేస్తున్నారు. ఈ కాలంలో అన్ని రకాలయిన అడ్మినిస్ట్రేషన్‌లలో చికాకులు కలహములు తప్పవు. కుజదోషం వున్నవారి కుటుంబాలలో కలహాలు వుంటాయి. జాతకాలలో కుజ సంచారం దోషంగా వున్నవారికి కలహబాధ, ఋణ భాధ, ఆరోగ్య బాదలు వుంటాయి. ప్రభుత్వం విషయంలో పాలనా రంగం చాలా చికాకుతో వుంటుంది. అగ్ని బాధలు, చోరబాధలు పెరుగుతాయి. యాక్సిడెంట్‌లు ఎక్కువ అవుతాయి.

ఈ సందర్భంలో సమాజంలో దుర్మార్గుల అరాచకాలు పెరుగుతాయి. అందుచేత ప్రజలు అందరూ కుజగ్రహ శాంతి చేయించడం మంచిది. చంద్రబాబుగారు 2016లో కుజస్తంభన గురు, రాహు కలయిక దృష్ట్యా అసెంబ్లీని కొత్త ప్రాంగణంలో ప్రారంభించకుండా ఉంటే మంచిదని నా సూచన.

అంతేకాకుండా "లోకకళ్యాణం కోసం ప్రజలు అందరూ సుబ్రహ్మణ్య స్వామికి పూజలు అధికంగా చేయించవలెను. కుజుడికి సుబ్రహ్మణ్య ఆరాధన ప్రీతి. సుబ్రహ్మణ్య ఆరాధనతో ఆయన శాంతిస్తారు. అలా చేయునప్పుడు మనకు మంచి జరగడం కోసం లోకంలో చెడు తగ్గడం కోసం అని సంకల్పిస్తే ఈ దుష్ట పరిణామాలు తగ్గుతాయి. ప్రభుత్వం ప్రతి సుబ్రహ్మణ్య దేవాలయాలలో అర్చనలు చేయిస్తే రాబోవు కుజస్తంభన కాలంలో దోసం తగ్గించుకోవచ్చు.

## ◆ పంచాంగము వ్రాసే అమృతఘుడియ, భక్తి, దినం, ఏమిటి?

నక్షత్రరీత్యా ఉత్పన్నమయిన వర్జ్యంతో గణితం చేసి అమృతఘుడియలు ఇస్తారు. అయితే వర్జ్యం విడువదగిన విషయం, కానీ అమృతఘుడియలు గ్రహింపదగిన సమయం వలన కృతకృత్యతా శాతం ఎక్కువ వుంటుంది. ఒకవేళ అమృతఘుడియ సమయంలో దుర్ముహుర్తాలు వుండవచ్చు. అయినా అమృతఘుడియలనే ప్రాధాన్యం చేసుకోవాలి. దినం అంటే దిన ప్రమాణం సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు వుండే సమయం దినప్రమాణం. దీని ఉపయోగం ప్రతి తత్‌దిన నిర్ణయం, వ్రత నిర్ణయం, అశౌచ నిర్ణయాలలో ఉపయోగం. భుక్తి అంటే సూర్యగమనం. నిన్నటి సూర్యోదయం నుండి నేటి సూర్యోదయం వరకు జరిగిన సమయం ఇలా 12 రాశులకు 365 రోజులకు 360డిగ్రీల సంచారమును విభాగం చేసి నిర్ణయిస్తారు. ఇది లగ్నములు నిర్ణయించడంలో ఉపయోగిస్తుంది. జాతకాలు, ముహూర్తాలు, ప్రశ్నలో నిర్ణయించడానికి ఇది ఉపయోగం.

◆ **వివిధ కల్పములలో అని సంభోదిస్తారు., కల్పముల పేర్లు ఏమిటి?**

1. శ్వేత 2. నీలలోహిత 3. వాసుదేవ 4. రాధాంతర 5. రౌరవ 6. దేవ 7. బృహత్ కల్ప 8. కందర్ప 9. సద్యోజాత 10. ఈశాన 11. తమో 12. సారస్వత 13. ఉదాన 14. గారుడ 15. కూర్మ 16. నరసింహ 17. సమాన 18. ఆగ్నేయ 19. సోమ 20. మను 21. తత్పురుష 22. వైకుంఠ 23. లక్ష్మి 24. సావిత్రీ 25. అఘోర 26. వరాహ 27. వైరాజ 28. గౌరీ 29. మహేశ్వర 30. పితృకల్పం.

◆ **మన పూర్వీకులు యిచ్చిన శాస్త్రాలలో సైన్స్‌కు అవకాశం వున్నదా?**

సైన్స్ లేకుండా మనవారు శాస్త్రాలు చెప్పలేరు. ఒక ఉదాహరణ చెబుతాను. శంకరుల వారు వారి వివేక చూడామణి గ్రంథంలో "జన్తూనాం నరజన్మ దుర్లభమ్" అని చెప్పారు. జంతువులలో మానవ జన్మరావడం దుర్లభమయినది. అంటే మానవుడుగా పుట్టడం గొప్ప విశేషం అని విశ్లేషించారు. ఇది వేదాంతపరంగా మానవజన్మ గొప్పది అని చెప్పడం కోసం చెప్పిన శ్లోకం. అయితే నేటి కాలంలో విద్యార్థులు జంతువుల నుండి మానవుడు పుట్టాడు అని చెప్పే డార్విన్ సిద్ధాంతం యిందులో వున్నదా! లేదా! గమనించండి. డార్విన్ సిద్ధాంతం, వివేకచూడామణి రెండూ తెలిసిన వారికి మాత్రమే ఇందులో దాగివున్న సైన్స్ అర్థం అవుతుంది. యిదే రీతిగా ప్రతి అంశాలను మన జీవన శైలికి ఉపయోగపడే ఎన్నో సైన్స్ విషయాలు దాగి వున్నాయి. అయితే మనం శోధన చేయాలి అంతే. పైథాగరస్ సిద్ధాంతం అని మనవారు చదువుకుంటున్న సిద్ధాంతం ఉన్నవారు ఎప్పుడో వాడారు కదా! ఋగ్వేద కాలం అనే పేరుతో నాసావారు సుమారు 5000 సంవత్సరాల క్రితం చరిత్ర ఉన్నట్లుగా తెలియజేశారు. అప్పుడు వృత్తం, అర్ధవృత్తం, దీర్ఘచతురస్రం వంటి వాటిని కల్పసూత్రం శుల్బ సూత్రం వంటి వాటి ద్వారా గణిత పద్ధతిలో అగ్నిహోత్ర వేదులు ఏర్పాటు చేసి అర్చన చేసారు కదా! మరి పైథాగరస్ సిద్ధాంతం ఈ మధ్య కాలంలోనిదే కదా! చరిత్ర తెలిస్తే ఈ గణితాలు ప్రపంచానికి భారతదేశం చిన్నదే అని తెలుస్తుంది. అలాగ శాస్త్రంలో సైన్సు దాగి వున్నది అని తెలుస్తుంది.

◆ **శరన్నవరాత్రులు యింటిలో చేయాలి అంటే ఏమి చేయాలి? చేయలేకపోతే ఏమి చేయాలి?**

శరన్నవరాత్రులు యింటిలో చేయలేని వారి విషయం ఆలోచిస్తే దేవాలయంలో అమ్మవారి దర్శనం చేయడం మంచిది.

నవరాత్రులు తొమ్మిది రోజులు తోచినరీతిగా అమ్మవారి సోత్ర పారాయణాలు చేయవచ్చు. అది కూడా చేయలేని స్థితిలో సదా "శ్రీమాత్రేనమః" అని స్మరిస్తూ వుంటే దేవీ అనుగ్రహం లభిస్తుంది. శరన్నవరాత్రులలో విశేషపూజలు చేసిన ఫలితం లభిస్తుంది.

ఒకవేళ నవరాత్రులు యింటిలో చేయగల శక్తి వున్నచో త్రికాలంలో బాల, లలిత, రాజేశ్వరీ ఆరాధన చేయడం. దధ్యన్నం నివేదన చేయడం ప్రాతఃకాలంలో బాలలకు పూజ మధ్యాహ్నకాలంలో సువాసినీ పూజ విశేషం.

అంతేకాకుండా లలితా సహస్రపారాయణ చేయడం మరియు కుంకుమార్చనలు చేయడం, చండీసప్తశతీ పారాయణ, మహావిద్య పారాయణ అంతేకాకుండా శ్రీచక్రార్చనలు చేయుట విశేషం. చండీహోమం, వనదుర్గా హోమం వంటివి చేయించాలి. వీటిలో అన్నీ చేయలేకపోయినా శక్త్యానుసారం చేయించాలి.

జగదంబ 'శివజ్ఞాన ప్రదాయినీ' శివజ్ఞానం అంటే వేదం ప్రధానమయినదిగా తెలుసుకోవాలి కారణం "వేదశ్శివ శ్శివోవేద" అంటారు. వేదఘోషలేని జగదాంబకు సంబంధించిన హోమము, పూజా యాగము ఏదైనా నిష్ఫలము అవుతుంది. అందు వలన వేదపారాయణ లేని ఏక్రతువు సిద్ధించదు. కావుననే వేదపారాయణ పండితుల ద్వారా చేయించాలి. మన దేవాలయం కనకదుర్గ గుడిలో కూడా దుర్గాష్టమినాడు వేదపారాయణ (సభ) విశేషంగా చేయించడం గమనించండి. యిలా శక్త్యానుసారం భగవతిని అర్చించాలి.

### ◆ భవానీదీక్షకు పురాణ ప్రవచనములకు సంబంధం వున్నదా?

పురాణాలతో సంబంధం లేకుండా ఏ దీక్షా వుండదు. దేవుని కథలు, దీక్షలు అన్నీ పురాణాల ఆధారంగా ఏర్పరచబడినవే.

భవానీ దీక్షాకాలంలో అందరూ రోజూ దేవీకథలు అధికంగా చెప్పబడ్డ దేవీ భాగవతం, మార్కండేయ పురాణం, బ్రహ్మాండపురాణం ఈ మూడు తప్పకుండా చదవాలి. లేదా దీక్షాకాలంలో ఎవరైనా పౌరాణికుల ద్వారా చెప్పించుకుని వినాలి. జగన్మాత చరిత్ర తెలియకుండా, తెలుసుకోకుండా దీక్ష చేయడం అనేది ఉపయోగం లేని విషయం. అందుకే దీక్షాకాలంలో పురాణ ప్రవచనం – వేద శ్రవణము తప్పకుండా చేయాలి. అలా చేయని దీక్ష నిష్ప్రయోజనము అవుతుంది. మనకు అన్ని భాషలలోను పురాణాలు లభ్యం అవుతున్నాయి కదా చదవండి.

### ◆ గ్రహణ కాలం భోజనాదులకు సమయ నిర్ధారణ - ఇది మహర్షులు ఎందుకు చెప్పారు?

మహర్షులు చెప్పిన విషయం తెలుసుకొని దానిని ఆచరించడం ఒక గొప్ప యోగం అనే భావించాలి. ఎందుకు అలా చెప్పారు అనే అంశం పరిశీలిస్తే ఆ ఆలోచన వచ్చిన వారిని తప్పక అభినందించాలి. గ్రహణం సమయంలో భారతీయ సంస్కృతిలో అనుష్ఠానం చేయడం (మెడిటేషన్) అనేది గొప్ప విలువలతో కూడిన అంశము. భారతీయులు మన సంస్కృతిని గౌరవించేవారు. గ్రహణ కాలంలో వారి వారి యిష్ట దైవాలను అనుష్ఠించడం జరుగుతుంది. మరి అనుష్ఠానం అనేది పద్మాసనం,

ప్రాణాయామం రెండింటితో కూడుకొని చేయు అంశములు. పద్మాసనం ప్రాణాయామము అనేవి చేయాలి అంటే యోగశాస్త్ర నిబంధనల ప్రకారం భోజనానికి నాలుగున్నర గంటల వ్యవధి కావాలి. ఒకటిన్నర యామ కాలము మరి యోగశాస్త్రం ప్రకారం రాత్రి రోజూ ఎనిమిది గంటలకు భుజించి ప్రథమ యామంలో భోజనం విశేషం..., రోజూ రాత్రి నాల్గవ యామం చివర సూర్యోదయానికి ముందు యోగాసనములు వేయుటకు కాలకృత్యములు తీర్చుటకు, అనుకూలంగా శరీరం వుంటుంది అని చెబుతారు అంటే కాలకృత్యములు తీర్చుకున్న తరువాత శరీరం ప్రాణాయామమునకు బాగా అనుకూలిస్తుంది. అందునే జీర్ణ విషయం బాగా పరిధిలోకి తీసుకున్నారు. మరి మెడిటేషన్‌కు ప్రాణాయామం ముఖ్య భూమిక వహిస్తుంది కదా! అందుకే రెండు యామములు ముందర మూడు యామములు ముందర గ్రహణ కాలాన్ని బట్టి భోజనం నియమావళి పెట్టారు. ఇలా భోజనం నియమావళిలో బాల, వృద్ధ, అనారోగ్యవంతులకు మినహాయింపులు యిచ్చారు. అలాగ యివ్వడంలో అంతరార్ధం ఈ ముగ్గురు ఎలాగూ పద్మాసనం, ప్రాణాయామం ముద్రలు వంటి వాటితో మెడిటేషన్ చేయలేరు, కావున వైద్య నిబంధనలకే ప్రథమస్థానం యిచ్చారు. మనకు ప్రత్యక్ష దైవాలు సూర్యచంద్రులు వారికి రాహు కేతు సంచారం సందర్భంలో ఏర్పడిన గ్రహణ కాలంలో మనం అనుష్ఠానం చేయడం వలన వారి అనుగ్రహం మనకు బాగా లభిస్తుంది అనే ధోరణలో మెడిటేషన్ విధించారు. వీలయినంత ఎక్కువ కాలం భోజన వ్యవధి ఏర్పరిస్తే తత్ఫలితంగా ఆ గ్రహణ సమయానికి శరీరం మలిన విసర్జితములు అయి ప్రశాంత చిత్తంలో యోగాభ్యాస ప్రక్రియాలయిన పద్మాసనం, ప్రాణాయామాలతో అనుష్ఠానమునకు సిద్ధం చేయవచ్చు అనే నియమంలో ఈ ఏర్పాట్లు మనకు మహర్షులు చేశారు. ఆహారం ఏమి తీసుకున్నా నాలుగున్నర గంటల వ్యవధిలో యోగాభ్యాసం నిషేధం. అందుకే గ్రహణాల కాలంలో అనుష్ఠానం ప్రక్రియలు దృష్టిలో వుంచుకొని, అనుసంధానంగా పద్మాసనం ప్రాణాయామం దృష్టిలో వుంచుకొని భోజన నియమాలు విధించారు. గ్రహణ సమయంలో అనుష్ఠానం ఎందుకు విశేషం అని ప్రశ్నించితే దానికి పూర్తి పురాణ విజ్ఞానం కావలసినదే. మనం మన సంప్రదాయములు గౌరవించే విషయంగా గ్రహణ కాలంలో అనుష్ఠానం చేద్దాం. దానికి అనుగుణంగా సైంటిఫిక్ రీజన్స్‌తో కూడిన భోజన నియమాలు పాటిద్దాం.

### ◆ రోజూ మేము పూజలో ఏయే అష్టోత్తరాలు చదవాలి?

రోజూ ఎవరైనా పూజా కార్యక్రమంలో గణపతి, విష్ణు, లక్ష్మి, గౌరీ, శివ అష్టోత్తరములు, రామ ఆంజనేయ స్తోత్రములతో పూజాకార్యం చేయడం మంచిది. తులసీ దళం రోజూ పూజలో వాడవలెను. యితర సోత్రములు యింక అవకాశము ప్రకారం చేయవచ్చు.

### ◆ పూజా సమయంలో "యధాశక్తి" అని సంకల్పిస్తారు ఎందుకు? పూజా సామాగ్రి ఇతరుల చేత తెప్పించి పూజ చేయకూడదు అంటారు ఎందుకు?

ప్రతి రోజూ కార్యక్రమంలోను, వివాహాది వైదీక కార్యక్రమములను చేయుటకు శక్తి ఆధారంగా చేసుకొని ఎన్నో రకాలయిన మార్గాంతరములు తెలియచేశారు. దానికి కారణం భారమయిన పనులు చేయుటకు భయపడి కర్మకాండ మరియు పూజాదికములు వదిలి వేయకుండా వుండుటకు గాను, మరియు భారముతో కార్యము నిర్వహించి తర్వాత యిబ్బంది పడకుండా ఉండుటకుగాను మనవారు ఈ విధంగా చాలా విషయాలలో చాలా మార్గంతరములు తెలిపారు. సువర్ణ ప్రతిమకు పూజ చేయమని శక్తి లేనిచో వెండి శక్తిలోనిచో రాగి, శక్తిలేనిచో మట్టితోనయినా అర్చన చేయమని ప్రతివ్రత కథలో తెలిపారు. శక్త్యానుసారం చేయు పూజ చాలా శోభగా వుంటుంది. సంతృప్తిని ఇస్తుంది. అందుకే పూజలు చేయు సందర్భంలో అప్పుచేసి సామాగ్రి తెప్పించి పూజ చేస్తే అది నిష్ఫలం అవుతుంది. అందుకే ప్రతివ్రత కథలో శక్తికి తగిన విధంగా ఏర్పాటు చేయమని శక్తికి మించి చేయవద్దు అని చెప్పారు కావుననే సంకల్పంలో యధాశక్తి అని చెప్పిన కారణం. ఇతరులను చూచి వారితో సమంగా చేయాలి అనుకోవడం తప్పు. అందుకే యధాశక్తి అని సంకల్పించి పూజలు చేయాలి. నీవే స్వయంగా పూజా సామాగ్రి ఎంచుకుంటే తద్వారా మనం మనస్థాయిలో ఉత్తమమైన సామాగ్రి తెచ్చి పూజ సంతృప్తిగా చేయవచ్చు. మన మనస్సుకు సంబంధించినది.., మరియు మన మనోభావం ప్రకారం యితరులు మంచి వస్తువులు తేగలవారు కారు. అందులో ప్రతి పూజాసామాగ్రి స్వయంగా ఎంచుకోవాలి.

### ◆ కలిలో రాక్షసులు ఉంటారా?

కృతయుగంలో రాక్షసులు పాతాళంలోను దేవతలు స్వర్గంలోను ఉండేవారు. త్రేతాయుగంలో భూమిమీదనే దేవతలు, రాక్షసులు (రామ–రావణ) జన్మించారు. ద్వాపరయుగంలో ఒకే కుటుంబంలో దేవ, రాక్షసులు (కృష్ణ,కంస) జన్మించారు. కలిలో దేవ, రాక్షసులు ఇరువురు వుంటున్నారు. "కామక్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతితస్కరాః" కామక్రోధ లోభ మోహములు అనే రాక్షసులు దేహంలోనే ఉండి శరీరములను తస్కరిస్తున్నారు. వారిని సంహరించడం కోసమే తపస్సు చేయవలెను. సన్మార్గం ఎంచుకునవలెను.

### ◆ పురాణాలలో రాజుల నిర్ణయాలు చేయునప్పుడు ప్రజల నుండి అభిప్రాయాలు తెలుసుకునేవారా?

చక్కటి ప్రశ్న. రమారమీగా ప్రజాస్వామ్యం నడచినది అంటే కూడా ఆశ్చర్యపడ నవసరం లేదు. రామాయణం పరిశీలిద్దాం. దశరధ మహారాజు రామునికి పట్టాభిషేకం చేయసంకల్పించి ప్రజలందరినీ సమావేశ పరచిన ఘట్టం. **అయోధ్యాకాండ రెండవ సర్గలో వున్నది.**

**సోహం విశ్రామ మిచ్ఛామి పుత్రంకృత్వా ప్రజాహితే**
**సన్నికృష్టానిమాన్ సర్వాన్ అనుమాన్య ద్విజర్షభాన్**
**యదీదం యేఽనురూపార్థం మయా సాధు సుమంత్రితం**
**భావంతో మేఽను మన్యంతాం కధంవాకర వాణ్యహం**
**ఇచ్ఛామోహి మహాబాహుం రఘువీరం మహాబలం**
**రధే సమహతాయాంతం రామంఛత్రా వృతాననం**

నేను విశ్రాంతి తీసుకోదలిచాను. పెద్దల అనుమతితో నా కుమారుని పరిపాలన మునకు ఏర్పాటు చేయదలచాను. మీకు సమ్మతియేనా? లేదా మరియొక విధంగా చేయమంటారా? అని అడుగగా... ప్రజలు అందరూ శ్రీరాముని రాజుగా మేము చూడగోరుచున్నాము. అని తమ సమ్మతిని తెలియచేశారు అని వున్నది. వాల్మీకి రామాయణంలో, తాను స్వయంగా ప్రభువు అయివుండి నిరంకుశంగా నిర్ణయం తీసుకోకుండా కేవలం ప్రజల సమ్మతి అడిగారు దశరధుడు అంటే ప్రజాస్వామిక లక్షణాలతో ప్రభుత్వం దశరధుల వారు నడిపారు అని అర్ధం.

అంతేకాకుండా ధృతరాష్ట్రుడు (ఆశ్రమవాసం పర్వం 9వ అధ్యాయంలో) ఆశ్రమ వాసమునకు పోదలచిన సందర్భంలో ప్రజలను అడిగిన తీరు పరిశీలించిన మనకు యివి గోచరిస్తాయి. అయోధ్యకాండ 100వ సర్గలో శ్రీరాముడు భరతునితో సంభా షించిన విధానము, అలాగే సభాపర్వం అయిదవ అధ్యాయంలో నారద, ధర్మ రాజులకు జరిగిన సంభాషణలు పరిశీలిస్తే మనకు ప్రజాపాలన విషయంలో ప్రజల రక్షణ కోసం చేయు ప్రయత్నాలలో రాజులు ఎంతగా ఇమిడిపోయేవారో తెలుస్తుంది.

◆ **కనకదుర్గ దేవస్థానంలో కట్టబోవు రాజగోపురం మీద ఎన్నో చర్చలు, సందే హాలు వస్తున్నాయి కదా! అసలు ఆ గోపురం శాస్త్ర సమ్మత మయినదేనా?**

శాస్త్ర విధానముగానే నిర్మాణం జరగబోనున్నది. ఆగమ శాస్త్రం ప్రకారం దేవతా విగ్రహ మధ్యభాగం, పీఠం యొక్క మధ్యభాగం, గర్భాలయ మధ్యభాగం, గర్భాలయ ద్వారం యొక్క మధ్యభాగం, వాహనం యొక్క మధ్యభాగం, ధ్వజస్తంభం యొక్క మధ్య భాగం ఒకే విధానంగా సమాంతరంగా ఒకే గీత మీద వున్నట్లుగా వుండాలి. యిది స్మార్తాగమం, పాంచరాత్రం, వైఖానస ఆగమాలు అన్నింటిలోను ఒకే రీతిగా చెప్పబడినది. అయితే కొండల మీద వున్న దేవాలయముల యందు ప్రాకారగోపురం విషయంగా అనుకూలం కొన్ని సందర్భాలలో కుదరవు. తిరుమలలో కొండమీద చదరంగా వున్న కారణంగా ప్రాకార గోపురం నిర్మాణంలో శాస్త్రం పూర్తిగా అమలు చేయబడినది. కానీ కొండల మీద నెలవయిన దేవాలయాలలో ఆగిరిపల్లి, మంగళగిరి, కనకదుర్గ (ఇంద్రకీలాద్రి), మట్టపల్లి వంటి క్షేత్రాలో ప్రాకారం ప్రాకార గోపుర

నిర్మాణం వంటివి పైన చెప్పబడిన రీతిగా నిర్మించడం కుదరదు. అందువలన విగ్రహం నుండి ధ్వజం వరకు పైన చెప్పిన రీతిగా నిర్మించి, ప్రాకార గోపురం మాత్రం కొండ దిగువ భాగంలో దేవతా విగ్రహం వున్న దిశకు ఎదురుగా వున్న ప్రాంతంలో నిర్మాణం చేయడం అనేది శాస్త్ర గ్రాహ్యమయిన విషయం. ప్రస్తుతం మీరు అడిగిన ప్రశ్న ప్రకారం కనకదుర్గ తూర్పు ముఖంగా వుంది. ఆమెకు ఎదురుగా ప్రాకార నిర్మాణం, ప్రాకార గోపుర నిర్మాణములకు అవకాశం లేదు దానికి తగిన స్థలం లేనందున కొండ దిగువ భాగంలో నిర్మాణం చేబట్టేలోపు రాజగోపురం శాస్త్రహితమయినదే. దీని మీద ఆగమశాస్త్ర రీతిన అనుమానములకు మరియు చర్చలకు అవకాశం లేదు అనే చెప్పాలి.

### ◆ శరభేశ్వరుడు అంటే ఎవరు?

సాక్షాత్తు పరమశివుడే. నరసింహావతారం ఒక పురాణంలో నరసింహస్వామి హిరణ్యకశిపుని సంహరించి ఎంత సేవటికి ఆయన శాంతింపపోయే సరికి పరమ శివుడు ఆయన దగ్గరకు నందిని పంపి శాంతింపమని కబురు చేసారు. అయినను శాంతింపగా ఉగ్రంగా ఉన్నటువంటి నరసింహమూర్తిని శాంతింపచేయుటకుగాను సాక్షాత్తు పరమశివుడే శరభేశ్వరుడుగా అవతారం ఎత్తి నరసింహమూర్తిని భుజాన ఎత్తుకుని గిరగిరా తిప్పి శాంతింపచేసారు.

### ◆ అప్పుచేసి, యితరత్రా సంపాదించిన సొమ్ముతో క్షేత్ర దర్శనం చేయవచ్చా?

అప్పుచేసి, దొంగతనంచేసి, మోసం చేసిన సొమ్ముతో ఏ విధమైన పూజాధికములు చేయరాదని శాస్త్రం చెబుతోంది. సంపాదించిన సొమ్ముతో మాత్రమే చేయాలి. మోసము దొంగతనము వంటివి వుంటే మీరు చేసిన పూజలు ఆ మోసపోయినవారికి కూడా ఫలితాన్నిస్తాయి. అలాగే మరల త్వరగా తీర్చగల శక్తివున్నప్పుడు తాత్కాలికంగా అప్పు తీసుకొని పూజలు క్షేత్రదర్శనం వంటివి చేయవచ్చు. అయితే అప్పు తీర్చకపోతే పూజలు క్షేత్రదర్శనం వంటివి ఫలితాన్ని యివ్వవు. యిక యాచనం చేసి సంపాదించిన సొమ్ముతో అర్భాటాలకు పోకుండా చేయు పూజలు క్షేత్ర దర్శనం మంచి ఫలితాన్నే యిస్తాయి. మనం వ్రత కథలు పరిశీలించినప్పుడు ఈ విశేషములు అక్కడ అక్కడ నిక్షిప్తమై మనకు దర్శనం యిస్తాయి. మనవారు చెప్పే వ్రతకథలలో సువర్ణ ప్రతిమ దేవుని విగ్రహాల నుండి మట్టి విగ్రహాల వరకు ఆరాధనకు ప్రాధాన్యం యిచ్చారు. శక్త్యా నుసారంగానే పూజాదికాలు చేయమన్నారు. తనకు గానీ యితరులకు గానీ యిబ్బంది కలిగించే రీతిగా ద్రవ్యం సంపాదించి పితృ/దేవతాకార్యములు చేయరాదు.

### ◆ అష్టాదశ విద్యలు అని వేటిని అంటారు?

అగ్నిపురాణం నుండి ఋగ్వేజు సామ అధర్వ వేదములు నాలుగు, శిక్ష వ్యాకరణం ఛందస్సు, నిరుక్తము జ్యోతి జ్యోతిషము, నాలుగు, శిక్ష వ్యాకరణం ఛందస్సు, నిరుక్తము

జ్యోతిషము, కల్పము అనే షడంగములు, మీమాంసా, ధర్మశాస్త్రము, పురాణము, న్యాయశాస్త్రము వైద్యశాస్త్రము, గాంధర్వ శాస్త్రము (సంగీతము) ధనుర్వేదము, అర్థశాస్త్రము (రాజనీతి శాస్త్రము) ఇవి మొత్తం అష్టాదశవిద్యలుగా ప్రసిద్ధి పొందెను.

◆ **మా అమ్మాయికి వయస్సు 28సం॥లు దాటినది? సంబంధాలు ఏవీ నిర్ణయం అవ్వడం లేదు. త్వరగా పెళ్ళి అవ్వడానికి ఏదైన మార్గం చెప్పండి?**

వివాహ ప్రయత్నాలు త్వరగా సిద్ధించాలి అనే కోరికతో వున్నవారికి – పురాణాల ఆధారంగా పెద్దలు చెప్పే శాంతి మార్గాలు అనేకం ఉన్నాయి. అందు ప్రధానంగా 1. రోజూ గణపతిని గరికతో సహస్రనామార్చన చేయుట ఈ కార్యం తల్లి తండ్రులు మాత్రమే చేయాలి. 2. వివాహం కాని పిల్లలు గ్రహ శాంతి కోసం రోజూ నవగ్రహాలకు 11 ప్రదక్షిణాలు చేయుట. 3. రోజూ రుక్మిణీ కళ్యాణంకానీ, సీతారామకళ్యాణం కానీ పారాయణ చేయుట ఇవికాక ఎటువంటి దోషమయినా పోగొట్టి నిత్యం యింటిలో శాంతి జరుగుటకు గాను రోజూ రామ పట్టాభిషేకం ఘట్టం పారాయణ చేయుట అనునవి విశేష మార్గాలు అంతేకాకుండా శివకళ్యాణం గానీ, శ్రీనివాస కళ్యాణం గానీ చేసి వివాహ ప్రయత్నాలు చేయుట సర్వదా శ్రేయస్కరం.

◆ **వివాహం చేయు సందర్భంలో అందరూ కళ్యాణ మండపంలో వుండిపోతారు కదా! అలాంటి సందర్భంలో యింటి దగ్గర చేయవలసిన కనీస ధర్మాలు ఏమి వుంటాయి?**

వివాహం కళాణ మండపంలో చేస్తారు. అయితే పెండ్లి కుమారుడు, పెండ్లి కుమార్తెల గృహములందు ఇంటికి తాళం వేయరాదు. మామిడితోరణం, గుమ్మానికి పసుపు కుంకుమ అలంకారము, ఇంటి ముందు ముగ్గు, ఇంట్లో దేవతానివేదన ఇవి ఆపరాదు. అందరూ పెళ్ళికి వెళ్ళిన సందర్భంలో ఇంటిలో నమ్మకం అయిన వారిని ఎవరినైనా వుంచి పై కార్యములు చేయవలెను. దేవతా నివేదన అర్చన వంటివి కుదరవు అనుకున్న సందర్భంలో దేవుని విగ్రహములు నీటిలో వుంచి మందిరంలోనే వుంచి కనీసం విద్యుదీపం వెలిగించడం మంచిది. ఇంటిని మాత్రం అలంకరించి పెళ్ళికి వెళ్ళవలసినదే. ఇంట్లో దీపం ఉండాల్సినదే.

◆ **మా పిల్లవాడికి ఏలినాటి శని నడుచుచున్నదని జాగ్రత్త అని అందరు చెబుతున్నారు. దీనికి శాంతి ఏమిటి?**

ఏలినాటి శని అనే విషయంగా భయపడవలసిన అవసరం అసలు ఏమీలేదు. సాధారణంగా అందరూ భయపడుతూ వుంటారు. కానీ శని చాలా మంచి గ్రహం. త్వరగా శాంతించే గ్రహం. ఆయన పేరు మందుడు. మందగమనంతో వుంటాడు. కావున ప్రతి పనినీ ఆలస్యం చేస్తుంటారు. అయితే నిత్యం శివారాధన, లేదా ఆంజనేయస్వామి వారి పూజ చేయుట వలన దుష్ఫలితాలు తగ్గుతాయి. శనైశ్చరుడు త్వరగా

అనుగ్రహిస్తారు. తద్వారా పనులు వేగం అవుతాయి. పైన చెప్పిన దేవతా ఆరాధనల వలన శనైశ్చరుడు త్వరగా శాంతించగలరు. అని పురాణ వచనం అందువలన మీ పిల్లవాడికి నడుచు ఏలినాటి శనిని గూర్చి బాధ పడక దేవతా ఆరాధన మీద దృష్టి వుంచండి. కోణస్థః పింగళో బభ్రుః కృష్ణో రౌద్రోంతకోయమః శౌరిః శనైశ్చరో మందః పిప్పలాదేన సంస్తుతః శ్లోకం రోజూ ప్రాతఃకాలంలో 108 సార్లు పారాయణ చేయండి.

### ◆ భర్త వశీకరణ-భర్తతో స్నేహం పెరుగుటకు ఏదేని వ్రతం ఉందా?

మత్స్యపురాణం నర్మదా మహత్యంలో బాణాసుర త్రిపుర దహనం ఘట్టం వున్నది అది ఈ వ్రతమును తెలియజేస్తుంది. బాణాసుర భార్య అనౌపమని అడగగా నారదుడు తెలిపిన వ్రతము. ఈ వ్రత ప్రభావంగా పార్వతీ పరమేశ్వరునితో సరిభాగం అందుకున్నట్లు, లక్ష్మి విష్ణువు యొక్క హృదయ స్థానం పొందినట్లు నారదుడు అనౌపమతో తెలిపిరి. వ్రతం విశేషం లఘువుగా వేదపారంగతుడు అగు విప్రునకు తిలధేను దానం చేయవలెను. తీయమామిడి, ఉసిరిగ, వెలగ, రేగు కదంబము, సంపెంగ, అశోకము, పున్నాగము, పిప్పలము, అరటి, మర్రి, దానిమ్మ, పీచుమందము, ఇప్ప మొదలగు వృక్షములను ఉపవాసం వుండి దానమీయవలెను. అగ్ని యందు పక్వము కానీ ఆహారము తినవలెను. సంధ్యాకాలములో మౌనము ప్రధానము. అష్టమీ, చతుర్థీ, పంచమీ, ద్వాదశీ, సంక్రాంతి, విషువత్ దినములు., పక్ష ఛ్ఛిద్రముల యొక్క ఆరంభ కాలము. ఇవి దివ్య దినములు. ఈ దినమునందు ఉపవసించి స్త్రీ ధర్మము ఆచరించ వలెను. ఇలాంటి వ్రతం మత్స్యపురాణంలో 136వ అధ్యాయంలో వున్నది. అంతేకాక "అశూన్యశయనవ్రతం" అని ఒక వ్రతం విష్ణ్వారాధన చేయు వ్రతం. పురాణాలలో చెప్పబడినది. వివరణ ఎక్కువగా యిచ్చుటకు అవకాశం లేదు. ఈ వ్రత ప్రభావంగా భార్యభర్తలు ఎప్పుడూ కలిసివుండి ప్రశాంత జీవనం చేస్తారు. యింతేకాక లలితాసహస్ర నామం ప్రతి శ్లోకమునకు లేదా నామము ముందు వెనక కూడా 'శివకామేశ్వరాంకస్థా శివాస్వాధీవల్లభా" అని సంపుటి చేసి పారాయణ చేయుట ద్వారా దాంపత్య కలహాలు తీరును అని పెద్దలు చెబుతారు.

### ◆ కులాంతర వివాహం సమర్థించవచ్చా? మతమార్పిడి ఏమిటి?

సమర్థించరాదు. కులాంతరం, మతాంతరం వివాహం అనేవి బ్రహ్మ లిఖితాధారంగా జరుగుతాయి. బ్రహ్మ వారికి అదే కులంలో వివాహయోగం వ్రాసి ఉంటే సమకుల వివాహం అయ్యేవి. సమకుల వివాహం రాసి వున్న సందర్భంలో ప్రేమతోనే విడిపోయినవారు కూడా వున్నారు. అయితే కులాంతరం మతాంతరం అనేవి ప్రేమవలన ప్రారంభం అయ్యే అంశాలు. సాధారణంగా వాటిని ప్రోత్సహించరాదు. కానీ వాటిని సమర్థించడం ప్రోత్సహించడం అనే అంశాలు మాత్రం ఎవరి మనోభావాలు వారివి.

అయితే ఈ విషయం గురించి శాస్త్రం ఏమి చెబుతోంది అనే అంశం ప్రస్తావించేవారికి నా సలహా ఒకటే భారతీయ సంస్కృతికి సంబంధించిన ధర్మశాస్త్రం. పుస్తకాలు, పురాణాలు బాగా తెలుగులో దొరుకుతున్నాయి. వాటిని శోధించమని నా అభిప్రాయం. అప్పుడు మీకు ఒక అవగాహన చేకూరుతుంది. మతమార్పిడి ఎవరి ఇష్టం వారిది. మానసిక బలహీనతలో మతం మీద అవగాహన లేనివారు తరచుగా మారుతారు. అయితే అన్ని మతాల సారం ఒకటే 'సత్యంవద ధర్మం చర' సత్యం పలకండి, ధర్మంగా నడవండి. ఇది కాక కొత్త అంశం ఏ మతంలోను లేదు. అది చేయునప్పుడు మతం మారడం ఒక నాటకమే. కులాంతరం మతాంతరం చేసుకున్నవారు వారి మతాలు మార్చుకోకుండా సంసారం చేస్తున్నారా? వారి పిల్లలకు తండ్రి యొక్క కులం వర్తిస్తుంది అనుకోవడం కూడా తప్పు. ఉదాహరణకు బ్రాహ్మణకన్య వైశ్య వరుని వివాహమాడితే వారికి పుట్టే సంతతికి ఉపనయనార్హత లేదు. ఇంకా ధర్మశాస్త్ర విశేషాలు చాలా ఉన్నాయి.

◆ **మా యింటిలో ఈశాన్యం మూల రావి, వేప చెట్లు కలిసి వున్నాయి. ఈశాన్యంలో వుండవచ్చా? లేదా తీసి వేయవలెనా?**

కేవలం రావిచెట్లు ఈశాన్యంలో వున్ననూ లేక వేపచెట్లు కేవలం వున్ననూ తీసి వేయవచ్చు. అయితే రెండూ కలిసి వుంటే లక్ష్మీనారాయణ యోగం అని పెద్దలు చెబుతారు. అందుచేత దేవతా సంబంధమయినవి ఏవైనా ఈశాన్యంలో ఉంటే అది అభివృద్ధి పథమే. రావి చెట్టు నీడలో నిదురించుట తప్పు. నీడ ఇంటి మీద కూడా పడకూడదు. కాని., తర్వాత వేప, రావి చెట్లు కలిపి వున్నవి కావున వాటిని తీసి వేయడం దోషం అవుతుంది. అవి వున్నందువలన వాస్తు దోషం రాదు. అవి బిల్డింగ్ కంటే ఎత్తు పెరగకుండా జాగ్రత్త తీసుకొండి.

◆ **మేము ప్రతిరోజు శివాలయంలో అభిషేకం చేయిస్తాము. అభిషేకజలం యింటికి తీసుకురాకూడదు అని కొందరు చెబుతున్నారు కారణం?**

"అగ్రాహ్యం శివనిర్మాల్యం పత్రం పుష్పంఫలం జలం, సాలగ్రామశిలాసంగా త్సర్వంయాతిపవిత్రతాం" ధర్మసింధులో వున్నది. శివ, సౌర నివేదనలు భక్షించెనేని చాంద్రాయణం చేయమని వున్నది. ఈ నిషేధము, జ్యోతిర్లింగము, స్వయం భూలింగము, ప్రతిష్ఠాలింగము వున్న శివాలయ విషయముల యందు దోషము లేదు అని వున్నది. అంతేకాక మరో విషయం సాలగ్రామంతో కూడివున్న శివాలయములో ఈ దోషం లేదు. మనవాళ్ళు పురాణాలలో చెప్పిన ఆధారంగా కేవలం శివార్చన చేయకూడదు అని శివాలయంలో సాలగ్రామములు వుంచుతారు. పురాణాలలలో కేవలం శివుణ్ణి అర్చించుట వలన మోక్షంరాదు అని. అలాగే కేవలం విష్ణు ఆరాధనతో మోక్షం

రాదని సాక్షాత్ శివ, విష్ణువులు చెప్పిన సందర్భాలు వున్నాయి. అందువలన ప్రతి ఆలయంలో విష్ణు స్వరూపంగా భావించే సాలగ్రామాలు వుంటాయి. సాలగ్రామంతో కూడిన ఏ శివాలయంలో ప్రసాదమయినా స్వీకరించవచ్చు. అందుచే దోషం లేదు.

◆ **ఇంటిలో అమ్మవారి పటం వుంచి రోజూ లలితాసహస్రనామంతో కుంకుమార్చన చేయవచ్చా?**

దేవతా పటములు కేవలం అలంకరణకు మాత్రమే అవి పూజకు పనికి రావు. కారణం ఇనుప మేకులు, రింగ్‌లు, ప్లాస్టిక్, చెక్క వంటివి వాడి తయారుచేస్తారు. యిది ఒక కారణం. మరొక కారణం పంచామృత స్నానం, శుద్ధోదక స్నానం చెయ్యకుండా అర్చనలు చేయరాదు. పటములు అభిషేకమునకు పనికిరావు. కావున అర్చనలకు నిషేధము. కుంకుమార్చన ఒకటేకాదు రోజువారి అర్చనలకు కూడా ఒక చిన్నదేవతా ప్రతిమను విగ్రహరూపంగా వుంచి పూజా కార్యక్రమం చేయడం మంచిది.

◆ **ఈ మధ్య కాలంలో ప్రతి దేవాలయంలోను గోపూజ చేస్తున్నారు. ఇది వ్యాపార ధోరణియా? లేక శాస్త్రమా?**

ఆగమ శాస్త్రప్రకారం ప్రతిష్ఠాకాలములో విగ్రహాలకు నేత్రోన్మీలనము చేసిన వెంటనే ఎదురుగా గోవు, అన్నము (పెద్దస్థాయిలో) వుంచటం శాస్త్రం అలా ప్రతిష్ఠ అయిన దగ్గర నుండి ఆ గోవును దేవాలయ ప్రాంగణంలో వుంచి పూజించడం శాస్త్రం. దేవత అర్చన విషయంగా క్షీరము, నెయ్యి, పెరుగు, గోవుకి సంబంధించినవి వాడవలెను. అంతేకాక దేవాలయ ప్రాంగణం శుద్ధికోసం గోమూత్రం గోమయం వాడవలెను. దేవాలయమునకు వచ్చు భక్తులు చేయబోవు యాగ హోమాదులలో వారు శాస్త్రతః పంచ గవ్య పాశన చేసి కూర్చోవలెను. దాని కోసం గోవు కావలెను ప్రాచీనంగా దేవాలయం మరియు దైవసంబంధ కార్యములు అన్నింటిలోను గోపూజ చెప్పబడినది. అందువలన గోవును దేవాలయంలోనే వుంచటం శాస్త్రం. పోషణకు అవకాశం వున్న దేవాలయములలో దేవాలయ ప్రతిష్ఠ నాటి నుండి గోవును వుంచేవారు. గోవు వున్నచోట అశౌచాది దోషాలు తెలియక జరిగితే రక్షణ ఉంటుంది అని శాస్త్రం. అంతేకాక గోవు పురాణాలలో చెప్పబడిన దాని ప్రకారం సర్వదేవతా స్వరూపం అందువలన దేవాలయాలలో నేడు గోశాల గోపూజ ద్వారా శాస్త్ర పరిరక్షణ జరుగుతుంది. సంతోషకరం. గో సన్నిధిలో చేయు పూజా వ్రత, హోమాలకు దేశవాళి గోవు విశేషము. జర్సీ గోవు కాదు.

◆ **అయ్యా! ఇంటిలో దేవతార్చన వున్నది. అనుకోకుండా విదేశాలకు వెళ్ళవలసి వచ్చేటట్లు వున్నది. విదేశాలకు వెళ్ళవలసి వచ్చినప్పుడు దేవతార్చన ఏమి చేయాలి?**

మనం ఇంట్లో ఉండగా దేవతార్చన చేసి వండిన పదార్థం నివేదన చేసిన తర్వాతనే భుజింపవలెను. అనేది పెద్దలు మనకు ఏర్పరచిన కట్టుబాటు. ఇది ఆర్ష సాంప్రదాయం.

ఒకవేళ మనం ఇంటిలో లేకపోతే ఎవరైనా దేవతార్చన విధానం తెలిసిన వారిచేత అర్చన చేయించవలెను. అది కూడా కుదరని సందర్భంలో దేవతార్చన మరియు ఇంట్లో పూజలో ఉన్న విగ్రహాలను బియ్యంతో ఒక పాత్రలో వుంచి (విగ్రహాలను, దేవతార్చననుమనుగునట్లుగా) మీరు వూరు కానీ విదేశాలకు కానీ వెళ్ళవచ్చు. మీరు తిరిగి వచ్చాక విగ్రహాలను శుభ్రం చేసి అర్చన చేసి ఆ బియ్యముతో నివేదన వండి ఎవరైనా బ్రహ్మణులకు భోజనం పెట్టవలెను.

బ్రాహ్మణ సంఖ్యకు నియమం లేదు. ఆ దేవతార్చన బియ్యంలో మునుగునట్లు చేయు రోజున దేవతార్చన పూర్తి చేసిన తర్వాతనే చేయవలెను. ఇది శాస్త్రం.

## ◆ సంవత్సరం అంతా శుభం జరగాలి అంటే ఏమి చేయాలి?

మనకు మంచి జరగడం మనతో పాటుగా లోకం అంతా శుభంగా వుండడం రెండు అంశాలు వుంటాయి.

అందులో దేనికైనా నవగ్రహ సంచారం ప్రధానంగా అనుకూలంగా వుండాలి. అందువలన ప్రజలు "మమ సహకుటుంబానాం క్షేమ స్థైర్య ధైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం" అని మరియు "సమస్త లోక కళ్యాణార్థం" అని సంకల్పించి నిత్యం నవగ్రహార్చన చేయడం లేదా మన దగ్గర్లోని దేవాలయములోని నవగ్రహ మంటపంలో నిత్యం, అర్చనలు చేయించినా లేదా... కనీసం ఆదివారము లలోనైనా నవగ్రహార్చన చేయుటవలన మనకు నిత్యం శుభమే జరుగుతుంది.

అంతేకాక మనకు జాతకాలకు నవగ్రహాలే కారకులు సృష్టి పరిపాలనలో విష్ణుమూర్తికి నవగ్రహాలు అనుచరులు. అందువలన నవగ్రహాలను అన్ని దేవాలయాలయందు రోజూ అర్చనలు చేయుట శ్రేయస్కరము. జగదాంబ దుర్గా మాత ప్రకృతి స్వరూపము కావున లోకంలో అందరూ శ్రీ మాత జగన్మాతను ఆరాధిస్తే జనులందరూ సుఖజీవనం చేయు అవకాశం వున్నది.

## ◆ సుందోపసుందులు అంటే ఎవరు?

సుందోపసుందులు అనేవారు రాక్షసులు. వీరు హిరణ్యకశిపుని వంశంలో నికుం భుడు అనే మహాబల పరాక్రమవంతుడై రాక్షసుడు వుండేవాడు. అతని కుమారులే ఈ రాక్షసులు. సుందోపసుందులు మహాబలపరాక్రమవంతులు వారు ఇరువురూ ఒకరు లేకుండా మరొకరు ఎక్కడికీ వెళ్ళేవారు కారు. వారిరువురూ కలిసి వింధ్య పర్వతం మీద తపస్సు చేసి బ్రహ్మను ప్రత్యక్షం చేసుకొని వరం పొంది బలగర్వితులై మూడులోకములను పీడించారు. బ్రహ్మవారిరువురు ఆగడాలు ఆపడం కోసం తిలోత్తమ అనే అప్సరసను సృష్టించాడు. అప్పటి వరకు ఏ పని చేసినా సరే కలిసి వుండే సుందోపసుందులు తిలోత్తమ చూడగానే "తిలోత్తమ నాది అంటే తిలోత్తమ నాది" అని తగవులాడుకొని వారిరువురూ యుద్ధం చేసుకొని నేలకొరిగి పోయారు. తిలోత్తమ ప్రభావంగా దేవతలకు పునః రాజ్యం లభించినది.

### ◆ చండీసప్తశతీలో ఏమి వుంటుంది?

మార్కండేయ పురాణంలోనిది ఈ చండీసప్తశతీ. ఇందులో జగదంబ అవతారములు ఎత్తి రాక్షస సంహారం చేసిన అంశాలు శ్లోకరూపంలో కథలుగా వుంటాయి. చండముండులు, రక్తబీజుడు, శుంభనిశుంభులు వంటి రాక్షసుల సంహారం కోసం శ్రీమాత చండీ, కాళీ వంటి అవతారములు దాల్చి రాక్షస సంహారం చేసినది ఆ అవతారముల ఆంతర్య విశేష ప్రాశస్త్యములు చండీసప్తశతీ నందు నిక్షిప్తమయినాయి.

### ◆ సూతమహర్షి యొక్క కులము ఏమిటి?

సూతుడు అనేది జాతిసూచకం కాదు. ఆయన పేరు మాత్రమే వాయుపురాణం ప్రథమాధ్యాయంలో ఉన్నది. పృథు చక్రవర్తి చేయుచున్న యజ్ఞంలో "సుత్య" అనే క్రియ జరుగుచుండగా సూతుడు జన్మించాడు. పొరపాటున ఇంద్ర, బృహస్పతులకు వేసిన చరువు వ్యత్యాసం జరిగిన కారణంగా దానిని వారిరువురు స్వీకరింపలేదు. అప్పుడు ఆ చరువు వృధా కారాదు. కావున అందుండి సూతుడు ఉద్భవించాడు. "సూతే ఉత్పాదయతి" అనే వ్యుత్పత్తి ఉన్నది. జన్మ ఉత్తతము లోకరీత్యా సూతత్వము. ఈయనకు "రోమహర్షణుడు" అనే పేరు ఉన్నది. బ్రాహ్మణస్త్రీకి – క్షత్రియపురుషుడికి జన్మించినవాడిగా పరిగణించి సూతుడు అనే జాతివానిగా నిర్ణయించారు. అయినను శుద్ధమైన జన్మ కావున వ్యాసుడు పురాణములను సూతునికి ఉపదేశించాడు. ఆయననుండి మహర్షులు కూడా విన్నారు. బలరాముడు సూతుడిని చంపి బ్రహ్మహత్యాదోషం పొందినట్లు పురాణ వచనము.

### ◆ సరి సంవత్సరాలలో ఉపనయనం చేయరాదా?

సరి బేసి భేదం లేదు. యిది దుష్ప్రచారంతో కూడిన వాక్యములు. "ఆషోడశాత్ బ్రాహ్మణస్య సావిత్రీనాతివర్తతే" అని 16వ సంవత్సరం దాటిన తరువాత అకాలం ప్రారంభం అవుతుంది అని చెప్పారు. 16 అంటే సరిసంఖ్యకదా! యిక సరి బేసి సంవత్సర బేధం లేదని తెలిపే శాస్త్ర వాక్యం. "సప్తమే బ్రహ్మవర్చస కామ మష్టమ మాయుష్కామం నవమే తేజస్కామం దశమేన్నాద్యకామం ఏకాదశ ఇంద్రియ కామం ద్వాదశే పశుకామం" 7వ సంవత్సరం ఉపనయనం బ్రహ్మ వర్చస్సును యిచ్చును. ఎనిమిదవ సంవత్సరం ఉపనయనం ఆయుష్షు పెంచును. తొమ్మిదవ సంవత్సరం చేయుట వలన వటువుకు తేజస్సు పెరుగును. పదవ సంవత్సరం చేయుట వలన వటువుకు తేజస్సు పెరుగును. పదవ సంవత్సరం పదకొండు పన్నెండు యిలా శాస్త్రంలో సరి వయస్సు బేసి వయస్సు బేధం లేకుండా చెప్పారు కదా!

మన శాస్త్రంలోలేని విషయాలు సంఘంలో వినబడితే ఎందుకు ఊరుకోవాలి. ఎవరయినా యిటువంటి తప్పుడు మాటలు చెబితే శాస్త్ర ప్రామణ్యం ఏది అని

అడగండి. సరి బేసి బేధం లేకుండా 16వ వయస్సులోపు ఉపనయనం చేయడం గాయత్రీ అనుష్టానం చేయించడం వంటి నియమాలు పెట్టుకోండి.

### ◆ మహర్షులలో అంగీరమహర్షి యొక్క గొప్పదనం ఏమిటి?

పూర్వం ఒకసారి అగ్నిహోత్రుడు దేవతలపై అలిగి తన ధర్మములను మానివేసి ఏకాంతమునకు పోయెను. అగ్ని లేకపోవడం వలన యజ్ఞయాగాది క్రతువులు ఆగిపోయినవి. ఆ సందర్భంలో అగ్ని యొక్క స్థానంలో ఎవరు సమర్థంగా వ్యవహ రించగలరు అనే విషయమై దేవతలు చర్చించుకొని అంగీరమహర్షిని అగ్నిహోత్రుని స్థానం ఇచ్చి యజ్ఞయాగాది క్రతువులు చేసిరి. ఆనాటి నుండి ఎక్కడా క్రతుభంగం జరుగలేదు. వైదిక నిత్యకర్మానుష్ఠానమునకు భంగం రాలేదు. కొద్దిరోజుల తరువాత అగ్నిహోత్రుడు తిరిగి వచ్చి ఆ స్థితిని చూచి సిగ్గుపడెను. కానీ, అంగీరమహర్షి అగ్నిహోత్రుని యొక్క స్థానము ఆయనకే తిరిగి ఇచ్చివేసెను. అంతటి గొప్ప మహర్షి కావున యజ్ఞయాగాది క్రతువులలో అంగీరమహర్షికి ప్రత్యేక అర్చన ఏర్పాటు చేసిరి.

### ◆ పంచపాండవులు ఇంద్రుడి అంశ అంటారు నిజమేనా?

అవును మనకు సహజంగా వ్యాసభారతం ఆధారంగా కుంతి ధర్మదేవతను ఆరాధించి ధర్మరాజును వాయుదేవుని ఆరాధించి భీముని, ఇంద్రుని ఆరాధించి అర్జునుని అలాగే మాద్రి అశ్వినీ దేవతలను ఆరాధించి నకుల సహదేవులను కనినట్లు దానికి దుర్వాసునిచే ఉపదేశింపబడిన మంత్రం ఉపయోగించినట్లు చెప్పబడుతుంది. అయితే ధర్మదేవత, వాయుదేవుడు అశ్వనీ కుమారుల దగ్గర ఇంద్రుని తేజము వున్నది. వారు ఆ తేజమును కుంతీ మాద్రిలకు ప్రవేశింపచేయగా పాండవులు జన్మించారు. అందువలన మొత్తం అయిదుగురు పాండవులు ఇంద్రుని అంశమే. అందుకే ద్రౌపదికి అయిదుగురు భర్తలు అనే దోషం లేదు. దీనికి మార్కండేయ పురాణం ఆధారం. ఇంద్రుడు ఒకసారి త్వష్టృ ప్రజాపతి కుమారుడు త్రిశిరుడు తపస్సులో వుండగా అతనిని ఇంద్రుడు సంహరించాడు. అప్పుడు ఆయన యొక్క తేజస్సు ధర్మదేవత యందు ప్రవేశించినది. ఆ తరువాత వృత్తాసురుడిని చంపెను. ఇంద్రుడు శరీరం నుండి తేజము వెడలి వాయుదేవతలో ప్రవేశించినది. గౌతమ మహర్షి భార్య అహల్యను చెరచిన సందర్భంలో ఇంద్రుడి తేజస్సు అశ్వినీ దేవతల యందు ప్రవేశించినది. యిలా ఇంద్రుని తేజము నలుగురి దగ్గర నిక్షిప్తమయినది.

"పంచధా భగవానిత్థ మవతీర్ణ శ్శతక్రతుః" భగవంతుడు ఇంద్రుడు అయిదు అంశ భాగములతో భూలోక మందు అవతరించెను. "తస్యాత్మన్నా మహాభాగా పత్నీ కృష్ణాహు తాశనాత్, శక్రైకస్య సాపత్నీ కృష్ణానాన్యస్య కస్యచిత్ యోగేశ్వరాః శరీరాన్ని కుర్వంతి బహులాన్యపి" ఇంద్రుని భార్యయగు శచీదేవియే ద్రౌపది అను నామ

ధేయంతో యజ్ఞమందు హోమగుండ మందలి అగ్నిహోత్రుని నుండి పెట్టెను. ద్రౌపది ఇంద్రుని పత్నియగు శచీదేవి అంశయేగాని యెంకెవరుకారు ఏమనగా యోగీశ్వరు లగు మహాపురుషులు తమ శరీరమును అనేక భాగములుగా విభజించగలరు. అందుకే పాండవులు కేవలం ఇంద్రాంశ ద్రౌపది శచీ అంశ కావుననే ద్రౌపదిని పంచభర్తృక దోషం లేదు. మార్కండేయ పురాణం చదువుకోండి.

**◆ దుర్గగుడిలో మా కుమార్తెకు వివాహం చేయవలెనని మొక్కుకున్నాము ఒక వేళ మగ పెళ్ళివారు ఒప్పుకోకపోతే ఏమి చేయాలి?**

ఇది చాలా మంచి ప్రశ్న. మీ కోరిక మన్నించి మగ పెళ్ళివారు ఓకే చెబితే వివాహం ముందు అమ్మకు నమస్కరించి దుర్గా మల్లేశ్వరస్వామి వార్ల దేవస్థానం ప్రాంగణంలో వివాహం చేసి అనంతరం మరల దుర్గామల్లేశ్వరుల దర్శనం వధూవరుల ఇరువురి చేత చేయించాలి. అయితే అందరూ శక్తిలేక ఒక తప్పుచేస్తున్నారు. వివాహానంతరం నూతన వధూవరులచేత 'శ్రీచక్రపూజ' 'దుర్గామల్లేశ్వరుల కళ్యాణం' చేయించాలి. కానీ చేయించడం లేదు.

మనం తిరుమలలో వివాహం చేస్తే అక్కడ శక్తి వున్న వారు శ్రీనివాస కళ్యాణం చేయిస్తున్నారు కదా! అలాగే ఇక్కడ నూతన వధూవరులచేత దుర్గామల్లేశ్వర కళ్యాణం చేయించాలి సరే. ఒక వేళ మీకు మగపెళ్ళివారి నుండి అభ్యంతరం వస్తే, వారి అనుకూలం కోరిక ప్రకారం వివాహం జరిపించి వెంటనే దుర్గాక్షేత్ర సందర్శనం దుర్గామల్లేశ్వర కళ్యాణం చేయించండి.

వారు మీ కోరిక మన్నింపక పోతే... వారి తరపున మీరు (తల్లిదండ్రులు) దుర్గాక్షేత్రంలో పై కార్యములు చేయించండి. పాఠకులు మన్నించాలి. యిక్కడ మరొక విషయం కూడా జతపరుస్తున్నాము. ఒకవేళ మీరు మొక్కుకున్నారు కానీ మీ పిల్లలు కనుక స్వతంత్ర భావాలతో వివాహం చేసుకున్న సందర్భం ఎదురైతే.... అప్పుడు కూడా వీలైనంతవరకు పిల్లల చేతగానీ లేదా మీరు కానీ పై కార్యక్రమములు క్షేత్రంలో జరిపించండి. అమ్మ ఆశీస్సులతో సుఖసంతోషాలతో వర్ధిల్లుతారు.

**◆ దత్తాత్రేయ ఆరాధనతో వచ్చే ప్రతిఫలములు ఏమిటి?**

దత్తానుష్ఠానం చేయడం ప్రత్యక్షంగా శ్రీమహావిష్ణువును అనుష్ఠించడమే. దుఃఖముతో బాధపడడం సుఖముతో ఆనందించడం వంటి అంశాలు జయించిన వారిని 'స్థిత ప్రజ్ఞులు' అంటారు. అటువంటి స్థితప్రజ్ఞత, యోగము దత్తానుష్ఠానం వలన కలుగుతాయి. దత్తాత్రేయులు యోగ గురువు. ఆయన అనుష్ఠానం వలన మనిషి మానసిక ఆనందం పొందుతారు. మనసును అదుపులో వుంచుకోగలుగుతారు. భూత భవిష్యత్ వర్తమానముల మీద మంచి అవగాహన పొందుతారు. సుఖదుఃఖ బాధలను జయించే శక్తి వస్తుంది.

**◆ నవగ్రహ పూజలు యింటిలో చేసుకోవచ్చా? గుడిలో నవగ్రహ ప్రదక్షిణాలు చేసిన వెంటనే కాళ్ళుకడుగుకుంటారు ఎందుకు?**

మనం యిళ్ళలో ఏ పూజ చేసినా (సత్యనారాయణ వ్రతం వంటివి) ప్రధమం మంటపారాధన మీద నవగ్రహారాధన చేస్తారు. మనం యిల్లు కట్టుకోవడానికి చేయు శంఖుస్థాపన రోజున నవగ్రహారాధన చేసి వాస్తు దేవతాహ్వానం చేస్తారు. అలాగే గృహప్రవేశం రోజున వాస్తు దేవతాహ్వానం కంటే ముందుగానే నవగ్రహ దేవతాహ్వానం జరుగుతుంది. నవగ్రహాలు శ్రీమహావిష్ణువు యొక్క ప్రతి నిధులు. సృష్టి పరిపాలనలో శ్రీమహావిష్ణువుకు సహకారం కోసం ఉత్పన్నమయినవే. అందువలన నవగ్రహారాధన యింటిలో చేయడానికి ఎటువంటి ఆక్షేపణ లేదు. జాతక రీత్యా దోషం పోవడానికి చేయు నవగ్రహ పూజలు కూడా యింటిలో చేసుకోవడమే శ్రేయస్కరం. "గృహస్థస్య క్రియాస్సర్వాన సిద్ధ్యంతి గృహం వినా" గృహస్థుచేసుకొనే ప్రతికార్యము స్వంత యింటిలో చేసుకకోవడమే శ్రేయస్కరము. యితరత్రా చేయునవే ప్రతికూలము. యిల్లు అనుకూలం లేని వారి విషయంలో దేవాలయంలో చేసుకోవడం మంచిది.

ఇక దేవాలయంలో నవగ్రహ ప్రదక్షిణలు అందరూ చేస్తారు. వారికి సంబంధించిన దోషాలు పోవడం కోసం వారు ప్రదక్షిణాలు చేస్తారు. అయితే వారు నడిచిన చోటనే మనం నడుస్తున్నాం. కావున వారిని వదిలిన దోషం మనల్ని స్పృశింపకూడదు అనే భావనతో చేసిన వ్యవస్థయే ఈ కాళ్లు కడుగుకోవడం.

ఇంటిలో నవగ్రహశాంతి మనం ఒక్కరమే చేసుకుంటాం. దేవాలయంలో అందరూ దోషనివృత్తి కోసం చేసుకుంటారు. అందువలన వారి దోషాలు మనకు తగలకూడదు అనే అంతర్యంతోనే ఈ పాదప్రక్షాళన కార్యక్రమం ఏర్పాటుచేయబడినది.

**◆ ఉపనయనం ముహూర్తాలు బాగా తక్కువగా ఉంటాయా? సకాలం వస్తే ఏం చేయాలి?**

ఉదాహరణకు 2016, 2017, 2018 లలో ఉపనయన ముహూర్తాలు లేవు. కానీ కాల ప్రాధాన్యంతో కూడుకున్న సంస్కృతి కదా మనది అందువలన గర్భాష్టమం మరియు 16 సంవత్సరాల వయస్సులో సకాలం పోతుంది, అకాలం వస్తుంది అనే కారణాలతో గ్రహబలం తక్కువగా ఉన్న ఉపనయనం చేయించి పిల్లవాడి చేత బహు ఎక్కువ గాయత్రీ అనుష్ఠానం చేయిస్తే వాడికి యోగం బాగుంటుంది.

**◆ వికర్ణుడు ధర్మవాది కదా! మరి యుద్ధంలో ఎందుకు పాల్గొన్నాడు?**

ధర్మవాది కావున దుర్యోధనాదుల దుర్మార్గములను ఎదుర్కొన్నాడు. అంతేకాకుండా రాజ్య బహిష్కరణ శిక్షకూడా పొందాడు. శిక్ష అమలుకు ముందు గాంధారీ అవసరం వచ్చినప్పుడు అన్నలకు సహకారం చేయమని అర్థించినది. శిక్ష అమలు కాలంలో వికర్ణుడు గొప్ప తపస్సు చేసాడు. కురుక్షేత్రంలో పాల్గొన్న వికర్ణుని ఎట్టి పరిస్థితులలోను

చంపవద్దని ద్రౌపది పాండవుల దగ్గర మాట తీసుకున్నది. కాని యుద్ధరంగంలో వికర్ణుడు వీరోచితంగా పోరాడుట వలన చివరకు భీముడు అతనిని ఓడింపక తప్పలేదు. కాని భీముడు చివరలో ఆకాశంలోకి గదను విసరగా అది వికర్ణుని అంతమొందించినది. అలా ప్రత్యక్షంగా కాక, పరోక్షంగా భీముని చేతిలో మరణించాడు. అతనిని అంతమొందించడం పాండవులకు ఇష్టం లేదు. కాని తప్పలేదు.

◆ **వృషభచక్రము, కలశచక్రము అనేవి శంఖుస్థాపన, గృహప్రవేశముల విషయంగా తప్పని సరిగా ఆచరింపవలసిన అంశములా?**

తప్పని సరి ఏమీలేదు. వృషభచక్రము శంఖుస్థాపన విషయమై చూడాలి. కలశచక్రము గృహప్రవేశ విషయమై చూడాలి. అయితే రెండు కార్యములకు రెండు చక్రాలు చూడాలి అని మొండి వాదన చేయువారు వున్నారు. అది తప్పుడు వాదన. కారణం రెండు చక్రాలు రెండు వ్యతిరేక ఫలితాంశములు వున్నాయి. ఉదాహరణకు 14,15,16,17 నక్షత్ర ఫలితం "నిర్ధనం, ధనం" ఈ రెంటికీ రెండు చక్రాలలో పూర్తి వ్యత్యాసం వున్నది. అందువలన మొండి వాదనలకు స్వస్తి చెప్పి వృషభ చక్రం శంఖుస్థాపనకు కలశచక్రం గృహప్రవేశమునకు వాడుకోవాలి. ఇలా వాడుకోవడం తప్పనిసరినా? అనే ప్రశ్నకకు సమాధానం తప్పని సరి కాదు అనేది 100శాతం కచ్చితమయిన సమాధానం., కారణం ఈ వృషభచక్రం నిర్మాణంలో వశిష్ఠ సంహిత, జ్యోతిర్నింబంధం, కాలామృతం వంటి గ్రంధాలలో వ్యత్యాసం వున్నది. అందువలన యిది సరియగు అంశం కాదు. ఆ చక్ర శుద్ధి విశేషం కాదు. చక్ర శుద్ధి కంటే రాశిచక్రంలో లగ్నం, గ్రహచారం, నక్షత్రమే ప్రధానము.

◆ **వర్షాలు కురియకపోవడానికి మానవుల కోర్కెలు కారణమా?**

నిజమే! వర్షాలు రాకుండా వుంటే బాగుండు అని కోరుకునే ప్రజలు ఈ సమాజంలో ఎక్కువ అయ్యారు. శ్రావణమాసం, ఆశ్వయుజమాసములలో శుభకార్యములు చేసుకునేవారు ఆషాఢమాసం ప్రభృతిగా స్లాబ్‌లు వేసుకునేవారు "ఇవ్వాళ్ళ వర్షం కురవకుండా వుంటే మన కార్యం పూర్తి అవుతుంది" అని దేవుడికి విన్నవించుకునేవారున్నారు. మార్కెట్‌లో ఉద్యోగరీత్యా తిరిగేవారు వర్షం వస్తే వారి పనికి యిబ్బంది కావున "వర్షం రాకుండా వుంటే బాగుండు" అనుకుంటారు. పిల్లవాడు స్కూల్ వెళ్ళినా వాడు యింటికి తిరిగివచ్చేవరకు వర్షం రాకూడదని భావించే తల్లిదండ్రులు వున్నారు. వర్షాలు తక్కువగా పడితే కొన్ని వస్తువులకు ధరలు పెరుగుతాయి. అలాంటి వ్యాపారులు వర్షాలు రాకూడదని భగవంతుడిని నమస్కరిస్తారు. ఇలా ఎందుకో వర్షం రాకుండా వుంటే బాగుండు అనుకునే దౌర్భాగ్య ప్రజలు సంఘంలో ఎక్కువ అయ్యారు. వారి మన్ననలు కూడా గ్రహించి భగవంతుడు వర్షాలు తక్కువగా

కురిపిస్తున్నాడు. యిప్పటికయినా ప్రజలు ఎవరి రక్షణ వారు తీసుకుంటూ అందరూ భగవంతుడిని వర్షాలు కురిపించమని ప్రార్థిస్తే తప్పకుండా మన మాట విని వర్షాలు కురిపిస్తాడు.

### ◆ సంతానం యొక్క మంచి, చెడు జాతకఫలితాలు తల్లి ప్రభావంలో వుంటాయా?

తల్లి యొక్క ప్రభావంతో పిల్లలకు చాలా విశేషమార్పులు తేవచ్చు. గర్భిణిగా వుండగా రాబోవు పిల్లల యొక్క జాతకాల ప్రభావం మార్పుచేయవచ్చు. గర్భిణీ స్త్రీ తీసుకునే ఆహారం నుండే గర్భంలో వున్న పిల్లలకు ఆహారం అందుతుంది అనేది మన వేద విజ్ఞానం అలాగే సైన్స్ కూడా చెబుతున్నాయి. ఈ నేపథ్యంలో గర్భిణీ స్త్రీ తాను తీసుకునే ఆహారం ప్రతిదీ యోగ్యమయినది అయి అది భుజించే సమయంలో భగవన్నామం చేస్తూ తీసుకుంటే గర్భంలో వున్న వారికి భగవంతుడిపై ఆలోచనలు ప్రారంభం అవుతాయి. అంతేకాదు గర్భంలో ఉన్నవారికి పూర్వజన్మ ప్రభావం వుంటుంది కదా! అది ఒక వేళ చెడుకు సంబంధించిన పూర్వజన్మ గుర్తులు ఉంటే అవి ప్రక్షాళన అవుతాయి. గర్భంలో వుండగానే చెడు ప్రక్షాళన జరిగి మంచిని పెంచే శక్తి కేవలం తల్లికి మాత్రమే ఉన్నది. అలాగే గర్భిణీగా వుండగానే మొత్తం కాలం అంతా విద్యా, విజ్ఞాన, భక్తి మార్గాలతో గడిపితే ఆ పిల్లలు చక్కటి యోగ జాతకులయి జన్మించే అవకాశం వుంటుంది. సంతానం యొక్క జాతకాలు తల్లి గర్భంలో వుండగానే మార్పుచేయు శక్తి తల్లికి మాత్రమే వున్నది. అది భగవదారాధనతో సాధ్యం. మన పురాణాలను అన్నింటినీ పరిశీలిస్తే ఇది సాధ్యమే అనే విషయం మనకు దృశ్చారారమవుతుంది.

### ◆ వాస్తు శాస్త్రం మీద నేటి సమాజంలో మనం వింటున్న విషయాలన్నీ నిజమేనా?

కాదు. కొన్ని కల్పనలు కూడా ప్రచారంలోనే వున్నాయి. ఉదాహరణకు 'ఆగ్నేయంలో మాత్రమే వంటగది కట్టాలి'. ఇది చాలా అపహాస్యమయిన విషయం. ఆగ్నేయంలో కానీ ఇంటికి వెనుక భాగంలో వున్న గదులలో ఆగ్నేయంలో కానీ, వంటగది కట్టమని శాస్త్రవచనం. ఇలాగే ఈశాన్యంలో దేవతామందిరం. ఇది కూడా శాస్త్రం చెప్పిన విషయం ఏమిటి అంటే ఇంటిలో ఈశాన్యం (లేదా) ఇంటికి వెనుక భాగంలో వున్న గదులలో ఈశాన్యంలో దేవతామందిరం చెప్పబడినది. ఇంతేకాక నైఋతిమాస్టర్ బెడ్‌రూమ్ – వ్యాపార స్థానంలో నైఋతిలో యజమాని నైఋతిలో ధన నిల్వలు ఇలా ఎన్నో అంశాలలో శాస్త్ర దూరమైన విషయాలు ఎవరికి తోచిన రీతిగా వారు చర్చిస్తున్నారు. దీనికి ప్రధానమయిన కారణం ఒకటే. విశ్వకర్మ వాస్తు, మయవాస్తు, మానసారం, సమరాంగణ సూత్రధార వంటి గ్రంథాల మీద అభ్యాసం చేయకపోవడమే. ఇవి చదివితే మీకు నేటి సమాజంలో వాస్తు రీత్యా ఎంత అపహాస్య స్థితిలో వాస్తు వున్నదో తెలుస్తుంది.

◆ **నిత్యంలో మనం చేయు చిన్న చిన్న పొరపాట్లు జీవితానికి యిబ్బంది కలిగిస్తాయి అంటారు. అటువంటి కొన్ని నిత్యకృత్య విషయాలు తెలియచేయగలరు?**

బయటకు వెళ్ళివస్తే కాళ్ళు కడుగకోకుండా లోపలికి రావడం ద్వారా లక్ష్మి నిలవదు / సూర్యోదయానికి పూర్వం నిద్రలేవడం ఆరోగ్యమునకు మంచిది / నిద్రలేవగానే దంతధావనం చేయకుండా ఏ విధమయిన పదార్థం నోటిలో వేసుకోకూడదు / అద్దంలో మన ముఖం మనం చూసుకొంటూ నిద్రలేవడం ద్వారా ఆ రోజు అంతా అశాంతి ఉంటుంది. నిద్రలేవగానే దేవతామూర్తుల పటములను నమస్కరిస్తూ లేవడం మంచిది / ఉదయకాలంలో నిద్రలేచినది మొదలు మరల రాత్రికాలంలో పడుకునే వరకు పడక సామాగ్రి ముట్టరాదు / దీపారాధన లేకుండా పూజ చేయరాదు. దీపారాధన తూర్పుకు లేదా ఉత్తరానికి అభిముఖంగా ఉండాలి/ పూజ మనం ఇంటిలో తూర్పు ముఖంగా (లేదా) ఉత్తరముఖంగా ఉండి చేయాలి / ఇంటి ముంగిట ముగ్గు వేయకుండా ఉదయకాలంలో పూజచేయరాదు/ సూర్యాస్తమయ సమయంలో డబ్బులు ఇంటి నుండి బయటకు తీసుకువెళ్ళరాదు / దంతధావనం, మలమూత్ర విసర్జనలు తూర్పు, పడమర ముఖంగా ఉండి చేయరాదు / నిదురించేటప్పుడు ఉత్తర శిరస్సు, భుజించేటప్పుడు ఉత్తర ముఖం, పఠించేటప్పుడు దక్షిణ ముఖం నిషేధం / ఆహారం తిరుగుతూ తినరాదు / తల్లిదండ్రులు బతికి వుండగా యిబ్బంది పెట్టిననూ, వారు పోయిన తర్వాత వారికి కర్మకాండలు సరిగా చేయకపోయినూ మీ పిల్లలు ఏదో రకంగా యిబ్బంది పడడం తప్పదు / సూర్యాస్తమయ సమయాలలో నిదురించే వారికి , స్నానం చేయకుండా భుజించేవారికి, స్నానం చేయకుండా వంట చేసే వారికి అష్టదరిద్రాలలో ఏదో దరిద్రం వెంబడిస్తూనే ఉంటుంది / గుమ్మం ఎదురుగా నిలబడి, గుమ్మం మీద నిలబడి ఎవరికీ డబ్బులు ఇవ్వవద్దు. / శుక్ర, మంగళ, శని వారములలో నిత్యంలో క్షౌరం చేయించుకోకండి/ శుక్ర, మంగళ, శనివారములలో చెప్పులు, నూనెలు, చీపురు వంటివి కొనవద్దు / ప్రతిరోజూ సూర్యోదయ సూర్యాస్తమయ సమయాలలో సూర్యనమస్కారం చేయువానికి మంచి జీవనం ఉంటుంది / రాత్రి 12-00 గంటల తర్వాత మరల సూర్యోదయం వరకు భుజింపరాదు / ఆడవారు కాళ్ళకు పసుపు, నుదుటిన కుంకుమ లేకుండా పూజ చేయరాదు (భర్త లేని వారి విషయంలో కాదు) / నగ్నంగా స్నానం, అద్దంలో చూసుకోవడం, నిదురించడం / సూర్యాస్తమయం తర్వాత ఇంటిలోనికి ఉప్పు, నూనె, చీపురు, నిచ్చెన, చెప్పులు, పరుపులు కొని తేవడం మంచిది కాదు / ఇలా ఇంకా ఎన్నో మంచి విషయాలు పెద్దలు చెబుతూ ఉంటారు. వాటిని విమర్శించకుండా ఆచరించడం మంచిది.

**◆ సూర్యుని పేరుతో సంస్థలకు పేరు వుంచరాదా? రవి కుమార్ అని పేరు పెట్టరాదా?**

యిది ఒక నానుడి. పెద్దలు దీని విషయంలో ఒక విశేషం చెబుతారు. అది శాస్త్రం కాదు అనుభవంతో చెప్పిన అంశమే. సూర్యునికి వృద్ధి క్షయం వున్నట్లుగానే సూర్యుని పేరుతో వుండే సంస్థలకు కూడా వృద్ధి క్షయములు వుంటాయి. ఒక సగము దినము వెలుగు ఒక సగము దినము చీకటి వున్నట్లుగానే సూర్యుని పేరున పెట్టే సంస్థలకు చీకటి వెలుగులు వుంటాయి. అని చెబుతారు. ఇది మన యిష్టానుసారంగా నిర్ణయించుకోవాలి. సూర్యుడు నిత్యమూ ఉంటాడు. 24 గంటలు 365 రోజులు ఉంటాడు.

**◆ నూతన వస్త్రములు ఏ రోజులలో ధరింపరాదు క్షౌరం ఏ రోజులలో పనికి రాదు?**

మంగళ శని వారములలో నూతన వస్త్రధారణ చేయరాదు. అత్యవసర విషయాలు శుభకార్య విషయాలలో నిషేధం లేదు. క్షౌరం మంగళవారం నిషేధం. సోమ బుధ వారములు విశేషము. సోమ బుధవారం క్షౌరం విషయంలో తిథి నక్షత్రాలు కూడా చూడనవసరం లేదని శాస్త్రం. అలాగే అమావాస్య ఏకాదశీ రోజులలో క్షౌరం నిషేధం.

**◆ పూజా సామాగ్రి యితరుల చేత తెప్పించ వచ్చా? అప్పుచేసి వ్రతములు చేయవచ్చా?**

భగవంతుడికి అర్చన చేయనిదే మన సాంప్రదాయంలో ఏ పనీ చేయరు. రోజు వారీ పూజ నుండి పెద్ద పెద్ద క్రతువుల వరకు కూడా అన్నీ దైవపూజతోనే ప్రారంభం అవుతాయి. దేవుడికి సంబంధించిన పూజా సామాగ్రి మనకుటుంబంలోని వారు ఎవరైనా తీసుకుంటే మంచిది. ఆశక్తతతో, అనారోగ్యంతో వున్నప్పుడు యితరుల మీద ఆధారపడవచ్చు. మనం, కుటుంబీకులు అందరూ స్వస్థతతో వుండి పూజా సామాగ్రి యితరుల చేత తెప్పంచడం "రాజసం" అవుతుంది. దేవుని దగ్గర "రాజసం" మంచిది కాదు. అందువలన మనం చేయు పూజకు సామాగ్రి మనం కానీ మన కుటుంబీకులు గానీ ఏర్పరిస్తే మంచిది. యధాశక్తిగా వ్రతం చేయమని చెప్పారు కానీ అప్పుచేసి వ్రతం చేస్తే ఫలితం వుండదు. భగవంతుడిని తనకు శక్తివున్నంతలోనే అర్చించిన వాడికి అభివృద్ధి వుంటుంది. పూజలు వ్రతముల విషయంలో నియమం, మనస్సు ప్రధానం.

**◆ సంఖ్యాశాస్త్రం ప్రకారం లక్కీనెంబరు తెలుసుకొని దాని మీద ఆధారపడడం సబబేనా?**

సబబు కాదు. కారణం లక్కీ నంబరు అంటే అప్రయత్నంగా వచ్చిన నెంబరు దాని వలన లాభం పొందాలి. అటువంటి నంబరు లక్కీ నంబరు అంటారు. అయితే నేటి సమాజంలో కొనుక్కున్న నంబర్లను లక్కీనంబురుగ ఫీల్ అవుతున్నారు. శాస్త్రంలో అన్ని నంబర్లకు మంచి విలువలే సూచింపబడ్డాయి. ఉదాహరణకు 4వ నెంబరు మనకు సరిపడని నంబరు అనుకోండి. నాల్గవ తేదీన మనం బంగారం ఉచితంగా యిస్తామంటే తీసుకోవడం మానివేస్తామా? నాలుగు లక్షలు యిస్తాం అంటే తీసుకోవడం

మానివేస్తామా? జీతం 40,000 అని చెప్పారు అనుకోండి ఉద్యోగంలో చేరడం మానివేస్తామా? అందుకే మనం ప్రత్యేక ప్రయత్నం నంబర్లకోసం చేయరాదు. లక్కీనంబరు అనేది శాస్త్రరీత్యా కనుక్కోవాలి. అనుకోకుండా ఆ నంబరు వస్తే దాని వలన మరికాస్త లబ్ధి ప్రశాంతత ఏర్పడుతాయి అని భావించాలి. ప్రత్యేకంగా డబ్బులు ఖర్చుచేసికొనే నంబర్లు లక్కీనంబర్లు కావు. ప్రతి మనిషీ అన్ని నంబర్లను తప్పక అనుభవిస్తాడు. సరిపడని నెంబరుతో కూడిన తేదీ రోజున ఏ పనీ చేయకుండా వుంటారా? గుర్తించండి. ప్రతి మనిషి జీవితంలో అన్ని నంబర్లు వాడకపోతే జీవితమే ఆగిపోతుంది. లక్కీనంబరు అనేది మానసిక బలహీనత. దాని మీద ఆధారపడి మానసికంగా బలహీనమై జీవితం పాడుచేసుకోవద్దని సూచన.

◆ **బ్రాహ్మణులలో శైవ మతస్థులు ముందా లేక వైష్ణవ మతస్థులు ముందా? ఎవరు ప్రధానం?**

ఇరువురూ ప్రధానమే. శివ కేశవ భేదం చూపరాదని తద్వారా దోషం కలుగుతుంది అని శ్రీవేద వ్యాసులవారు తెలిపారు. పురాణాలలో ఈ విషయం మనకు తెలుస్తుంది. అందుచేత శైవులు వైష్ణవులు అనే వారు సాంప్రదాయ అనుసరణవలన వచ్చిన శాఖలు మాత్రమే. "దేవీ భాగవతం" ఈ రెండింటినీ కూడా తేలిక చేసి చెప్పినది. మీరు శైవులు వైష్ణవులు అనుకునేదాని కంటే ముందుగా మీరు గాయత్రీ ఉపదేశంలో "శాక్తేయులు" అయ్యారు – అని సూచించినది. బ్రాహ్మణులు అందరూ ఉపనయనం నాటి నుండి గాయత్రీ ఉపదేశం వలన శాక్తేయులుగా పిలవవలెను. శైవం, వైష్ణవం అనేవి సద్గురువుల ద్వారా వచ్చిన సత్ సాంప్రదాయములు మాత్రమే. పురాణ అవగాహన వున్న వారికి మాత్రమే ఈ విషయాలు తెలుస్తాయి. గోలోక ఖండంలో శ్రీకృష్ణుని నుండి శివుడు, విష్ణుమూర్తి ఒక్కసారిగా వచ్చినట్లుగా ఉన్నది.

◆ **పెద్దలు వస్తే పూజ మధ్యలో లేవవచ్చా?**

లేవరాదు. మాట్లాడరాదు. ఇంట్లో వేరేవారు వారికి అర్ఘ్యపాద్యాది సేవలు చేయాలి. అయితే వచ్చినవారు కూడా దానిని గ్రహించుకోవాలి. వారు గ్రహించకపోతే వచ్చే సమస్యలు ఆ వచ్చినవారి విజ్ఞత మీదే ఆధారపడి ఉంటుంది. గజేంద్రమోక్షం ఘట్టంలో ఇదే కదా జరిగినది. గజేంద్రుడు పూర్వ జన్మలో రాజు. ఆయన పూజా సమయంలో ఉండగా దూర్వాసమహర్షి రావడం పూజలో ఉన్న రాజు లేవకపోవడం అనంతరం మహర్షి శాపం ఇవ్వడం ఆయన గజేంద్రుడుగా జన్మించడం ఇదే కదా జరిగినది.

◆ **షిర్డిసాయి 'ముస్లిం' కదా! ఆయనను హిందువుల పూజా పద్ధతితో ఎందుకు కొలుస్తారు?**

ప్రశ్నకు పత్రికా ముఖంగా సమాధానం యివ్వడం కష్టమే. సర్వమతాల నుండి శాంతిని కోరుకోవలసిన కాలం ప్రస్తుతం వున్నది. అన్నిరకాలయిన మతాలలోను మంచి వారికి చెడు వారి ద్వారా సమస్యలు వస్తున్న ఈ కాలంలో మనం ఈ విధమయిన వ్యంగ్య ప్రశ్నలకు అవకాశం యివ్వరాదు. సర్వమత సౌభ్రాతృత్వం కోసం పరిశ్రమ

చేయుచున్న ఈ భారతదేశంలో ప్రస్తుతం షిర్డి సాయి లాంటి వారికి ప్రత్యేక స్థానం వున్నది. చాలామంది ఆయన సందేశాలను అనుసరించి మంచి జీవనం చేయుచున్నారు. తద్వారా కొంత భారతావని ప్రశాంతంగా వుంది. అనుటలో సందేహం లేదు... 'ఆచార్య దేవోభవ' అని శృతిని ఆధారంగా చేసుకొని సాయిని గురువుగా భావించి సత్ప్రవర్తన అలవాటు చేయడం దృష్ట్యా ఆయన అందరికీ గౌరవనీయుడే. అందరికీ ఆయన బోధనలను పాటించే భక్తులు వలన యిబ్బందుల కలుగటం లేదు కావున షిర్డీసాయి భారతీయులందరికీ సహకారం చేసిన సిద్ధ పురుషుడు. హిందూ మతం విధానాలతో పూజలు జరుగుతున్నాయి. ఎందుకు అంటే ఆయనను ఎక్కువగా ఆరాధిస్తున్న వారు హిందువులే. హిందువులే ప్రారంభంలో ఎక్కువ శాతం ఆయనను ఆరాధించడం జరిగినది. ఇప్పుడు కూడా ఆయన దగ్గర వున్న భక్తుల శాతం హిందువులదే.

◆ **శంఖుస్థాపన చేయకుండా కట్టిన యిల్లు కొన్నాం. ఇప్పుడు ఏమి చేయాలి?**

ప్రధానంగా వాస్తు సంబంధ రిపేరులు ఏమైనావుంటే పూర్తిచేసి, అటు తర్వాత శంఖుస్థాపన చేయవలసిన ప్రదేశం ఏది అయితే వుంటుందో ఆ ప్రదేశంలో కూర్మయంత్ర ప్రతిష్ఠ చేయుట శ్రేయస్కరం. ఇది శాస్త్రవచనం కాదు కానీ పెద్దలు చెప్పే మాట. శంఖుస్థాపనకు ఎలా మంచి ముహూర్తం చూస్తామో అదే విధముగా మంచి ముహూర్తం ఎంచుకొని గృహప్రవేశం చేయండి సుఖజీవనం చేయగలుగుతారు.

◆ **శని ఆచారం సరిగా లేనివారిని యిబ్బంది పెడతారు అంటారు నిజమేనా?**

జ్యేష్ఠాదేవీ ప్రవేశించే అంశాలు కొన్ని పురాణాలలో చెప్పబడ్డాయి. అలాంటి అంశాలతో కలిపి, అనాచార ప్రవర్తకులకు శనైశ్చరుని ద్వారా యిబ్బందులు పెరిగే అంశాలు వున్నాయి. వాటిలో మలిన వస్త్రధారణ (నిన్నటి రోజు కట్టినవస్త్రం మరల కట్టడం) ఒకరు వాడిన దువ్వెన, కాలుచెప్పులు, పక్కబట్టలు, మరొకరు వాడడం వంటివి. పగటికాలంలో మంచంమీద పడుకొని లేచిన తరువాత స్నానం చేయక పోవడం, కాళ్ళు కడుగుకోకుండా యింటిలోకి రావడం, తిరుగుతూ దంతవధానం చేయడం, పురుషుడు రోజూ తలస్నానం చేయకపోవడం, నిద్ర లేచిన వెంటనే పడకసామాగ్రి తీయకపోవడం, స్నానం చేయకుండా వంటచేయడం వంటి వాటి ద్వారా శనైశ్చరుడు వెంటనే ప్రవేశించి యిబ్బందులు కలుగజేస్తాడు. ఒక్కొక్కసారి ఒక్కొక్క రూపంలో యిబ్బందులు కలిగిస్తాడు.

◆ **సమాంతర కథాగమనంతో నడచిన పురాణములు ఉన్నవా?**

ఉన్నవి. విష్ణు, భాగవత, బ్రహ్మవైవర్త, గర్గ, హరివంశం ఒకే కథాగమనంగా గోచరిస్తాయి. కొన్ని పురాణములు కొన్ని కొన్ని విశేషములను ఎక్కువగా కలిగి ఉన్నాయి. అలాగే శివ, మార్కండేయ, దేవీభాగవత, బ్రహ్మవైవర్త, బ్రహ్మాండ పురాణా

లలో కథలలో సారూప్యత ఉంటుంది. అయితే ఇతర అంశాల దృష్ట్యా పురాణాలను వేరుగా విడదీయవలసి వస్తుంది.

**◆ వివిధ కాలములలో చేయుటకు రోజువారీగా కొన్ని క్రియలు చెప్పబడినవి కదా! వాటి వివరములు తెలుపగలరు?**

మీరు అడిగిన ప్రశ్న ప్రకారం రోజువారీ కార్యక్రమముల గురించి అడుగుతున్నారు అని అర్థం అవుతోంది. సూర్యోదయానికి ముందు రెండు గంటల కాలమునకు బ్రహ్మ ముహూర్తం అని పేరు. అకాలంలో నిద్రలేవాలి. సూర్యోదయానికి 72 ని॥లు ముందు పూర్వ సంధ్య అంటారు. పూర్వ సంధ్యలో నిత్యకృత్య పూజాదికాలు ప్రారంభించాలి. ఇంటి బయటముగ్గు వేసిన తరువాత మాత్రమే పూజకు ఉప క్రమించాలి. పూజకు ప్రారంభ సమయానికి యిల్లు శుభ్రపరచి వుండాలి. ప్రాతఃకాల పూజ చాలా విశేషం. ప్రాతఃకాలం సూర్యోదయత్ పూర్వం చేయలేకపోతే సూర్యోదయం పరం 72 నిమిషాలు కూడా విశేషమే. సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు వున్న కాలమును మూడు భాగములు చేయగా "విభజ్యాహ్నః ప్రయాణంతు తత్రాద్యంశేపిదైవికమ్ – ద్వితీయే మానుషం కార్యం తృతీయేపిచ పైతృకమ్" మొదటి భాగం అంతా దేవతా కార్యములు చేయుటకు రెండవభాగం మనుష్యకర్మలు అనగా శాంతులు, దానములు వంటివి మూడవ భాగంలో పితృకర్మలు చేయుటకుగాని నిశ్చయించారు.

**◆ దుర్గామాతను విగ్రహరూపంగా కాకుండా ఇంకా ఎలా ఆరాధింపవచ్చు?**

దుర్గామాత ప్రకృతి స్వరూపిణీ ఆమె ప్రకృతిలో ప్రతిచోట ఉంటుంది. ప్రధానంగా వనదుర్గా అవతారంగా వృక్షరూపంలో వుంటుంది. మనం మన చుట్టుప్రక్కల వున్న పూల చెట్లు, ఫల చెట్లు నీడను యిచ్చే చెట్లను రక్షించడం పోషించడం వంటివి చేయడం దృష్ట్యా మనకు తెలియకుండానే మనం దుర్గామాత అర్చన చేస్తున్నట్లే. అలాగే పల, పుష్ప, ఆహార పదార్థములను పాడుచేయకుండుట, పారవేయకుండుట వంటివి చేయడం దృష్ట్యా మనకు దుర్గామాత అనుగ్రహం లభిస్తుంది. అలాగే నీరు లక్ష్మి స్వరూపంగా చెబుతారు. పురాణాలలో విశేష స్థానం కూడా యిచ్చారు. అలాంటి నీటిని వృధాచేయడం వలన లక్ష్మి అనుగ్రహం తగ్గుతుంది. యంత్రరూపంలో దుర్గా పూజచేయవచ్చు. కేవలం మానసికంగా దుర్గా నామం పారాయణ చేయవచ్చు. "దుర్గా" అని మూడు సార్లు పిలిస్తే ఆమె అనుగ్రహించి మన కష్టాలు తీరుస్తుంది అని కొన్ని స్తోత్రాల ఫలశృతిలో వున్నాయి. అందువలన ప్రకృతిని పోషించి దుర్గా అనుగ్రహం పొందమని సూచన.

**◆ వివాహం అయిన వారిని దత్తత తీసుకోవచ్చా?**

తీసుకోవచ్చు. దీనికి సంబంధించి ధర్మసింధు అనే గ్రంథంలో దీనికి ఆధార వాక్యము వున్నది. వావిళ్ళ వారి ప్రతిధర్మ సింధు 236 పేజీలో "అసంభవే సగోత్రసపిండేషు కృతోనయనోపి వివాహితోపి వాదత్తకో భవతి–అసంజా అపుత్ర

ఏవ వివాహితో గ్రాహచ ఇతియేభాతి – సపిండ సగోత్రేషు కృతోపనయన. ఏవేత్య పిభాతీ. భిన్నగోత్రస్తు అకృతో పనయన ఏవగ్రాహయః– కేచిత్తు కృతోపనయనోపి భిన్న గోత్రోగ్రాహోచ ఇత్యాహః" అని వున్నది.

సగోత్రసపిండుల విషయములో వివాహం అయిన వానిని కూడా కూడా దత్తత తీసుకోవచ్చు అని చెప్పారు. అయితే పుత్రవంతుడు కాక ముందు ఈ కార్యం చేయవలెను. అసపిండసగోత్రులందు ఉపనీతుడు మాత్రమే అని తోచుచున్నది. వేరే గోత్రీకులను దత్తత తీసుకునే విషయమై ఉపనయనము కాని వానిని మాత్రమే గ్రహింపమని శాస్త్రవచనం. కొందరు వాదనల ప్రకారం ఉపనయనం అయిననూ అసపిండ భిన్నగోత్రలందు గ్రాహ్యమే అనిరి. ఏదో ఒక శాస్త్రం గ్రంథం ఆధారములతో ధర్మశాస్త్ర వచనములు చెప్పవలెను. మరి ఆధారం లేని ధర్మశాస్త్ర వాక్యములు చెప్పుట వలన నరక ప్రాప్తి కలుగుతుంది. మీరడిగిన దత్తత విషయంలో యింకా అనుమానములు వుంటే ధర్మసింధు చదవండి.

◆ **"అనంతావై వేదాః" అనడంలో ఆంతర్యం?**

కృష్ణ యజుర్వేదం పరిశీలిద్దాం. "ఆశీతిద్వయం" 82 ప్రశ్నలు దాటి కొత్త వేదమంత్రం కృష్ణయజుర్వేదంలో వుండదు. మరి కృష్ణయజుర్వేదమునకు హద్దు వున్నది కదా! యింక అనంతం అనే పదం ఎలా పుట్టింది అని శోధించాలి. యిలాగ కృష్ణ యజుర్వేదం వంటి శాఖలు ఎన్నో అనంతమయిన శాఖలు వేద విభాగం చేసేటప్పుడు వ్యాసులవారు చేశారు. అయితే వేదం సృష్ట్యారంభంలో ఒకరాశి వలే (మంత్రముల రాశి) వుండేది. దానిని వేద వ్యాసుల వారు విభాగం చేశారు. మంత్రరాశిగా వున్న వేదము అనంతము అందు ప్రపంచములోని భూత భవిష్యవర్తమానములకు సంబంధించిన ఎన్నో విజ్ఞాన విషయాలు, శాస్త్ర విషయాలు, పురాణ విషయాలు ఉన్నవి. వాటిని క్రమబద్ధం చేసి విభాగం చేసిన తరువాత కూడా అనంత శాఖలతో వేదం "అనంతావై వేదాః" అనే కీర్తింపబడుతోంది. నేడు మనకు కొన్ని శాఖలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. అందువలన భారతీయ సంస్కృతికి మూలము అయిన వేదమును రక్షించి వేద పండితులను రక్షించి వృద్ధిపరచి భవిష్యతరాలకు చూపగలిగిన వారు దైవానుగ్రహపాత్రులు అవుతారు. ప్రతి వేదశాఖకు ఒక హద్దు నిర్దేశం అయినది కానీ మొత్తం మీద వేద మంత్రరాశి అనంతం తద్వారా వచ్చిన వేదశాఖలు అనంతం అందుకే వేదం "అనంతావై వేదాః" అంటున్నది.

◆ **ఇంటిలో నిత్యం ప్రశాంతత తగ్గినది. శుభ కార్యములు జరగడం లేదు. లోకకళ్యాణం కోసం కూడా ఏదైనా సత్కార్యం చేయవలెను అని వున్నది. ఏమిటి చేయమంటారు?**

వీటికి శాస్త్రాలలో వివరాలు ఏమీ వ్రాసి వుండవు. అయితే పురాణాల ఆధారంగా పెద్దలు చెప్పిన అంశాలను మనం పాటించాలి. పెద్దల పురాణాల ఆధారంగా

చాలా ప్రయోగాలు చేశారు. వారు అందలి విషయాలను అనుష్ఠించి ఫలితాలు పొంది వారి అనుభవాలను తర్వాత తరాలకు అందచేశారు. అందలి కొన్ని అంశాలు పరిశీలిద్దాం. "ఉపాస్మహే నృసింహాఖ్యం బ్రహ్మ వేదాంత గోచరం భూయోల్లాల్లిత సంసార ఛేద వాతుం జగద్గురుం" అని నృసింహోపాసన విషయంగా వున్నది. అది దృష్టిలో వుంచుకుని సకల సంసార బాధల నివృత్తి కొరకు రోజూ నృసింహారాధన చేయమని చెబుతారు. సంసారం అన్నాక సమస్యలు రాకుండా వుండవు., కానీ వాటిని ఓర్పుగా నేర్పుగా దాటుటకు నృసింహ ఆరాధన బాగా పనిచేస్తుంది. రోజూ నారదుడు వాల్మీకి మహర్షికి బోధించిన సంక్షిప్త రామాయణం మరియు రామ పట్టాభిషేక ఘట్టం యింటిలో వారందరూ పారాయణ చేసిన, ఆ యింట అశాంతికి చోటు వుండదు. అన్నీ మనం చేయలేము కావున ఏదో ఒకటి ఆచరిస్తే సమస్యలు తొలగుతాయి. యింటిలో ఆహార పదార్థాలు తయారు చేయునప్పుడు "గోవింద" నామస్మరణ చేయుచూ తయారు చేయుట వలన అది ప్రసాదంగా అవుతుంది. "గోవింద" అంటే "గోభిర్వేదాం త్రై ర్విద్యతే లభ్యతే శక్యతే యితి గోవింద" అందువలన ప్రసాదం వంటి ఆహార పదార్థములు తినడం వలన జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం కలిగిన వారికి అశాంతికి చోటు లేదు కదా! ధనం ఖర్చుచేసి నవగ్రహహోమం, మహావిద్యాహోమం చేయడం వలన శాంతి లభిస్తుంది. ధనం ఖర్చు చేయగలిగినా ఖర్చు చేయలేని స్థితిగా వున్నా రోజూ రామాయణం పారాయణ చేయండి. అది బాగా యోగిస్తుంది. రోజూ రామపట్టాభిషేకం ఘట్టం పారాయణం చేసిననూ ఇంటిలో ప్రశాంతత చేకూరుతుంది. అంతేకాకుండా రోజువారీ దినచర్యలో ఉభయసంధ్యా కాలములో గృహము శుభ్రం చేయించి యింటి ముందర ముగ్గు వేయించి మీరు స్నానాదులు కావించి దీపారాధన చేసి కులదైవారాధన పితృదేవతాస్మరణ మరియు దుర్గాసహస్రం పారాయణ చేసిన యెడల తప్పకుండా శుభం చేకూరుతుంది. ప్రశాంతత చేకూరును. యిది ప్రాచీనులు అందరూ ఆచరించారు. మనకు పురాణాల మీద అవగాహన తక్కువ అయిన కారణంగా వాటి జోలికి పోవడం లేదు తద్వారా సమస్యలు వచ్చినప్పుడు పెద్ద స్థాయిలో బాధపడుతున్నారు. యింక లోక కళ్యాణం కోసం గోపూజ, రామ, దుర్గాపూజలు చేయడం చాలా అవసరం. మీరు చేయండి. మీ తోటి వారిచేత లోకకళ్యాణార్థం పూజలు చేయించండి. యిది లోకోపకార కార్యం.

◆ **మా యింటికి ఈశాన్యములో ద్వారం వున్నది. ఈశాన్యం బ్లాక్ వాస్తు ప్రభావం ఏమీ కనబడడం లేదు కారణం?**

విశ్వకర్మ సిద్ధాంతం ప్రకారం చతుష్పథం దగ్గర నివాసం శ్రేయస్కరం కాదు. బ్లాకులు అనే మాట చతుష్పథం దగ్గరనే కదా వచ్చేది ఈ నేపథ్యంలో ఈశాన్యం బ్లాక్ చెప్పుకోవడానికే గొప్ప. మరొక కోణంలో మనం స్థలం, యిల్లు పెంచాలి అంటే

తూర్పుకు ఉత్తరానికి పెంచాలి. మరి ఈశాన్యం బ్లాక్‌కు తూర్పు రోడ్డు, ఉత్తరం రోడ్డు వున్న కారణంగా యింక పెరిగేది ఏమీ వుండదు. స్థిరాస్తి వృద్ధి లేని స్థలంగా ఈశాన్యం బ్లాక్‌ను చెప్పుకోవచ్చు. మరొకమాట యింటికి ఈశాన్యం ద్వారం వున్ననూ మిగిలిన వాస్తు విషయాలు పరిశీలించాలి కదా! అందువలన మీ దగ్గరలోని వాస్తు పండితుని సంప్రదించండి. ఒకవేళ యింటికి ఈశాన్యం సింహద్వారం వుంటే అది శాస్త్ర నిషేధమే. నేటి సమాజంలో అందరూ వాస్తు విషయాలు మాటలాడి వాస్తు ప్రకారం అనే భావనతో ఈశాన్య సింహద్వారం ఏర్పాటు చేయుచున్నారు. అది తప్పు. "గృహాయతేనంద విభాగభాజితే శరాంశకే దక్షిణ భాగమాధికం" అనే సిద్ధాంతం ప్రకారం యింటి నడివిని తొమ్మిది భాగములు చేసి అందు అయిదవ భాగంలో సింహద్వారం వుంచమని శాస్త్రం. మరి శాస్త్రమును ఎంతపక్కదోవ పట్టించారో చూశారా? దీనికి విరుద్ధమయిన వాక్యాలు ఎక్కడా లేవు. కానీ 1980 నుండి ఆధుని కులు వాస్తు పుస్తకాలు వ్రాసి శాస్త్రం పాడు చేశారు. వారికి ప్రోత్సాహం బాగా లభించినది. వారు చెప్పిన మాటల మహర్షుల మాటలను కనబడనీయకుండా చేశాయి. అయితే ఈశాన్యం ద్వారం కావాలి అంటే పెట్టుకోవచ్చు కానీ సింహద్వారం పనికిరాదు. మీకు యింకా సులభశైలిలో ఈ వివరములు కావాలి అంటే "వాస్తు సుధ" వాస్తు శాస్త్రవివేకం వంటి అనువాద గ్రంధాలు మరి పరిశీలించండి. దీని మీద విజ్ఞానం బాగా లభిస్తుంది. విశ్వకర్మ వాస్తుమయ వాస్తు గ్రంధాలలో మూలం తెలుస్తుంది.

### ◆ ధ్వజంలేని శివాలయంలో ప్రదక్షిణాలు, ప్రసాదము విశేషమేనా?

విశేషమే. ధ్వజం వున్న శివాలయంలో చండీప్రదక్షిణాలు చేయడం విశేషం. ధ్వజం లేని చోట మామూలు ప్రదక్షిణాలు చేయవచ్చును. సాలగ్రామములు వున్న శివాలయంలో ప్రసాదములు, తీర్థములు తీసుకోవడంలో ఏ విధమయిన ఆలోచన లేదు కానీ సాలగ్రమంలేని శివాలయంలో తీర్థ ప్రసాదముల విషయంలోనే ప్రసాదం తీసుకోవడం పనికిరాదని కొందరు పెద్దల వాదన. అయితే అర్చన అంటూ చేశాక ప్రసాదం తీసుకోకపోవడం నిషేధం మరియు ఫలితం శూన్యం అయ్యే యోగం వుంటుంది. కావున ప్రసాదం తీసుకోవడం కోసమే శివ కేశవ భేదం లేకుండా సాలగ్రామం కూడా వుంచి అర్చన చేస్తారు. ప్రదక్షిణాలు, ప్రసాదముల విషయంలో ధ్వజ స్తంభం పాత్ర ఏమీలేదు.

### ◆ పుసంవన వ్రతం అనగా ఏమిటి?

"వ్యక్తే గర్భే ద్వితీయేవా తృతీయేమాసి పుంసవనం కార్యం" అని శాస్త్రం గర్భవతి అని తెలియగానే గర్భశుద్ధ్యర్థం పుసంవనం చేయాలి. ఇది వైదిక ప్రక్రియ. మరొకటి శ్రీమద్భాగవతం షష్టమ స్కంధంలో ఉన్నది. ఇది 19వ అధ్యాయము "శుక్లే

మార్గశిరేపక్షే యోషిద్భర్తుంజ్ఞయా ఆరభేత వ్రతమిదం సర్వకామికమాదితః" స్త్రీ తన యొక్క భర్త అనుజ్ఞను గైకొని మార్గశిరమాసంలో ప్రారంభం చేయవలసిన వ్రతం. లక్ష్మీనారాయణ ఆరాధన విశేషం. సంవత్సరంపాటు చేయవలసిన వ్రతము. ఈ వ్రతాచరణములో స్త్రీకి సకల శుభలక్షణములు కలుగును. కురూపి అయిన ఆడవారికి సౌభాగ్యములు కలుగును. అదృష్టహీన అయిన స్త్రీకి సకల సౌభాగ్యములు కలుగును. అందువలన పుంసవనవ్రతం పురాణోక్తమయిన ఈ వ్రతం చాలా విశేషము.

**◆ యంత్రాలు, రుద్రాక్షలు ధారణ వలన కోరికలు సిద్ధిస్తాయి అంటారు నిజమేనా?**

అదృష్టం కానీ, దురదృష్టం కానీ జాతకం ప్రకారమే నడుచును. చెప్పనావశ్యకం లేని ప్రశ్న యిది. అనుభవించినవారు వారి అనుభూతిని బట్టి రెండురకాల సమాధానాలు వస్తాయి. అయితే రుద్రాక్షలు వాటి ధారణ కోసం కొన్ని ఫలితాంశములు తెలియ జేశారు. వాటికి పురాణ ఆధారాలు వున్నాయి. వాటి ఫలితాలు పురాణాలలో చెప్పిన దానికంటే యితర ఫలితాంశములు కల్పనలే. యంత్రములు, మంత్రశాస్త్రం ప్రకారము నవ రత్నములు జ్యోతిషశాస్త్రం ప్రకారం వివరింపబడి ఫలితాలు చెప్పబడ్డాయి. వాటికి శాస్త్ర ఆధారం వున్నది కానీ ఫలితములు వాటి అనుభవం అనుభవించిన వారి నమ్మకం మీద ఆధారం.

**◆ దసరాలలో మూలా నక్షత్రం, దేవీత్రిరాత్ర వ్రతం విశేషాలు ఏమిటి? ధర్మశాస్త్ర విశేషాలు ఏమిటి?**

ధర్మశాస్త్రం, పురాణాంశం రెండు కలిపి వుంటాయి. ఎప్పుడూ కూడా వనరుల సౌలభ్యం మేరకు పెద్దలు ఆచారాలను యిలాంటి విషయాలలో తంత్ర గ్రంథాలను ఆధారం చేసుకొని మరికొన్ని విశేషములు తెలుపుతారు. అందులోనివే ఈ మూలా నక్షత్రం, దేవీత్రిరాత్ర వ్రతం. వీటి ఆచరణ మరియు నిర్ణయం విషయంలో ధర్మశాస్త్రం పూర్తిగా పురాణముల మీద ఆధారపడి నిర్ణయములు తెలిపింది. అందులో భాగంగా వ్రతాచరణ విషయంలో తంత్ర గ్రంథములు పరిధిలోనికి తీసుకోబడినాయి. ఆశ్వ యుజ శుక్ల పాడ్యమితో తొమ్మిది రోజులపాటు అనగా నవమి వరకు 'శరన్నవ రాత్రులు' అనే పేరుతో అర్చింపబడుటకు శ్రీమాతానుగ్రహం కోసం కలశస్థాపన పాడ్యమినాడు చేస్తారు. దేవాలయములలో వివిధ రూపాలతో శ్రీమాతార్చన జరుగును. మూలా నక్షత్రం రోజు సరస్వతీ రూపంగా అర్చన చేస్తారు. పాడ్యమికి మూలానక్షత్ర మునకు మధ్య కేవలం పంచమినాడు "ఉపాంగలలితా వ్రతం" అనే వ్రతం మాత్రమే ఉన్నది. దేవాలయాలలో వారి వారి ఆచారం ప్రకారం వివిధ దేవతా రూపములు వేయు చున్ననూ తదియనాడు గౌరీ, పంచమినాడు లలితరూపం విశేషంగా చేయవచ్చు. మూలా నక్షత్రం ప్రథమ పాదంలో సరస్వతీ పూజ. ధర్మ సింధు నిర్ణయ సింధులలో మూలస్య ప్రథమపాదే సూర్యాస్తమయాత్ప్రాక్ త్రిముహూర్తవ్యాపినీ సరస్వత్యావాహనం అని

చెప్పబడిన కారణంగా సూర్య అస్తమయమునకు పూర్వం 144 నిమిషములు మూలా నక్షత్ర వ్యాప్తి వుంటే సూర్యోదయానికి మూల లేకున్ననూ ఆ రోజే సరస్వతీ ఆ వాహనం. భవిష్యోత్తర పురాణంలో "భవే న్మూలాద్యపాదో వైక్షణాదాయాం కురూత్తమ. తదా సరస్వతీ పూజా ప్రభాతేస్యాత్ పరేహని – నాధ్యాపయేన్న చలిఖే న్నాధీయాతక దాచన–పుస్తకే స్థాపితే దేవ విద్యాకామో ద్విజోత్తమః" అని వున్నది. మూలానక్షత్రం రోజూ పుస్తకములను సరస్వతీ రూపంగా ఆవాహన చేసి అర్చన చేయమని ఆ సమయంలో అధ్యయన ఆధ్యాపన లేఖనములు పనికిరావని పురాణ వచనం నవరాత్రులు చేయు శక్తిలేని వారి విషయముగా అనుకోవచ్చు త్రిరాత్రవ్రతం కల్పం చెప్పబడినది. మూలా నక్షత్రం రోజు అక్షరాభ్యాసం చేయరాదు.

సప్తమీ రోజూ ప్రారంభించి నవమి వరకు యధావిధి కల్పోక్తం, గురు సంప్రదాయం అనుసరణీయం. దశమినాడు అపరాజితాదేవి పూజ, శమీ పూజ, విద్యారంభం వ్యాపారంభం, మొదలగునవి., విశేషం నవమి, అష్టమి రోజులలో ప్రాంతీయ ఆచారం ప్రకారం యంత్రపూజ చేయు అలవాటువున్నది. ఇండస్ట్రీస్, వాహనములు వున్న వారు గమనించాలి "శ్రవణర్క్షాతు పూర్ణాయాంకాకుతేస్థః ప్రస్థితోయతః – ఉల్లంఘయే యుస్సీమానం తద్దినర్షే తతోనరాః" అని కశ్యపవచనం శ్రవణా నక్షత్రం పూర్తిగా వున్న విజయదశమి రోజు రాములవారు ప్రయాణం చేశారు.

కావున అటువంటిరోజు సీమదాటి విదేశములకు ప్రయాణం చేయరాదని కవ్యపుల వారు చెప్పిరి. విజయదశమీ రోజున రాజులకు పట్టాభిషేకం విశేషం" శ్రవణేనాసి సంయుక్తాయాం రాజ్ఞాం పట్టాభిషేచన" ఏదేని సంస్థ యజమానిగా కూర్చుండబోవు వారు కూడా ఈ రోజున పదవీ బాధ్యతలు స్వీకరించుట మంచిది శ్రేయస్కారము.

**◆ గణపతికి వివాహం వున్నదా లేదా? టి.వి. లోను బయటా ఏమిటి ఈ చర్చ? మన సంప్రదాయం అపహాస్యం అవుతోంది ఆధారం ఏమైనా వున్నదా?**

అయ్యా శివపురరాణంలో గణపతికి వివాహం జరిగినట్లు స్పష్టంగా వున్నది. ఇంత కంటే ఆధారం ఏమి కావాలి. మీకు సులువుగా తెలియాలి అంటే గీతా ప్రెస్, గోరఖ్‌పూర్ వారి శివపురాణం 324 నుండి 327 పేజీలలో ఈ అంశం ఉన్నది. ఇంక టి.వి.లలో చెప్పేవారి ఉద్దేశ్యం నేను చెప్పే సమర్థుణ్ణి కాదు. నాకు పురాణవాక్యమే ఆధారము. గణపతి వివాహం అయినది రుద్ర సంహిత కుమాన ఖండములోనిది ఈ అంశము.

**◆ గోదావరి పుష్కరాలు పురస్కరించుకొని 2015 ముహూర్తాలు ఉండవు. అంటున్నారు నిజమేనా?**

గోదావరీ తీరవాసులు ఆ నదీతీరంలో మాత్రం వివాహాదులు చేసుకోక పోవడం శాస్త్రమే. అయితే మిగిలిన ప్రాంతాలవారు వివాహాదులు చేసుకుంటారు. మీరు

2003, 1991 అంతః పూర్వం పంచాంగములలో సుముహూర్తములు వ్రాసిన అంశం గమనించండి. 'మఘాది పంచ పాదేషు గురుస్సర్వత్ర నిందితః' అనే జ్యోతి శాస్త్ర వాదన ప్రకారం అక్టోబరు 1 కు గురువు మఘ 2వ పాదం ప్రవేశం అవుతున్నారు. అప్పటి వరకు ఆషాఢ శ్రావణ మూఢమి భాద్రపదాలలో ముహూర్తాలు లేవు. అందువలన చర్చనీయాంశమయిన విషయం ఏమీ లేదు. సర్వత్రా శుభకార్యములు జరుగుతాయి. గతంలో పుష్కరాలు కూడా యిలాంటి వాదనలే వచ్చాయి. ఎక్కడా సుముహూర్తాలు ఆగలేదు. దీనికి మీకు గట్టి ఆధారం ంచాంగములే. మీరు ధైర్యంగా వచ్చే సంవత్సరం వ్యాపార పెట్టుబడులు పెట్టుకోవచ్చు. వివాహాదులు సంవత్సరం అంతా గోదావరీ తీరం మినహాయించి అంతటా జరుగుతాయి.

**◆ షిర్డిసాయిబాబా దేవుడు కాదా? ఈ మధ్య స్వామీజీ చేసిన వ్యాఖ్య సబబేనా? అసలు విషయం ఏమిటి?**

యిది ఈ కాలంలో చర్చించరాని అంశం. సంఘ విద్రోహులు ఎందరో పెరిగిన ఈ రోజులలో షిర్డిసాయి ప్రభావంగా చాలా మంచి జీవనశైలి అనుసరించే వారు పెరిగారు. సంఘం ఈ రోజు సత్ప్రవర్తనగల ప్రజలు కావాలి అని కోరుకుంటోంది. అంతేకాక షిర్డిసాయిని అనుసరించడం ప్రారంభం అయిన తరువాత మతమార్పిడి అనే దౌర్భాగ్యం సంఘంలో తగ్గిందా? లేదా? ఆయన చెడుమాటలు ఏమీ చెప్పలేదు కదా! ఏ మతం అయినా 'సత్యంవద దర్మంచర' అని మాత్రమే చెప్పాలి. అవే షిర్డిసాయి చెప్పారు. కేవలం "నేను షిర్డిసాయి భక్తుడను" అని చెప్పడం కంటే ఆయన చెప్పిన సూక్తులు ఆచరించడం చాలా అవసరం ఆయన సూక్తులు పాటించని ఆయన భక్తులు దౌర్భాగ్యులే. యిక వేదం "ఆచార్య దేవోభవ" అని చెప్పినది షిర్డిసాయిని ఆచార్యుడిగా భావించే వారందరికీ ఆయన దేవుడే. వారు పూజలే చేసుకోవచ్చు లేదా దేవాలయములే కట్టుకోవచ్చు. వారి యిష్టం. ఎందరో సంఘంలోని ప్రజలను మంచి మార్గంవైపు నడపడానికి మంచి జీవనశైలి ప్రచారం చేస్తున్నారు. వారిని గురువుగా భావించేవారికి వారు ప్రత్యక్ష దేవుళ్లే. అందువలన రాబోవు కాలంలో వీరందరికీ ఆలయాలు కట్టినా తప్పులేదు. అయితే వారి బోధనలు ఆచరించేవాడే సరైన భక్తుడు. వారిని అనుసరించని వాడు మరల సంఘ ద్రోహి మాత్రమే. అయితే నేటి సమాజంలో యిందరినీ దేవుళ్ళుగా భావించే ముందు మనం భారతదేశంలో పుట్టాం మనకు వేదము, పురాణము, ఇతిహాసము ఏమి చెబుతున్నాయి. అని పరిశోధన చేయనివారు భారతీయ సంస్కృతికి ద్రోహం చేసినవారా? కాదా? అనేది కూడా ఆలోచించండి. భారతీయ సంస్కృతి గురించి పురాణ వాఙ్మయం గురించి తెలుసుకొనే ప్రయత్నం మానివేసి ద్రోహంచేసిన తీరు, షిర్డిసాయి సూక్తులు ఆచరించడంలో

కూడా ప్రవర్తిస్తే మరల వేరే తప్పు చేసినట్లు అవుతుంది. మాతృద్రోహం లాగానే వ్యవస్థా ద్రోహం చాలా దుర్మార్గం, శిక్షార్హం. వ్యవస్థా ధర్మాలు పాడు చేసినవారు సంఘంలో చీడ పురుగులు. అది వారి విజ్ఞతకే వదిలివేయాలి. ఒక గురువును ఆశ్రయించడం కంటే అనుసరించడం చాలా గొప్ప. వివేకానందుడు చికాగో ఉపన్యాసంతో ప్రారంభించి ప్రతి ఉపన్యాసంతో భారతీయ సంస్కృతికి దర్పణాలు అయిన పురాణాలు భగవద్గీత వాడుకొని మన సంస్కృతిని ప్రచారం చేసి ఆయన గొప్పవాడయినాడా? లేదా? తెలుసుకోండి. మనం పురాణ ధర్మాలు దాటి ఏ మతం ఏ దేవుడు కూడా కొత్తవి చెప్పరు. ఏ మతం అయినా "సత్యంవద ధర్మంచర" అని చెప్పాల్సిందే. దానికి వేదమంటే ఆధారం, ప్రారంభం, ఆచరణకు యోగ్యము. కలిపై చేయి సాధిస్తోంది.

◆ **దేవతా విగ్రహాలు, ఒక్కోచోట ఒక్కతీరుగా వున్నాయి. అది తప్పా, ఒప్పా? మనం విగ్రహాలకు దేవాలయంలో అర్చించే విధానం వున్నదా? (సంఘసంస్కర్తలకు సమాధానం)**

మనకు స్కూల్‌లో 2+2=4 అని చూపడానికి అక్కడ చాక్లెట్‌లో లేదా పళ్ళు, లేదా ఏదేని తినుబండారమునో వుంచి కూడికా విధానం నేర్పుతారు. యిక ప్రతిసారీ కూడికలు చేసినప్పుడు చాక్లెట్‌లే కావాలి అంటే కుదరదు కదా? అది ప్రాధమికాంశం. అలాగే గాంధీగారి మీద భక్తి, గౌరవం పెరగడానికి ఆయన చరిత్ర పాఠంగా చెబుతారు. అప్పుడు పిల్లవాడికి ఒక గాంధీ విగ్రహము లేక చిత్రపటము చూపిస్తాం. అలాగ చేయకపోతే గాంధీ అనేవారు ఎవరో? అనే సందేహ నివృత్తి అవ్వదు. వాడి దృష్టిలో పిలక, చేతిలో వున్న కర్రను ఆధారంగా గాంధీ మనసులో పడతారు. ప్రతి వారికీ గాంధీ చిత్రపటం చూపిస్తేనే గాంధీ భవిష్యత్తులో గుర్తుకు వస్తారు. అందువలన గాంధీ గురించి వేరేగా వర్ణించనవసరం లుదే. చిత్ర పటం లేదా విగ్రహం చాలా అవసరం. గాంధీజయంతి నాడు గాంధీని భక్తిగా అర్చిద్దాం అనుకుంటే విగ్రహమునకు పూజలు చేస్తున్నారా? లేదా? విగ్రహారాధన ఖండించిన సంఘ సంస్కర్తలు వెర్రివారా? కాదా? మీరే చెప్పండి. విగ్రహారాధన లేకపోతే లక్ష్యం కుదరదు. అందుకే భక్తి మార్గంలో ప్రారంభంలో "చిన్మయస్య అద్వితీయస్య నిష్కలస్య అశరీరిణః ఉపాసకానాం కార్యాణాం బ్రహ్మణో రూపకల్పనా" విగ్రహాలు నిర్మాణం, చిత్రలేఖ రచనా విషయం వాటి అర్చనా విషయాలు అయనా సరే ఆగమ శాస్త్రమునకు మత్స్యపురాణం అగ్ని పురాణం వంటివి ఆధారం చిన్మయము, అద్దితీయము అశరీరము అయిన పరమాత్మ స్వరూపము విగ్రహం రూపంలో అందించినది సాక్షాత్ బ్రహ్మగారే సృష్టికర్త., ఆయన పిచ్చివాడు కాదు. ఆయన ఎందుకు అలా విగ్రహం అందించారు అంటే ఉపాసకుల లక్ష్యసిద్ధి కార్యసిద్ధి కోసం ఆంజనేయ స్వామి ఆయన రూపం యిలా ఉంటుంది. అంటే ప్రారంభంలో మనకు ఉపాసనకు లక్ష్యం సిద్ధించదు. అందుకే విగ్రహం

వుంచి దానితో ధారణ చేసి లక్ష్యం వుంచుతాం. తర్వాత యంత్రం మీద దృష్టి వుంచి మెడిటేషన్ చేయడం ఆ తరువాత శరీరంలో షట్చక్రాలమీద ధ్యాసవుంచి పరమాత్మ లక్ష్యంతో దేనితోను బంధం లేకుండా జ్ఞానసిద్ధి పొందడం చివరి సాధన సాధనాక్రమంలో భాగంగా భక్తి జ్ఞాన వైరాగ్య భావనలు ఏర్పరచి, విగ్రహారాధన, యంత్రారాధన, జ్ఞాన సముపార్జన అనేవి లక్ష్య సిద్ధికోసం ఏర్పాటు చేసి, చివరకు కుండలినీ శక్తితో పరమాత్మను సాధించడం కోసం మన వారు ఎన్నో మార్గాలు ఏర్పాటు చేసారు. అందులో ప్రారంభ మార్గం విగ్రహారాధన.

◆ **బ్రహ్మ ముహూర్తం అంటే ఏమిటి? ఆ సమయంలో చేయు గణపతి హోమము, సుదర్శన హోమం వంటివి విశేష ఫలితాలు యిస్తాయి అంటారు? నమ్మవచ్చా?**

సూర్యోదయానికి రెండు గంటల ముందు ఉండే కాలమునకు బ్రహ్మ ముహూర్తం అని పేరు. చాలా గొప్ప కాలం యిది. కనీసం రోజూ నిద్ర లేవడం ఈ సమయంలో చేసినా మంచి జీవశక్తి ప్రతి మనిషికీ లభిస్తుంది అని పెద్దలు చెబుతారు. మన సంస్కృతి ప్రకారం ప్రతి మానవుడి దినచర్య బ్రహ్మ ముహూర్తంలోనే ప్రారంభం అవ్వాలి. అంతే కాదు సూర్యోదయం సమయానికి నిద్ర చాలా తప్పు అని చెప్పారు. సూర్యోదయ సూర్యాస్తమయాలలో నిద్ర రాక్షస కృత్యం. యిక మీరు అడిగిన హోమం విషయం దేవాలయాలలో అయితే నేను చెప్పలేను. మీ స్వగృహం విషయం అయితే 100శాతం పనికిరాదు. కారణం హోమం చేయించడానికి వచ్చిన బ్రాహ్మణుడు తన నిత్యకర్మానుష్ఠానం అనే సంధ్యావందనంలో సూర్యోదయం వరకు గాయత్రీ అనుష్ఠానం చేసి అనంతరం సూర్యోదయ కాలంలో సూర్యోపస్థానం చేయమని శాస్త్రవాక్యం, సంధ్యోపాసన గాయత్రీ కాక మరి ఏ యితర అనుష్ఠానం చేయరాదని చెప్పబడినది. ఆయనకే ఇతర అనుష్ఠానము పనికిరాదని శాస్త్రం అయితే ఆ బ్రహ్మ ముహూర్త కాలంలో మీకు ఎలా హోమం చేయిస్తారు. యిక ఉపనయన అర్హతలేని వారు వారే స్వయంగా తోచిన విధంగా చేసుకుంటాం అంటే దానికి సమాధానం లేదు. వైదీక సాంప్రదాయం ప్రధానంగా చేసి పరిశీలిస్తే మీరు అడిగిన కార్యక్రమాలు బ్రహ్మగారు లేకుండా చేయరాదు కావున చేయడం తప్పు. ఉపనయన వివాహం వంటి వైదిక క్రియలకు పై సమాధానంతో పోలిక లేదు.

◆ **టి.వి.లలో జ్యోతిశాస్త్రం మీద ఇతర ఆచారాల మీద జరిగే చర్చ ఎంతవరకు సమంజసం. అవి అవసరమా?**

చర్చలు చేయడం కంటే జ్యోతిషం సబ్జెక్ట్‌ను సీరియల్స్‌గా పెట్టి కనీస విజ్ఞానం పెంచడం అవసరం. చర్చలో కూర్చునే వారు నిజంగా మనకు ఈ శాస్త్రం ఎంతవరకు తెలుసు అని ఆత్మ విమర్శ చేసుకొని రావడం చాలా అవసరం. మీరు చాలాకాలంగా

టి.విలలో చూసే వుంటారు. ఏ చర్చలో అయినా ఫలితం పూర్తిగా తేలినది వున్నదా? లేదు కదా? ఆ శాస్త్రం సముద్రం. ఆ జ్యోతిష్యం చదివినవారు నిత్య విద్యార్థి. శాస్త్రం ఎప్పుడూ గొప్పదే శాస్త్రి యిచ్చే ఫలితాలలో వున్న పొరపాట్లను ఆధారంగా చేసికొని శాస్త్రం తప్పు అని చెబుతున్నారు అదీ పెద్ద తప్పు.

గంటకాలం పాటు టి.వి.లలో చర్చించి గత పది సంవత్సరాలలో ఏ అంశాన్ని పూర్తిగా ఫైనల్ చేయకుండా సిద్ధాంతులు, శాస్త్రి గార్లు వెళ్ళిపోతున్నారు కదా! అటువంటి టి.వి. చర్చలు చూడడం మన తప్పు. వాటిని అడ్డుకోకపోవడం కూడా మన తప్పే. ఇంతేకాదు హిందూమత సంబంధ వ్యవహారములు మీద ఒకటే చర్చ టి.వి.లలో రావడం మీద కడా దృష్టి పెట్టండి అప్పుడు ఈ టి.వి.లలో చర్చ మీద అవసరం లేదా అనవసరం అనే విషయం మీకు చాలా ప్రస్ఫుటంగా తెలుస్తుంది. అన్ని మతాల వారికి పూజలు, యంత్రాలు, తావీదులు (తాయత్తులు) వున్నాయి. రక్షలు కట్టడం ఉన్నది. కానీ హిందువుల మంత్రం, యంత్రమే టి.వి.లలో చర్చకు వస్తుండడం ఎంతవరకు అవసరమో గమనించుకోండి.

### ◆ శ్రీకృష్ణుని బాల్య చేష్టల మీద నందమహరాజుకు భయము ఉండేదా?

ఉండేది కాదు. కారణం నామకరణ సమయంలో గర్గ మహర్షి శ్రీకృష్ణుని యొక్క అవతార విశేషం, ఆయన భూమి మీదకు ఎందుకు రావలసి వచ్చింది., రాబోవు పరిణామాలు గురించి వివరంగా ముందుగానే చెప్పిన కారణంగా ఆయనకు ఎటువంటి భయము లేకుండానే ప్రవర్తించాడు. కానీ గోవర్ధనోద్ధరణ తరువాత పూర్తిగా సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమే శ్రీకృష్ణ పరమాత్మ అని గట్టిగా నమ్మాడు.

### ◆ ఈ మధ్య 'వీధిశూల' అనే అంశం ఎక్కువగా వింటున్నాం. నేడు మనం వింటున్న అంశాలు అన్నీ మహర్షులు చెప్పినవేనా?

శాస్త్ర విషయం కొంత, యితర విషయములు యింకా ఎక్కువ కలిపి మనం వింటున్నాం. మహర్షులు చెప్పినది వీధిశూల అతి తక్కువ. దానిని ఊహలు కల్పనలు, అనుభవాలతో యింకా కొంచెం పెంచారు. కోణవేధ, కూపవేధ వృక్షవేధ, యంత్రవేధ, రథ్యావేధ, పంకవేధ యిలాగ సింహ ద్వారమునకు వేధలు తెలిపారు. మహర్షులు. అందుభాగంగా సింహద్వారమునకు ఎదురుగా రహదారి వుండరాదని తెలిపారు. యింటికి రెండు ద్వారములు ప్రయాణం అవతలవున్న వేధలు పరిగణనలోకి తీసుకోనవసరం లేదని గర్గమహర్షి వచనము. "ద్వారోచ్ఛ్రాయ ద్విగుణితాం త్యక్త్వా భూమిం బహిస్థితి: నదోషాయ భవేద్వేధో గృహస్య గృహిణోధవా" ముహూర్త గణపతిలో మాత్రం 'గేహోచ్ఛేద్విగుణాధిక్యా ప్రాన్తరే సంస్తితేసతి", నైకకోణేషువేధస్యాద్భిత్తి మార్గోత్తరేపిచ" అని వున్నది. అందువలన మన యింటికి ఎదురుగా వచ్చే దారికి

అడ్డంగా మరొకదారి వచ్చినది కనుక్కొండి. వీధిశూల అనే విషయం లేదు. యిక గృహమునకు ఏ విధంగా వీధిశూల పనికిరాదో చూద్దాం. మన నివాస స్థలమునకు సమాంతరంగా రహదారి వుంటే ఎదురుగా వచ్చే రహదారి వలన వీధిశూల వుండదు. ఒకవేళ వెనకనుండి వీధివుంటే ఆ వీధి శూల అధికంగా యిబ్బంది పెడుతుంది. వరాహమిహిరుడు "మార్గతరుకోణకూపస్తంభ భ్రమవిద్ధమ శుభదం ద్వారం ఉచ్ఛ్రాయాద్విగుణ మితాం త్యక్త్వాభూమిం నదోషాయ" అని చెప్పారు. రెండు ద్వారములు ప్రయాణము సుమారు 14 అడుగుల అవతల వున్న వీధి వలన వీధి శూలలేదని స్పష్టార్థము. కానీ నేటి సమాజంలో ఈ అంశమే పరిగణనలో లేదు గర్గుడు, వరాహుడు వంటివారు చెప్పిన శాస్త్రమునకు విలువ లేదు ఎవరికి తోచిన మాటలు వారు అమలు జరిపి శాస్త్రమును అపహాస్యం చేయుచున్నారు. నేటి సమాజంలో వినబడే వీధిశూల మీద వ్యాఖ్యలు అన్నీ చాలా వరకు కల్పనలే.

### ◆ నవ్యాంధ్రప్రదేశ్ భవితవ్యం జ్యోతిశ్శాస్త్ర రీత్యా ఎలాగ ఉన్నది?

ఈ ప్రశ్న చాలామంది ఉత్తరాలు, ఫోన్‌ల ద్వారా అడిగారు. అందరూ ఆంధ్ర ప్రదేశంలో అభివృద్ధి మీద వివిధ రకములైన ఊహలతో ఉన్నారు. జగన్మాత అనుగ్రహం ఆంధ్రప్రదేశమునకు మరియు నవ్యాంధ్ర నిర్మాత చంద్రబాబు గారికి 100 శాతం ఉన్నది. చంద్రబాబుగారు జూన్ (8) రాత్రి ధనుర్లగ్న వృషభాంశలో సంతకం పెట్టిన నాటి నుండి సమైక్యాంధ్రలో నుండి నవ్యాంధ్ర యొక్క పాలన విడిగా ప్రారంభం అయినట్లు ఈ ముహూర్తమునకు లగ్నమునకు గురువీక్షణ లాభంలో శనిరాహువులు మరియు పంచమంలో శుక్రుడు మంచి ముహూర్తమే. ఇంకా చెప్పాలి అంటే రవి కూడా యోగకారకుడు. మరి అదేరోజు సింహలగ్నం అయితే యింకా బాగుండేది. అయిపోయినదానికి బాధ పడడం కంటే జరిగిన దానిలో మంచి వెదకడం మంచిది. ధనుర్లగ్నమునకు గ్రహసముదాయం బాగుంది కదా! కావున ఆంధ్ర యొక్క భవితవ్యం బాగుంటుంది. అయితే కుజుడు చంద్రనక్షత్రం లోను, చంద్రుడు కుజనక్షత్రంలోను ఉన్నారు. ఈ కారణంగాను, కుజవీక్షణ శుక్రుడిమీద వున్న కారణంగాను వ్యవసాయ రంగంలోను ధరవరల అదుపు విషయం లోను అవకాశం అనుకూలం 50శాతం మాత్రమే. చంద్రకుజుల కలయిక వలన అధికారప్రతినిధికి మనశ్శాంతి కరువు అవుతుంది. చంద్రబాబుగారు ఎక్కువ శ్రమను పొందుతారు. అంతేకాక కుజుడు ప్రమాదాలకు కారకుడు అందువలన కుజగ్రహ ప్రభావం చేత ఋణముల ప్రమాదములు అంతర్గతంగా దుర్మార్గుల వలన చికాకులు పెరుగుతాయి. చంద్రుడు మనఃకారకుడు. కుజుడితో కలసిన కారణంగాను, శుక్రుడు మీద వున్న కారణంగాను, మరియు నరేంద్రమోడీగారు కూడా భరణీ నక్షత్రంలో

తులా లగ్నంలో కుజ సంచారం దోషంగా ఉన్న సమయంలో సంకతం చేసిన కారణంగాను పరిశీలన చేసి చూస్తే కేంద్ర ప్రభుత్వంలో క్రమేణా నిధులు తెచ్చే విషయంలో మనస్పర్థలు కలహములు రాకుండా ఓర్పుగా ఉండవలసిన అవసరం ఆంధ్ర నిర్మాతకు ఎక్కువ అవసరం అవుతుంది. 2016 అధికం., అంతేకాదు. గురు, బుధ, శని, రాహు, రవి అనుకూలం దృష్ట్యా విద్య, ఉద్యోగ, అభివృద్ధి పథకాలు వ్యాపారం, వాణిజ్యం, చాలా బాగా అభివృద్ధిలో ఉంటాయి. కుజుడు ప్రభావం పాలనా రంగంలో మనస్పర్థలకు అవకాశం ఉంటుంది. ఇక నరేంద్రమోడీ గారి సక్సెస్ రేట్‌కంటే చంద్రబాబు గారి సక్సెస్ రేటు ఎక్కువ అని ముహూర్తాల ఆధారంగా చెప్పవచ్చు. అందరం రోజూ జగన్మాతను ఆంధ్రదేశం అభివృద్ధిలోకి రావాలి అని మరియు కలహరహిత అభివృద్ధి సహిత నవ్యాంధ్ర నిర్మాణం జరగాలని ప్రార్థిద్దాం. మనం జగన్మాత అనుగ్రహం, ముహూర్త బలం దృష్ట్యా నవ్యాంధ్ర అభివృద్ధిలోకి వస్తుంది అని ఆశిద్దాం. అందరం మనవంతు కర్త్యంగా ప్రభుత్వ యంత్రాంగానికి సహకరిద్దాం. మన భావితరాల వారికి చక్కగా పరిపాలనా రంగంతో తోడుగా నడిచే లక్షణాలు నేర్పుదాం. కుజ నక్షత్రంలో నవ్యాంధ్ర ప్రారంభం దృష్ట్యా రాబోయే అయిదు సంవత్సరాలు పునాదులకు సరిపోతుంది. పునాదులు కనబడవు భవనానికి ఆధారం అవుతాయి. అదేరీతిగా రాబోవు 2019 వరకు ఆంధ్రకు పునాది నిర్మాణం అవుతుంది. జరగబోవు అభివృద్ధి విజ్ఞానంతో శోధిస్తే మనం చాలా మంచి పొందాము అని రాబోవు కాలంలో చంద్రబాబును అభినందించి మనం సుఖించే అవకాశం ఉంటుంది. నవ్యాంధ్రకు అభివృద్ధి 100శాతం ఉన్నది. అయితే రాబోవు అయిదు సంవత్సరాలలో కొంతకాలం గురురాహు కలయిక, కుజస్తంభన రెండు సార్లు వంటి గ్రహచారం వున్ననూ మొత్తం మీద అభివృద్ధి దిశాప్రయాణం సాగుతుంది. సహనావవతు సహనౌభువక్తు, సహవీర్యం కరవావహై, తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై ఓం శాంతిః శాంతిః శాంతిః

### ◆ కలిలో మోక్షము పొందుటకు సులువయిన మార్గం ఏది?

**కలౌకలుష చిత్తానాం న్నూణాం నాన్యాత్పరాయణం**

**నామ సంకీర్తనం ముక్త్వా ధర్మానుష్ఠాన వర్జితే"** బ్రహ్మపురాణ వాక్యం. కలి యుగంలోఏ కారణముల చేతనయిననూ ధర్మకృత్యములు ఆచరించుటకు అవకాశములు తగ్గిపోవును. అవకాశం వున్నంతవరకు శక్త్యానుసారంగా ప్రయత్నించి ఆచరించడం గొప్ప విషయం. ప్రాథమికంగా అన్ని వర్ణములవారికి అన్ని ఆశ్రమముల వారికి ధర్మనియమములు తెలిపారు. అవి తెలిసి ఆచరించశక్యము కానివారు యింకా బాధపడే అవకాశం ఎక్కువ వున్నది. అందువలన రామ, కృష్ణ యిత్యాది భగవన్నామ

స్మరణ ఒకటే సులువయిన మార్గం. అది మోక్షమునకు దారియిస్తుంది. యిది కూడా పురాణ వచనమే. యిలా చెప్పారు కదా! అని అవకాశం వుండి కూడా నిత్యకర్మానుష్ఠానం. వేద శాస్త్ర పోషణ రక్షణ చేయకపోతే అది దోషం అవుతుంది. అందరూ కృష్ణా రామ అనుకుంటూ వేదశాస్త్ర పురాణములు వర్జించితే సంఘం కలుషితం అవుతుంది. శక్తివున్నా లేకున్నా కృష్ణ, రామ స్మరణ చేయుట మోక్షప్రదము.

◆ **శ్రీకృష్ణునికి భార్యా పిల్లలు వున్నట్లుగా పురాణాలు చెబుతున్నాయి కదా! మరి ఆయనను ఆజన్మ బ్రహ్మచారిగా చెబుతారు కారణం ఏమిటి?**

బ్రహ్మచారి అంటే "బ్రహ్మ వేదాధ్యయన చరంతీతి బ్రహ్మచారీణః" – బ్రహ్మ వేదః తద ధ్యయనార్థం వ్రత మపి బ్రహ్మ తచ్చరతీతి బ్రహ్మచారీ. బ్రహ్మ అనగా వేదము తదధ్యయనార్థమయిన వ్రతము బ్రహ్మము అనీ దానిని ఆచరించువాడు బ్రహ్మచారి అని చెబుతారు. బ్రహ్మచారి అనే దానిలో నాలుగు రకములు – గాయత్రీ బ్రహ్మచారీ, ప్రాజాపత్య బ్రహ్మచారీ, వైదిక బ్రహ్మచారి, నైష్ఠిక బ్రహ్మచారి అని నాలుగు రకములు. సరే పై వ్యాఖ్యానం ప్రకారం బ్రహ్మ యందే నిత్య దృష్టి కలిగివున్నవాడు బ్రహ్మచారీ అనబడతాడు. శ్రీకృష్ణుడు అటువంటి వాడే కదా. సదా ఆయన బ్రహ్మ యందే నిమగ్నమయివున్నారు. "కృష్ణస్తు భగవాన్‌స్వయమ్" అని తనకు తానే ప్రకటించిన గొప్ప అవతారం శ్రీకృష్ణుడు. ఆయన అవతారంలో రెండు సార్లు విశ్వరూప సందర్శనం యిచ్చారు. అలాగే యితర దేవతలతో కూడా అవతారకాలం అంతా సాక్షాత్ శ్రీమన్నారాయణుడుగానే వున్నారు. శ్రీమన్నారాయణుడు ఎప్పుడు బ్రహ్మచింతనలోనే వుంటారు కదా! మరి కృష్ణావతారంలో ఆయనకు వున్న పిల్లల విషయం ఏమిటి? ఎనిమిది మంది భార్యలు 16,000 మంది గోపికలు, మరియు వారి దగ్గర శ్రీకృష్ణునికి సంతానం వున్నమాట నిజమే? జాంబవతి ప్రేరణతో శ్రీకృష్ణుడు పరమశివుని గూర్చి తపస్సు చేసి శివుని అనుగ్రహంతో సంతానం పొందినట్లుగా పురాణాలు చెబుతున్నాయి. అయితే వారి యొక్క సంసారిక జీవనం మానవుల మాదిరి దేహసంబంధం వుండదు. పుట్టినవారు అందరూ యోగశక్తితో వచ్చినవారే. సాక్షాత్ భగవానుడు అయిన శ్రీకృష్ణునికి మానవ విధానంగా కాక యోగ శక్తితోనే సంతానం వున్నట్లు ఆధారాలు వున్నాయి. అందువలన భగవంతుడి విషయంలో అటువంటి ఆలోచన చేయనవసరం లేదు. రామావతారంలో శ్రీమన్నారాయణుడు తానే "నరుడు" తానే నారాయణుడు. నరుడుగా వున్న నారాయణుడు గావున శ్రీరాముని విషయంగా ఈ విధమయిన చర్చ రాదు. కానీ శ్రీకృష్ణావతారంలో నరుడు అర్జునుడు, నారాయణుడు శ్రీకృష్ణుడు కావున మాములు మనుషులు మాదిరి కాక యోగశక్తితోనే సంసార జీవనం చేశారు.

**◆ ఉపనయనమునకు ముహూర్తం కంటే వయస్సుకే ఎక్కువ ప్రాధాన్యం అంటారు? నిజమేనా?**

భారతీయ సంస్కృతిలో జ్యోతిష శాస్త్రమునకు ఒక విశిష్ఠస్థానం ఏర్పరిచి ప్రతి పనికీ ముహూర్తం చూడడం అలవాటు చేశారు. అలాగే ధర్మశాస్త్రమునకు ఇందులో పెద్ద పీట వేశారు. వీటిని అన్నింటి కంటే ప్రతి పనీ సమయపాలనతో చేయుటకు కాలనిర్ణయం చెప్పారు. కాల నిర్ణయం ప్రకారం ధర్మశాస్త్ర రీత్యా కార్యక్రమాలు చేయగలిగితే విశేషమే. అలా కాకపోతే, కాలనిర్ణయం ప్రకారము చేయు పనులకు ప్రాధాన్యం యిచ్చారు. "గర్భాష్ట మేష బ్రాహ్మణముపన యీత" అనే విషయం చెప్పి ఆ సూత్రం ప్రకారం గర్భాష్టమంలో ఉపనయనం చేయువారికి గ్రహబలం లేకపోయిననూ చేయవలసినదే అనే విషయం తెలియచేశారు. గర్భాష్టమమే ఉపనయనానికి ప్రధానం. ఒక వేళ గర్భాష్టమంలో ఆధిదేవతమయిన ప్రతిబంధకం వస్తే "ఆషోడశాత్ బ్రాహ్మణ్యస్య సావిత్రీ నాతి వర్తతే" అని సూత్రం చెప్పి 16వ సంవత్సరం వరకు మంచి కాలంగా పరిగణించారు. ఈ ప్రకారంగా చెప్పాలి అంటే పై సంవత్సరం గ్రహబలం లేకపోయినా గర్భాష్టమంలో ఉపనయనం చేయువారికి దోషం వుండదు. గర్భాష్టమం కాని వారికి పై సంవత్సరం పనికిరాదు.

**◆ నిరుపయోగ పండితులు అంటే ఎవరు?**

వేదం చదువుకొని విద్యార్థులకు పాఠం చెప్పక, సభాసదస్యములలో పాల్గొనక, స్మార్త ప్రక్రియలు చేయించక పోవడం వంటివి చేయు వేదపండితుడును, అనాచారంతో ఉన్న జ్యోతిష్యుడు, సభలో పాడలేని సంగీత విద్వాంసుడు వైద్యం చేయలేని వైద్య శాస్త్రజ్ఞుడు ఇత్యాదులు నిరుపయోగ పండితులు. అలాగే వేదం విషయంలో అధమ పాఠకులు వివరం తెలుపుతూ పాణినిశిక్షలో గీతీశీఘ్రీ శిరఃకంపీ తథాలిఖితపాఠకః అనర్థజ్ఞః అల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః అని చెప్పారు. ఏ శాస్త్రం, వేదం పండితుడ యినా ఇతరులకు తన చదువును పాఠం చెప్పకుండా ఉంటే వారికి దోషం వస్తుంది.

**◆ పాండవులకు ద్రౌపది కాక యితర భార్యలు వున్నారా? వారి పేర్లు ఏమిటి? ఉపపాండవుల పేర్లు ఏమిటి?**

ధర్మరాజు భార్య దేవిక – భీముడి భార్యలు జలంధర, హిడింబ – అర్జునుని భార్యలు సుభద్ర ఉలూచి, చిత్రాంగి – నకులుని భార్య కరేణుమతి – సహదేవుని భార్య విజయ. ద్రౌపది ద్వారా – ధర్మరాజ పుత్రుడు ప్రతిసింద్యుడు/ భీమునికి శ్రుత సోముడు / అర్జునునికి శ్రుతకీర్తి/నకులునికి శతానీకుడు/సహదేవునికి శ్రుత సేనుడు కలిగారు. వీరు ఉపపాండవులు. ధర్మరాజునకు దేవకీ వలన యౌధేయుడు/ భీమునికి జలంధర వలన సర్వగుడు– హిడింబి వలన ఘటోత్కచుడు/అర్జునునికి

సుభద్రవలన అభిమన్యుడు, ఉలూచి వలన ఇరావంతుడు చిత్రాంగి వలన బభ్రు వాహనుడు/సహదేవునికి విజయ వలన సుహోత్రుడు/నకులునికి కరేణుమతి వలన నిరమిత్రుడు కలిగారు.

◆ **భోజనం ఏయే దిక్కులలో కూర్చుని చేయవలెను?**

తూర్పుముఖంగా కూర్చొని భుజిస్తే ఆయుష్యు పెరుగుతుంది.

దక్షిణ ముఖంగా కూర్చొని భుజిస్తే యశస్సు పెరుగుతుంది.

పశ్చిమ ముఖంగా కూర్చొని భుజిస్తే శ్రేయస్సు పెరుగుతుంది.

ఉత్తర ముఖంగా కూర్చొని భుజింపవద్దని శాస్త్రం. పంక్తి భోజనాలలో ఈ నియమం లేదు. దిశా భేదం లేదు. తల్లి క్షేమం దృష్ట్యా దక్షిణముఖంగా కూర్చుని భుజించవద్దని పాఠాంతరము వున్నది.

◆ **నిదురించేటప్పుడు ఏ దిక్కులో శిరస్సు పెట్టుకోవాలి?**

తూర్పు లేదా దక్షిణం వైపు శిరస్సు ఉంచి నిదురించాలి. వేరే వారి ఇండ్లకు వెళ్ళినపుడు పడమర వైపు తలవుంచి నిదురించాలి. ఉత్తరం వైపు శిరస్సు వుంచి ఎప్పుడూ, ఎక్కడా నిదురించరాదు.

◆ **మలమూత్ర విసర్జన ఏ దిక్కుగా వుండి చేయరాదు?**

తూర్పు పడమర దిశలకు అభిముఖంగా వుండి మలమూత్ర విసర్జనచేయరాదు.

◆ **ఇంట్లో ధన నిక్షేపాలు నైఋుతిలో ఉంచవచ్చా?**

నైఋుతిలో బరువు ఉంచవచ్చుకానీ ధన నిక్షేపాలు ఉంచరాదు. ఉత్తరం కుబేర స్థానం కదా! అలాగే తూర్పుకు దిక్పాలకుడు ఇంద్రుడు. అందువలన తూర్పు, ఉత్తర, ఈశాన్య దిశలలో ధన నిల్వలు ఉంచుట శ్రేయస్కరము. నైఋుతికి దిక్పాలకుడు రాక్షసుడు కదా! అందువలన అక్కడ ధనము ఉంచరాదు.

◆ **విద్యాభ్యాసం చేసేటప్పుడు ఏ దిక్కుకు తిరిగి ఉండాలి?**

కేవలం తూర్పు లేదా పడమర దిశలకు అభిముఖంగా మాత్రమే ఉండి విద్యాభ్యాసం చేయాలి.

◆ **పూజ చేయునపుడు దీపారాధన ఎటువైపు తిరిగి ఉండాలి?**

మనం పూజ చేయునపుడు తూర్పు లేదా ఉత్తర ముఖంగా మాత్రమే ఉండి పూజ చేస్తాము. ఆ సందర్భంలో భగవానుడు మనకు అభిముఖంగా పడమర లేదా దక్షిణ ముఖంగా ఉంటారు. మనకు కుడి చేతి వైపున కలశారాధన చేయు బిందె, శంఖము మరియు దీపము ఉండవలెను. ఎడమ వైపు ఘంట ఉండవలెను. స్త్రీలకు పూజా కాలములో శంఖ పూజ ఘంట మోగించుట ఆచారము లేదు. దీపారాధన ప్రమిదలో

ఒక దీపం దేవుడివైపు మరొకటి ఊర్ధ్వముఖంగా (కుంభవత్తి) మరొకటి ఉత్తరం వైపు ఉండవలను. ధూపము కూడా కుడి వైపునే ఉండవలెను.

**◆ పిల్లలు శారీరకంగా బాగా పెరగాలి. ఏమి చేయాలి?**

గర్భిణీగా ఉండగా సౌందర్యలహరి, భగవద్గీత రోజూ పారాయణం చేస్తే ఈ సమస్య ఉండదు. పుట్టిన తరువాత రోజూ బాలరక్షాస్తోత్రం, బాలగ్రహరక్షాస్తోత్రం (బృహత్స్తోత్ర రత్నాకరం లోనివి) రోజూ పారాయణ చేయుట ద్వారా పిల్లలకు రక్షణ ఏర్పడుతుంది. వామన అవతార ఘట్టం రోజూ పారాయణ చేయుట వలన పిల్లలు శారీరకంగా బాగా ఎదుగుతారు. ఆదివారం, గురువారం, అమావాస్య రోజులలో చంటి పిల్లలను సంధ్యాసమయంలో బయటకు తీసుకువెళ్ళవద్దు. పిల్లలకు చీపురు, వేరే వారి పాదరక్షలను తగలనీయవద్దు.

**◆ భార్యాభర్తల మధ్య అన్యోన్యం పెరిగేందుకు సులభమయిన మార్గం ఏదయినా చెప్పండి?**

బ్రహ్మావైవర్త పురాణంలో శంకరుడు పార్వతిని ఉద్దేశించి చేసిన స్తోత్రం. అతి చిన్న స్తోత్రం యిది పారాయణ చేయుటవలన మిత్రుల మధ్య భార్యాభర్తల మధ్య ద్వేషం పోయి మైత్రీభావనలు పెరుగుతాయి.

*స్థిరాభవ మహాదేవి చండికే జగదంబికే ।*
*మమాపరాధ మఖిలం క్షంతు మర్హసి సుందరి ॥*
*మాంభృత్యం తపసాక్రీతం కృపాంకురు మమోపరి ।*
*బ్రహ్మ విష్ణు మహేశానాం బీజభూతే సనాతని ॥*
*అహో గోలోక నాథస్య గుణా తీతస్య నిర్గుణే ।*
*సర్వశక్తి స్వరూపేచ సదైవ సహచారిణి ॥*
*సాకారేచ నిరాకారే నిత్యేస్వేచ్ఛామయే ప్రియే ।*
*కృపయా తద్విభోరేవ మమ వక్షసి సాంప్రతం ॥*
*సర్వబీజ స్వరూపేచ మహామాయే మనోహరే ।*
*సర్వసిద్ధి ప్రదేదేవి ముక్తిదే కృష్ణ భక్తిదే ॥*
*ఇచ్ఛైవం శ్రీహరేః సాక్షాత్నాహం దాతుమపి క్షమః ।*
*తదాదేహం పరిత్యజ్య నిర్గుణం వ్రజనిర్గుణే ॥*

స్తోత్ర పారాయణం నిత్యం అధికసార్లు చేయవలెను. దృష్టి మరల కూడదు. దీని ఫలశృతి.

*ఇత్యేవం పార్వతీ స్తోత్రం శంకరేణ కృతాపురా ।*
*యః పఠే ద్విపదాగ్రస్తః భయాదేవ ముచ్యతే ॥*
*మిత్రభేదో భవేద్దారం తత్సం ప్రీతి ర్భవేత్పురా ।*
*పార్వతీ పరితుష్టాచ నత్యజే తస్య మందిరం ॥*

**◆ పురాణాలలో నైమిషారణ్యం గూర్చి వ్రత కధకు సంబంధం వుంటుంది ఏమిటి విశేషం?**

వాయుపురాణంలో "భ్రమతోధర్మచక్రస్యయత్రనేమిరశీర్యత కర్మణాతేన విఖ్యాతం నైమిషం ముని పూజితం" అని చెప్పబడింది. పరుగిడుచున్న ధర్మచక్రము యొక్క అంచు (నేమి) ఒక ప్రదేశంలో శిధిలమయినది. ఆ స్థానమునకు నైమిషము అని పేరు. ఆ స్థలమును ఋషులు పవిత్రంగా భావిస్తారు. నైమిషంలో సిద్ధుల చేత చారణులచేత సేవింపబడే గోమతీ నది వున్నది. రోహిణి అక్కడ సౌమ్యుని కనినది. వశిష్ఠ కుమారుడు "శక్తి" అక్కడ జన్మించాడు. అరుంధతికి తేజశ్శాలురగు వందమంది పుత్రులు కలిగారు. శక్తి కల్మాషపాదుని శపించెను. అక్కడనే విశ్వామిత్రులకు వశిష్ఠుల వారికి కలహం ప్రారంభం అయినది. పరాశరులవారు యిక్కడనే జన్మించారు. అందువలన నైమిషారణ్యం యజ్ఞములు చేయువారికి చాలా ప్రీతికరమయిన స్థానం.

**◆ శ్రీచక్రం అర్చించవలెను అంటే గురువు ఉపదేశం అవసరమా? అందరు అర్చింపవచ్చా? కల్పం ప్రకారం కాకుండా మన మనోభీష్టం ప్రకారం అర్చింపవచ్చా?**

మనకు భారతీయ సాంప్రదాయంలో ప్రతి పూజ ప్రతియాగం యిలా అన్ని ఆధ్యాత్మిక కార్యములకు కొన్ని నియమాలతో కూడిన శాస్త్రం చెప్పబడినది. దీనికే "కల్పం" అని పేరు. ఈ నియమాలను మన మహర్షులు నిర్మించగా వారి శిష్యబృందం, వరస తరతరాలుగా అనుష్ఠిస్తూ మన మహర్షుల కల్పాన్ని గౌరవిస్తూ ఆచరిస్తూ అభివృద్ధి చేసుకువచ్చారు. మనం దానిని అవహేళన చేయవలసిన అవసరం ఏముంది. మనం కూడా దానినే పాటిస్తే తప్పు ఏముంది. అలాగ వారి విధానం అనుసరించ దమునే భారతీయ సంస్కృతి రక్షణ అని అనవచ్చు. వారు చెప్పినట్లు చేయకపోతే మరి ఎలాగచేయాలి? ఇలాగ ప్రారంభం అయిన సమస్య వేరే వేరే రూపాలలోకి వెడుతుంది. దానికంటే కల్పం ప్రకారం మనం ఆచరించడం శ్రేయస్కరం కదా! గురుముఖతః ఉపదేశం తీసుకొని కల్పం ప్రకారం అర్చించడం విధి. యిక రెండవ రకం మనోభీష్టం పూర్తి స్థాయి భక్తితో మనకు మనశ్శక్తికి, బుద్ధికి తోచిన విధంగా చేయు పూజ నిష్ప్రయోజనం మాత్రం కాదు. అయితే అనాచారంతో కాకుండా సదాచారంతో చేయడం మంచిది.

**◆ దేవాలయంలో పూజ చేయించుకుంటే మంచిదా? లేక యింటిలో పూజ చేసుకోవడం మంచిదా?**

రెంటికీ ప్రాముఖ్యత, ప్రాధాన్యం వున్నది. ప్రాతఃకాలంలో యిల్లు శుభ్రం చేసి మనం స్నానం కావించి అనంతరం రోజూ యింటిలో దీపారాధన దేవతా అర్చన చేయడం ఆచారం (విధి). దుష్ట సాంప్రదాయములకు దూరంగా వుండి యిల్లు లక్ష్మీప్రదం కావించుకోవడం కోసం ఈ ఆచారం ఏర్పాటుచేశారు. "గృహస్థస్య క్రియాస్సర్వా నసిద్ధ్యంతి గృహంవినా" గృహస్థు ప్రతి కార్యము శుభ, పితృ, పుణ్య

కార్యములు యింటిలో చేయవలసినదే. అనగా వివాహాదులు ఆబ్దీకాదులు, వ్రతాదులు గృహంలో చేసుకోవడం ద్వారానే అధిక ఫలం అని శాస్త్రం. అయితే దేవాలయంలో పూజలు ఎందుకు చేయాలి అంటే దేవతా క్షేత్రం భక్తుల దర్శనం, పూజల వలన విగ్రహంలో చైతన్యం మరియు అధికశక్తి పెరిగి వుంటాయి. అలా శక్తివంతమయిన ఆ దేవతామూర్తిని కొలవడం ద్వారా మనకు కార్యసిద్ధి త్వరగా చేకూరుతుంది. సమాజం శ్రేయస్సు ప్రధాన లక్ష్యంగా దేవాలయములలో అర్చనలు చేయవలసినదే. అందుకే ధర్మశాస్త్రం ప్రకారం నిత్యం మన దగ్గరలోని దేవాలయమును సందర్శించమని చెబుతారు. దేవాలయములలోని దేవతామూర్తులు శక్తివంతం అయితే గ్రామరక్షణ బాగా చేకూరుతుంది. మనం దేవాలయంలో చేసిన అర్చనలకు దేవతామూర్తికి శక్తి పెరగడం వలన, అర్చన చేయించుకునే శక్తిలేని భక్తులకు కూడా స్వామి కోరికలు తీర్చుతారు. మనం మన యింట చేయు అర్చన మన వరకే ఉపయోగం. దేవాలయంలో చేయు అర్చన లోకోపయోగం. అందువలన రెండూ నడచిననాడే లోకోపయోగం సమాజ శ్రేయస్సు.

### ◆ గర్భిణీ స్త్రీలుగా వున్నప్పుడు యిల్లు మారడం మంచిది కాదా?

నూతన గృహప్రవేశం వంటివి కూడదు అని శాస్త్రం చెబుతోంది. "షాణ్మాసాదూర్ధ్వం సర్వకార్య నిషేధం" ఆరు మాసాలు నిండిన తర్వాత పూర్తిగా సర్వకర్మలు నిషేధమే. శంఖుస్థాపన, గృహప్రవేశాదులు నిషేధమే. అయితే అద్దె గృహములు మారే విషయం పరిశీలిస్తే అది వసతి, గృహ యజమాని నిర్ణయం మీద ఆధారపడి వుంటుంది. నీటి వసతి, కనీస సౌకర్యాలు కుంటు పడినప్పుడు గృహం మారక తప్పదు కదా! గృహ యజమాని మనం ఉండడానికి ఒప్పుకోని సమయంలో యిల్లుమారక తప్పదు కదా? అలాంటి సమయంలో ధర్మశాస్త్ర చర్చకు తావు వుండదు.

### ◆ గురువు తల్లి తండ్రులకంటే గొప్పవాడా?

ఎవరి గొప్ప వారిదే. తల్లితండ్రులు అనేవారే లేకపోతే గురువు అనే శబ్దమునకు అవకాశమే లేదు. మన సృష్టి తల్లితండ్రుల ద్వారా జరిగితే మన విజ్ఞాన స్థితికి, విద్యా స్థితికి నడవడి చేకూర్చేవాడు గురువు. వీరు ముగ్గురు ద్వారానే మన జీవనం ఆధారపడివున్నది. అందుకే వేదం మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అని ముగ్గురికీ ప్రత్యేకస్థానం యిచ్చినది. ప్రాచీనకాలంలో, అతి చిన్న వయస్సులోనే గురువు దగ్గర వదిలి వేసేవారు. గురువాసంలో ఆ పిల్లవాడు తల్లితండ్రులను కూడా అపేక్షించకుండా కేవలం విద్యార్జన మీద మాత్రమే దృష్టి కలిగేలా చేసి తన స్వంత పుత్రుని లాగా పెంచేవారు గురువు. అందుకే తల్లి తండ్రి స్థానం తర్వాత ప్రతి మనిషికీ గురువే జీవితంలో కీలకం. ఆయన స్థానం జీవితానికి అంత అవసరం కావుననే ఆచార్యదేవోభవ అన్నారు.

◆ **విష్ణు సహస్రంలో ఈశ్వరాయనమః/ శమ్భవే నమః అని వస్తాయి. అంటే విష్ణువు శివుడు అని అర్థమా?**

శివ, విష్ణు భేదం అసలు లేదు యిరువురూ ఒకటే. "ఈశ్వరః" అంటే నిరవధిక మగు ఐశ్వర్యము కలవాడు అని అర్థం. అలాగే "శంభవే నమః" అనగా భక్తులకు సుఖములు ఒసంగువాడు అని అర్థం. అయితే శివకేశవ భేదం చూడడం మహాపాపం. ఇద్దరూ ఒకటే, ఇద్దరూ ఐశ్వర్యవంతులే, శుభములను ఇచ్చేవారే, సర్వవ్యాపకులే.

◆ **పెద్దలను గౌరవించాలి, పెద్దలకు ఎదురు సమాధానం చెప్పరాదు అనే విషయములకు ఎప్పుడూ ఆచరణీయమేనా?**

సదా ఆచరణీయమే. పెద్దలను సర్వదా గౌరవించాలి. వారిని వారి మనస్సును నొప్పింపకుండా మనం ప్రవర్తించుకోవాలి. అయితే "సత్యం వద, ధర్మం చర" అనే శృతి వాక్యములను ఆధారం చేసికొని పరిశీలిస్తే ధర్మమునకు వ్యతిరేక వాదన చేయు పెద్దల మాటలను తెలివిగా తిప్పి చెప్పవలసినదే. అంతేకాక ధర్మమునకు వ్యతిరేక ప్రవర్తనతో వున్న వారు ఎంతటివారయినా ఏ స్థాయి వారయినా వారికి చక్కగా తెలియచెప్పడం చాలా మంచి విషయం అలాగ చేయు విషయంలో ఎన్ని సమస్యలను అయినా భరించవలసినదే. కారణం గీతలో చెప్పన రీతిగా యద్యదా చరతి శ్రేష్ఠః తత్త దేవేతరో జనః సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే" శ్రేష్ఠుడయిన వాడుగా ఎవరయితే వుంటారో వారు ఆచరించు విషయములను అందరూ అవలంభిస్తారు. అందువలన పెద్దలయినా శ్రేష్ఠులయినా ధర్మ ప్రవృత్తిని పాటించితే వారిని అనుసరణం చేయువారు కూడా ధర్మప్రవృత్తిని కలిగివుంటారు. పెద్దలు ధర్మప్రవృత్తికి దూరం అయితే వారిని అనుసరించే అందరూ చెడు మార్గంలో వెడతారు. అందువలన అధర్మం దగ్గర్లో వున్న పెద్దలయినా శ్రేష్ఠులనయినా వ్యతిరేకించడం దోషం కాదు. "ధర్మో రక్షతి రక్షితః" వ్యక్తికంటే వ్యవస్థ ప్రధానం.

◆ **గురువు దగ్గర చదువుకున్న వారికే విద్య శోభిస్తుంది అంటారు నిజమేనా?**

మంచి మాట అడిగారు. గురువు దగ్గర చదువుకోవడం వలన ఆయన అనుభవాలను మరియు విద్యా విషయాలను అన్వయం చేసుకునే విషయం గురువు చెబుతాడు. అప్పుడు విద్య మీద మంచి అవగాహన వుంటుంది. అది అమలు చేయువారికి శోభ చేకూరుతుంది. ఒక వేళ మనకు పుస్తకాలు దొరుకుతున్నాయి. కదా! అని చదువుకుంటే విషయ పరిజ్ఞానం చేకూరవచ్చుగానీ విద్యా శోభ చేకూరదు. ఉదాహరణకు జ్యోతిశ్శాస్త్రం పుస్తకాలు అన్ని భాషలలో సరళంగా దొరుకుతాయి. కానీ పరంశం ప్రాధాన్యమయినది. దేనికి ఏ స్థాయి విలువ యివ్వాలి అన్నీవివరాలు గురువు దగ్గర చదువుకున్నవారికి తెలిసినంతగా పుస్తకాలు చదవినవారికి తెలియదు అనవచ్చు.

అందువలన ప్రతివారు విద్యా కోరిక వుంటే గురువును ఆశ్రయించాల్సినదే ఉదా హరణకు ఈ మధ్య ఆంధ్రదేశంలో ఒక ఎఫెమరీస్ పుస్తకం అమ్మకానికి వచ్చినది అందులో రాహు కేతువులకు వక్రమార్గం ఋజుమార్గం రెండూ యిచ్చారు. శాస్త్రప్రకారం రాహుకేతువులు ఎప్పుడూ వక్రమార్గంలోనే సంచరిస్తారు. మరి కేవలం ఆ ఎఫెమరీస్ పరిశీలిస్తే గురువు లేకపోయినా మార్గదర్శకుడు లేకపోయినా అది తప్పు అని తెలియదు కదా! అందుకే అటువంటి పొరపాట్లు జరగకూడదని గురువును ఆశ్రయించాలి. గుకారశ్చాంధకారస్తు రుకారస్తన్ని వారకః అనే కారణం విశేషమయినదే.

◆ **కేవలం శిరస్సు మాత్రమే వుండే దేవతా ప్రతిమలు ఏమి చేయాలి?**

మీరు అడిగిన రీతిగా దేవాలయములలో కేవలం శిరస్సు మాత్రమే వుండే విగ్రహాలు అమ్ముతుంటారు. అటువంటి సందర్భాలలో వాటిని నిత్యం పూజ చేయనవ సరం లేదు. కలశం పెట్టి చేయు వ్రతములో కలశమునకు అలంకారము కొరకు ఈ దేవతా శిరస్సులు ఉపయోగించవచ్చు. కలశము మీద కొబ్బరికాయ వుంచుతాము కదా! ఆ కొబ్బరికాయకు అలంకరణ నిమిత్తంగా ఈ దేవతాముఖం వుంచి వ్రతాదులు జరపవచ్చు.

◆ **వ్రతములు పండుగలు నిర్ణయం మీద ఏకత్వం కోసం సమావేశములు పెడుతు న్నారు. అవి సరియగు ఫలితములు చూపే అవకాశం వున్నదా?**

కచ్చితంగా 100శాతం జరగదు. ఫలితాలు శూన్యం. కాలం వృధా. కారణం వ్రతములు, పండుగలు నిర్ణయం చేయు విషమములకు ఆధారం పురాణములు. అవి ఒకే విషయం సూచిస్తున్నాయి. వాటిని సవిస్తరంగా ధర్మశాస్త్ర గ్రంధాల ద్వారా అందించారు. ధర్మసింధు, నిర్ణయ సింధు, వ్రత రత్నాకరం, వ్రత నిర్ణయ కల్పవల్లీ, ధర్మ ప్రవృత్తి పురాణాల వంటివి. అవి కూడా ద్వారా అందించారు. ధర్మసింధు, నిర్ణయ సింధు, వ్రత రత్నాకరం, వ్రత నిర్ణయ కల్పవల్లీ, ధర్మ ప్రవృత్తి వంటివి. అన్నీ కూడా పెద్దగా వ్యత్యాసం లేకుండానే ఫలితాలు చెప్పాయి. మరి యింక సమస్య ఎక్కడా అంటే పంచాంగ గణితాలలో తేడా. అది సరిచేసి నిర్ణయాలు చేస్తే అందరికీ ఒకటే నియమావళి వుంటుంది. పండుగలు నిర్ణయం చేయు ధర్మశాస్త్ర గ్రంథాలలో తేడాలు పెద్దగా లేవు. పూర్వ పద్ధతి పంచాంగ గణితాలు అన్నీ ఒకే రీతిగా వుంటాయి. వాటిని తప్పు అంటారు మన దృక్ సిద్ధాంత పంచాంగకర్తలు. జ్యోతిష్యశాస్త్ర గ్రంథా లలో ప్రారంభంలో జ్యోతిష ఫలితాలు. దృక్ సిద్ధాంతం ప్రకారం చేసిన పంచాంగాల ఆధారంగా చేయమని వున్నమాట వాస్తవమే. అయితే దృక్ సిద్ధాంతంలో అయనాంశల విభేదం బాగా పొడచూపడంతో వాటిలో ఏకీకృతం లేవు. మీ దగ్గర కంప్యూటర్ సాఫ్టవేర్లు వుంటే నక్షత్ర అంత్యములు మీరు చెక్ చేసి చూడండి. Lahari, KP,BV RAMAN అయనాంశలలో తేడా నిమిషాలలో గోచారం అవుతుంది. Lahari

అయనాంశను ప్రభుత్వంవారు కొందరి పండితుల సలహాల మేర గ్రహించి దానికి గుర్తింపు ఇచ్చారు. సిద్ధాంతం మీద బాగా అవగాహన వున్న బ్రహ్మశ్రీ మధుర కృష్ణ మూర్తి శాస్త్రిగారు దానిని తోసిపుచ్చి ఎన్నో వాదనలు చేసి సిద్ధాంత పరంగా విజయం సాధించారు. కానీ సంఘంలో బాహుళ్య ప్రచారంలోకి రాలేదు. ఆయన ఓపికగా వుండగానే దృక్ సిద్ధాంతం ఏకతాటి మీదకు వచ్చి ఏ దృక్ సిద్ధాంతం కరెక్ట్ అనే అంశం నిర్ణయిస్తే అప్పుడు పూర్వ పద్ధతి పంచాంగాల విషయం పరిశీలించవచ్చు. దృక్ సిద్ధాంతం ఏకదాటి మీదకు రాకుండా వున్న ఈ సందర్భంలో పూర్వ పద్ధతి పంచాంగమే తప్పు అనడం అపహాస్యం. మధురవారు సిద్ధాంతం తప్పు అని సూచిస్తే బహుమానం ఇస్తాను. అంటే గణితం మీద ఎవరూ చర్చ చేయలేకపోతున్నారు. ఎఫమరీస్‌ల ఆధారంతో లేదా కంప్యూటర్ ఆధారంతో గణితం చేయడం అలవాటు పడిన సిద్ధాంతులు "ఎఫమరీస్ ఎలా తయారైంది, ఎఫమరీస్ రాకముందు పంచాంగ గణితం ఎలా చేసేవారు." అనే విషయాన్ని శోధించుకోవాలి. ఆత్మ విమర్శ చేసుకోవాలి. పూర్వ పద్ధతి ప్రకారంగా గణితంలో గ్రహాలు వస్తున్నాయి. దృక్ పద్ధతిలోను గ్రహాలు వస్తున్నాయి. ఈ రెంటికి సమయ బేధం ఉన్నది. రోజుల తేడాలో ప్రవేశాలు జరుగుతు న్నాయి. వాటిని శోధించాలి. తేడా ఎక్కడా ఉంది., అని గ్రంథాలు శోధించాలి. వాటి మీద చర్చ చేయాలి కానీ, టీ.విలో కూర్చుని కంప్యూటర్‌లు, వెబ్‌సైట్‌ల గురించి మాట్లాడటం తప్పు. అంతేకాక పంచాంగకర్తల సమావేశంలో అసలు గణితం గురించి, గణిత గ్రంథాలలో ఉన్న తేడా గురించి ఎవరూ చర్చ చేయడం లేదు. గమనించారా? గతంలో టివిలో ఒక చర్చా కార్యక్రమంలో కూడా చెప్పాను. ఒక ప్రక్కన పంచాంగ గణితాలు ఒక తాటి మీదకు రాకుండా శ్రమ చేస్తుంటే మధ్యలో తెలిసీ తెలియనివారు పండుగల నిర్ణయాల మీద వారి భేషజం కోసం గొప్ప కోసం సమావేశాలు ఏర్పాటు చేయడం చాలా హాస్యాస్పదంగా వున్నది. పంచాంగ గణితాలు ఏకీకృతం కావడం కోసం సిద్ధాంతం చేయగల వారితో సభలు ఏర్పాటు చేయాలి కానీ ఈ పండుగల నిర్ణయం కోసం సమావేశం అనవసరం. పంచాంగ గణితం మీద అవగాహన లేని వారు సభలు నిర్వహించడం చాలా అపహాస్యవిషయాం. మీ గొప్ప కోసం అనవసర పనులు చేయవద్దని విజ్ఞప్తి. పంచాంగ గణితం సరిగా వుండకపోతే దాని ప్రభావంగా పండుగ నిర్ణయాలలో తేడాలు వుంటాయి. అంతకన్నా మరొక విశేషం ఏమీ లేదు. అందువలన పండుగల ఏక నిర్ణయం కోసం చేయు సభలు సమావేశములు కీర్తి కోసమే కానీ, పనులు పూర్తి అవడం కోసం కాదు. నా ఈ వ్యాఖలు గ్రహించండి. విషయం పరిశీలించండి – ఆగ్రహం తెచ్చుకోవద్దు. శాస్త్రాన్ని కాపాడే ప్రయత్నంలో మంచి నిర్ణయాలు చేద్దాం. దానికి మన చేయూత సరియగు మార్గంలో యిద్దాం. యిదే నా ప్రధాన ఉద్దేశ్యం.

**◆ రాధ గురించి శ్రీమద్భాగవతంలో ఎందుకు లేదు? ఆవిడ చరిత ఎక్కువగా ఏ పురాణంలో దొరుకుతుంది?**

రాధా చరిత విశేషంగా కావాలి అనుకునేవారు బ్రహ్మవైవర్త పురాణం చదవాలి. శ్రీదాముడు అనే గోపకుడు గోలోకంలో రాధ వలన శపింపబడి మరల తాను రాధను శపించాడు. భూలోకంలో మానవ కన్యగా జన్మించమని, కృష్ణుని విడనాడలేని రాధ శ్రీకృష్ణుల వారిని ప్రార్థింపగా ఆమె కోరిక తీర్చు ప్రయత్నంలో భాగంగా శ్రీకృష్ణ పరమాత్మ వరాహకల్పంలో రాధ కోసం జన్మిస్తానని హామీ యిచ్చారు. అందులో భాగంగా బ్రహ్మ కల్పంలో పొందిన శాపాన్ని వరాహ కల్పంలో పొందారు రాధాకృష్ణులు. శ్రీకృష్ణుడు, భక్తి కోసంగా ప్రధాన ఉద్దేశ్యంతో శ్రీమద్భాగవతం సాగింది కానీ రాధను ప్రధానంగా చేసి బ్రహ్మవైవర్త పురాణం సాగింది. అందువలన రాధ చరిత బ్రహ్మవైవర్త పురాణంలో ఎక్కువగా వుంటుంది. రాధాకృష్ణ వివాహం జరిగినట్లు వారివురువురూ కూడా శ్రీకృష్ణుడు మధురకు వెళ్ళిన తరువాత దూరంగా వున్నట్లు మరల అవతారం చాలించు సందర్భంలో యిరువురూ కలుసుకున్నట్లు ఎన్నో రాధా కృష్ణ విశేషాలు బ్రహ్మవైవర్త పురాణంలో వున్నాయి. అందువలన పురాణాలలో ఒక్కో అవతారం ఒక్కో విశేషమును పొందుతూ సాగే కథలలో కొన్ని విశేషాలు వస్తాయి. కొన్ని విశేషాలు రావు. రాలేదని విమర్శ చేయడం కంటే విశేషాలు వ్రాసి వున్న పురాణాలు శోధన చేయడం వలన పురాణ విజ్ఞానం శోభిస్తుంది.

**◆ పుట్టిన రోజు తేదీల ప్రకారం చేసుకోవాలా? లేక పంచాంగ తిథుల ప్రకారం చేసుకోవాలా?**

ఇది అడగకూడని ప్రశ్న. బ్రిటీషువారు మనకు పరిపాలన చేయు వరకు మనకు క్యాలెండర్ డేట్‌లు తెలియవు. జనవరి ఫిబ్రవరి వంటివి లేవు. మనకు కేవలం పంచాంగం మాత్రమే వున్నది. అందరూ క్యాలెండర్ పాటిస్తున్నారు అని మనవారు పంచాంగ తిథులను క్యాలెండర్ డేట్‌లను సమన్వయం చేసి యిస్తారు. మనం భారతీయ సంస్కృతి పాటిద్దాం అనుకుంటే మన భారతీయ పంచాంగం వాడుకోవాలి. వద్దు అనుకుంటే పాశ్చాత్య క్యాలెండర్ వాడుకొని దాని ప్రకారంగా పుట్టిన రోజు చేసుకోవాలి. యిది మన అభిప్రాయం మీద ఆధారపడవలసిన అంశము.

**◆ పుట్టినరోజునాడు పూజలు ఏమి చేయవలెను?**

ప్రాతఃకాలంలో అభ్యంగనస్నానం చేయడానికి ముందు తల్లి పిల్లల శిరస్సు మీద చమురు ఉంచవలెను. తల్లిలేని ఎడల కుటుంబంలోని పెద్దల చేత ఆ ఏర్పాటు చేయవలెను. నూతన వస్త్రాలు ధరించిన తరువాత తల్లిదండ్రులకు నమస్కరించి అనంతరం ఇష్టదైవారాధన చేసి అవకాశం ఉంటే ఆయుష్యహోమం, నవగ్రహహోమం చేయించుకొనుట మంచిది. తల్లిచేత ప్రథమతః పరమాన్నం తినవలెను.

**◆ చంటి పిల్లల గూర్చి ఎక్కువ చర్చచేయుట వలన దిష్టి తగులుతుందా?**

తప్పక తగులుతుంది. అయితే ఆ పిల్లవాడి తల్లి తండ్రుల మధ్య జరిగే చర్చ (పిల్లల గురించి) వలన దోషం లేదు. యితరుల దగ్గర కనుక చంటి పిల్లల చర్చ, అధికంగా వారి చేష్టలను గురించి చర్చ చేయుటవలన తప్పకుండా దిష్టి తగులుతుంది. అందువలన చంటిపిల్లల తల్లితండ్రులు వారి పిల్లల గురించి బంధువర్గంలోను స్నేహవర్గంలోను మితంగా మాట్లాడాలి. అంతేకాకుండా ప్రదోషకాలంలో పిల్లలను బయటకు తీసుకువెళ్లకూడదు. ఆదివారం గురువారములలో ఈ నియమం అధికంగా పాటించవలసిన అవసరం వున్నది. అమావాస్య రోజులలో కూడా జాగ్రత్త అవసరం.

**◆ నవరత్నధారణ, రుద్రాక్షధారణ, మంచివాస్తులు జీవితాన్ని మారుస్తాయా?**

ముఖ్యంగా ఒక విషయం గుర్తుంచుకోండి. లలాటలిఖితం ఎవరూ మార్చలేరు. అయితే కష్టకాలంలో ఎదిరించే శక్తిని పొందడానికి మనకు మహర్షులు యివి చెప్పారు. ఈ విషయం గుర్తుంచుకోండి. మనం చలికాలంలో స్వెట్టర్ వేసుకుని చలిని ఆపుతున్నామా? లేక చలిని తట్టుకుంటున్నామా? మనం భగవత్ సృష్టి అయిన చలిని ఆపడం లేదు. ఆపడం మనిషి వలన కాదు. అందుకే చలి నుండి తట్టుకోవడం స్వెట్టర్స్ వేసుకుంటున్నాం. మన మహర్షులు ఎవరూ కూడా జీవితాన్ని మారుస్తాయి అని నవరత్నధారణ, రుద్రాక్షధారణ గురించి చెప్పలేదు. అయితే మంచి వాస్తు లేకపోవడం ద్వారా మానసిక ఒత్తిడి వస్తుంది. అటువంటి దోష సమయాలలో కూడా నవరత్న, రుద్రాక్షలు నివారణ మార్గాలవుతాయి.

**◆ యంత్రముల మీద ఆధారపడడం మంచిదా? పూజల మీద ఆధారపడడం మంచిదా?**

కొన్ని సందర్భాలకు యంత్రములు కరెక్ట్ – అన్ని సందర్భాలకు పూజలు కరెక్ట్. పూజల మీద ఆధారపడిన వ్యక్తి అన్ని సందర్భాలలో వచ్చే సమస్యలకు పరిష్కారం అన్ని చోట్ల సాధించగలడు. యంత్రం మీద (పూజా యంత్రములు) ఆధారపడిన వ్యక్తి మానసికంగా బలహీనుడవుతాడు. అయితే మత్స్యయంత్రం, కూర్మయంత్రం, నవగ్రహ యంత్రం వంటివి అలవాటుపడిన మనిషి ఆ యంత్రం దగ్గర లేకపోతే చికాకు, అధైర్యం. భీతి పొందుట తథ్యము. అందుచేత దిష్టియంత్రాలు, లక్ష్మీగణపతి, కుబేర వంటి యంత్రాల మీద ఆధారపడడం కంటే పూజల మీద ఆధార పడడం మంచిది. దైవబలం ఎప్పుడూ వెంట వుండడం మంచిది. యంత్రం ప్రభావం వుంటుంది కానీ యంత్రం కంటే జపం పూజ విశేషము అని అర్థం.

**◆ జీవితం ఎప్పడు సుఖంగా వుండాలి? ఎప్పడు యిబ్బందులు రాకుండా వుండాలి? అంటే ఏమి చేయాలి? జ్యేష్ఠాదేవి ప్రభావం మనుషుల మీద ఎలా వుంటుంది?**

ఇది అందరికీ అవసరమయిన ప్రశ్న. ఎప్పుడూ జాతకం బాగా వుండాలి అంటే రోజూ నవగ్రహాలకు ఆరాధన చేయాలి. రోజూ మన జాతకం పరిపాలించేది

నవగ్రహములే కదా? అటువంటి ఆ గ్రహములను ఆరాధించడం ద్వారా ప్రతిరోజూ గ్రహశాంతి జరిగి మనకు మంచిఫలితాలు అందుతాయి. రోజూ చేసే నవగ్రహారాధనలో సంకల్పంలో ఏ విధమయిన కోరికలూ చెప్పరాదు. యిలా రోజూ నవగ్రహారాధన చేసేవారికి సమస్తమయిన సమస్యలు తీరి చక్కటి జీవితాన్ని అందుకుంటారు. మరియిక జ్యేష్ఠాదేవి లక్ష్మీదేవి యొక్క సోదరి. ఈవిడ ఎక్కడ అనాచారము, అశుచి వుంటాయో అక్కడ నివాసం జరుగుతుంది. అందుకే జ్యేష్ఠాదేవిని నిరోధించి లక్ష్మీదేవిని ఆహ్వానించాలి అంటే శారీరక శుభ్రత, పరిసరాల శుభ్రత చాలా అవసరం. గోళ్ళు, వెంట్రుకలు తీసుకోవడం, స్నానం, అలంకరణ, గృహాలంకరణ యిలా ప్రతి విషయం లోను కూడా పెద్దలు ప్రాంతీయ ఆచారాలు ప్రకారం కొన్ని నిబంధనలు ఏర్పాటుచేశారు. వంట, పడక, భోజనం, యిలా ప్రతి విషయానికి నిబంధనలు వున్నాయి. వాటిని అన్నింటినీ శాస్త్రీయంగా ఆచరిస్తే జ్యేష్ఠాదేవిని దూరం చేసి లక్ష్మీదేవిని ఆహ్వానింపవచ్చును.

◆ **మాది జాయింట్ ఫ్యామిలీ. నేను వేరే కాపురం పెట్టవలసి వచ్చినది. మా అమ్మకు, నా భార్యకు పొంతన కుదరక ఈ నిర్ణయం చేయవలసి వస్తోంది. నా నిర్ణయం తప్పా? ఒప్పా?**

మనకు మన చరిత్ర మీద మన సంస్కృతికి సంబంధించిన గ్రంథముల మీద సరి అయిన అవగాహన లేక ఈ సమస్యలు తలెత్తుతున్నాయి. పై మూడు అంశాలు తెలుసుకోవడం చాలా సులువైన పనియే. యిక సందర్భంలోకి వస్తే మన సంస్కృతి సంప్రదాయముల ప్రకారం అలాగే ధర్మశాస్త్రం ప్రకారం కూడా ధర్మజీవనం చేయు వ్యక్తి ప్రతివాడు తండ్రి ఆదేశములు చేయు వ్యక్తి ప్రతివాడు తండ్రి ఆదేశములు పాటించడం ప్రధాన కర్తవ్యం. అలాగే తల్లికి రక్షణ చేయవలసిన బాధ్యత పుత్రుడికి వున్నది. అలాగే ధర్మార్థకామముల యందు ఎన్నడూ అతిక్రమించనని అగ్ని ఎదుట మంత్ర పూర్వకంగా ప్రమాణం చేశాము కావున భార్యను ఎట్టి స్థితిలోను విడనాడరాదు. పై సంసారి ఎట్టి స్థితిలోను విడనాడరాదు. యివి సంసారిఅయిన ప్రతి మగవాడికి విధింపబడిన నియమాలు, 1. నీ భార్యకు నీ తల్లికి యిరువురిరి పొంతన కుదరక వారు పరస్పరం కలహించుకున్ననూ లేక దూషించుకున్నను అది చూచుట కూడా దోషమే. నీ తల్లిని ఎవరూ దూషించకుండా చూడవలసిన బాధ్యత నీదే. అలాగే నీ భార్యను ఎవరూ దూషించకుండా చూడవలసిన బాధ్యత నీదే. 2. అందువలన పై ధర్మాన్ని అనుసరించి నీ భార్యకు నీ తల్లికి పొంతన కుద రక పరస్పర దూషణలు దాకా వస్తే అది వినడం నీకు తప్పు అవుతుంది. అందువలన నీ తండ్రి యొక్క అంగీకారంతో వేరే కాపురం పెట్టుము. 3 వేరే కాపురం పెట్టి భార్యకు అనుకూలం చేయవచ్చు. అలాగే ఎటువంటి స్థితిలోను మాతృ పితృ రక్షణ విడనాడ వద్దు.

యిలాంటి సందర్భాలలోనే మనకు పురాణాలు ఇతిహాసాలు మీద అవగాహన వుంటే ఎటువంటి టెన్షన్ లేని నిర్ణయాలు చేయవచ్చు. మహర్షుల చరిత్రలు పరిశీలిస్తే చాలామంది మహర్షులు తపస్సు చేసుకునే నిమిత్తంగా వేరే ఆశ్రమాలకు వెళ్ళిన వారే. రామాయణం వివిధ వ్యాఖ్యానాలు పరిశీలిస్తే తల్లి తండ్రి భార్య ముగ్గురి దగ్గర ఏ రీతిగా మన సంచారం వుండాలి అనే ధర్మము పూర్తిగా అవగతమవుతుంది. అందరికీ ధర్మశాస్త్రం తెలియనవసరం లేదు. కానీ పురాణాలు యితిహాసములు చదవడం ద్వారా ధర్మబద్ధమయిన జీవనం చేయుటకు ఉపయోగము. ఆ కథలు తెలిసికొని తద్వారా మనకు కూడా ధర్మాచరణ తెలిసే అవకాశం వున్నది. అలాగే నీ తల్లితండ్రుల రక్షణ బాధ్యత నీ మీదనే వున్నది. నీవు వేరే కాపురంలో వున్ననూ తప్పు కాదు కానీ తల్లితండ్రుల నిత్యావసరాలు నీ ద్వారా తీరకపోవడం పెద్ద పొరపాటు అవుతుంది. నీ తల్లి తండ్రుల నుండి దూరం వెళ్ళుటకు బాధపడనవసరం లేదు. కానీ నీవు నీ తల్లితండ్రులకు రోజూ సేవ చేయలేని దుస్థితి ఏర్పడితే అది తప్పు. ఒక చోట ఉమ్మడి కుటుంబంగా వుండి పరస్పర కలహ దూషణలు పెంచు రీతిగా ప్రవర్తించితే అది పెద్ద దోషం అవుతుంది. అందువలన వేరే కాపురం పెట్టే విషయంలో తప్పు లేదు. తండ్రి యొక్క అనుజ్ఞ లేకుండా వేరే కాపురం పెట్టవద్దు. జరిగే పొరపాట్లు నీ తండ్రికి విశదీకరించి ఆయన అనుజ్ఞ తీసుకొని వేరే వెళ్ళండి. మీరు ప్రతి నిత్యం వారికి రక్షణ చేయుటకు వారి అవసరాలు రోజూ పరిశీలించి తీర్చుటకు గాను అతి దగ్గర్లో వుండండి. యిరువురికీ అనగా భార్య పిల్లలకు తల్లితండ్రులకు యిబ్బంది లేని నడవడి ఎంచుకోండి - శుభం భయాత్ - యికనయినా రోజూ ఒకసారి అయినా కొంత సమయం రామాయణ పఠనానికి అవకాశం చూసుకోండి. తద్వారా యిలాంటి సమస్యాకాలంలో మీకు మంచి సమాధానం దొరుకుతుంది.

### ◆ శుభలేఖలు చింపకూడదు అంటారు. ఎందుకు?

శుభమును సూచిస్తూ వ్రాసిన పత్రిక శుభలగ్న పత్రిక. రాబోవు శుభకార్య నిమిత్తంగా ఈ పత్రిక వ్రాస్తాము. దానికి మంగళ ద్రవ్యములు పసుపు వుంచుతాము. అయితే కార్యం పూర్తి అయిన తర్వాత కూడా గత శుభాన్ని సూచించే పత్రిక ఆ శుభలేఖ. దానికి మంగళ ద్రవ్యం పసుపు అలాగే వుంటుంది. అందువలన మంగళ ద్రవ్యాలతో కూడిన ఆ శుభలేఖను చింపడం ఆ ద్రవ్యాలను అవమానించినట్లు. అంతేకాక ఆ పత్రికలో వున్న శుభమును అవమానించినట్లు. అలా చేసిన వారికి వారి జీవితంలో శుభ ప్రతిబంధకాలు వచ్చే అవకాశం వుంటుంది. మంగళప్రదమయిన విషయాలలో కూడా ఆటంకాలు వస్తాయి. అందువలన పాత శుభలేఖలను నదీ ప్రవాహంలో వేయాలి. అంతేకానీ చింపడం తగలపెట్టడం మంచిది కాదు. నదిలో కలిపి వేయండి.

### ◆ విభీషణుడి తల్లి, భార్య, కుమార్తెలు ఎవరు?

విశ్రవసునికి "సుమాలి" యొక్క కుమార్తె కైకసి వలన రావణ, కుంభకర్ణ, విభీషణుడు జన్మించారు అని రామాయణం ఉత్తరకాండ తొమ్మిదవ సర్గలో వున్నది. అయితే విశ్రవసునికి "మాలిని" అనే ఆమె ద్వారా విభీషణుడు కలిగెను అని కూడా వున్నది. యితడు శైలూషుడు అనే గంధర్వుని యొక్క కుమార్తె "సరమ"ను వివాహమాడెను. యితని పెద్ద కుమార్తె మనకు సుందరకాండలో (37 వ సర్గ) దర్శనమిస్తుంది. తల్లి పంపగా వచ్చి సీతకు ఊరట కలిగిస్తుంటుంది. పరిణయమైన తరువాత సరమ లంకలో రాక్షసుల నడుమనే వున్నప్పటికినీ, వారి దుర్గుణములు ఈమెకు రాలేదు. విభీషణుడు రావణుని విడిచిపెట్టి రాముని శరణు కోరటానికి వెళ్లినపుడు, ఈమె విభీషణుని వెంట వెళ్లలేదు, లంకలోనే వుంది. ఎల్లప్పుడు సీతకు హితవుగా వుంటూ, ధైర్యమును ఇచ్చింది.

సీతను భయపెట్టడానికి రావణుడు మాయా శిరమును తెచ్చి సీతకు చూపించి, 'రాముడిని సంహరించాను, ఇదిగో రాముడి శిరస్సు' అని చెప్పించాడు. సీత అది చూసి దిగులు చెందింది. అప్పుడు సరమ వచ్చి అదంతా రాక్షస మాయ అని చెప్పి సీత భయం పోగొట్టింది.

విభీషణుని కుమార్తె పేరు అనల. అనల ద్వారా సరమ సీతకు లంకలోని విషయాలను చెబుతుండేది.

### ◆ వేదాశీర్వచనం గ్రహ శాంతి కలిగిస్తుంది అంటారు? శని దోషం కూడా పోగొడుతుందా?

వేద మంత్రాలు అంటే ఏమిటి? "వేదః శివః – శివోవేదః" వేదమే శివుడు. శివుడే వేదము. సృష్ట్యారంభం నుండి అపౌరుషేయములై వచ్చిన వేదములో గ్రహ మంత్రములు, గ్రహములను శాంతింప చేయు మంత్రములు ఎన్నో వున్నాయి. అలాగే గ్రహాధి దేవతలు యొక్క సూక్తములు కూడా వేదంలోనే వున్నాయి. ఉదాహరణకు చంద్ర రాహువులకు ఆరాధన దేవత అయిన గౌరీ దుర్గలకు సంబంధించి "జాతవేదసే" సూక్తము వేదము లోనిదే. అలాగే రవికి ప్రీతికరమయిన "అరుణము" వేదంలోనిదే. యిలాగే గురువుకు శనికి ఆరాధ్య దేవత అయిన శివుడు – ఆయనకు సంబంధించిన నమకము వేదములోనిదే. యిలా అన్నీ గ్రహాలకు అధిదేవతలు ఆరాధ్య దేవతలు వారికి సంబంధించిన మంత్రములు వేదములోనే వున్నాయి. శనిదేవుడు శివానుగ్రహం వున్నవారిని యిబ్బంది పెట్టడు అని పురాణ వచనం. అందువలన పైన మనం చెప్పుకున్నట్లుగా వేదమే శివుడు, శివుడే వేదం అయినప్పుడు వేద మంత్ర శ్రవణం చేయువారికి వేదాశీర్వచనం చేయించువారికి శనైశ్చరానుగ్రహం లభిస్తుంది. మీకు ప్రత్యక్ష నిదర్శనం మీరు ఏదో ఒక జీవనాధారం కలిగివున్నారు అంటే అది శనైశ్చరుని అనుగ్రహమే.

◆ **"ఆదిదేవో మహాదేవః" అని విష్ణుసహస్రనామంలో వున్నది. మహాదేవుడు అంటే శివుడు కదా?**

హరిహరుల అనుగ్రహం మీకు బాగా లభిస్తుంది. మంచి ప్రశ్న వేశారు. మహాదేవుడు అని సాధారణంగా లోకంలో శివుడికి పేరు వున్నది. మీరు విష్ణుసహస్రంలోని మహాదేవః అనే నామంలో విష్ణువును శివునితో పోలిక చేశారేమో అన్న అనుమానంతో ఈ ప్రశ్నవేశారని అర్థం అవుతోంది. "మహాంశ్చాసౌదేవశ్చ మహాదేవః అని వ్యుత్పత్తి. శ్రేష్ఠుడయిన దేవుడు అని వస్తుంది అర్థం. అటు శివుడయినా యిటు విష్ణువయినా శ్రేష్ఠులే కదా! ఈ మహాదేవః అనే నామం అందరి నామాలోలోను ఉంటుంది. ఆదిదేవః అంటే దేవతలలో మొదటివాడు అని అర్థం. ఆది అంటే మొదలు అని అర్థం వస్తుంది కదా! శృతి స్మృతుల వివరణలు, సృష్ట్యాది విషయాలలో శ్రీమహావిష్ణువు ప్రారంభంలోనే వున్నట్లు చెప్పబడింది. అందువలన శ్రీమహావిష్ణువు ఆదిదేవుడుగా కీర్తింపబడతాడు. "మహపూజాయాం" అనే ధాతువు నుండి మహత్ శబ్దం వ్యుత్పత్తి అయినది.

◆ **దక్షిణం షాపు అద్దెకు అవకాశం వచ్చినది. నేను వుంటున్న షాపుకు దక్షిణం కలుపుకోవచ్చా?**

ప్రతి దానికీ ఒక మార్గం వుంటుంది. అందులో భాగంగా మీకు ఒక మార్గం వున్నది. ప్రత్యక్షంగా మీరు దక్షిణం షాపును కలుపుకోకూడదు. అందువలన మీరు వుంటున్న షాపును ఖాళీ చేసి దూరంగా కొత్త షాపులోకి తాత్కాలికంగా మారిపోండి. అప్పుడు మీరు రెండు షాపులకు అగ్రిమెంట్‌లు వ్రాసుకోండి. రెండు షాపులు కలిపి ఇంటీరియర్ చేయించుకొని మరల పాత షాపుకు షిఫ్ట్ అయిపోండి. అప్పుడు మీరు దక్షిణం జరిగిన దోషం రాదు. అలాగే మీరు క్యాష్ కౌంటర్ పాత ప్రదేశంలోనే వుండే లాగా దానిలో మార్పు రాకుండా వుండేలాగ డిజైన్ చేయించుకోండి. మీకు యిబ్బందులు రావు. పాత షాపులోనే దక్షిణం షాపు కలుపుకోవడం మాత్రం శ్రేయస్కరం కాదు.

◆ **శ్రీరాముడు బ్రహ్మ విష్ణువు శివాత్మకుడు ఎట్లు?**

బ్రహ్మాండ పురాణం పరిశీలింపవలసిన అవసరం వున్నది. వశిష్ఠ వాక్యం

***బ్రహ్మ విష్ణ శివరూపంతోఖిలం హస్తి పాతి సృజతిస్వయం ప్రభుః***
***రామ ఏవ ద్విజవర్య తతోస్యత్ నాస్తి తద్ధి పరమం ఖలు దైవమ్***

శ్రీరామచంద్రుడు ఒక్కరే ఈ మనకు దృశ్యమగు చరాచర, జగత్తుకు సృష్టి స్థితి లయకారకుడు. బ్రహ్మగా సృష్టికారుడు, తానే – సృష్టి పరిపాలకుడుగా శ్రీమహావిష్ణువు శ్రీరాముడే. ప్రళయకారుడుగా శివుడు కూడా శ్రీరాముడే. అలా మూడు రూపములతో భాసిల్లే విశేష మూర్తి శ్రీరాముడు. శ్రీమద్వాల్మీకి రామాయణంలో

ఖరదూషణాది సంహార కాలంలో శ్రీరాముని ముఖము సాక్షాత్ పినాక ధారియగు రుద్రుని తలపించుచున్నది అని అరణ్యకాండంలో వర్ణించారు. మరొక చోట వాల్మీకి రామాయణంలోనే శత్రు సంహార సమయంలో రామునికి పోలికగా రుద్రునే పోల్చారు. స్కంధపురాణంలో "రుద్ర తేజో విలసితం దృష్ట్వా రామకళేబరమ్ ॥. ఈ శ్లోకాల వరసలోనే.... రావణ సంహార కాలంలో శ్రీరాముడు సాక్షాత్ పరమేశ్వర రూపంగా పోలిక చేశారు. అంతేకాక 18 భుజములతో శ్రీరాముడు శివకేశవులకు అభిన్నాకారముగా, గంగాధరుడుగాను లక్ష్మీపతిగాను భక్తులకు సిద్ధకింపురుష గంధర్వాదులకు శ్రీరాముడు దర్శనమిచ్చెనట.

### ◆ వివాహం రోజున ఉపనయనం చేయవచ్చా?

భారతీయ సంస్కృతి మీద జరిగిన ఎన్నో దాడుల ప్రభావంగా వైదిక సంస్కారములు, వాటిని విలువలు ప్రజలకు తెలియని స్థితి ఏర్పడినది. గర్భాష్టమేషు బ్రాహ్మణ ఉపనీయాత, గర్భంలో కలిపి ఎనిమిదవ సంవత్సరం నడుచుచుండగా ఉపనయనం చేయమని నియమం. ఉపనయనం నాటి నుండి బ్రహ్మచారిగా పిలువబడతారు. "ద్వాదశ వర్షాణి బ్రహ్మచర్యం ఆచరేత్" పన్నెండు సంవత్సరములు బ్రహ్మచర్యం పాటించాలి. బ్రహ్మచర్య కాలంలో విద్యాభ్యాసం చేయించి ఆ తరువాత గోదాన వ్రతం, వేదత్రయములు, స్నాతకం చేసుకొని వివాహం చేసుకోమని బ్రాహ్మణులకు చెప్పబడింది. పదకొండవ ఏట రాజులకు, పన్నెండవ ఏట వైశ్యులకు ఉపనయనం చేసి బ్రహ్మచర్య దీక్షానంతరం వివాహం చేయమని చెప్పారు. నేటి సమాజంలో మన వారికి మన సంప్రదాయములు తెలియవు, తెలుసుకోరు. ఒక వేళ ఎవరయినా చెప్తే చాదస్తం అనివిసుక్కుంటారు. బ్రిటీషువారి కాలంలో వచ్చిన ప్రతిబంధకాల దృష్ట్యా, వివాహం నాడు ఉపనయనం చేయడం ఆరంభించారు. మరొక కారణం ఆర్థిక స్థితి. ప్రస్తుతం సమాజం ఆర్థికంగా బలపడినప్పటికినీ, చిన్నతనములో ఉపనయనం చేయుటకు ప్రజలు మక్కువ చూపించం లేదు. వివాహం నాడు ఉపనయనం సమర్థించతగిన అంశము కాదు. బాల్యంలోనే ఉపనయనం చేయాలి.

### ◆ దక్షిణం వైపు స్థలము లేదా షాపు కలుపుకోవాలి ఏమి చేయాలి?

స్థలం.., దక్షిణ స్థలం కొనుక్కోవాలి అంటే ఉన్న స్థలాన్ని వేరే పేరుకు మార్చి అప్పుడు దక్షిణం స్థలాన్ని కొనుక్కోవాలి. అలా కాని ఎడల మనకంటే పెద్దవారి పేరున దక్షిణ వైపు స్థలం కొనుక్కోవచ్చు. షాపు.., దక్షిణషాపు కలుపుకోవాలి అంటే ఉన్న షాపును ఖాళీ చేసి ఈ రెండు షాపులు కలిపి ఒకే అగ్రిమెంటును తీసుకొని అప్పుడు షాపు ఇంటీరియర్ పూర్తి చేసుకొని ఆ షాపులో మరల కొత్త ముహూర్తము చూసుకొని దిగవలెను.

### ◆ ప్రదోషం నాడు ఉపనయనం చేయవచ్చా?

పాడ్యమి, పౌర్ణిమ, అమావాస్య, చతుర్ధశి, అష్టమి రోజులలోను మరియు ప్రదోష దినములు అనబడే "విఘ్నార్కకామ రాత్ర్యాదౌద్వ్యేకార్ధఘటికాఃక్రమాత్" తదియనాడు రాత్రి సూర్యాస్తమయం తరువాత 3.36 ని॥ల లోపు చవితి ఒక అర ఘడియ కలిస్తే అది ప్రదోష దినం. షష్టినాడు రాత్రి సూర్యాస్తమయం తరువాత 12.00 గం॥ల లోపు సప్తమి ఒక ఘడియ కాలం కలిసిన అది ప్రదోష దినమే. ఇలాగ ప్రదోష దినములలో నాలుగు రోజులు ఉపనయనం చేయుట నిషేధము. ప్రదోష దినములలో ఉపనయనం చేసిన ఎడల మరల పునరుపనయనం చేయమని ధర్మశాస్త్రం.

### ◆ అమరావతి రాజధాని అయితే ఎలా ఉంటుంది?

వాస్తు నైసర్గికం బాగుంది అని నిర్ణయించబోనున్నారు. నిర్ణయం అయినా! అవ్వకపోయినా! ఒక విషయం ప్రస్తావిద్దాం. బౌద్ధక్షేత్రంగా మనకు ఊహనిచ్చిన దగ్గర నుండి ఎప్పుడయినా దాని వృద్ధిని చూశామా? ఈ మధ్యకాలంలో ఒకసారి మాత్రం 'బౌద్ధయాగం' ఒకటే జరిగింది. కాలచక్ర పూజ అయితే వాస్తు నైసర్గికం చూస్తే కృష్ణా గుంటూరు జిల్లాలలో వ్యవసాయ రీత్యా అత్యధిక స్థాయి పంటలు పండే ప్రాంతం ఒక మాటలో చెప్పాలి అంటే కృష్ణా గుంటూరు జిల్లాలకు సరిపడ కూరల సరఫరా ఈ ప్రాంతంలోనే అవుతూ వుంటుంది. చంద్రబాబుగారు మంచి అడ్మినిస్ట్రేటర్ కాబట్టి భగవంతుడు ఆయనకు ఆరోగ్యం బాగా యిచ్చి కనీసం ఇంకా రెండు సార్లు ముఖ్యమంత్రిగా వస్తే గానీ రాజధాని దాని నిర్మాణం దానికి కావలసిన మెరుగులు దాని ద్వారా కార్యకలాపములు పూర్తి స్థాయిలో ప్రజలకు అందుబాటుకు రావు. అయితే వేగంగా పూర్తి అవ్వాలని 2016లో గురు, రాహు కలయిక కుజ సంచార దోష ప్రభావం ప్రభుత్వానికి, మంత్రులకు ఎటువంటి ఆటంకములు ఇవ్వ కూడదని ప్రార్థిద్దాం. యింకా యితర ప్రాంతాలకు ఎగు మతి జరిపే స్థాయీ వ్యవ సాయ భూమి. కానీ ఆ ప్రాంతాలలో వ్యవసాయదారుల వ్యవసాయం ద్వారా నిల్వపెట్టి నది చాలా తక్కువ పని అందరూ చెబుతూ వుంటారు అక్కడివారు. మరొక విషయం ఏమిటి అంటే రెండవ జనరేషన్ వారి వారి ఆస్తి అనుభవించే విషయంలో చికాకులు పడుతున్నట్లు ప్రత్యక్ష సర్వే, కృష్ణ నుండి గుంటూరు తెనాలి వైపు పారే రెండు కాలు వలు దక్షిణానికి వెడుతున్న కారణంగా ప్రకాశం బ్యారేజీ నుండి యన్.ఆర్.ఐ. హాస్పిటల్ వరకు మరియు నాగార్జున యూనివర్శిటీ ప్రాంతం వరకు కూడా సమస్యలు లేకుండా అభివృద్ధిగా సాగే సంస్థలు ఒకటీ లేవనే చెప్పాలి. అయితే అమరావతి దగ్గర్లో అటువంటి ప్రయత్నాలు జరగలేదు కావున ఫలితాలు తెలియవు. యిక పెనుమాక గ్రామం దాకా వస్తే తూర్పు-ఈశాన్య కొండ వృద్ధిని తగ్గిస్తుంది. అమరావతీ

నుండి కొంతవరకే రావడం శ్రేయస్కరం విజయవాడ, గుంటూరు హైవే వరకు రాజధాని నిర్మాణం సాగితే 100 వృద్ధి శాతం పొందలేరు. పెనుమాకకు కూడా వచ్చినా ఈశాన్య కొండ దోషం తగులుతుంది. హైవేవరకు వస్తే సీతానగరం ఈశాన్యం కొండ వస్తుంది. అసలు బౌద్ధ క్షేత్రాలు సింగపూర్, మలేషియా వంటివి అంతవృద్ధిలో వుంటే గతంలోనే ప్రసిద్ధ బౌద్ధక్షేత్రం అమరావతి ఎందకు అభివృద్ధికి కాలేదు. పైగా మరుగున పడింది. ఎందుకు ఆలోచించారా? ఉండవల్లి గుహలు ఎప్పటినుండో పర్యాటకశాఖ పరిధిలో వున్నా ఎంత శాతం వృద్ధి పొందింది? ఒకసారి ఆలోచించండి. నూజివీడు ప్రాంతంలో రాజులు ఎక్కువకాలం వంశపారంపర్యంగా పరిపాలన చేసిన చరిత్ర వున్నది. అటువంటి ప్రాంతం వదిలి ఏ రాచరిక చరితా సరిలేని అమరావతి ఎంచుకోవడం ప్రయోగం చేయడమే అవుతుంది అనేది లోకల్‌గా 25 సంవత్సరాల వాస్తు పండితుడిగా నా అనుభవం నాకు ఈ చుట్టుప్రక్కల గ్రామాల చరిత్ర, వృద్ధి శాతం వాస్తు విషయం తెలిసి చెబుతున్న అంశం. ప్రతి సంవత్సరం 2 లేదా 3 పంటలు పండిన రైతు, పొలం ధరలు నేటికి ఒక గొప్ప స్థాయికి రాలేదు అంటే ఆ స్థలంలో ఉన్న వాస్తు మహిమ ఏమిటో నాకు అవగాహన కాలేదు. అమరావతి నుండి అతి తక్కువ క్షేత్రమే వాస్తుకు అనుకూలం. ఉత్తరం కృష్ణకు కట్ట ఎగువగా వుండి గ్రామాలు పల్లంగా కారణంగా ప్రస్తుతం నేతలు ఊహించిన రీతిగా అంతా వాస్తు సౌఖ్యం వున్న భూమి మాత్రం కాదు. తరువాత తరం బలహీనం అవుతుంది. మంగళగిరి ఎయిమ్స్ వరకు మందగమనంగా అయినా మంచి ఫలితాలు తీసుకోగలదు. శాశ్వాత నిర్మాణాలు ఒకసారి స్థలచరిత్ర చదివి తెలిసికొని ముందుకు వెడితే మంచిది. నూజివీడు ప్రాంతం పరిపాలనలో అంతర్భాగం చేస్తేనే మరల చరిత్ర వృద్ధికి వెడుతుంది.

◆ **శ్రీవిద్యోపాసన సరియగు శాస్త్ర విధానంతో ఉపాసిస్తే ఐశ్వర్యం ఖచ్చితంగా వస్తుందా?**

అంత గొప్ప ఉపాసన చేస్తే అమ్మవారి కరుణతో 'శాశ్వతైశ్వర్యా' శాశ్వతం అయిన ఐశ్వర్యం అందుకుంటారు. శ్రీమాత 'నిష్కామా', 'క్రోధశమని', 'లోభనాశినీ', 'మోహనాశినీ', 'మమతాహంత్రీ' అనే నామాలతో పూజింపబడుతోంది. అంతచక్కగా శ్రీ విద్యను ఉపాసిస్తే అరిషడ్వర్గములు తెంచుకొని శాశ్వతమయిన ఐశ్వర్యము బ్రహ్మానందమును అందుకుంటారు. భౌతిక సుఖాలు అనుభవిస్తూనే క్రమంగా ఆ స్థాయికి చేరతారు. అయితే ప్రారంభంలో ఆ మాత ఉపాసకుణ్ణి పరీక్షించడం కోసం ధనయోగం యిస్తుంది. అక్కడ అహంకారమునకు లోనయిన వ్యక్తిని అరిషడ్వర్గములలో బంధుడిని చేసి చివరకు నాశనం చేస్తుంది. ధన బంధంలో కూడా అరిషడ్వర్గాలను దాటే రీతిగా ప్రయత్నంలో కూడిన ఉపాసకుడికి "మోక్షం" యిస్తుంది శ్రీవిద్యోపాసన – మోక్షవిద్యయే.

◆ **దేవాలయ ప్రాకార ద్వారమునకు ఈశాన్యంలో గేటు పెట్టవచ్చా?**

చాలా తప్పుడు పని అది. దేవాలయం ప్రాకారమునకు ఎప్పుడూ తూర్పు దక్షిణ పశ్చిమ ఉత్తర దిశలతో మధ్యలోనే ద్వారం ఉంచాలి. ఈ మధ్యకాలంలో వాస్తుశాస్త్ర మహర్షులు చెప్పినవి అమలు సరిగా జరగడం లేదు. అందువలన ఈ ప్రమాదాలు వచ్చాయి. యిళ్ళ విషయంలో "అంతద్వారాత్ బహిర్ద్వారం నోచ్ఛం నసంకటం" అనే సూత్ర ప్రకారం లోపల ద్వారం కంటే ప్రాకారం ద్వారం ఎత్తు తక్కువ వెడల్పు ఎక్కువ వుండాలి. దేవాలయమునకు మాత్రం ఎత్తు వెడల్పులు ప్రాకార ద్వారమునకు సంబంధించి ఎక్కువగా వుండాలి. విదిక్కులు ఈశాన్యం, దక్షిణ, ఆగ్నేయాలు, పశ్చిమ వాయువ్యంలో ప్రాకార ద్వారాలు దేవాలయములకు పెట్టడం శాస్త్ర విరుద్ధం.

◆ **రాధ గాధ తెలుసుకోవడం ఎలా?**

శ్రీమద్భాగవతమే శ్రీకృష్ణ విశేషములు తెలుపునదిగా చెబుతారు. అయితే అలాంటి పురాణములు యింక ఏమీ లేవా అని పరిశీలిస్తే బ్రహ్మవైవర్తపురాణం నేనువున్నాను అని ముందుకు వస్తుంది. యిందు అతిశయోక్తి లేదు. అయితే భాగవత మునకు వున్న విశేషం బ్రహ్మవైవర్తపురాణమునకు ఎందుకు రాలేదు. అని ప్రశ్నిస్తే చాలా సమాధానములు వున్నాయి. రాధా గాధ మనకు బ్రహ్మవైవర్తంలో విశేషంగా కనబడుతుంది. కానీ శ్రీమద్భాగవతం ఒక శ్రీకృష్ణలీలామృతమే కాకుండా భగవదవ తార కథలు విశేషంగా చూపుతుంది. అంతేకాదు భక్తుల కథలు ఎన్నో శ్రీమద్భాగవ తంలో దృగ్గోచరము అవుతాయి. భక్తుల కథలు భగవంతుని అవతారగాధలు సాంఖ్య యోగం వంటివి ఎన్నో విశేషంగా శ్రీమద్భాగవతంలో వున్నందున మనము శ్రీమద్భాగవతమును పారాయణకు, పఠనమునకు, శ్రవణమునకు అనుష్ఠిస్తున్నాము. గోలోకంలో బ్రహ్మకల్పంలో శ్రీదాముని వలన శాపం పొందిన రాధ., మరియు ఇంకా కొందరి శాపములు గోలోకంలో పొంది రాధ భూలోకంలో జన్మింపవలసి వచ్చింది. సరే ఆవిడ శ్రీకృష్ణుని విడనాడి నివసింపలేదు కావున ఆవిడకోసం శ్రీకృష్ణ పరమాత్మ కూడా భూలోకం చేరవలసిన అవసరం ఏర్పడినది. అయితే అది ఎలాగ అంటే వరాహ కల్పం ప్రస్తుతం మనం వున్న ఈ కల్పములో శ్రీకృష్ణ-రాధ యిరువురు గోపకులంలో జన్మించు రీతిగా శ్రీకృష్ణపరమాత్మ వ్యవస్థ చేశారు. అంతేకాదు, ఈ కృష్ణావతారం కోసం బ్రహ్మదేవుని ప్రార్థన భూభారం తొలగించవలసిన బాధ్యత వంటివి చేయు నెపంతో శ్రీకృష్ణుల వారు రాధతో యితర దేవతాగణములతో భువి మీదకు వచ్చారు. కేవలం ప్రకృతి అంశములు ప్రకృతి దేవతా ఆరాధనలు, గణపతి తత్వములు శ్రీకృష్ణ వృత్తాంతములు బ్రహ్మ వైవర్తపురాణంలో వుంటే శ్రీమద్భాగవతంలో ఇతర దేవతా అవతార కథల వలన భక్తులకు పాఠకులకు శ్రోతలకు అందరికీ శ్రీహరి

మీద భక్తి బాగా పెరుగుతుంది. ఎంతో శ్రమిస్తే కానీ దొరకని శ్రీహరి భక్తి కేవలం భాగవతం కల్గింపచేయగలదు. అలాగే శ్రీమద్భాగవతం మొత్తం ఏడు రోజులు ఒక చోటనే కూర్చొని పఠనం చేయుట లేదా శ్రవణం చేయుట వంటివి పూర్వజన్మ సుకృతం వలన లభించు అంశములే. అంతే కాదు ఇహజన్మలో చేసిన పాపములు పోవలెను అంటే శ్రీహరి చరితా కథామృతం పూర్తిగా వున్న శ్రీమద్భాగవతం ఏదో రూపంగా తెలుసుకోవలసినదే. అందుకే శ్రీహరి పురాణంగా ఉపన్యసింపవలసి వచ్చిన సందర్భంలో శ్రీమద్భాగవతమే ప్రధానాంశం అవుతున్నది.

మరి ఈ రెంటిని అనగా బ్రహ్మవైవర్త పురాణం శ్రీమద్భాగవత శ్రీకృష్ణలీలామృతం పోలిక చేస్తే భాగవతం కంటే బ్రహ్మవైవర్త పురాణంలో ఎక్కువ విశేషాలు వున్నట్లు గోచరిస్తాయి. కానీ ఈ రెంటిలో ఏది గొప్ప అని విశ్లేషించకూడదు. వ్యాస మహర్షి చేత అందింపబడిన ఈ రెండు పురాణాలు తెలుసుకున్నవారు యింకా ఎక్కువ కృతార్థులు వారి జన్మ ధన్యం వారు సదా పూజ్యులు. ఎప్పుడు శ్రీకృష్ణ చరితం తెలుసుకోవడం పఠించడం మరియు వినడం చేయడం వలన వారు మోక్షమునకు దగ్గర అవుతారు. నందపుత్రోత్సాహము, పూతనా మోక్షం, తృణావర్త వధ, శకట భంజన, కృష్ణాన్న ప్రాశన, వృక్షార్జున భంజన, వరకు రెంటిలో కథలు ఒకటే కానీ బ్రహ్మవైవర్తంలో రాధాకృష్ణ వివాహ ప్రసంగం యివ్వబడినది. అలాగే బలకేశివధ, కాళీయ దమనము. ఇంద్రయాగ భంగము, ధేనుకవధ, గోపికా వస్త్రాపహరణ, రాసక్రీడ రెండిటోను వుండగా రాధా శ్రీకృష్ణ విశేషాలు ఎక్కువగా అందించినది బ్రహ్మవైవర్త పురాణం. ఎందుకు అలాగ అంటే రాధ కోసం శ్రీకృష్ణుడు భువి చేరినట్లు ప్రధానాంశం చేసినది బ్రహ్మవైవర్తం. భక్తుల రక్షణ కోసం పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదు ష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే అనే కోణంలో భగవదవ తారం శ్రీకృష్ణావతారంగా శ్రీమద్భాగవతం ముఖ్య ఉద్దేశ్యంగా సాగినది. అందుకే భక్తి ప్రధానంగా సాగిన అవతారగాధలు శ్రీమద్భాగవతం ముఖ్య ఉద్దేశ్యంగా సాగినది. అందుకే భక్తి ప్రధానంగా సాగిన అవతారగాధలు శ్రీమద్భాగవతంలో చెప్పబడుతుంది. మధురకు పయనం అయిన శ్రీకృష్ణులవారి ప్రస్తావన వరకు రాధా ప్రసంగం బ్రహ్మ వైవర్తంలో విశేషంగా వున్నది యిది. చాలా విశేషం ఏమిటి అంటే అవతారం క్రమంగా చాలించు విషయంలో భాగంగా రాధాకృష్ణుల కలయక వారు మరల క్రీడించుట, రాధాకృష్ణుల గోలోక ప్రయాణం వ్రజ జనాల సేవ యివి అన్నీ శ్రీమద్భాగవతంలోలేని విశేష అంశాలు మనకు బ్రహ్మవైవర్తంలో కనబడతాయి. అయితే మరొక విషయం ఏమిటి అంటే రాధా ప్రసంగం కోసం సాగిన కృష్ణ చరిత అయిన బ్రహ్మవైవర్తపురాణం అయినా – భక్తిప్రధానంగా సాగిన శ్రీమద్భాగవతం అయినా ఏదో ఒక విషయంగా శ్రీకృష్ణ చరిత శోధన ప్రారంభించినవారికి మోక్షప్రాప్తి తప్పక లభిస్తుంది అంటే

అతిశయోక్తి లేదు. మనం రెంటి విషయాలను విపులంగా తెలుసుకుందాం అనుకునే వారికి బ్రహ్మవైవర్తరితో పాటు, భాగవతంతోపాటు గర్గపురాణం గురించి కూడా తెలియాలి. శోధన చేయండి.

◆ **ఉపనయనం వివాహంతో కలిపి చేయకూడదు కదా! ఈ ఆచారం ఎలా వచ్చింది? ఏమిటి ఆధారం?**

టివిలలో వచ్చే ఉపన్యాసాల ప్రభావమేమో చాలా మంది ఫోన్‌లు చేసి అడిగారు. 16 సంవత్సరాలోపుగానే ఉపనయనం చేయాలి. యిది భారతీయ సంస్కృతి. యింటికో ఆచారం వుండదు. యిది గుర్తుంచుకోండి. గర్భాష్టమం మొదలు 16వ సంవత్సరం వరకు ఉపనయనమునకు మంచి కాలమే. యిందులో సరి, బేసి సంవత్సరాల వాదన అసలు లేదు. అలా చర్చించడం పిచ్చివాదన అవుతుంది. యిక మరొక విషయం ఉపనయనం అయిన తరువాత బ్రహ్మచారిగా "ద్వాదశవర్షాణి బ్రహ్మ చర్య మాచరేత్" అన్నారు 12 సంవత్సరాలు కాలం బ్రహ్మచారిగా వుండి విద్యార్జన చేయాలి. ఆ తరువాత స్నాతకుడు అయి వివాహం చేసుకోవాలి. మరి వివాహం రోజు ఉపనయనం అనే దుష్ట సాంప్రదాయం ఎలాగ వచ్చింది. బ్రిటీషు కాలంలో అన్ని కులాలలోని యువత స్వాతంత్రోద్యయంకు వెడుతుండేవారు. ఆ ఉద్యమంలో మరణించిన వారికి ఆబ్దీకములు శాస్త్రీయంగా ప్రతి సంవత్సరమూ నిర్వహింపవలసినదే. అందువలన యువకులలో ఈ ఉద్యమ ఉత్సాహం గమనించిన పెద్దలు... ఒక వేళ మన పిల్లవాడు ఉద్యమానికి ఆకర్షితుడయినా, కాకపోయినా వివాహ కాలం వచ్చే వరకు బుద్ధిగా వుంటే అప్పుడే ఉపనయనం చేద్దాంలే. లేకపోతే ఒక వేళ వీడు ఉద్యమానికి వెళ్ళి పొరపాటున కాలం చేస్తే., కేలవలం ఆబ్దీకములు పెట్టడం ఒకటే మిగులుతుంది అనే నెపంతో వివాహంలో ఉపనయనం అనే కార్యం మొదలు పెటారు. అది ఆనాటి స్థితి. ఉద్యమం ప్రతి పల్లెలో ప్రజల్ని ఆకర్షితుల్ని చేసింది. ప్రజలు వైదీక సాంప్రదాయ విద్యార్జన మీద కూడా ఎక్కువ దృష్టి చూపలేదు. అందుకే ఆ బ్రిటీషర్స్ కాలం నుండి వైదీక సాంప్రదాయములు కూడా పాడయినాయి. అంతేకాదు ఉపనయనది సంస్కారములు పాడయినాయి. ఆ బ్రిటీష్ కాలంలో ప్రారంభం అయిన ఉపనయనం వివాహం కలిపి ఒకే రోజు చేయడం అనే దుష్ట ఆచారం నేడు "మా యింటి ఆచారం" అనే స్థాయికి దిగజారింది. అందరు మతస్థులు వారి వారి ఆచారాలు సకాలంలో సక్రమంగా చేసుకుంటారు. కానీ భారతీయ సంస్కృతికి మూల కారణం అయిన ఉపనయనం మరియు గాయత్రీ అనుష్ఠానం మాత్రం మన భారతీయులు సకాలంలో చేయకపోవు స్థితికి దిగజారారు. మరల చెబుతున్నా వివాహంలో ఉపనయనం దుష్ట సాంప్రదాయం ఉపనయనం అయి గాయత్రీ అనుష్ఠానం చేయని వాడు కర్మ భ్రష్టుడు.

◆ **అయ్యా! అస్థిసంచయనం అనే కార్యంలో అస్థికలు వేరు వేరుగా నదులలో కలిపే ఆచారం వున్నదా? యిది శాస్త్రీయమేనా?**

వేరు వేరు నదులలో కలపడం పెద్ద దుష్ట సాంప్రదాయం. ఒకసారిగా అన్ని అవయవాలతో పుట్టిన వ్యక్తికి ఒకసారిగానే సంస్కారం చేయాలి. విడివిడిగా వేరు వేరు నదులలో కలపడం అనేది శ్రేయస్కరం శాస్త్ర సమ్మతం కాదు. ఒక వేళ దగ్గర్లో జీవనది వుంటే ఆ నదికే ప్రాధాన్యం యివ్వవలెను కానీ, వేరే నదికి వెళ్ళి అస్థి సంచయనం చేయుట సరికాదు. అంతేకాదు దగ్గర్లో వున్న నదిలో కొంత వేరేచోట వున్న నదిలో మరికొంత అస్థులు సంచయనం చేయడం శాస్త్రం కాదు. నేటి సమాజంలో గోదావరిలో కొంత, గంగలో కొంత కలపవలెను అనే దృష్టిలో అస్థులు సంచయనం రోజు ఆపుట దోషమే. ఒక శరీరమునకు ఒకసారే జననం. ఆ శరీరమునకు దహనానంతరం ఒకసారే సంచయనం. ఈ కార్యం కోసం పక్కనే వున్న జీవనది ప్రాధాన్యత గంగకంటే ఎక్కువే. ఈ ప్రశ్న అడిగిన మీకు వైదీకుల సహవాసం ఎక్కువ అని తలంపు వస్తుంది. "ఒకసారి జననం, ఒకేసారి దహనం, ఒకేసారి అస్థిసంచయనం".

◆ **వధూవర గణ సమ్మేళనం అనే పట్టిక శాస్త్రయుక్తమేనా?**

అతి చాలా తప్పుడు పట్టిక. మనకు గ్రహమైత్రికి, రాశికూటమికి, నాడీకూటమికి ఇలాగ వరుసగా ఒక్కొక్క కూటమికి కొన్ని కొన్ని పాయింట్లు ఆ పట్టికకు ఆధారం. అయితే ఒక తప్పు ఉన్నది. అందులో మతాంతర పాఠాలు పరిధిలోకి తీసుకోలేదు. ఉదాహరణకు గ్రహమైత్రి కుదిరినపుడు స్త్రీదీర్ఘము, నాడీకూటము చూడనవసరం లేదు. వారు ఈ పాఠాన్ని పరిధిలోకి తీసుకోలేదు. ఇలాగ తప్పుల నడకతో ఉన్న ఆ పట్టిక ప్రపంచ వ్యాప్తం అయిపోయినది. కలిలో అనవసర విషయాలు ప్రపంచ ఖ్యాతి గడిస్తాయి అని మహర్షులు పురాణాలలో చెప్పిన వాక్యం ఈ పట్టిక విషయంలో నిజమైనవి. మీరు ముహూర్తదర్పణం, ముహూర్తసుధ, కాలామృతం మరియు ముహూర్త చింతామణి గ్రంథాలు పరిశోధన చేస్తే మీకు ఆ పట్టికలోని తప్పులు తేలికగా తెలుస్తాయి.

◆ **త్రిజ్యేష్ఠ అనే అంశం నిత్యం వాడుకునే అంశమా?**

కాదు. కేవలం జ్యేష్ఠమాసంలో ఇద్దరు జ్యేష్ఠులకు వివాహం చేయు సందర్భంలో చెప్పిన నిషేధ వాక్యము. ప్రథమ గర్భంలో పుట్టినవారు మాత్రమే జ్యేష్ఠులవుతారు. ఇతర మాసాలలో చేయు త్రిజ్యేష్ఠలు శాస్త్రం కాదు. జ్యేష్ఠుడు, జ్యేష్ఠానక్షత్రం, జ్యేష్ఠ మాసజననం ఇవి అన్నీ కూడా శాస్త్రదూరమైన అంశాలు. కేవలం జ్యేష్ఠమాసంలో వివాహం మాత్రమే త్రిజ్యేష్ఠకు అనుబంధము. జ్యేష్ఠురాలు జ్యేష్ఠపౌర్ణిమ జ్యేష్ఠానక్షత్రంలో

పుడితే ఆమె స్వయంగానే త్రిజ్యేష్ఠకదా! ఇక పుట్టగానే వివాహం చేయక్కరలేదు అనే నిర్ణయానికి రావాలా? భవిష్యత్తులో అందరూ ఒకరినే కంటారు మరి వారే జ్యేష్ఠులు. ప్రతి ఇరవై ఏడు రోజులకు జ్యేష్ఠానక్షత్రం ఆవృతం అవుతుంది. మరి అటువంటి సందర్భంలో వివాహం కష్టసాధ్యమే. ఇటువంటి పిచ్చి శాస్త్రాలు మన మహర్షులు ఇవ్వలేదు. ఎటువంటి త్రిజ్యేష్ఠలోనైనా జ్యేష్ఠమాసం వివాహం అనే ఒక అంశం కలిస్తేనే దీని చర్చ. మిగతా 11 మాసాలలో వివాహ విషయంలో త్రిజ్యేష్ఠచర్చ లేదు.

### ◆ సంవత్సర సూతకంలో సాధారణంగా చేయకూడని, చేయదగిన కార్యములు ఏమిటి?

తల్లిదండ్రులకు కర్మ చేయు సందర్భంలో మాత్రమే సంవత్సర సూతకం వర్తిస్తుంది. ధర్మబుద్ధితో ఇతరులకు కర్మకాండ చేయవలసిన సందర్భంలో సంవత్సర సూతకం ఉండదు. కర్తృత్వం ఆపాదింపబడే మాతామహ, మహీలలో విషయాలలో కూడా సంవత్సరసూతకం ఉంటుంది. ఆ సందర్భంలో నిత్య పూజలకు అడ్డం లేదు. దేవా లయ దర్శనం నిషేధం., ఒకవేళ వృత్తి రీత్యా దర్శించిన తీర్థ ప్రసాద శఠగోప వంటివి తీసుకోరాదు. విశేష ఆబ్దీకములు నిషేధము. ఇతరుల ఇండ్లలో శుభ, అశుభ కార్యములో పాల్గొనడం వారికి బట్టలు పెట్టడం, వారినుండి బట్టలు పెట్టించుకోవడం వంటివి చేయరాదు. తీర్థయాత్రలు చేయరాదు. అయితే వృత్తిరీత్యా వెళ్ళే మార్గంలో దేవాలయ దర్శనం దోషం కాదు. ఎవరికి అక్షింతలు వేయరాదు. ప్రత్యేక పూజలు ఇంటా బయట నిషేధమే. ఇక సంవత్సరసూతకంలో తన భార్య గర్భిణీగా ఉంటే శిశు కార్యక్రమములకు దోషము లేదు అన్నారు కాబట్టి సీమంత, పుంసవన, జాతకర్మ, నామకరణ, డోలారోహణ, నిష్క్రమణ, అన్నప్రాశనలకు దోషము ఉండదు. శిశువులకు బాలారిష్ట శాంతి చేయించుకోవచ్చును. ఒకవేళ సూతకంలో ఉన్నవారికి గ్రహశాంతి అత్యావశ్యకమైతే గురు ఆజ్ఞతో అనుష్ఠించవచ్చును. తల్లిదండ్రులకు కర్మ చేసినవాడు పెద్ద కుమారుడైనను మిగిలిన వారికి కూడా సూతక దోషం ఉంటుంది.

### ◆ వస్త్రధారణ విషయంగా కూడా శాస్త్రం చెప్పబడిందా?

శివపురాణంలో శివార్చన సమయంలో పంచకట్టు మాదిరిగా ధోవతిని కట్టమని చాలా స్పష్టంగా చెప్పారు. అంతేకాదు అక్కడ అన్ని రకాల పూజలయందు అని కూడా చెప్పబడినది. దీని ప్రకారం పూజల యందు పంచకట్టు తప్పనిసరి. బ్రహ్మచారి అయిన వారు లుంగీ కట్టుగా కట్టుకొనినను అంతరకవచం (అండర్ వేర్) తప్పని సరిగా ధరించాలి. గృహస్థుగా ఉన్నవారు పూజా సమయం కాకుండా మిగిలిన సమయాలలో లుంగీ కట్టదలచిన ఎడల అంతరకవచం తప్పనిసరి కాని ఆయుర్వేద నియమాల ప్రకారం పంచకట్టులో ఆరోగ్య సిద్ధి ఉందని తెలియజేస్తారు. వైదిక

సాంప్రదాయప్రకారం పౌరాణిక నియమం ప్రకారం కూడా "భూమి స్త్రీస్వరూపం గుమ్మం స్త్రీస్వరూపం (గౌరీ) నది స్త్రీస్వరూపం నీరు స్త్రీస్వరూపం (లక్ష్మి)" అందువలన మర్మాంగములకు ఆచ్ఛాదన లేకుండా వాటిని దాటరాదు. అంతేకాక వివస్త్రగా స్నానం చేయరాదు. "నవివసనస్నాయాత్" వేదవాక్యం. స్త్రీలకు కూడా పూజా సమయంలో ప్రత్యేక వస్త్రధారణ నియమం చెప్పబడింది.

**◆ శ్రీ పంచమి రోజు తారాబలం కుదరక పోయినా అక్షరాభ్యాసం చేయవచ్చా?**

శ్రీ పంచమి విశేషమయిన దినమే. బాసర విశేషమయిన క్షేత్రమే. కానీ అనేక మంది మహర్షులు జ్యోతిష శాస్త్రంలో శ్రీపంచమి రోజున అలాగే బాసర క్షేత్రంలోను తారాబలం కుదరకపోయినా గ్రహబలం లేకపోయినా మరియు ఇతర మూఢమి వంటి రోజులలో అయినా అక్షరాభ్యాసం చేసుకోవచ్చు అని ఎందుకో చెప్పలేకపోయారు పాపం., ఒకవేళ వాటి విశేషం అంత గొప్పగా ఉంటే మనం తారాబలం కుదిరితే శ్రీపంచమి రోజు విద్యారంభం చేయవచ్చు. శ్రీపంచమి నాడు మరియు బాసర వంటి క్షేత్రాలలో సరస్వతి అర్చన చేయడం మూలంగా విద్యావ్యాసంగం పెరుగుతుంది. అంతేగానీ అక్షరాభ్యాసానికి మహర్షులు అంత శాస్త్రం చెబితే దానిని కాదని కేవలం శ్రీపంచమి అనే విశేషంతో అక్షరాభ్యాసం చేయడం సరికాదు.

**◆ భారతీయ సంస్కృతికి సంధ్యోపాసనకు ఇంటి ముందు ముగ్గుకు అనుబంధం ఏమిటి?**

ఇంటి ముందు ముగ్గు వేయకుండా ఎటువంటి పూజలు చేయరాదు. దేవతాహ్వానం చేయాలి అంటే ఇల్లు శుభ్రంగా ఉండాలి కదా! అందులో భాగమే ఇంటి ముందు ముగ్గు. తర్వాత సంధ్యోపాసన అంటే సూర్యోదయ సూర్యాస్తమయ సమయాలలో ఉపనయనార్హత ఉన్నవారు సంధ్యావందనాది నిత్య కర్మానుష్ఠానం చేయడం వారికి తోడ్పాటుగా ఆడవారు గృహ శుద్ధి చేయడం రెండూ సంధ్యోపాసనములే. ఉపనయనార్హత లేని వారి విషయంలో కూడా అమంత్రకంగా సంధ్యోపాసన చెప్పబడింది.

**◆ ఇంట్లో హోమం చేసుకోవాలి. హోమగుండం ఈశాన్యంలో పెట్టవచ్చా?**

పెట్టవచ్చు. "ఉత్తరపూర్వ దేశౌగార స్యోత్తర యాగ్నిం ప్రతిష్ఠాపయతి" అని పూజార్హమైన అగ్నిని ఈశాన్యంలో ప్రతిష్ఠించాలి అని చెప్పారు. ప్రస్తుతం నేటి సమాజంలో ఈశాన్యంలో అగ్ని అనే అనవసరమయిన ఆందోళన అందరిని పీడిస్తుంది. కానీ పూజార్హ అగ్ని ఈశాన్యంలో శ్రేష్ఠమే.

**◆ వాస్తు శాస్త్రం మోడ్రన్ కాలనీలను ఆధారం చేసుకొని చెప్పబడిందా?**

విశ్వకర్మవాస్తు, మయవాస్తు వంటి గ్రంథాలు చదివితే మీకు మనం ఎంత అసహ్యకరమైన గృహనిర్మాణాలు చేసుకుంటున్నామో అనే విషయం అర్థం అవుతుంది.

ఇంటి వెడల్పులో 1/9 వ వంతు స్థలం ఇంటి చుట్టూ వదలమన్నారు. భూగర్భ నీరుకి అవకాశం మొక్కలు పెట్టే అవకాశం లేకుండా ఇల్లు కట్టవద్దని అన్నారు. ప్రతి గదికి వెంటిలేషన్ దృష్ట్యా ద్వారం కిటికీ లేకుండా నిర్మాణం చెప్పారు. అంతేకాకుండా "ఆర్జవేనవిహీనశ్చ" అనే శ్లోకంలో ఏకస్యాంవీధ్యాంపంక్తిశోభార్థం అనే వ్యాఖ్యానం పరిశీలిస్తే నేడు మోడ్రన్ కాలనీల కంటే శాస్త్రకారుడు చెప్పిన రీతిలో గృహ నిర్మాణం చాలా ఆరోగ్య ప్రదమని తెలుస్తుంది.

### ◆ సదాచారం, వామాచారం, దురాచారం, అనాచారం, సమయాచారం, వీటిలో బేధములు ఏమిటి?

మీకు తెలిసి అడిగినా? తెలియక అడిగినా? లలితా సహస్ర నామాలతో అను సంధానం అయిన ధర్మ శాస్త్ర ప్రశ్నవేశారు సంతోషం. సత్+ఆచారం సదాచారం. మంచి ఆచారం అనగా మనకు మన ప్రవర్తన విషయంగా కాని, పూజాదికములు, వ్రతములు, వివాహాది కర్మకాండ, సాంఘీకంగా సంచారం వీటి విషయంలో మనకు కొన్ని నియమ నిబంధనలు యివ్వబడినాయి. వాటిని ఉల్లంఘించకుండా మనం ప్రవర్తించడమే సదాచార ప్రవర్తన అనిపించుకుంటుంది. ఆ నియమ నిబంధనలు వేదము, శాస్త్రము, పురాణము ఆధారంగా చేశారు. కొన్ని నియమాలు మాత్రం ప్రాంతీయంగా దొరికే వనరుల దృష్ట్యా ఏర్పాటు చేశారు. "సదాచార ప్రవర్తినీ" అనీ నామం అమ్మవారికి వున్నది కదా! సదాచారంగా ప్రవర్తించే వారిని శ్రీమాత రక్షిస్తుంది. వారికి అమ్మ అనుగ్రహం వున్నట్లే. వామాచారం అమ్మవారి ఆరాధనా క్రమంలో త్వరగా ఆ మాత దగ్గరకు చేరడానికి ఏర్పరచిన తాంత్రిక విధానం దీనితో చాలా ప్రతిబంధకములు రాగలవు. యిది వైదీకమార్గమునకు విరుద్ధము. వైదీక మార్గం అంటే వేదవిహితమయిన కర్మానుష్ఠానము. అనాచారం అంటే ఏ విధమయిన ఆచారము లేకుండా ఏ విధంగా తోచితే ఆ విధంగా ప్రవర్తించడం. దీనిలో తెలియక ఆచరించడం తెలిసి ఆచరించడం రెండు రకాలు వుంటాయి. సదాచారం తెలిసి కూడా అహంకారంతో దుర్మార్గ ప్రవర్తనతో వుండడం దురాచారం. అనాచారం వామాచారంతో ఎవరికీ యిబ్బంది రాదు. శాస్త్రం చెప్పిన రీతిగా ఆచరింపకపోవడం అనాచారం దీని వలన వాడు ఒకడే యిబ్బంది పడతాడు. దురాచారం అంటే వేద విహితమయిన కర్మానుష్ఠానం చేయకపోగా చేసే వాడిని చెడకొట్టడం అలాంటి దురాచారం వలన సంఘమునకు యిబ్బంది ఉంటుంది. అమ్మవారి నామాలలో "దురాచార శమనీ" అని వున్నది కదా! ఆవిడ దురాచార పరులను శిక్షించునది అని తెలుస్తోంది. సమయాచారం అంటే మంత్రంతో వున్న బీజాక్షరములు ఏయే స్థాన ములలో ఏ రీతిగా పలకాలి అనే గొప్పవిద్య. వ్యాకరణ శాస్త్రంతో ముడిపడివున్నది.

అసాధారణమయిన ఈ సమయాచారము తెలియకుండా చేయు శ్రీ విద్యోపాసన వలన ఉపాసకుడి సక్సెస్‌రేట్ తక్కువ స్థాయిలోనే ఉంటుంది. సమయాచారము తెలిసి ఉపాసన చేయండి. మూలాధారం నుండి సహస్రారం వరకు చైతన్యం కలిగి కుండలినీ యోగంతో మోక్షసాధన చేయగలుగుతారు. నేడు సమయాచారము గురించి పాఠం చెప్పగల ధీమంతుడు తక్కువ. గురువు వ్యాకరణ పండితుడు అయినా కానీ లేదా అనువంశీగా తయారు చేయబడిన గురువు అయినా సరే దీనిమీద సరియగు పాఠం చెప్పగలరు. లలితానామంలో "సమయా చారతత్పరా" అని వున్నది కదా! ఈ నామంభాష్యంలో ఉపాసకుడికి వ్యాకరణ శాస్త్రం తెలిసి అక్షరములను వివిధ స్థానములలో పరికించడం యొక్క గొప్ప విశేషం తెలుస్తుంది.

◆ **విద్యా విషయమై ఏయే ఉపాసనలు ఎక్కువగా ఫలితాన్ని చూపిస్తాయి?**

మహాసరస్వతీ ఆరాధన.

యిందులో భాగంగా మహాలక్ష్మి మహాకాళీ, మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీమాతలలితా ఉపాసన.

యిక వేదంలో ఈశానస్సర్వ విద్యానాం అని వేదంలో వున్నది.

"శ్రీ శివాశివ శక్త్యైక్య రూపిణీ లలితాంబికా" అని కదా! లలితా నామం. యింతేకాదు "శివజ్ఞాన ప్రదాయినీ" అని కూడా వున్నది శివ అంటే పరమ శివుడు "శివా" అంటే శ్రీమాత. అందువలన లలితను ఆరాధించినా అంతరంగా శివుని ఆరాధన పూర్తి అవుతుంది. పంచాక్షరీ చేస్తే పరోక్షంగా శ్రీమాతారాధన పూర్తి అవుతుంది. పంచాక్షరీ చేస్తే పరోక్షంగా శ్రీమాతారాధన పూర్తి అవుతుంది. యిక చదివిన చదువులో తెలివి పనిచేయుటకు "మేధాదక్షిణా మూర్తి". చదువు స్థిరంగా వుండడానికి కాను. హయగ్రీవ ఆరాధన చేయవలెను. బ్రహ్మవేదాంత విదయ పొందాలి అంటే నారసింహ ఆరాధన చేయాలి. శ్రీరామ ఆరాధకులకు వేదాంత విద్య వస్తుంది. శ్రీ కృష్ణ ఆరాధకులకు భక్తి జ్ఞాన విద్యలు వస్తాయి. నారసింహ లేదా శ్రీరామ అనుష్ఠానం చేసే డాక్టర్లకు సక్సెస్‌రేట్ ఎక్కువ అని పెద్దలు చెబుతారు.

◆ **పురాణాలలోని కాలచక్ర వివరం తెలియచేయగలరు?**

నాకు తెలిసిన కొన్ని విషయాలను సూక్ష్మంగా ఇక్కడ ఇస్తున్నాను. కొన్ని పురాణాలు జ్యోతిష గ్రంథాల ఆధారంగా ఇవ్వడం అయినది. గడియారములు రాక పూర్వం ప్రపంచమునకు మొదటిసారిగా భారతీయులు సమయ నిర్ణయ విధానం నేర్పారు. కాలాన్ని విభాగం చేసి కాలస్వరూపాన్ని అందించారు. జనక మహారాజుకు పూర్వుడయినటువంటి నిమిచక్రవర్తి యొక్క కనురెప్పపాటు వ్యవధిని ఒక నిమిష ముగా అభివర్ణించారు. నిమి మిథిలాపురమునకు అధిపతి. నిమిషము యొక్క

పరిమాణము తెలిసిన ఎడల మిగిలిన కాలప్రమాణము అంతా తేలికగా శోధించ వచ్చు. కాలక్రమంలో నిమిషం యొక్క వివరం యిలా తెలిపారు.

***శ్లో॥ తీక్ష్ణ సూచ్యాబ్జ పుష్పస్య దళవేధస్త్రుటిర్భవేత్ ।***
***తచ్ఛతం లవత్యుక్తం తత్త్రింశ నిమిష స్మృతం ॥***

పదునైన సూదితో ఒక తామర దళమును గుచ్చితే ఆ సూది దళమును దాటుటకు పట్టు కాలము ఒక 'తృటి'గా కనుగొన్నారు. అటువంటి 100 తృటుల కాలము ఒక 'లవ' అగును. అటువంటి ముప్పది లవల కలిపితే ఒక నిమిషము అగును అని నిర్ధారించారు. కాలము యొక్క పరిమాణము కనుగొనుటతో ఆగక సమయ నిర్ధారణ కూడా జ్యోతిశ్శాస్త్ర ఆధారంగా సూర్యగమనాన్ని మనిషి యొక్క నీడను బేరీజు చేసుకుంటూ సమయగణన విధానాలు కనుగొన్నారు. చాలా విశదీకరణతో కూడిన చక్కటి విధానాలు మనకు జ్యోతిశ్శాస్త్రంలో వున్నాయి. ఒక ఘడియకు 24 నిమిషములు. ఒక నిమిషమునకు రెండున్నర విఘడియలు. యిలాగ కాలచక్ర కొలమానం ఏర్పాటు చేశారు.

ఒక రోజుకు అరవై ఘడియలు. ముప్పది రోజులు ఒక మాసం. 12 మాసములు ఒక సంవత్సరం. ఇలాంటి 4,32,000 సంవత్సరములు ఒక కలియుగ ప్రమాణము. 8,64,000 సంవత్సరములు ద్వాపరయుగ ప్రమాణము. 12,96,000 సంవత్సరములు త్రేతాయుగ ప్రమాణము 17,28,000 సంవత్సరములు కృతయుగం ప్రమాణముగా గుర్తించారు. ఈ నాలుగు యుగములను కలిపి ఒక మహాయుగంగా అభివర్ణించారు. యిటువంటి 71 మహాయుగములు కలిపితే ఒక మన్వంతరం అవుతుంది. 4 మన్వంతరాల ప్రమాణం ఒక కల్పము అనబడును. ఈ కల్పము బ్రహ్మకు ఒక పగలు అగును. యితే రీతిగా రాత్రిని కూడా గణింపవలెను.

ప్రతి మన్వంతరమునకు ముందు ప్రారంభంలోను చివర అంతంలోను ఒక కృతయుగ ప్రమాణం సంధి వుంటుంది. 14 మన్వంతరములు, 15 సంధులను కలిపి ఒక కల్పము అంటారు. పగటి కల్పము బ్రహ్మకు ప్రారంభం అవ్వగానే బ్రహ్మ నిదుర నుండి లేచి ధ్యానయోగములో కొంత కాలము వుండి తర్వాత చరాచర్మాతకమగు సృష్టిని ప్రారంభం చేయును. రాత్రికల్పము ప్రారంభం అవ్వగానే బ్రహ్మ నిదురించును. రెండు కల్పములు కలిపితే బ్రహ్మకు ఒక దినము అగును. రాత్రి కాలములో బ్రహ్మ నిదురించు కాలములో సమస్త చరాచర జగత్తు నశించును. అలాగ బ్రహ్మ నూరు సంవత్సరముల కాలము గడుపును అని పురాణవచనము.

మనకు ప్రస్తుతము ఆరుగురు బ్రహ్మలు గతించిరి. మానసము, చాక్షుషము, వాచికము, శ్రావణము, సత్యము, అండజము అని ఆరు బ్రహ్మ కాలములు నడచినవి. ఏడవ బ్రహ్మ అయిన పద్మజుని కాలములో వున్నాము మనము. శ్రీమహావిష్ణువు యొక్క

నాభికమలము నుండి ఉద్భవించారు. ఈయనకు ప్రస్తుతం 51వ సంవత్సరం నడుచుచున్నది. యిందులో ప్రథము కల్పము అగు శ్వేతవరాహకల్పము నడచుచున్నవి. శ్వేతవరాహ కల్పములో స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుషములు అనబడే అరుగురు మనువుల కాలము నడచి ఏడవది అయన వైవస్వతమనువు యొక్క కాలములో మనము వున్నాము. ఈ వైవస్వత మనువు కాలములో కూడా 27 మహాయుగములు నడచినవి. ప్రస్తుతం 28వ మహాయుగంలో కృతత్రేతా ద్వాపర యుగములు గడచి కలియుగంలో ఉన్నాము. మన్వంతరములు పేర్లు తెలుసుకుందాం. 1) స్వాయంభువ 2) స్వారోచిష 3) ఉత్తమ 4) తామస 5) రైవత 6) చాక్షుష 7) వైవస్వత 8) సూర్యసావర్ణి 9) దక్షసావర్ణి 10) బ్రహ్మసావర్ణి 11) ధర్మసావర్ణి 12) రుద్రసావర్ణి 13) రౌచ్య 14) బౌచ్ఛ

ప్రతి మహాయుగం ద్వాపరయుగంలో శ్రీమహావిష్ణువు వ్యాస అవతారము ఎత్తి వేదవిభాగము చేయుటయు అలాగే పురాణ రచనలు చేయుట వంటివి చేస్తూ వుంటారు. యిప్పుడు మనం 27 మహాయుగములు గతించినవి అనుకున్నాం కదా! గతించిన వ్యాసులు ఎవరు అని తెలుసుకోవలసిన అవసరం వున్నది. వారు వరుసగా 1) స్వాయంభువ 2) ప్రజాపతి 3) ఉశన 4) బృహస్పతి 5) సవిత 6) మృత్యువు 7) ఇంద్ర 8) వశిష్ఠ 9) సారస్వత 1) త్రిధామ 11) త్రివృష 12) భరద్వాజ 13) అంతరిక్షక 14) ధర్మ 15) త్రయారుణ 16) ధనంజయ 17) కృతంజయ 18) సంజయ 19) భరద్వాజ 20) గౌతమ 21) ఉత్తమ 22) వాజశ్రవ 23) సోమశుష్మ 24) ఋక్ష 25) శక్తి 26) పరాశర 27) జాతూకర్ణి ప్రస్తుతం శ్రీమహావిష్ణువు అని కృష్ణద్వైపాయనుడు వేదవ్యాసుడిగా వ్యవహరిస్తున్నారు.

ప్రస్తుతం మనం శ్వేతవరాహకల్పములో వున్నాము.

రాజ్యభారం దృష్ట్వా స్వాయంభువ మనువు యొక్క సంతానము భూమిని ఏడు ద్వీపములుగా విభజించిరి. 1). జంబూద్వీపం 2) ప్లక్షద్వీపం 3) క్రౌంచద్వీపం 4) కుశద్వీపము 5) శాల్మికద్వీపము 6) పుష్కరద్వీపము 7) శాకద్వీపము అను పేర్లతో ఏడు ద్వీపములుగా విభజింపబడినది. ప్రస్తుతం మనం వున్న భూభాగం జంబూ ద్వీపంలోని అగ్ని యొక్క కుమారులు నాభి, కింపురుష, హరివర్ష, ఇళావృత, రమ్య, హిరణ్యవంత, కురువు, భద్రాశ్వ, కేతములు అనబడువారు పంచుకొనిరి. జంబూ ద్వీపానికి నాభి అధిపతి అయిరి.

నాభికి మేరుదేవి యందు ఋషభుడు కలిగెను. ఋషభుని సంతానం 100 మంది. అందులో పెద్దవాడు భరతుడు. ఋషభుని తర్వాత భరతుడు రాజ్యాభిషిక్తుడయ్యెను. భరతునిచే పరిపాలింపబడిన ప్రాంతం కనుక భరతవర్షము అని పిలువబడుచున్నది.

*శ్లో॥ ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రేశ్చైవ దక్షిణమ్ ।*
*వర్షంతు భారతంనామ భారతీయత్ర సంతతి ॥*

సముద్రమునకు ఉత్తరమున, హిమాలయములకు దక్షిణముగా గల భూమి "భరతవర్షము" అని పిలువబడుతుంది. అందు నివసించు ప్రజలు భారతీయులు అగుదురు. ఈ భూమిని గూర్చి విష్ణుపురాణంలో "కర్మభూమిరియం స్వర్గమపవర్గంచ గచ్ఛతామ్" అని చెప్పబడినది. ఈ భరత వర్షమునకు కర్మభూమి అని పేరు. కోరిన వారిని స్వర్గమును మోక్షమును యిచ్చును. 'జీవులు భరతవర్షము నుండి మాత్రమే మోక్షము పొందగలరు' అని విష్ణు పురాణము తెలుపుచున్నది.

మనం ఏ శుభకార్యం చేసినా సంకల్పంలో ఈ కాలచక్ర విధానం ఉంటుంది. అద్య, బ్రహ్మణ, ద్వితీయపరార్ధే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే... అని – దీని విశిష్ఠత అర్ధ మయింది కదా! మన పురాణాల ద్వారా యింకా విశేషాలు ఎన్నో అందుకోవచ్చు.

- **2015 సం॥ ఆంధ్ర, తెలంగాణా కలిసి వున్నప్పుడు యిప్పుడు ఏ ఆధారంగా పంచాంగ కర్తలు దేశ భవిష్యత్ నిర్ణయించే విధానము... జ్యోతిష శాస్త్రం ద్వారా తెల్పండి?**

ఆంధ్ర రాష్ట్రావతరణ నవంబరు 1 ఆధారంగా మనవారు యిన్నాళ్ళు పంచాంగాల యందు ఫలితాంశములు వ్రాసుకున్నారు. యిప్పుడు కూడా వానికి సమాంతరంగానే నవ ఆంధ్రరాష్ట్రావతరణ జూన్–8 2014 న జరిగిన రోజు జన్మ చక్రంగా భావించి దాని ప్రకారం గోచారము, మరియు దశలు అంతర్దశలు అనేవి తెలుసుకొని ఫలితాంశములు నిర్ణయిస్తారు.

యిదే రీతిగా మన తెలంగాణా రాష్ట్రమునకు కూడా యిక రాబోవు 2015లో మన ఈ రెండు రాష్ట్రాల వారికీ కూడా గురుబలం బాగుంది. అందుచేత అందరూ అభివృద్ధిలోకి వస్తారు. ఆర్థిక వ్యవస్థబలం పుంజుకుంటుంది. విద్యాప్రణాళికలు బాగుంటాయి. వ్యవసాయం కొంత యిబ్బందికరం.

యిక మనం అందరం కలసి ఉభయరాష్ట్రాలు సుఖంగా వుండాలి అని మన జగదాంబ దుర్గాభవానీని ప్రత్యేకంగా రోజూ ఆంధ్రప్రదేశ్‌లో, తెలంగాణాలో వాతావరణం, వ్యవసాయం బాగా వుండాలి అని ప్రార్థిద్దాం. తద్వారా ఆమె కరుణా కటాక్ష వీక్షణవలన అందరం సుఖపడతాం.

- **భారతీయ సంస్కృతిలో పనివారిని గౌరవంగా చూడడం అనే అంశం ప్రత్యేకం చెప్పారా? లేదా?**

"ప్రత్యేకంగా గౌరవం" అనే విషయమై నాకు అంత పరిజ్ఞానం లేదు. కానీ అందరినీ గౌరవించడం అనేది మన సాంప్రదాయం.

ఈ నేపథ్యంలో మీరు అడిగిన ప్రశ్నకు మన ఆచార వ్యవహారములు సరిగా పరిశీలిస్తే మనకు మంచి సమాధానం దొరుకుతుంది. మన సాంప్రదాయం ప్రకారం ప్రాచీనులు చెప్పిన అంశాలు మనము ఏవీ పాటించడం లేదు కారణం ఏమిటి? మార్పు ఎప్పుడు ఎలా వచ్చింది అని చరిత్ర శోధిస్తే, అందరినీ గౌరవించే సాంప్రదాయం వున్న ఆచారం మనమే తప్పుదోవ పట్టించాం అనే విషయం ప్రస్ఫుటంగా కనబడు తుంది. ఉదాహరణకు

1. రజకవృత్తి: ప్రాధమికంగా మీరు కొన్ని విషయములు వివరంగా తెలుసుకోండి.

ఎ) నిన్న ఒకసారి కట్టి విడిచిన గుడ్డలు ఎవరూ ముట్టరాదు

బి) అలాగే స్నానం చేయు సందర్భంలో శరీరం మీదవున్న ప్రతి వస్త్రము తడిపి స్నానం చేయవలెను అనేది ధర్మశాస్త్రం.

సి) రజకుల చేత వస్త్రములు ఉతికింపబడిననూ వాటిని మనమే ఎండపొడన ఆరవేయవలెను అనేది ధర్మశాస్త్రం. మరి నేటి సమాజంలో ప్రత్యక్షంగా విడిచిన గుడ్డలు రజకులకు యిస్తున్నారు. వారు ఉతికి ఆరవేయుచున్నారు. చూశారా! శాస్త్రం కర్మ సంబంధంగా వారికి తగిన గౌరవం యిస్తే మనం అగౌరవంగా ప్రవర్తిస్తున్నాము. యిటువంటి నడవడి మనకు ఎక్కడినుండి వచ్చి నది అనే విషయంగా బాగా శోధించాలి.

2. గృహం–కూలీలు గృహప్రవేశానంతరం నీ శక్తి మేర బంధువులను పిలవవచ్చు పిలవకపోనూ వచ్చు కానీ గృహనిర్మాణంలో తోడ్పాటు చేసిన కూలీలకు యింట భోజనం మన ఆచారం. గమనించారా! మన ఆచారంలో కూలీలకు కూడా గౌరవం యిచ్చారు.

3. పాత్రలు శుభ్రం చేయు పనివారికి నేటి సమాజంలో అందరూ వారు తిన్న ఎంగిలిపాత్రలు ప్రత్యక్షంగా యిస్తుంటారు. వంటయింటి సింకులోనే వుంచేవారూ వున్నారు. శాస్త్రం ప్రకారం ఎంగిలి పాత్ర అందులోను యింటి యజమాని తిన్నది పనివారికి యివ్వవద్దని మరియు రాత్రులందు దేవుడు వున్న గృహంలోనే ఎంగిలిపాత్రలు వుంచవద్దని పెద్దల వచనం.

చూశారా! యిది విరుద్ధ కార్యం.. పాత్రలు శుభ్రం చేయువారికి ఎంగిలి వస్తువు యివ్వరాదు అనేది మన ఆచారం. కాకపోతే మనం ఆచరించడం లేదు.

4. గోవులు, గోపాలురు, రైతులు ఎక్కడ గౌరవింపబడతారో అక్కడ దేశం సుభిక్షంగా వుంటుంది అని దేవీపురాణం తెలియచేస్తోంది. మనం ఎలాగ ప్రవర్తిస్తున్నా గోపాలురతో.

యిలా ఎన్నో విషయములలో మనం తప్పుగా ప్రవర్తిస్తున్నాం. మన సాంప్రదాయముల యందు సంఘంలో అందరినీ గౌరవించే లక్షణాలు మనకు అలవాటు చేస్తే మనం సాంప్రదాయ విరుద్ధంగా ప్రవర్తిస్తూ అది శాస్త్రం, ఆచారం మీద దుష్ప్రచారం చేస్తున్నాం. యితరుల ఆచారాలలో యివి కానరావు ప్రత్యక్షంగా మీరు చూసుకోండి. మన ఆచారం చెప్పిన మహర్షులు చాలా గొప్పగా చెప్పారు. మనం ఆచరించపోవడం మన తప్పు శోధన చేయండి. చరిత్ర తెలుసుకోండి.

◆ **అయ్యా! నా కుమారుడు భార్యతో విడాకులు తీసుకున్నాడు. యిక వాడికి ఒక కుమార్తె కూడా ఉన్నది. భవిష్యత్తులో పురుడు మైలవంటి పూజాదికములలో గోత్రప్రవరలు అతని భార్యా పిల్లలకు ఎవరివి వర్తిస్తాయి.**

చట్టప్రకారం విడాకులు అయినాయి. ఆడవారికి గోత్రం మార్పు ఒకసారే. ప్రతీసారీ మారవు. ఆవిడ పిల్లలకు మాత్రం వివాహం చేసేవరకు తండ్రి గోత్రనామములు మరియు అశౌచాదికములు వర్తిస్తాయి. విడాకులు భార్యాభర్తలు తీసుకున్నారు కదా! అయినా తన భార్య తల్లితండ్రుల మృతి తాలూకు మైల మీ అబ్బాయి పట్టవలసినదే. ఈ భార్యభర్తల వరకు ఈ జాతాశౌచమృతా శౌచములు తప్పుకోవాలి అంటే "ఘటాశ్రాద్ధం" అనే కార్యక్రమం చేసి అశౌచాదికములలో బంధం తెంపుకోవచ్చు. కానీ వారి కుమార్తెకు అలాగ కుదరదు. భార్య స్థానం మారినట్లుగా తండ్రి స్థానం మారుద్దాం అనుకున్నా మారని స్థానం కదా! అందువలన ఆమెను వదిలివేసిన ఆ దౌర్భాగ్య తండ్రి తాలూకు పురుడు, మైల ఈ మీ మనవరాలికి తప్పదు. మీ మనవరాలు వివాహం వరకు జనకస్థానం గోత్రమే చెప్పాలి.

"ధర్మేచ అర్థేచ కామేచ నాతిచరితవ్యా" అని అగ్నిసాక్షిగా ప్రమాణం చేసి భార్యను విడనాడిన దోషం మీ కుటుంబానికి తగలవచ్చు. అగ్నిప్రయాణం ప్రమాదమే. వేద మంత్రాల అర్థం కూడా అదే. బృహస్పతిచరిత, మార్కండేయ పురాణలో మనువు కథలు చదవండి మీ అబ్బాయి చేసిన పనికి పితృదేవతలు హర్షించరు. శ్రాద్ధాదికములు సఫలం అవ్వవు అని పురాణ వచనము. ఒకవేళ మీ కోడలు స్వయంగా విడాకులు తీసుకుంటే పై శ్రాద్ధ అంశాలలో వర్తింపవు. రెండవ వివాహం శాస్త్రసమ్మతం సామాజిక దృక్పథమే.

◆ **పురాణాలలో ధర్మశాస్త్ర గ్రంథాలలో ఉన్న బ్రాహ్మణ ధర్మాలు తెలియచేయగలరు?**

ప్రతి పురాణంలోను ధర్మశాస్త్రం చెప్పబడినది. వాటిలోని విశేషాలు చూద్దాం.

జన్తూనాం నరజన్మ దుర్లభ మతః పుంస్త్వంతతో విప్రుతా
తస్మాత్ వైదిక మార్గ ధర్మ పరతా విద్వత్వమస్మాత్పరం (వివేక చూడామణి)

జన్తువులలో నరజన్మ దుర్లభమయినది. అందులోను పురుష జన్మ విశేషం అందునా బ్రాహ్మణుడుగా జన్మించుట గొప్ప విషయం. బ్రాహ్మణుడయి పుట్టి వైదిక మార్గమును ఆచరించువాడు విశేషమయిన వ్యక్తి. కారణం ఏమిటి అంటే వైదిక మార్గంలో జీవించడానికి ఎన్నో నిబంధనలు "బ్రాహ్మణో నామ భగవాన్ జన్మ ప్రభృతి పూజ్యతే" అని వున్ననూ – వైదిక ధర్మాలు ఆచరించే బ్రాహ్మణుడి గూర్చి గొప్పగా చెప్పుకోవలసిన అవసరాన్ని శ్రీఆదిశంకరులు మనకు తెలియచేయడంలో ఆంతర్యం – వైదిక ధర్మంలోని గొప్ప లక్షణాలు ఆరు. అవి యజ్ఞయాగ క్రతువులు చేయడం, చేయించడం, సదా అధ్యయనం చేయడం, అధ్యయనం చేయించడం,

దాన ప్రతిగ్రహణం యిందు గొప్ప ఏమిటి అంటే సదా అధ్యయనం చేస్తూ వుండడం వలన వేదశాస్త్రములలోని రహస్యాలు తెలుసుకోవడం జరుగుతుంది. అది యితరులకు చెప్పడం వలన వేదశాస్త్ర వృద్ధి జరుగుతుంది. తాను స్వయంగా యజ్ఞయాగాలు చేసి వేద శాస్త్రములలో చెప్పిన ధర్మాలు ఆచరించినవాడు అవుతాడు. యితరులచేత చేయించడం ద్వారా వేదశాస్త్రములలో చెప్పబడిన ధర్మాలు సంఘంలో వ్యాప్తి చేయించిన ఘనుడు అవుతాడు అందుకే శంకరులు ఒక పక్క మోక్షమార్గమును ఉపదేశిస్తూనే వైదిక మార్గమును అనుసరించే వారిని గొప్పగా అభినందించారు. అంతేకాక పురాణాలలో మహర్షులు అందరూ వైదిక మార్గం అవలంభించారు. అందుకే వారు వివాహం చేసుకొని సంతానవంతులయి వేదవిహితమయిన కర్మానుష్ఠానం చేశారు. చక్కటి గృహస్థ ధర్మాలను పాటించేవారికి కూడా మోక్షం లభిస్తుంది. గృహస్థ జీవితం తపస్సు లాగ చేయువారిని మోక్షం తప్పక లభిస్తుంది. వైదిక మార్గాన్ని అవలంభించాలి అంటే వివాహం తప్పకుండా చేసుకోవాలి. యజ్ఞం చేయాలి అంటే భార్య కావాలి.

***భగవద్గీతలో సంన్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ***

***తయోస్తు కర్మ సన్యాసాత్ కర్మయోగో విశిష్యతే.*** అని భగవానుడు చెప్పారు. సన్యాసము ఒకటే కాదు. నియమబద్ధమయిన సంసార జీవనం కూడా విశేషమయినదే అనుటకు కారణం కూడా కలదు. బ్రహ్మచారీ, గృహస్థు, స్నన్యాసి, యిలా ఎవరైనా సరే ఆహారం కోసం గృహస్తు మీద ఆధారపడవలసినదే.

***యధా మాతరం ఆశ్రిత్య సర్వే జీవన్తి జన్తవః***

***ఏవంగార్హస్థ్య మాశ్రిత్య వర్తన్త ఇతరాశ్రమాః***

తల్లిని ఆశ్రయించియే అన్ని ప్రాణులు బ్రతుకుచున్నట్లు గృహస్థాశ్రమం ఆశ్రయించియే ఇతరాశ్రమములు ప్రవర్తించున. మోక్ష విషయంలో

***సన్యాసీ మోక్ష మాప్నోతి బ్రహ్మలోకం వనీ తథా***

***స్వర్లోక మృషి లోకంచ గృహస్థ బ్రహ్మచారిణౌ***

సన్యాసి మోక్షమును, వానప్రస్థుడు బ్రహ్మలోకమును, బ్రహ్మచారి ఋషిలోకమును, గృహస్థుడు స్వర్గమును చేరును. అయితే ధర్మ కర్మానుష్ఠానములు అవలంభించాలి. అందుకే ధర్మ విషయాలు తెలుసుకోవాలి. వీటిని పురాణాలు తెలుపుతున్నాయి. అందుకోసం పురాణ విజ్ఞానం తెలిసి వుండాలి. వైదిక మార్గంలో నడవబోవు బ్రాహ్మణుని పంచదశ కర్మలు విధిగా జరగాలి.

***జన్మనా బ్రాహ్మణోజ్ఞేయః సంస్కారై ద్విజ ఉచ్యతే***

***వేదాభ్యాసేన విప్రత్వం త్రిభిశ్శ్రోత్రీయ ముచ్యతే (మనుస్మృతి)***

జన్మతః బ్రాహ్మణుడయినవాడు సంస్కారములచేత ద్విజుడవుతాడు. వేదభ్యాసము చేసినవాడు విప్రుడవుతాడు. పై మూడు లక్షణములు వున్నవాడు శ్రోత్రీయుడవుతాడు.

సంస్కారములు అంటే గర్భాదాన, పుంసవన, సీమంత, జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌలము. యివి ఏడు కుమారుని కొరకు తండ్రిచే చేయబడు సంస్కారములు అంటే కుమారుని ఉద్దేశించి తండ్రి చేస్తారు. ఉపనయనము, వేదవ్రతములు నాలుగు, గోదానం, స్నాతకం యివి బ్రహ్మచర్యంలో జరిగే మరొక ఏడు సంస్కారములు. వివాహముతో కలిపి పంచదశ సంస్కారములు చెప్పబడినవి. యివి ముఖ్యమయిన సంస్కారములు. యివి కాక బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, పితృయజ్ఞము, మనుష్య యజ్ఞము, భూతయజ్ఞముతో పాటు, పాకయజ్ఞములు, సోమ యజ్ఞములు, హవిర్యజ్ఞములు వాటిలోని రకములతో కలిపి మొత్తం నలభై సంస్కారములు చెప్పబడినవి. పంచమహాయజ్ఞముల అర్థం బ్రహ్మయజ్ఞం వేద పారాయణాదులతో చేయునది. పూజా హోమాదులతో చేయునది దేవయజ్ఞము. తర్పణాదులతో చేయునది పితృ యజ్ఞము, అధిపూజనం మనుష్యయజ్ఞం, వివిధ ప్రాణులకు చేయు బలి ప్రదానం భూతి యజ్ఞము ఔపాసన, వైశ్వదేవం, పార్వణం, అష్టకా, మాసిశ్రాద్ధం, సర్పబలి, ఈశానబలి అనునవి ఏడుపాక యజ్ఞములు. అగ్నిహోత్రం దర్శపూర్ణమాసలు, ఆగ్రగుణం, చాతుర్మాస్యలు, నిరూఢపశుబంధం, సౌత్రామణి, పిండపితృయజ్ఞం యివి ఏడు హవిర్యజ్ఞములు. అగ్నిష్టోమం, అత్యగ్నిష్టోమం, ఉక్థి, షోడశి, వాజపేయం, అతిరాత్రం, అప్తోర్యామం అనునవి ఏడు సోమయజ్ఞములు.

ద్విజుడు విప్రుడవ్వాలి కాబట్టి వేదాభ్యాసం చేయాలి. పైన తెల్పిన వివాహాది 26 సంస్కారములు కూడా భార్యలేనిదే చేయుటకు వీలుకాదు. అంతేకాక మిగిలిన 14 సంస్కారములు కూడా తల్లి తండ్రి యిరువురు లేనిదే జరగవు. కావుననే వైదిక మార్గము సశాస్త్రీయముగా అవలంభించవలెను అనిన భార్య అవసరం వివాహితుడయిన వ్యక్తికి మాత్రమే వైదీక సంస్కారములలో పూర్ణత్వ సిద్ధి వుంటుంది. మార్కండేయ పురాణంలో ఈ విషయమై మానవుల కథల ద్వారా (జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభిర్ ఋణవా జాయతే బ్రహ్మ చర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవభ్యః ప్రజయా పితృభ్యః అనే వేద వాక్యాన్ని సమర్ధించే కథలు) రౌచ్య మనువు తండ్రి "రుచి" ఆయన వివాహం చేసుకొనక విరాగి అయి తిరుగు సందర్భంలో పితృదేవతలు అతడికి దర్శనం యిచ్చి ధర్మోపదేశం చేశారు. వివాహము స్వర్గము మరియు ముక్తికి కారణము అని చెప్పారు. గృహస్థు అయినవాడు మాత్రమే దేవ, ఋషి పితృగణాలను సంతృప్తిపరచగల సమర్థుడు. పుత్రులను పొందక, పితృదేవతలకు తర్పణములు చేయక, భూతాదులకు కర్మలు చేయక ఎవరూ ఉత్తమగతి పొందలేరు. అందువలన ప్రతి వానికీ వివాహం ఆవశ్యకం. ఉత్తానపాదుడు, సురుచిలకు ఉత్తముడనే రాజు జన్మించాడు. అతడు ఒకసారి భార్యను విడనాడాడు. అప్పుడు ఉత్తమనువు కథలో చెప్పినధర్మాలు 1. ఆత్మయే పుత్రుని రూపంగా భార్య గర్భమునందు వెలువడును. భార్యను రక్షించుట ఆత్మ

రక్షయే. 2. భార్యను విడనాడుట ద్వారా మన పితృదేవతలకు స్వర్గము నుండి క్రిందకు పడవేయబడుదురు. 3. భార్య లేక కర్మానుష్ఠాన భంగం కలిగిన కారణంగా అతడు పూజనీయుడు కాడు. భార్యను విడనాడిన వానికి నమస్కరింపకూడదు. 4. అందు వలన అగ్ని సాక్షిగా వివాహమాడిన భార్యను చివరి వరకు రక్షింపవలసినదే యిటు వంటి గృహస్థ ధర్మాలు మార్కండేయ పురాణంలో మనువుల కథలలో చెప్పబడ్డాయి. ఆశ్రమ ధర్మాలు, శ్రాద్ధ విషయాలు ప్రతి పురాణంలోను చెప్పబడినవి.

వేద మార్గంలోకి వెళ్ళాలి అంటే ఉపనయనం ముఖ్యం "గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీత" గర్భంతో కూడి ఎనిమిదవ సంవత్సరం అనగా పుట్టింది మొదలు ఏడు సంవత్సరాల మూడు నెలలకు ఉపనయనమునకు సకాలం ప్రారంభం అవు తుంది. అయితే ఒకవేళ గర్భాష్టమంలో ఏదేని కారణం చేత ఉపనయనం చేయలేక పోతే "ఆషోడశాత్ బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే" అని 16వ సంవత్సరం దాటితే ఉపనయనం చేసినా గాయత్రీ సిద్ధించదు. అని 16వ సంవత్సరం వరకు సకాలం అని తెలియచేశారు. ఒకవేళ పిల్లవాడికి వాక్పటిమ కనుక ఏర్పడితే అప్పుడె అయిదు, ఆరు, ఏడు సంవత్సరాలలో కూడా ఉపనయనం చేయవచ్చని శాస్త్రవచనం.

**సాధారణ ధర్మాలు**

***చతుర్ద్వారం పురుషం చతుర్ముఖం చతుర్ధా చైవము పయాతివాచా***
***బాహుభ్యాం వాచ ఉదరా దుపస్థాత్ తేషాంద్వారం ద్వారపాలోబుభూషేత్***

(భారతం శాంతిపర్వం)

మనుజులకు కాళ్ళు, చేతులు, వాక్, ఉదరము, ఉపస్థ అనునవి నాలుగు ద్వారములు. ఈ ద్వారములకు ఒక రక్షకుడుగా వుండి నిగ్రహంతో రక్షించుకోవలయును. అది ఎట్లనగా

***నాక్షైర్దీవ్యేన్నా దదీతాన్య విత్తం నవాయోనీయస్య శృతం ప్రగృహ్ణాత్***
***కృద్ధోన చైవ ప్రపరేత ధీమాం స్తథాస్య తత్పాణి పాదుం సు గుప్తమ్.***

బుద్ధిమంతుడు ద్యూత మాడరాదు. ఇతరులు విత్తము స్వీకరింపరాదు. యోని సంబంధముకు యోగ్యుడు కానివానిచే యజ్ఞము చేయించరాదు. కోపించి ఎవరినీ కొట్టరాదు. ఇట్లా చరించిన అతడి పాణి పాదములు అనే ద్వారం సురక్షితము అగును. దీని అర్థం శాంతం అవసరం. చెడు పనులు చేయరాదు.

***నాక్రో శమృచ్ఛేన్న వృథా వదేచ్చ నపై శునం జనవాదం చ కుర్యాత్***
***సత్యవ్రతో మితభాషో-ప్రమత్తః తథాస్య వాగ్ద్వార మతో సు గుప్తమ్ ॥***

ఎవరినీ తిట్టరాదు. అవసరముగా మాట్లాడరాదు. ఇతరుల పైకి చాడీలు చెప్పరాదు. ఇతరులను నిందించరాదు. సత్యమునే మాట్లాడవలయును. మితముగా మాట్లాడవలయును. ఈ విషయంలో చాలా జాగ్రత్తగా వుండవలెను. యిలా వాగ్ద్వార పరిరక్షణ చేయవలెను.

***నానాశనః స్యాన్మహాశనః స్యాత్ అలోలుప స్సాధు ఖిరాగతస్స్యాత్***
***యాత్రార్థ మాహార మిహాదధీత తథాస్సస్యా జ్ఞారరీ ద్వారగుప్తిః***

అసలు తినకుండా వుండరాదు, అధికముగా తినరాదు. భోజనము నందు ఎప్పుడూ లాలసత ఉండాలి. సజ్జ్య సాంగత్యము చేయవలెను. బ్రతుకుటకు అవసరమయిన ఆహారం మాత్రమే తీసుకోవాలి. యిలా ఉదర ద్వార రక్షణ చేయాలి.

***నవీరపత్నీం విహరేతనారీం నచాపి నారీ మనృతా వాహ్వయీత***
***భార్యావ్రతం హ్యాత్మని ధారయీత తథాస్యోపస్థ ద్వార గుప్తిర్భవేత్ ॥***

తన ధర్మపత్నితోనే విహరింపవలయును. పరస్త్రీలతోర శ్రమింపరాదు. ఋతుస్నాతగా వున్నప్పుడు ఆహ్వానింపవలెను. ఇతర సమయాలలోతన భార్యతో కూడా రమింపరాదు. ఏకపత్నీ వ్రతము అవలంభింపవలయును. యిలా ఉపస్థ ద్వారము రక్షింపవలెను. యిలా నాలుగు ద్వారములు రక్షించుకొనువాడే బ్రాహ్మణుడు. మోఘాన్య గుప్త ద్వారస్య సర్వాణ్యేవ భవన్త్యుత కింతస్య తపసా కార్యం కింయజ్ఞేన కిమాత్మనా. ఈ నాలుగు ద్వారములు రక్షించుకోలేనివారు ఆచరించిన అన్ని కార్యములు వ్యర్థములు. అట్టి వారాచరించిన తపస్సు యజ్ఞము, ఆత్మ ధ్యానముతో ఉపయోగము వుండదు.

**దేవతల దృష్టిలో బ్రాహ్మణులు ఎవరు?**

***అనుత్తరీయ వసన మనుపస్తీర్ణ శాయినమ్***
***బహూపధానం శామ్యంతం తందేవా బ్రాహ్మణం విదుః***

కేవలం కౌపీనం మాత్రమే ధరించువాడు (అలంకార వాంఛ లేనివాడని పెద్దలు చెబుతారు) భూమిపై ఎలాంటి వస్త్రము పరచకుండా నిదురించువాడు, తన బాహువు మాత్రమే దిండుగా కలవాడు పరమ శాంత స్వభావుడు మాత్రమే బ్రాహ్మణుడని దేవతలు తలుస్తారు.

***ద్వంద్వారా మేషు సర్వేషు య ఏకో రమతే మునిః***
***పరేషా మనను ధ్యాయం స్తందేవా బ్రాహ్మణం విదుః***

శీతోష్ణసుఖదుఃఖములకు అతీతుడు, యితరులను గూర్చి అతిగా ఆలోచించనివాడు బ్రాహ్మణుడని దేవతలు తలచెదరు. అంతేకాక ఈ జగత్తంతా నశ్వరమని తెలిసినవాడు. సకల భూతముల స్వరూపం తెలిసినవాడు, పంచభూతముల నుండి భయము లేనివాడు, సకల భూతములను గౌరవించు వాడే బ్రాహ్మణుడని దేవతలు తలచెదరు. అంటే దీని అర్థం చతుర్ద్వార రక్షణ చేయుచూ యోగముతో పంచభూతములు ద్వారా రక్షణ పొందుచూ సుఖములకు లోనవ్వకుండా వుండే విధంగా ప్రవర్తించేవాడే నిజమయిన బ్రాహ్మణుడని దేవతల ఉద్దేశ్యం.

**సంధ్యావందన విధి :–** "సంధ్యాహీనో–శుచిర్నిత్యం అనర్హస్సర్వ కర్మసు" అని చెప్పబడింది. (దేవీభాగవతం, బ్రహ్మ వైవర్తపురాణంలో అగ్ని పురాణంలలో దీని

విశేషములు వున్నవి) సంధ్యావందనం చేయనివాడు మైలవానితో సమానం. అటువంటి వాడు అనగా సంధ్యావందనం చేయనివాడు సర్వ కార్యములకు అనర్హుడని పురాణ వచనం.

"బ్రహ్మహత్యా మాత్మహత్యాం ప్రత్యహం లభతే ద్విజః" అనగా సంధ్యావందనం చేయని వానికి బ్రహ్మ హత్య, ఆత్మ హత్య దోషములు కలుగును. "సఃస్నాతః సర్వతీర్థేషు త్రిసంధ్యం యః సమాచరేత్" ఎవడయితే మూడు సంధ్యలలోను సంధ్యావందనం చేస్తాడోవాడు సర్వతీర్థములలో స్నానం చేసిన ఫలితం పొందుతాడు. సంధ్యావంద నంతో గాయత్రీ జపం ఒక భాగం గాయత్రీ జప మహిమ అగ్నిపురాణంలోని ధర్మ ములు గాయత్రిని మించిన మంత్రము ఏదియు లేదు. గాయత్రీ అనుష్ఠానం ద్వారా ఎంతటి పాపమయినా తొలగిపోవును. ప్రాతఃకాలములో నక్షత్రములు వుండగానే సంధ్యావందనం చేయవలెను. సూర్యుడు నడినెత్తిన వుండగా మాధ్యాహ్నిక సంధ్య, సాయకాలంలో సూర్యుడు క్రుంగక ముందే సంధ్యావందనం చేయవలెను. అలా కుదరని పక్షంలో ఉదయాస్తమయ కాలముల తర్వాత మూడు ఘడియల వరకు అనగా 72 నిమిషముల వరకు ప్రతి నిత్యము సంధ్యావందనం చేయదగినది. సంధ్యావందనంలో నూట ఎనిమిది సార్లు గాయత్రిని తప్పకుండా చేయవలెను. బ్రాహ్మణుడు వేదమును తప్పక చదవవలెను. వేదము చదవక శాస్త్రము చదువుట దోషము. అందువలన వేదాధ్యయనం చేయని దోషం పోవాలి అంటే బ్రాహ్మణుడు నిత్యం సహస్ర గాయత్రి చేయవలసినదే. బ్రాహ్మణులను వైష్ణవులు, శైవులు అనుట నిషేధము కారణం గాయత్రీ ఉపాసన వలన "సర్వేద్విజాః శాక్తాః నశైవా నచ వైష్ణవాః" వైష్ణవులు అను భేదం పనికిరాదు. ఆ వర్గీకరణ మనం చేసుకున్నదే. శివుని ఆరాధించి విష్ణువును ఆరాధింపకున్నా విష్ణువును ఆరాధించి శివుని ఆరాధింపకున్నా అధోగతి లభించును అని సర్వ పురాణ సారము. లలాటమున బొట్టు తప్పక పెట్టవలెను. లేని ఎడల "సర్వం నిష్ఫలం యాతి లలాటే తిలకం వినా" స్నానం చేసి వెంటనే బొట్టు పెట్టని ఎడల అనుష్ఠాన ఫలం వ్యర్థమగును. "వినాపాదక్షాళనం యఃస్నాత్వా విశతి మందిరం – తస్యస్నానాదికం నష్టం జపహోమాది పంచకం" పాద ప్రక్షాళన చేసికొనక యింటిలో ప్రవేశించినచో అతడు చేసిన స్నానాదికములు జపహోమాదులు అన్నియు వ్యర్థమై పోవును. లక్ష్మీదేవి కోపముతో శాపము పెట్టి అతని ఇంటిని వదిలిపోవును. లక్ష్మీదేవి కోపముతో శాపము పెట్టి అతని ఇంటిని వదిలిపోవును. ప్రాణాయామం బ్రాహ్మణులకు తప్పనిసరి విధి. బ్రాహ్మీముహూర్తే చోత్థాయ అనగా బ్రహ్మ ముహూర్తముననే నిదు లేవవలెను. బ్రహ్మ ముహూర్తం అనగా సూర్యోదయమునకు

రెండు గంటల ముందు ఉదాహరణకు సూర్యోదయం ఆరుగంటలకు అయితే నాలుగు గంటల నుండి ఆరు గంటల వరకు బ్రహ్మ ముహూర్తం. అలాగే సూర్యాస్తమయ కాలంలో నిదురించుట భుజించుట నిషేధము. భక్ష్యా భక్ష్య విశేషం బ్రహ్మవైవర్తపురాణంలోని ధర్మములు తాను ఏమి తినదలచిననూ భగవానునికి నివేదన చేయునవి మాత్రమే భుజించాలి. ఏకాదశినాడు గృహస్థుడయినవాడు ఎట్టి స్థితిలోను భుజింపరాదు. శ్రీకృష్ణాష్టమి, శ్రీరామనవమి, శివరాత్రులందు భుజించుట కూడా దోషమే. ఈ దినముల యందు ఉపవాసము చేయలేనివారు పాలు, పండ్లు, దుంపలు తిని ఉండవచ్చును. సామర్థ్యం లేనివాడు బలవంతంగా ఉపవాసం చేయుట తగదు. "ద్విః స్విన్నమన్నం పృథుకం దేశ విశేషకే నాత్యంతం శస్తం విప్రాణాం భక్షణేన నివేదనే". రెండు సార్లు వండిన అన్నం, అటుకులు, మరమరాలు వంటివి కొన్ని ప్రాంతాల వారు శుద్ధముగానే చూచెదరు. కానీ అవి నివేదనకు బ్రాహ్మణుల భక్షణకు పనికిరావు. బ్రహ్మచారులకు యతులకు విధవలకు పై వస్తువులు పనికిరావు. అలాగే వీరికి తాంబూల భక్షణ నిషేధము. బ్రహ్మచారి, యతి, విధవ తాంబూల భక్షణ చేసినచో అది గోమాంస భక్షణముతో సమానం అని తెల్పిరి. ఎడమ చేతిలో నీరు తాగరాదు. పాడ్యమినాడు గుమ్మడికాయ, తదియనాడు పొట్లకాయ, చవితినాడు దుంపకూరలు, అష్టమినాడు కొబ్బరి, నవమినాడు సొరకాయ, దశమినాడు తీగ బచ్చలి, ఏకాదశినాడు పప్పుధాన్యములు, త్రయోదశినాడు వంకాయ తినకూడదు. యింకా బ్రహ్మవైవర్త పురాణాలలో చెప్పబడిన ధర్మాలు. అమావాస్యనాడు, కృత్తికా నక్షత్రమునాడు క్షౌరము చేయించుకొనరాదు. క్షౌరము చేయించుకున్న రోజున స్త్రీసంగమము, దేవతార్చన, పితృతర్పణం చేయరాదు. "నిషిద్ధం సర్వ వర్ణానాం దివాస్వప్స్త్రీ నిషేవణం" అనగా సర్వ వర్ణముల వారికీ పగటి కాలంలో స్త్రీ సంగమం నిషేధము. ఎవరి యింట సాలగ్రామం వుండునో ఆ యింట శ్రీహరి చక్రసహితుడై నివసించును. అచట సమస్త తీర్థములు వుండును. సాలగ్రామం వున్న యింటిలో తెలిసో, తెలియకో చనిపోయిన వ్యక్తి శ్రీహరిసాయుజ్యం పొందును. <u>కూర్మ పురాణంలోని ధర్మములు</u>

సదో పవీతీ చైవస్యాత్ సదా బద్ధ శిఖో ద్విజః
అన్యధాయయత్కృతం కర్మ తద్భవత్యయధాకృతమ్

బ్రాహ్మణుడు ఎప్పుడూ యజ్ఞోపవీతము, శిఖ ధరించియే ఉండవలెను. శిఖాయ జ్ఞోపవీతములు లేకుండా చేయు కర్మ చేయనట్లే అగును. నకుర్యాత్ యోభివాదస్య ద్విజః ప్రత్యభివాదనమ్ । అభివాదము చేసిన తర్వాత ప్రత్యభివాదము చేయని

వానికి పునః నమస్కరింపకూడదు. ప్రత్యభివాదము చేయనివాడు శూద్రసముడు అగును. అయితే ధర్మశాస్త్ర ప్రకారంగా ప్రత్యభివాదం చేయలేని స్థితిలో (నిదురించుట, భుజించుట, దేవతార్చన, ముఖ ప్రక్షాళన వంటి సమయాలలో వున్న వానికి) నమస్కరించకూడదు / పాదాభివందనం చేయునప్పుడు కుడికాలు మీదకు కుడిచేయి ఎడమకాలి మీదకు మన ఎడమచేయి వుంచి నమస్కరించాలి / మనో వాక్కాయములతో తల్లితండ్రులకు ఎప్పుడూ ప్రియమునే చేయవలెను / వారి అనుమతి లేకుండా యితర ధర్మములు (ఆశ్రమ ధర్మాలు) ఆచరించరాదు / జ్యేష్ఠభ్రాత తండ్రితో సమానం , కావున అతనిని అవమానింపరాదు. "అన్నం ననిన్ద్యాత్" అన్నమును నిందించరాదు. అన్నమును పూజనీయంగా చూడవలెను. ఉత్తరాభిముఖంగా కూర్చుని భుజింపరాదు / ఆచమనం చేయుటకు వేడినీరు ఉపయోగించరాదు / మూత్ర పురీషాదులు ఉత్తరముఖంగా వుండి చేయవలెను. ఆ సమయంలో యజ్ఞోపవీతం దక్షిణ కర్ణముకు తగిలించవెను. / వివస్త్రుడయి మలమూత్ర విసర్జన మరియు నీటిలో దిగుట స్నానం చేయుట, నడచుట, వంటివి దోషము ఆసనము లేకుండా కూర్చొనరాదు./ షష్ఠి, అష్టమి, పూర్ణిమ, అమావాస్య, ద్వాదశి చతుర్దశి బ్రహ్మచర్యం పాటింపవలెను. / తాను సంపాదించిన ధనమును – ధర్మం కొరకు, కీర్తి కొరకు, సంపదను పెంచుటకు, తన భోగమును, తనవారి కొరకు అయిదు భాగములు చేసి వినియోగించవలెను / అపవిత్రుడయి వుండగా సూర్యచంద్రులను చూడరాదు / ఆత్మ ప్రశంస, పరనింద చేయరాదు / జలమున తన రూపము చూడరాదు / యితరులను విమర్శించడం తనునుతాను విమర్శించుకోవడం కూడా తగదు / అవయవములతో, నఖములతో శబ్దము చేయరాదు / శూన్య గృహమున ఒకరే నిదురింపరాదు / పాదరక్షలు చేతితో స్పృశింపరాదు / అపవిత్రావస్థలో పడుకొనరాదు / అగ్నిని నోటితో ఊదరాదు / ఆహార పదార్థములను నోటితో ఊదరాదు / అకారణముగా మలమూత్రములను ఆపరాదు / భుజించుచూ లేవరాదు / పాదరక్షలు, జలము లేకుండా నడువరాదు / హీనమైన చోట (అనాచారం) అపవిత్రమైన చోట భుజింపరాదు / బ్రాహ్మణుడు మద్యము సేవించినచో బ్రహ్మహత్యాదోషము కలుగును / పరిషేచన చేయకుండాను, దేవతా నివేదన చేయకుండాను భుజింపరాదు. తడి బట్టలతో, అపవిత్ర వస్త్రములతోను భుజింపరాదు / ఏడ్చుచూ భుజింపరాదు / ఉత్తర పశ్చిమ శిరస్సుతో నిదురించరాదు / బ్రహ్మపురాణంలోని ధర్మములు అనుకూలంగా మాట్లాడవలెను / నిలుచుని భుజింపరాదు, మూత్ర పురీషాదులు విడువరాదు, దంతధావనం చేయరాదు / తూర్పు ఉత్తర దిశలలో మాత్రమే వుండి

ఆచమనం చేయవలెను / ఆహారంలోని రుచులు విమర్శించరాదు / వెంట్రుకలు స్పృశింపరాదు / నిష్కారణముగా మాటి మాటికి తలస్నానం చేయరాదు / రాత్రులందు దక్షిణాభి ముఖంగా మలమూత్ర విసర్జన చేయవచ్చు / ఉభయ సంధ్య లందు మైధునము, ప్రయాణము చేయరాదు / తూర్పు ఉత్తరముఖులై క్షురకర్మ చేయించుకోవలెను. విష్ణుపురాణములోని ధర్మములు పర స్త్రీ వ్యామోహం పనికిరాదు / శిఖాబంధనం చేయకుండా ఏ పనీ చేయరాదు / బిగ్గరగా నవ్వరాదు / స్నానము చేసిన వస్త్రములతో అవయవములు తుడుచుకొనరాదు / స్త్రీలను అవమానింపరాదు, ధిక్కరింపరాదు, వారిని చూచి ఈర్ష్యపడరాదు / దీనులయిన సజ్జనులను ఉద్ధరింప వలెను / ఇతరులకు దుఃఖము కలిగించు సత్య విషయమై మౌనం వహింపవలెను / మార్కండేయపురాణంలోని ధర్మములు విరిగిన శయ్య, పాత్ర, ఆసనం విసర్జింప వలెను. గురువుతో ప్రమాణ పూర్వకంగా మాట్లాడవలెను / రెండు చేతులతో శిరమును గీయుట కేశములు స్పృశించుట చేయరాదు / దంతధావన సమయంలో మాట్లాడ రాదు / విప్రుడు రాజు తన కన్నా అధికుడు, విద్వాంసుడు, గర్భవతి, మూర్ఖుడు, రోగి, శత్రువు వీరలకు దారి యీయవలెను / గ్రహణములందు కాక యితర దినములలో రాత్రులందు స్నానం చేయరాదు / తడివస్త్రము దులపరాదు తడికేశములు దులపరాదు / ఎరుపురంగు, నలుపురంగు మరియు చిత్ర వస్త్రములు ధరింపరాదు / స్నానం చేయకుండా చందనం ధరింపరాదు / అంచులేనివి, జీర్ణ మయినవి వస్త్రములు ధరింపరాదు. స్నానమయిన పిదప నిదురింపరాదు / పురుష సంతతి కోరువారు భార్య రజస్వల అయినది మొదలు సరి దినములలోను స్త్రీ సంతతి కోరువారు బేసి రోజులలోను (నాల్గవ రోజు నుండి 16వ రోజు లోపుగా కలువవలెను. పెద్దలు చెప్పే అమంగళకర వస్త్రధారణ, పనులు చేయరాదు / తనకంటే తక్కువ వారితో కలిసి కూర్చొనరాదు. నిత్య కర్మలకు పితృ కర్మలకు హాని చేయరాదు / స్కందపురాణంలోని ధర్మములు ప్రాతఃస్నానం వలన దుస్స్వప్న దోషం పోవును / పన్నెండు సార్లు విధిగా ప్రాణాయామం ఉదయకాలంలో చేయాలి (గాయత్రితో కూడి) / నిత్యం సహస్ర గాయత్రి చేయు వానికి వేదాధ్యయనం చేయని దోషం తగలదు / సూర్యోదయం నుండి మధ్యాహ్న సంధ్య వరకు ఉపవాసం చేయాలి / పంచమహాయజ్ఞములను నిత్యం ఆచరించుట గొప్ప విశేషము / అతిథి యొక్క ఆచార వ్యవహారములను విమర్శించవద్దు / కేవలం తన భార్యను ఋతుస్నాత అయిన రోజు మాత్రమే సంభోగించువాడు బ్రహ్మచారిగానే చెప్పాలి. ఋతుకాలం అనగా ధర్మశాస్త్రతః చెప్పబడిన కాలము / తడిసిన పాదములతో నిదురించరాదు / పాద

రక్షలతో వుండగా తాగుట, తినుట, పడుకొనుట వంటివి చేయరాదు / తనను అందరూ గౌరవించు రీతిగా నడుచుకోవాలి / తన కుటుంబంలోని తన పూర్వీకులను తను విమర్శించరాదు / నిత్యం విభూదిధారణ, రుద్రాక్షధారణ చేసి సదా శివుని స్మరించుచూ వుండువారు రుద్రాంశ సంభూతులే. శివపురాణంలోని ధర్మములు నాభి స్థానం వరకు వున్న నీటిలోనే మునిగి చేయవలెను / భస్మమును నీటిలో పారవేయుట, నీటితో కడుగుట ద్వారా నరక ప్రాప్తి / నిత్యకర్మానుష్ఠానం పది రోజులు లుప్తమయినచో లక్ష గాయత్రి చేయవలెను / పన్నెండు లక్షలు గాయత్రి దీక్షగా చేసినవాడు పూర్ణ బ్రాహ్మణుడు / దానము తీసుకొన్న దానిలో కొంత మరల దానంచేసి మరియు జపంచేసి దానం తీసుకున్న దోషము పోగొట్టుకొనవలెను / బ్రాహ్మణులు ఐశ్వర్య ప్రాప్తికై రెండు పూటలా అగ్నిహోత్రం చేయవలెను / అగ్నిని ఉపాసించలేనివాడు జపమయిననూ అనగా అగ్ని మంత్రముల పారాయణ అయిననూ చేయవలెను / ప్రాతఃకాలంలో సూర్యోదయం వరకు గాయత్రి జపం చేసి తదుపరి సూర్యోపస్థానం చెప్పవలెను. భస్మము అనగా అగ్నిహోత్రం చేయగా వచ్చిన భస్మమును ధరించుట శ్రేష్ఠము లేని ఎడల ఆవు పేడను కాల్చగా వచ్చిన భస్మమును మాత్రమే ధరింపవలెను. అలంకరణకు యితర ద్రవ్యములు వాడువారి ముఖము చూడరాదు.

ఇదే రీతిగా అన్ని పురాణాలలోను ధర్మశాస్త్ర విషయాలు చెప్పబడ్డాయి. స్త్రీలను కూడా గౌరవించే విషయంలో పురాణాలు వేదము చాలా చక్కగా వివరించాయి. అయితే వారి రక్షణ దృష్ట్యా ఎన్నో నిబంధనలు తెలుపబడినవి. అర్ధోవా ఏష ఆత్మనో యత్పత్నీ అని శృతి వాక్యం అనగా భార్య తన శరీరంలో సగభాగము. యిక్కడ పురాణాలలో చెప్పబడిన ప్రతి ధర్మము భార్య లేకుండా చేయుటకు వీలు లేకుండా బంధించి వేశారు. అంటే ఆమెకు ఈ కర్మ కాండల యందు గౌరవం యిచ్చినట్లేనా? కాదా? అంతేకాక భర్త సంపాదించుకురావడం వరకే పని సంపాదించి యింటికి తెచ్చిన వస్తువుల మీద మొత్తం పెత్తనం భార్యదే పత్నీహి పారీణ హ్యాస్యేశే అని వేదం ద్వారా భార్యకు మాత్రమే యింటి పెత్తనాన్ని తెలియచేశారు. చూశారా ధర్మం తెలియకపోవడం వలన నేటి సంఘంలో అనవసర చర్చలన్ని నడచుచున్నాము. పురాణాల అన్నింటిలోను వేదం చదువుకున్న బ్రాహ్మణునికి మాత్రమే గొప్ప విలువలు యివ్వబడ్డాయి. అయితే వేదాభ్యాసయోగం రావాలి అంటే సదాచారపరాయణుడై వుండాలి. ఆచార, ధర్మములు తెలియని వానికి తెలిసి పాటింపని వానికీ వేదాధికారం కలుగదు. యివేకాక ఎన్నో ధర్మాలు పురాణాలలో తెలుపబడ్డాయి. వేద పండితులకు దానం చేయు విషయమై రామాయణంలో శ్రీరాముడు లక్ష్మణునితో ఆచార్యః

తైత్తిరీయాణామ్ అభిరూపశ్చ వేదవిత్ తస్యయానం చదాసీశ్చ సౌమిత్రే సంప్రదాపయ కౌశేయాని చ వస్త్రాణి యావత్ తుష్యతి సద్విజః తైత్తీరియ యజుశ్శాఖాధ్యయనం చేసినవారు బ్రాహ్మణోత్తములు వారు మిక్కిలి శక్తివంతులు, చక్కటి వాక్ శుద్ధి కలవారు. వారు దానములు పుచ్చుకొనుటకు పాత్రులు కావున వారికి సంతృప్తి కలుగునట్లుగా ధన కనక వస్త్ర వాహనమును, దాసదాసీ జనములను, పట్టువస్త్రములను యిప్పించుము అని తెలిపారు.

ఈ విధంగా వేదాధ్యయన పరులను అందరూ గౌరవింపవలసినదే. యివే కాక పురాణాలలో చాతుర్వర్ణ ధర్మాలు శ్రాద్ధ విషయాలు, చతురాశ్రమ ధర్మాలు, నిత్యంలో స్త్రీ ధర్మాలు గర్భిణీ స్త్రీ ధర్మాలు యిలా ఎన్నో ధర్మాలు పురాణాలలో వివరింపబడ్డాయి. అందరూ పురాణ శోధనలు చేసి ధర్మమయిన జీవితాన్ని గడపాలి. వేదవిహితమయిన కర్మానుష్ఠానం చేయాలి. వేద రక్షణ చేయాలి. లక్ష్యం గొప్పది అయితే కార్య సాఫల్యమవుతుంది.

**శ్రీలక్ష్మీనృసింహార్పణమస్తు**

